

# శ్రీ చాగంటి శేషయ్యగారు

గ్రంథకర్త

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము

కపిలేశ్వరపురం — తూర్పు గోదావరిజిల్లా

## పరిచయము



శ్రీ చాగంటి శేషయ్యగారిచే ఆంధ్రీకరింపబడిన ఈ నవల తొలుత 1917 సంవత్సరమున ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలో ప్రకటింపబడినది. ఆంధ్రుల ఆదరాభిమానములచే దీనిని పునర్ముద్రించు అవకాశము గలిగినందుల కెంతయు సంతోషము.

కపిలేశ్వరపురం
విలంబ చైత్ర శు ౧

ప్రకాశకులు

# పీఠిక.



ఈగ్రంథమును 'శ్రీపంచాననరాయచౌదరి' అను కవిశేఖరుఁడు బంగాళాభాషలో రచియించెను. నేను దాని నాంధ్రీకరించితిని.

గ్రంథమునుగూర్చి నేను వేఱుగఁ బీఠికవ్రాయుటకంటె గ్రంథకర్త వ్రాసినపీఠికనే యాంధ్రీకరించినచో బాగుగనుండుననియెంచి యట్లుచేయుచున్నాఁడను.

"మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైనపిదప నద్వితీయప్రతాపశాలియు మహారాజునగు సీతారామరాయలెట్లు ప్రవర్తించెనో, ఏరూపముతో నెట్టి యవస్థయందెట్టికార్యముల నాచరించుటలోఁ బ్రవృత్తుఁడయ్యెనో యీగ్రంథమునఁ దెలుపఁబడినది. ప్రకృతియొక్క రీతి నీతులు గొంతవఱకిందు వర్ణింపఁబడినవి ..............

అద్వితీయధీశక్తిసంపన్నుఁడును, వంగమాతా సుసంతానమును, వంగదేశీయలేఖకప్రపంచ ధ్రువనక్షత్రమును నగు బంకించంద్ర చట్టోపాధ్యాయుని కావ్యోద్యానమునుండి కుసుమములను గోసికొనివచ్చి నేనీమాలను సమకూర్చితిని. దుగ్ధములయందు తక్రము పడినతోడనే దుగ్ధముగుణ మెట్లునశించునో, అట్లే యీయసమలేఖకుని యయోగ్యహస్తము పడుటచే నందలి మనోహరవిషయము లత్యంతవికృత భావాపన్నములైనఁగావచ్చును. అందులకుఁ బాఠకమహాశయులు నన్ను మన్నించి సవరింపవలయును. పాఠకమహాశయుల హృదయము లాకమారైనను నిందలి భావలహరులలో నీఁదులాడెనేని నాపరిశ్రమమంతయు సార్థకమగునని తలంచుచున్నాఁడను."

కపిలేశ్వరపురము
29–1–1917

చాగంటి శేషయ్య.

శ్రీరామచంద్ర.





## మొదటి ప్రకరణము.

### పుణ్యాశ్రమము

కడవెడుపాలలో గోమూత్ర మొక్కబిందువుపడినను నాదుగ్ధములన్నియు విఱిఁగిపోయి వికృతాకారమును జెందినట్లే, పుణ్యమయమైన యీమహాప్రపంచమునం దేమాత్రము పాపలేశము సంఘటించినను శాంతినికేతనతుల్యమై, సుఖమయమైన యీ ప్రపంచమంతయు నొక్కమారు శ్మశానముగాఁ బరిణమించిపోవును. శుష్కవృక్షకోటరమునం; దించుక యగ్నినుంచినను నల్పకాలములోనే యది ప్రజ్వరిల్లి యందుమూలమున వృక్షమేకాకుండఁ గాననమంతయుఁ గూడ దగ్ధమయి పోవునట్లే, యేగృహస్థుఁడుగాని, యేరాజ్యాధిపతి గాని, యొక్కమారు పాపపంకిలహ్రదమున స్నానమాచరించుట తటస్థించినచో వానిసంసారమును, వానిరాజ్యమును, సంపూర్ణముగ ధ్వంసమైపోవును. భయంకర మగు నదీప్రవాహమును వాలుకారేణువు లెదురుకొనఁజాలనట్లే, క్షుద్రబలులగుమానవు లేకార్యమును చేసియైనను విధివిధానముల నతిక్రమించుటకు సమర్థులుకాఁజాలరు. కనుకనే తత్వజ్ఞానియు, మహారాజు నగు సీతారామునకుఁ జిరహితైషియగు చంద్రచూడతర్కాలంకారుఁడును, పరాక్రమశాలియు, విశ్వసనీయ సేనాపతియునగు మృణ్మయుఁడును తమప్రాణములనర్పించు కార్యములనుజేసి తాముచెడిపోయిరేకాని, కృతార్థులు కాఁజాలరైరి. పాపాత్ములు తమపాప ఫలమును తమదుర్బుద్ధి పరిణామమును తమ యదృష్టమునం దచిరకాలముననే యనుభవించుచుందరు.

~ జగత్తునకు మూలకారణుఁడును, పరాత్పరుఁడు నగుపరమపురుషుఁడీ ప్రపంచభూమియందు సుమతులకును గుమతులకును నెట్టియద్భుతరంగములనేర్పఱచియుంచెనో, ఏకాంతములును, దుర్జ్ఞేయములును, కవికల్పనాతీతములు నగునట్టి రంగములఁ బ్రకృతిరహస్యములను దెలిసికొనుట కల్పప్రాణులగు నీమానవులు సమర్థులుకారు. మాయామయుఁడగు నాపరాత్పరుని యప్రతిహత మాయాప్రభావముచే నొక్కస్నిగ్ధచందనకణము సర్వమును దహించుటకు శక్తికలదియగుచున్నది. పంచదార మాధుర్యమునువీడి తిక్తమును దాల్చుచున్నది. సర్వేంద్రియ నిగ్రహుఁడై మహాపురుష సదృశుఁడగు మానవుఁడంతలోఁ బిశాచీ ప్రియసంగుఁడై క్షుద్రదేవతాసహోదరుఁడై పాపపురుష సహాయభూతుఁడగుచున్నాఁడు. విచిత్రమయమగు నీమహాప్రపంచమునం దెవ్వఁడెట్టి విచిత్రకార్యములయందు నియుక్తుఁడగుచున్నాఁడో, ఆతఁడట్టికార్యములయందు స్థిరముగా నుండుటకశక్తుఁడగుచున్నాఁడు. అట్లేలస్థిరముగా నుండఁజాలకున్నాఁడో యూహించుట కెవ్వరికిని శక్యముకాదు. అస్థిరదేహులగు నీమానవుల కాకారణము దుర్జ్ఞేయమైనది.

పర్వతమునుండి నిర్గమించెడి సామాన్యజలబిందువులనుండి, భయంకర తరంగవిశిష్టమును, పరిపూర్ణనిర్మల సలిలసంయుతమునగు నది యుత్పన్నమగుచున్నది. ఆవగింజంత ప్రమాణముగల వటబీజమునుండి, ఆకాశమునుభేదించెడి కాండప్రకాండములతోఁగూడిన మహావృక్ష ముత్పత్తియగుచున్నది. అట్లే యీప్రపంచమునందు నిరుపయోగమగు నొక యల్పకార్యావలంబనముచే నొక్కొక్కప్పుడు ప్రళయకాలమునందు వలె భయంకరకార్యము లుత్పత్తిల్లుచుండును. మహారాజగు సీతారాముని జీవనమే యిందులకుఁ దార్కాణము. పిల్లపిల్లవాయువులచే సముద్రమునం దుత్పన్నములైన భీషణతరంగ

ములలో వర్తకుని యోడ మునిఁగి పోయినట్లే రూపమోహముచే, నతిశయవిలాసవాసనలచే సీతారామునివంటి యపార ధీశక్తిసంపన్నుఁడధోగతిపాలై పోయినాఁడు. ఒకచిన్న మేఘఖండముచే సుధాకరుని సుధామయకాంతి కప్పువడి పోవుచున్నది. చిన్నచిన్నగడ్డిపోచలచే మహామత్తగజము బంధింపఁబడుచున్నది. ఇట్టి యద్భుతములనుగాంచి మనమాశ్చర్య పడనక్కఱలేదు. పరివర్తన స్వభావవిశిష్టమగు నీ ప్రపంచమునం దిట్టియద్భుత వ్యాపారము లనేకస్థలములలో వేనవేలు సంఘటిల్లుచుండును.

కృతఘ్నుఁడును పాపమతియునగు గంగారాముఁడు దుర్ముహూర్తమునఁ బతివ్రతయు, మహారాజునకుఁ గనిష్ఠభార్యయునైన రమాదేవి రూపానలమున శలభమువలెఁబడి భస్మమైపోయినాఁడు. దుర్ముహూర్తమున నేగుణమయియగు శ్రీ సన్యాసినీ వేషముతో సీతారాముని ప్రాసాదమునం దడుగు వెట్టినది. ఇవియే విషవృక్షాంకురమునకు గారణములైనవి. పిదప సీతారాముని లోలతారూప సలిలసేచనముచే నాయంకురము వృద్ధిఁజెంది వృక్షమైనది. తుదకు సమగ్రరాజ్యనాశన ఫల ముదయించినది. తత్త్వజ్ఞానియుఁ జిరహితైషియునగు గురుదేవుఁడు సదుపదేశమనెడి కుఠారాఘాతముచే నావృక్షమును భేదించిభూమిపై ద్రోయవలయుననితనప్రాణములనుధారవోసినాఁడు. కాని కృతార్థుఁడుగాలేకపోయినాఁడు. క్రమక్రమముగా విషఫలము పక్వమునకు వచ్చినది. సీతారాముని యధఃపతనముతోఁగూడ భారతభూమి చాలకాలమునకుఁ బిదప హిందువులస్వాధీనమునుండివిడివడిపోయినది.

హిమసంపాతముచేఁ గమలదళమెట్లు భిన్నభిన్నమైపోవునో, అట్లే రూపమోహముచే నత్యంత సత్పురుషుల శ్రద్ధాబుద్ధులుకూడ నిస్తేజములై నశించిపోవును. వంగదేశమున నద్వితీయ మేధావియని పొగడ్తఁగన్న సీతారాముని జీవితమునం దీవిషయము స్పష్టముగా

రజున్నైనది. భయంకరమగు నమావాస్య గడచిపోయినపిదప మధుర జ్యోత్స్నావిశిష్టమగుపూర్ణిమ యరుదెంచినట్లే, అదృష్టదేవతానుగ్రహావశమున నట్టిపురుషులకు మఱలమంచికాలమురావచ్చును. అనుతాపోదయముచేతను, కాలప్రభావముచేతను, వివేకాభివృద్ధివలనను, వారిస్వభావము ముహూర్తకాలములో సంపూర్ణముగా మాఱిపోయి నూతనరూపమును దాల్పఁగలదు. పరిణామశీలమగు నీప్రపంచమునం దిట్టిఘటనము లరుదుగావనినచో, మహారాజగు సీతారామరాయలు నియతఘటనా ప్రవాహమునఁబడి పోయిపోయి తుద కేదోయొక కూలమును జేరఁగలుగుననిన నందాశ్చర్యమేమున్నది ?

సీతారామరాయ రాజ్యభ్రష్టుఁడై నమూఁడు సంవత్సరములకుఁబిదప ఫాల్గునమాసమునం దొకనాఁటి సాయాహ్నమునఁ బవిత్రమును, శాంతిమయమును, మనోహరమునగు నొక్కయాశ్రమమున వృద్ధుఁడును, తేజోశాలియునగు నొకమహాపురుషుఁడు, దేవీరూపయగు నొకసన్యాసినితో నేమేమియో మాటలాడుచుండెను. ఈ ఘోరకలికాలమునఁ బ్రకృతికి శోభాయమానమై యలరారుచుండెడి యీపవిత్రాశ్రమమునకు దేవగణసహితమై యమరావతి విచ్చేసి, మ్లేచ్ఛయుతమైయున్న యీమనోహరస్థానమును తన నేత్రములతోఁ జూడలేకపోయెను. ఆస్థానమునుసులభముగాగ్రహింపఁజాలకపోయెను.

హరిద్వారమునకుఁ బశ్చిమోత్తరమున నించుమించుగ నెనిమిదిక్రోశముల దూరములో హిమాలయసమీపసమతలమునందొక్కచోట నీపుణ్యాశ్రమముండెను. మానవులయాశలవలెనే, యెత్తైన నాల్గుపర్వతశృంగము లా యాశ్రమమునకు నాల్గుదిక్కులను శోభిల్లుచుండెను. సర్వజనపూజితుఁడగు విధాత యీ యాశ్రమమునకుఁ జుట్టును స్వభావసిద్ధమును, దుర్భేద్యమునైన నట్టియావరణమును నిర్మించియుండెను. ఆనడుమ మనోహరమగు నుద్యానవనమునందువలె నానావిధవృక్షరాజి శోభిల్లుచుండెను. దానిని బరికించి చూచి

నచో నెవఁడో యొక నేర్పరియగుశిల్పి యతిప్రయత్నముతో శ్రేణీ బద్ధముగా నాచెట్లను నాటి పెంచినట్లుగఁ గన్పట్టుచుండెను. నడుమ నడుమ గులాబి, మల్లె, బొండుమల్లె మొదలగుపూలచెట్లు విశేషము గానుండి వనమునకంతకును శోభఁదెచ్చుచుండెను. ఆసమతలమునకు జుట్టును వింటుక యొరసికొనుచు వెండియొడ్డాణమువలె నొకసెలయేఱు ప్రవహించుచుండెను. అందనేకవిధములగు చిన్నచిన్న చేప లత్యానందముతో విహరించుచుండెను. ఋతురాజగు వసంతుని శుభాగమనమువలన నభినవశోభందాల్చి, వికసితకుసుమభరితమై యొప్పారు వృక్షపంక్తిచే భక్తిరసార్ద్రితమగు నా పవిత్రాశ్రమ మెంతయు నయనానందదాయక మగుచుండెను. కృత్రిమాలంకారములతోడను, నశేషశిల్పచాతుర్యములతోడను బరిశోభించెడిప్రాసాదములసైత మీయాశ్రమముతో లేశమును సరిపోలఁజాలవు. భోగవిలాసవిరతులగు మహర్షుల కుచితముగనుండునట్లు విధాత యిట్టిప్రదేశముల నచ్చటచ్చట సృష్టించియుంచెను. మఱియును స్వార్థపరులును, పాపపరాయణులునగు మానవుల సమాగమముచేఁ గలుషితులైపోవుదు రను భయముచే వారి నీ నిర్జనప్రదేశముననుంచి కాపాడుచుండెను. అద్వితీయమగు నీప్రదేశశోభను నిశ్చలచిత్తముతో నొక్కసారి పరికించి చూచినచో, సంసారచక్రమునంబడి తిరుగులాడుచున్న దురదృష్టవంతుల సంతాపాగ్ని యఱనిముసములోఁ జల్లారిపోవును. చింతాశీలు రగు మానవులహృదయ మీశ్వరునియందు లీనముకాఁగలదు. ఇంతేకాదు; అత్యంతనాస్తికుని నీరసహృదయమునసైతము భక్తిరస ముప్పొంగ నారంభించును.

ఈయాశ్రమస్థానమునం దక్కడక్కడఁ జిన్నచిన్న కుటీరములు నిర్మింపఁబడియుండెను. ఆకుటీరమునందలి హోమశేషాగ్ని మెల్లమెల్లగాఁ బ్రజ్వరిల్లుచుండెను.

అట్టి కుటీర సమ్ముఖమునం దొకచో వ్యాఘ్రచర్మాసనము పైఁగూర్చుండి సన్యాసియు సన్యాసినియు మాటలాడుకొనుచుండిరి. మహాపురుషుల వయసును నిర్ధారణముసేయుట కెవ్వరును సమర్థులు కారు. కాని, యామహాపురుషుని మస్తకమున నెనుబదేండ్లు గడచినవని తోఁచుచున్నది. అయిన నాతనిశరీరమున బిందుమాత్రమైనను మాంసము కొఱఁతవడలేదు. సంపూర్ణారోగ్యలక్షణము లాతనిదేహమునఁ జక్కఁగఁ గన్పట్టుచుండెను. తప్తకాంచన సన్నిభమగు నాతని దేహచ్ఛాయయు, జ్ఞానగర్వితములగు నుజ్వలనేత్రములును, శ్వేత చామరమువంటి ప్రేలాడుచున్న గడ్డమునుబరికించినచో నెవ్వఁడో స్వర్గభ్రష్టుఁడైన యొక దేవపురుషుఁడని భ్రమగొల్పుచుండును. ఆతఁడే యీయాశ్రమమున కధీశ్వరుఁడు. ఆతనిపేరు రామానంద స్వామి. శిష్యులనేకు లీపవిత్రస్థానమున నాతనితోఁగూడ వాసము చేయుచుండిరి.

పాఠకమహాశయుల కీమహాపురుషుఁ డపరిచితుఁడు కాఁడు. ఇంతకుముం దనేకపర్యాయము లీతనిజూచియే యున్నారు. శ్రీ యదృశ్య మైపోయిన పిదప, మతిభ్రష్టుఁడైన సీతారామరాయ లాగ్రహముచే విధించిన యాశిక్షననుభవించి,జయంతీదేవి యనేకస్థలములఁ దిరిగితిరిగి తుదకీక్షణమున గురుదేవుని యాశ్రమమునకు జేరుకొనియెను.

జలదగంభీరస్వరముతో స్వామి యిట్లనియెను. "నీవు ప్రపంచ రంగమున నెందులకుఁ బ్రవేశించితివి ? స్వార్థపరాయణులగు మానవులతో సంబంధము గలుగఁ జేసికొనవలసిన యావశ్యకము నీకేమి వచ్చినది? నీ. క్షుద్రహృదయమునందలి ప్రేమానురాగమును సంపూర్ణముగ జగత్పతియైన పరాత్పరుని పాదపద్మములకడ నర్పించి, మరలఁ గావలెనని కోరి తెచ్చుకొని మాయాబద్ధురాలవగు చెండ్లులకు?

గర్హితకార్యములను జేసినప్పుడు తత్ఫలము వెంటనే లభించునని నీవు తెలిసికొనలేవు. అపకర్మముల పరిణామఫల మెప్పుడును శుభప్రదముగా నుండనేరదు."

సవినయముగ జయంతి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "మీ యాజ్ఞ నుపేక్షించేసి ప్రపంచమునఁ బ్రవేశించి మీయెడ నపరాధ మును చేసితిని. అందుకొఱకిప్పుడు మీసమ్ముఖమున క్షమాభిక్ష నడుగుకొనుచున్నాను. నేనట్టికార్యమును జేయుటకొక విశేషోద్దేశ మున్నది!

మేఘమునందలి మెఱపువలె నుండెడి యించుక మందహాస ముతో స్వామి యిట్లనియెను. "నీవేయుద్దేశములకు వశవర్తినివై యీకార్యమును జేసితివి? ఈశ్వరచింతాభిన్నమగు జీవనమునలన నేమి ప్రయోజనమున్నది ? "

జ—ప్రభూ! మీయనుగ్రహముచే నేనైహికమాయను జయించి తిని. సంపూర్ణమైన ముక్తిలాభమును గైకొంటిని. స్నేహచక్షువు లతో నెప్పుడును నే నెవరినిజూడలేదు. కాని, వాని సరళస్వభా వముచే, నామె ముఖదర్శన మైనప్పుడు నాహృదయమున సోదర స్నేహ మంకురించినది. ఆమె నీ ప్రపంచమున సుఖినిఁగాఁ జేయ వలయునని యిచ్ఛవొడమినది. అందుచే మీ యాజ్ఞకు వ్యతిరేకముగఁ బ్రపంచరంగమునఁ బ్రవేశించితిని. నాకింతకంటె వే ఉద్దేశమేమి యును లేదు.

స్వామి—మంచిది. నీయీయుద్దేశమున కేమిఫలముగలిగినది? విధినిర్దిష్టమగు ఘటనాప్రవాహమునకుఁ బ్రతిహతము సేయువా రెవ్వరు? నీబుద్ధివృత్తి యింకను నిష్కళంకితముగాలేదు. అందుచేతనే యిట్టి యసాధ్యకార్యములయందు నీకిచ్ఛ వొడమినది. ఎవరియదృ ష్టమున విధాత సుఖమును లిఖియింపలేదో, అట్టివారికి సుఖమును గలుగఁజేయుటకు క్షీణబలులగు మానవుల సామాన్యకార్యములే

సమర్థములైనచో నొకచిన్న మేఘఖండముచే సుధాకరుని సుధామయ కాంతి యేల కప్పఁబడిపోవును ?

జయంతి—ఆమాటనిజమే. అల్పప్రాణులగు మానవులు వేయి కార్యములుచేసియును బ్రహ్మవ్రాతను దప్పించుటకు సమర్థులుకారు. కాని యొక్కవిషయమునమాత్రము నేను మిగుల నాశ్చర్యపడుచు న్నాను.

స్వామి—ప్రపంచమున నాశ్చర్యముగలుగఁజేయునవి వేన వేలుకలవు. అందు నీకాశ్చర్యముగలుగఁజేసినదేది?

జయంతి—ప్రభూ ! సీతారామరాయలను నొక మహారాజు ప్రపంచమునజన్మించి మిగుల విఖ్యాతిగాంచి యున్నాఁడు. ఆతఁడు విజ్ఞాననిధి-సకలసుగుణాకరుఁడు-ధర్మమునకునిలయము. శరత్కాలకౌ ముదివలె నాతనిపవిత్రచరిత్ర మించుకంతయును గళంకములేనిది. అట్టిమహారాజువర్తన మంతలో నెంతయోభయానకముగా నేలపరిణ మించినది? నవనీతతుల్యమగు నాతనిహృదయ మంతలో నేలపాషాణ సమమైనది? వివేకసంపచ్ఛ్రేష్ఠులగునట్టి మానవుల స్వభావమంతలో నట్లుపరివర్తనమునొంది, నీచమార్గమువట్టునని నేనెన్నఁడు నెఱుంగను. అందుచే సీతారామునిపరివర్తనము నాకత్యంతాశ్చర్యమును గల్గించు చున్నది.

తత్త్వజ్ఞానియగు స్వామి యించుక మందహాసముచేసి యిట్లు ప్రత్యుత్తర మొసఁగెను. "వైషమ్యమయమగు నీప్రపంచమున నందు లకంతగా నాశ్చర్యపడనవసరములేదు. ఏమనిన, లోకమున నత్యంతా సంభవవ్యాపారములుసైత మొక్కొక్కప్పుడు సంభవించుచుండుటను మనముచూచుచునేయున్నాము. తిథులననుసరించి యమృతకిరణుని వృద్ధిక్షయములుసంభవించునట్లే. అదృష్టప్రభావమువలనను, కాల స్వభావముచేతను, మానవులబుద్ధియందుఁ దారతమ్యము గలుగుచుం డును. అగ్నిప్రజ్వలించినతోడనే వాయువునచ్చి సాహాయ్యమొనర్చు

చుండును. అట్లే మానవునకవయోగకాలమువచ్చినప్పుడు, అత్యంత బుద్ధిమంతుడైనను నాతనిబుద్ధి భ్రమసిపోయి యదియాతనియవయోగమునకు సాహాయ్యపడుచుండును. అప్పు డట్టివాని కెవ్వరును నిది కుమార్గ మిదిసన్మార్గ మని తెలుపుటకు సమర్థులుకారు. సుధాభ్రాంతిచేఁ బ్రకాశించుచున్న దీపశిఖయందుఁ బడుచున్నప్పు డించుకేనియు వెనుదీయని జ్ఞానశూన్యమగు శలభమువలె సీతారామరాయలును భ్రాంత్యధీనుఁ డైపోయినాఁడు. అట్లేకానిచో నంతటియపారధీశక్తిసంపన్నునకుఁ గర్తవ్య పరాయణున కట్టి దుర్బుద్ధి యేలపొడమవలయును; అట్టి పురుషసింహుఁడొక సామాన్యపు స్త్రీరూపమునెడల మోహితుఁడై యంతలో సంపూర్ణముగా జ్ఞానశూన్యుఁ డైనపుడు సంభవింపరాని కార్యము లేమియుండును? ఆతని యధఃపతనము సర్వజనపూజితుఁడగు విధాతచే నియమితమైనది. సీతారాముని యదృష్టతరువున కదివిషఫలము. కావుననే యాతని కట్టి దుర్బుద్ధి యుదయించినది. ఆతని యాత్మీయు లనేకకార్యములుచేసి యాతనిఁ గాపాడఁదలంచి తామే నాశనమైపోయిరి, కాని కృతార్థులు గాలేకపోయిరి. కాలముననుసరించియును, పూర్వజన్మ కర్మననుసరించియును, మానవులకుఁ గుబుద్ధిసుబుద్ధులు గలుగుచుండును. కాలకర్మము లెప్పు డెట్టి బుద్ధిని మానవునకుఁ బ్రసాదించుచుండునో దాని ననుసరించియే యాతఁడు ప్రవర్తించుచుండును. ఎంతటి యపారధీశక్తి సంపన్నుఁడైనను దానినతిక్రమించి వర్తింపనేరఁడు. అట్లేకాకపోయినచో, నిన్నొక దేవిగాఁ దలంచుచు సర్వదా అత్యంత భక్తివిశ్వాసములతో మెలంగెడి సీతారామరాయలు, సర్వజన సమక్షమున నట్టి భయంకర శిక్షను నీకేలవిధించును? ఆసమయమునఁ గాలకర్మము లాతని కాబుద్ధి నొసంగినవి. గొప్ప గాలివానపట్టుటకు ముందు ప్రకృతిసతి యెట్లు గంభీరరూపమును ధరించియుండునో, అట్లే మానవులు తమకధఃపతనము రానున్నప్పుడు, సీతారాముని

వలెనే బుద్ధిభ్రాంతులై సదసద్వివేచనాశూన్యులై జడులై యుందురు. అప్పుడు వివేకవంతుల యుపదేశములుగాని హితాహితజ్ఞానుల తిరస్కారములుగాని వారి కర్ణ కుహరములయందుఁ జొరఁజాలవు. ప్రపంచమునం దీనియమానుసారముగఁ గాలచక్రము తిరుగనారంభించినప్పుడు దానినాపుట కెంతటి సమర్థులకును స్వాధీనముకాదు.

జయంతి—ఆమాటనిజమగును. కాని, సీతా రాముని సౌభాగ్య దీప మింతశీఘ్రకాలములోనే యేలయారిపోయినది ?

స్వామి—వత్సా! భయంకరమగు నదీప్రవాహవేగమున నొక యొడ్డువిరిగిపోవునప్పుడు రెండవయొడ్డున నది పెఱుఁగుచుండును. అట్లే పరాత్పరుని నియమానుసారముగ నొకజాతి యధఃపతన మగు నప్పు డింకొక జాతి యున్నతశిఖరము నధిష్ఠించుచుండును. హిందువు లవనతి నొందుటయును ముసల్మానులభ్యుదయమును గాంచుటయును నిప్పుడు విధాతృని యభీష్టమైయుండెను. సీతారామరాయ లీవిధముగా బుద్ధిభ్రంశము నొందినఁగాని విధాతృని యభీష్టము నెఱవేఱదు. అందునిమిత్తమే మేఘఖండముచే సుధాకరుని మధురకాంతి కప్పువడి పోయినట్లు సీతారామరాయల హితాహితజ్ఞానము మఱుఁగువడి పోయినది. చాలకాలమునుండి హిందువుల స్వాధీనమందున్న యీ భారతభూమి యిప్పుడు వారిచేతినుండి జారిపోవలసిన విధియున్నది. ఎంతటిశక్తిశాలియును, ఎట్టి మహాపురుషుఁడును, సహస్రకార్యములు చేసియును నావిధి కన్యథాచేయుటకు శక్తుఁడుకాఁడు. త్రేతాయుగమున రావణసంహారరూప మహత్కార్యసాధనముకొఱకు గుణవతియగు కైకేయికి దుర్బుద్ధి వొడమినది. అట్లే యీకలియుగమున యవనుల యభ్యుదయముకొఱకు సీతారామునివంటి సత్పురుషునకు హితాహితజ్ఞానము నశించిపోయి నిర్దయయుదయించినది. యవనుల యభ్యున్నతికి సీతారాముఁ డంతరాయముగా నున్నాఁడు. అందుచే నాతని యధఃపతన మత్యంతావశ్యకమైనది. అదియైనంగాని విధాతయుద్దేశ్యము నెరవేరదు.

జయంతి—ప్రభూ! నే నబలను. అల్పమతిని. అందుచే భవిష్యద్విషయమున నంతదూరమువఱకును నాదృష్టిని బ్రసరింపఁజేయుటకుఁగాని, సృష్టికర్తయొక్క యీయపూర్వ లీలావిచిత్రమును దెలిసికొనుటకుఁగాని సమర్థురాలను గాలేకపోయితిని. ఇప్పుడు మీ ముఖమున సకలవిచిత్రతత్త్వములను దెలిసికొంటిని. నాహృదయమునఁగల సందియము తీరిపోయినది. సీతారాముని యధఃపతనమునకుఁ గారణము విధాతృని నియమముతప్ప వేఱొక్కటి లేదనువిషయము నిప్పుడు స్పష్టముగాఁ దెలిసికొంటిని. కాని, భవిష్యత్పరిణామ మెట్లుండునో తెలిసికొనవలయునను నిచ్ఛ యత్యంతము నాహృదయమును వేధించుచున్నది. భూత భవిష్య ద్వర్తమాన కాలములు మూఁడును భవదీయ జ్ఞానదృష్టి కధీనములు. నాయెడలఁ బరిపూర్ణ కృపనుంచి నాకుతూహలమును దీర్ప వేడుకొనుచున్నదానను.

స్వామి—వత్సా! ఇట్టి యనవసర చర్చలతో నీకేమిపని? మానవమాత్రులందఱును తమతమ పూర్వజన్మ కర్మముల ననుసరించి లభించెడి ఫలముల ననుభవించుచుఁ గాలసాగరమున నీఁదులాడుచుఁ గాలముపూర్తియైనతోడనే యందు మునిఁగిపోవుచుందురు. ఇందుల కన్యథా చేయుట కెవరికిని నేమార్గములును లేవు. కాలమాసన్నమై యున్నను మానవుఁడు తన జీవితమునం దింక నేకార్యము లవశిష్టములై యున్నవో వాని ననతికాలములోనే చేసి మఱిపోవును.

జయంతీదేవి యించుక లజ్జాభావముతో నవనతమస్తకయై "ప్రభూ! నే నెప్పుడు నీప్రపంచవ్యామోహమునకు లోఁబడియుండ లేదు. కాని, యీ యభాగినిమూలమున నాజీవిత మీప్రాపంచికవాసనలకు లోనైనది. ఆమెను నేను సహోదరినివలె స్నేహచక్షువులతోఁ దిలకించితిని. అందుచే నామె సర్వమును ద్యజించి నన్నే యాశ్రయముగా నమ్మినది. ఆమెకిఁక నీజన్మమున నాయనుకొనఁదగినవారెవరును లేరు. ఆమెకొఱకేను మిగుల విభ్రమమునొందితిని. తుద

కామె కెట్టిగతి సంప్రాప్తమగునో తెలిసికొనవలయునని యిచ్చ వాడమి మీకడ నీకథ ప్రస్తావమునకుఁ దెచ్చితిని. ప్రకృతోద్దేశ మీవృథాకౌతూహలమును తృప్తిపఱచుకొనుటకై మాత్రమే కాదు. ఈయభాగిని సీతారాముని ధర్మపత్ని. హిందూవివాహము నీటి బిందువువంటిదిగాదు. యావజ్జీవబంధముగలదిగాని, నడుమ విచ్ఛిన్న మగునదిగాదు. సీతారామునకు మఱల నుచ్ఛదశ వచ్చినచో నిశ్చ యముగా నామెదుర్దశకూడ దూరమైపోవును. ఏమనిన నా రిరువు రకును పతిపత్నీ సంబంధముండుటచే వారి యదృష్టముకూడ నొక విధమగు నుపకరణముచేతనే నిర్మింపఁబడిన దగుచున్నది. భాస్క రోదయ మైనపిదపఁ గమలిని యెట్లుమలినముతో నుండదో యట్లేపతి సుఖముగాఁ గాలముగడపుచున్నప్పు డాతనిసతియును విషాదముతో నుండఁజాలదు. అందుచేఁ జిరదుఃఖినియైన యానారీమణి కెప్పుడైన సుఖము గలుగునో లేదో తెలిసికొనుటకై మిమ్ముల నింతగా వేఁడు కొనుచున్నదానను.

వర్షవిహీనమైన మేఘమువలెను నిర్వాతస్థానమందలి దీపశిఖ వలెను, స్వామి క్షణికకాలము నీరవుఁడైయుండి పిదప జలదగంభీర స్వరముతో "అత్యంత దుర్ముహూర్తమున నామెకు సీతారామ రాయలతో వివాహమైనది. వారియదృష్టమున దాంపత్యసుఖము లేశమును గలుగదు. శనిదృష్టిప్రభావముచే సీతారాముని సర్వమును నాశనమైపోయినది. ఎనిమిది సంవత్సరములకుఁ బిదప నాతఁడీప్రపం చమునఁ గనఁబడఁడు. ఈలోపుగ నేదోయొకవిధమగు సుయోగము గల్గినఁ గల్గవచ్చును. అదియటుండనిమ్ము. "ఆమెసర్వమునుత్యజించి నన్నే యాశ్రయముగా నమ్మినది" అని చెప్పియుంటివి. అట్లయినచో నామెనెచ్చటనుంచితివి?" అనియెను.

జయంతి— ప్రభూ! ఆమెను నాతోఁగూడ నీపుణ్యాశ్రమము నకుఁ దీసికొనివచ్చుటకు నాకు సాహసము లేకపోయినది. అందుచే

కంఖాలమునందు, మీశిష్యుఁడగు బ్రహ్మానందమిశ్రుని యింటనుంచి వచ్చితిని.

స్వామి—మంచిది. నేనొక్కసారి యామెను జూడవలసి యున్నది. నీవుస్వయముగా కంఖాలమునకేగి యామె నిచ్చటికిఁ దీసికొనిరమ్ము.

స్వామిచెప్పిన యావాక్యముల నన్నిఁటిని విని జయంతీదేవి పులకితచిత్తయై తలయూచియూరకుండెను. ఇంతలో సూర్యాస్తమయ మగుచుండుటనుజూచి వారిరువురు తమతమ కుటీరాభ్యంతరములఁ బ్రవేశించిరి.



## రెండవ ప్రకరణము

### విషాదిని

జయంతీదేవి మఱునాఁడు ప్రత్యూషమున నే లేచి, గురుదేవుని యాజ్ఞాపరిపాలనము సేయవలయునను నుద్దేశముతో బయలువెడలెను. పాషాణమయమగుదుర్గమప్రదేశముదాటి యథాకాలమున కంఖాలము నకువచ్చి చేరెను.

హిందువుల పవిత్ర ప్రధానతీర్థమగు హరిద్వారమున కతిసమీపమున నీకంఖాలముండెను. అందు హరిద్వారపు పండాలును పవిత్ర చేతస్కులగు ననేక బ్రాహ్మణులును వాసము చేయుచుండిరి. వారిలో బ్రహ్మానందమిశ్రుఁడొకఁడు. ఆతనికి సంసారబంధ మేమియును లేదు. ఆతనికిఁ జాలదినములకిందటనే భార్యావియోగము తటస్థించినది. ఆతని కొక్కతెయే కుమార్తె. ఆమె యత్తవారింట గాపురము సేయుచుండెను. మిశ్రమహాశయుఁ డేకాకియై యీమనోహర స్థానమున నీశ్వరధ్యానము చేసికొనుచు రాత్రిందివములు గడపుచుండెను.



జయంతి యా మిశ్రమహాశయుని కుటీరమునఁ బ్రవేశించెను. మిశ్రుఁడు నామెనుజూచి సమాదరమున గౌరవించి యామెరాకకుఁ గారణం బడిగెను. జయంతి సవినయమై "గురుదేవుఁడు సహోదరిని చూడవలయునని యిష్టపడుచున్న వాఁడు అందుకొఱకే నేనువచ్చితిని. ఆమె నాయాశ్రమమునకునాతోఁగూడఁ గొంపోయెదను." అనియెను.

మిశ్రి—నీసహోదరి మిగులసుశీల. సర్వనియంతయగు నీశ్వరునిపై నామెకు భక్తివిశ్వాసములు లతిప్రగాఢముగనున్నవి. నేనామెను నాతనయవలెఁ జూచుచున్నాఁడను. ఆమెను జూచినచో సుబాలను జూడకపోవుటచేఁ గలుగుకష్టమును పూర్ణముగా మఱచిపోవుచుంటిని. ఆమె వృత్తాంతమునుబట్టి యామె యొక బంగాళాదేశీయుని తనయయని తోఁచుచున్నది. ఆమె నిరుపమరూపరాశినిఁ బరికించినచో నామాటసత్యమని స్పష్టమగును. ఆగుణమయి పదకమలశోభచే నొకమహద్వంశము ప్రకాశవంతమగుచున్నది. కాని, యీయావనకాలమున నామె కీయోగినీవేష మేలవచ్చినది? మధురవసంతకాలమున వర్షప్రాదుర్భావమునకుఁ గారణమేమి ? బాల్యమున యోగినీవేషములుదాల్చుటచే నామెభర్త సజీవుఁడై యుండెనా యని సంశయము కలుగుచున్నది. భర్తజీవించియుండినచో సంసారధర్మమునకు జలాంజలి నొసఁగి యీవిధముగా సన్యాసినీ వేషముతోఁ దిరుగఁ గారణమేమి? బాల్యకాలముననే యత్యంత సుశీలయై, భక్తిపరాయణయై, ధర్మజ్ఞాన విశిష్టయై, పరాత్పరసేవానిరతయై, నారీజన్మమును సార్థకముసేయు కర్తవ్యకార్యములయెడ నిరసనభావమును వహించి యీవిధముగ ననధికార కార్యములయెడ నేలప్రవృత్తయగుచున్నది? గృహమునఁ బాయసాన్నమున్నచో భిక్షావృత్తియవలంబించు టెందులకు? ప్రేమమయుఁడగు నీశ్వరుఁ డబలాసంరక్షణార్థ మతి సులభోపాయముల నేర్పఱచియుంచినాఁడు. స్త్రీలు వారిహృదయమునందలి ప్రేమానురాగములను సంపూర్ణముగ నిష్కపటభావముతో వారి

భర్తలపాదపద్మములకడ నర్పింప సమర్థులగుదురేని జగత్పతి వారి యెడఁ బ్రిసన్నుఁడై నిరుపమానానందము నొసంగును. ధర్మాసక్తులును, భక్తిపరాయణులు నగు పురుషు లనశనవ్రితమును దాల్చి దుష్కర తపశ్చర్యలను చేయుటవలన నెట్టిఫలమును బొందుదురో, అతిథిసత్కారము, క్షుధాతురున కన్నదానము, కర్తవ్యాకార్య పరిపాలనము, మొదలగు సత్కార్యములచే స్త్రీలు నట్టిఫలమునే పొందుచు దేవీరూపలై శాశ్వత సౌఖ్యముంగాంచెదరు. తన కనుకూలములగు పుణ్యాకార్యము లుండఁగా, సరళసహజమార్గమునువీడి, బాల్యమున నీమె యీవిధముగా నసాధ్యమార్గమునఁబోయి యాపదపాలగుటెందులకు? రజ్జువుచే స్వసంరక్షణశక్తి విరహితమగు పశువును నొకచోఁ గట్టివైచి రక్షించినట్లు ధర్మపాిణులగు నబలలను ప్రేమశృంఖములచే నీప్రిపంచమునఁ బురుషులకుఁగట్టివైచి సత్కార్యాచరణమున నియోగించినప్పుడు వారున్మార్గగాములై బంధములను ద్రెంపివైచినచోఁ జేయఁదగినదేమి? అందులకనియే శాస్త్రకర్తలు నారీలోకమునకుఁ బతిసేవయే పరమధర్మముగా నిర్దేశించియున్నారు. సుశీలయగు నీ బాలిక స్వధర్మము నుల్లంఘించి కర్తవ్యమునుమఱచి యీవిధముగ విపరీతపథమున నేలప్రియాణము సేయుచున్నది? అందువలన నామె కేమిలాభము కలుగును? నేను నాసంశయము నణఁపఁజాలక యొకనాఁడామెతో నీవిషయమును గూర్చి ప్రిస్తావించితిని. కాని యామెవలన నెట్టి ప్రిత్యుత్తరమును బడయలేకపోయితిని. శిశిరసిక్తమగు కమలము వలె నామెముఖ మశ్రుజలముచేఁ బరిప్లుతమయ్యెను. నే నట్లడుగుట వలనఁ బూర్వస్మృతిసాగరమునందలి శోకానలము ప్రజ్వరిల్లుచుండెనని నేను తెలిసికొంటిని. అందుచే మరల నాసంబంధమైన వృత్తాంతమును గూర్చి నేనేమియు నామె నడుగలేదు. ఎప్పుడో యొకప్పుడు నీవలన నీసమస్త విషయములను దెలిసికొనవచ్చునని యెంచి నాసంకల్పమును హృదయముననే యణఁచి యుంచితిని.

ఈ బాలిక జీవితవృత్తాంతమంతయును నీకుఁ దెలిసియుండును. కావున నా కెఱింగింపుము.

జయంతీదేవి మిశ్రమహాశయుఁడు నుడివిన వాక్యములను విని సవినయముగ సమ్రస్వరముతో "ప్రభూ! దురదృష్టానలదగ్ధమగు నారీజాతి యదృష్టమును వేఱొకవిధాత నిర్ధారణచేసియుండెనని తోఁచుచున్నది. అందుచేతనే యనేకామృత కుండములలో స్నానసముచేసినను, వారి గాత్రదాహ మించుకంతయును బ్రశమితమగుట లేదు. అనేక సంవత్సరములు గంగాతీరమున వాసముచేయుచున్నను వారి పిపాస శాంతి నొందుటలేదు. ఏమహాత్ముని యశస్సు జగద్విశ్రాంతమైనదో, ఎవఁడు దయాసాగరుఁడో, ఎవఁడు ప్రేమావతారుఁడో, ఎవఁడు కరుణాసింధువో, ధరాభారనివారణార్థ మెవఁడీ యవని నవతరించెనో, ఎవఁడు దోషరహితుఁడో, ఎవఁడు సర్వగుణాకరుఁడో, ప్రపంచమందలి మానవులలో నెల్ల నెవఁడు సర్వోత్కృష్టుఁడో, అట్టి శ్రీరామచంద్రునియం దాత్మ సమర్పణముఁగావించిన జానకి యొక్కనాఁడైనను సుఖము ననుభవింపలేకపోయెను. చిరకాల మశ్రుజలములతోడనే కాలముగడపెనుగదా! అందుచేతనే స్త్రీల యదృష్టము నెవఁడో వేఱొకవిధాతవలన భిన్నోపకరణముచే సంఘటింపఁబడెనని చెప్పియుంటిని. దేవాదిదేవుఁడగు నీశ్వరుని యదృష్టమున సముద్రమథనమునం దాతని కమృతమునకు బదులుగఁ గాలకూటము లభించినట్లే యీప్రపంచమున ననేక స్త్రీలకు వారి యదృష్టదోషముచే నమృతమునకుఁ బదులుగ గరళములభించుచున్నది. అట్లే కోమలకుసుమగుచ్ఛము సర్పాకారమునుదాల్చి దంశన మొనర్చుచున్నది. సర్వసుగుణాశ్రయుఁడగు సత్పురుషుని బరిణయమాడియును వారికి సదా మనోవేదనముతోడనే కాలపుగడపుచుండుట తటస్థించుచున్నది. దేనివలన నిట్టి విచిత్రవ్యాపారములు సంఘటించుచుండునో, అట్టిప్రకృతిమర్మములను దెలిసికొనుట మిక్కిలిదుస్తరము.

అందుచే నారీజాతి యస్పష్టతరుపున విషమయఫలమే లభించునని మీకడ విన్నవించియుంటిని" అనియెను.

మిశ్రిమహాశయుఁడు నిశ్చలహృదయముతో జయంతీదేవి నుడివిన వాక్యములను విని యిట్లనియెను. "బిడ్డా! నీవాక్యములు సారవంతములు. భ్రాంతి విరహితములు. కాని యెప్పుడును దేవతలకును, మానవులకును సామ్యముదెచ్చుట సరికాదు. దుష్టశిక్షణమును శిష్టరక్షణమును జేసి ప్రపంచమున కుపదేశరూపమున మహోపకార మొనర్పవలయునను నుద్దేశముతో జగత్ప్రభువు రామచంద్రుఁ డీకర్మభూమిపై నవతరించినాఁడు. ఆతఁడొనర్చిన కార్యముల కన్నిటికిని పరార్థపరాయణతయే మూలమంత్రము. స్వార్థపరాయణత్వముగాని, సుఖేచ్ఛగాని యాతనికడ నించుకంతయును లేదు. మానవుల యాపదలను దొలఁగించుటకై యీలీలారంగమున నాపరాత్పరుఁడే యీరూపమునఁ బ్రవృత్తుఁడైనాఁడు. సర్వదా ప్రజాచిత్తరంజకుఁడై వారలను సంతృప్తిపఱచుచు రాజ్యపరిపాలనము సేయుచుండుట రాజునకు విధియని క్రియారూపమున నుపదేశించుటకై శ్రీరామచంద్రుఁడు నిరపరాధినియగు సతీశిరోమణిని విసర్జించివైచినాఁడు. ఆమె పతివ్రతన విషయమున నించుకంతయు నాతనికి సందేహములేదు. ఈశ్వరప్రతిరూపుఁడగు నృపతి నెఱవేర్పవలసిన కఠోర ధర్మమును క్రియారూపమున నుపదేశించుటకై యాతఁడు ప్రపంచమున నట్టి యద్భుతత్యాగమును జేసి నిదర్శనమును జూపినాఁడు. తదనంతరము వారిరువురును గొన్నిదినములు విరహవ్యథను సహించుకొని తుదకు వైకుంఠపురమున మరలఁ గలిసికొనిరి. దేవతల లీలాచాతుర్యములయందేదో యొక రహస్యోద్దేశ ముండుటచే నట్లుజరుగుచుండును. కాని యీయువతీమణి యదృష్టవృక్షమునఁ దిక్తఫలము ఫలించుటకుఁ గారణ మేమియున్నది? యౌవనమున నిట్టియోగినీవేష మేల ధరింపవలసివచ్చెనో యావృత్తాంతమును నాకడ దాఁపక

యెఱింగింపుము. ఇన్ని దినములామె నాయాశ్రమము నందున్నది. కాని యింతవఱకు నామె వృత్తాంత మేమియు నాకుఁ దెలియలేదు. అంతయేల? ఆమె నామమైనను నేనెఱుంగను. అందునుగూర్చి యేమైన నడిగినచో నామెకేదయినఁ గష్టముగలుగునేమో యను భయముచే నేనడుగలేదు."

జయంతి—ప్రభూ! ఈదుఃఖినియొక్క దుఃఖమయ జీవిత వృత్తాంతమును జెప్పవలసివచ్చినచో నెంతయో యగును. ఆయావదంతమును సవిస్తరముగ మఱియొకప్పు డవసరక్రమమున దేవరకు విన్నవించుకొనియెదను. ప్రస్తుతమున మీయౌత్సుక్యనివృత్తికొఱకు ఆమెవృత్తాంతమును క్లుప్తముగాఁ దెలుపుచున్నాను. ఆలకింపుఁడు. విధాత జానకినివలెనే యీమెనుగూడ జన్మదుఃఖినిగాఁజేసి ప్రపంచమున సృజించియున్నాఁడు. అందుచేఁ బ్రపంచమందలి మానవాగ్రగణ్యులలో నొకనియం దాత్మసమర్పణముఁ జేసికొనినను నారీజన్మమును సార్థకపఱచుకొనుభాగ్య మీమెకు లభించినదికాదు. అమావాస్యారజనివలె నీమెజీవనాకాశమునఁ జిరకాలము మహాంధకారమే వ్యాపించియుండెను. ఆమెయదృష్టమున నానందరూపచంద్రోదయము కాలేదు. ఆచిరదుఃఖిని పేరు శ్రీ. ఆమె వంగదేశమందలి యొక కాయస్థకులమున జన్మించినది. ఎనిమిదేండ్ల వయసున వంగదేశమందలి యొక జమీందారును మహారాజునగు సీతారామునకును నామెకును బరిణయమైనది. వివాహమైనకొన్ని దినములకుఁ బిదప నొకదైవజ్ఞుఁడు నూతనదంపతుల యదృష్టమును గణనచేసి, అత్యంత దుర్ముహూర్తమున నీవివాహము జరిగినదనియు, ఈరమణితో సహవాససుఖ మనుభవించినచో ననతికాలములోనే పతియాయువు గడతేరిపోవుననియుఁ, జెప్పియున్నాఁడు. సీతారామరాయ లీవృత్తాంతమును విని యీజన్మమున నామెను సంపూర్ణముగఁ ద్యజించివైచి మఱి యిరువురు నారీమణులను బెండ్లియాడి సుఖముగా రాజ్యపాలన

ము చేసికొనుచున్నాఁడు. ఈయభాగిని పతిచేఁ ద్యజింపఁబడి పితృగృహమునందే వాసముచేయుచుండెను. కొన్ని దినములకుఁ బిదప ముందుగఁ దండ్రియుఁ దరువాతఁ దల్లియు నిహలోకమును వీడి పోయిరి. ఆసమయముననే యొక మహాద్భుతకార్యము సంఘటిల్లినది. తన్మూలముననే విషవృక్షమున కంకురము బయలుదేరినది. ఇప్పటి కావృక్షమున సమస్త రాజ్యనాశక ఫలము ఫలించినది.

మిశ్రి—ఏమియద్భుతకార్యము సంఘటించినది? స్పష్టముగాఁ దెలుపుము.

జయంతి—ఈయభాగినితల్లి మృత్యుశయ్యయందుండఁగానామె జ్యేష్ఠపుత్రుఁడు గంగారాముఁడు వైద్యునిఁదీసికొనివచ్చుటకై పోవుచుండఁగా మార్గమధ్యమున మహమ్మదీయఫకీరొకఁడు దారికడ్డముగా బడియుండెను. గంగారాముఁడు వేగముగాఁ బోవలసినవాఁడగుటచే ఫకీరుపైనుండి దాటి గంతవ్యస్థానమునకేగెను. వైద్యునిఁ దీసికొని యింటికి వచ్చునప్పటి కాతని తల్లి మరణించెను. ఫకీరు తనకు బ్రాహ్మణకాఫర్ చేసిన యాభయంకర మహావమానమునకుఁ బగ దీర్చుకొనుటకై ఖాజీకడ నభియోగమునుదెచ్చెను. మహమ్మదీయ ప్రభుత్వమున ఫకీరులకు గౌరవమధికమగుటచే నాఫకీరు చెప్పినదంతయు సత్యమని ఖాజీనమ్మి గంగారాముని బంధించి తెచ్చుటకై నల్గురు సాయుధులగు మనుష్యులను బంపెను. గంగారాముఁడు తల్లికిఁ బరలోకక్రియ లాచరించుచున్న సమయమున యమదూతసములగు నా నల్వురును వచ్చి యాతనిపట్టుకొని బంధించి ఖాజీగృహమునకుఁ గొనిపోయిరి. న్యాయపరాయణుఁడును బుద్ధిమంతుడునగు ఖాజీ యా గురుతరాపరాధమునకు సామాన్యమగు శిక్షనే విధించెను. గంగారాముని బ్రతికియుండఁగనే పాతివేయవలయునని యాజ్ఞాపించెను. ఆ వృత్తాంతమును విని శ్రీ అత్యంతమనఃపీడితయై యాసన్న మృత్యుముఖముననున్న సహోదరు నుద్ధరించుట కేయుపాయమును గానక

తుదకు సీతారాముని శరణుఁ జొరవలయునని నిశ్చయించుకొనియెను. ఖాజీ కోపమునుండి తప్పించి గంగారాముని నుద్ధరింపఁగల శక్తిశాలి, ధైర్యవంతుఁడు సీతారామునికంటె వేఱొకఁడు లేఁడు. సహోదరిని విపదవస్థమూలమున గుణమయియగు శ్రీ లజ్జను ద్యజించి యేకాకినియై యతి దైన్యముతో మహారాజు నెదుటకుఁబోయి యావదుదంతమును విన్నవించెను. వసంతాగమనముచే ధరారమణి యెట్లు సంక్షోభిత యగునో, అట్లే యౌవనసమాగమముచే శ్రీరూపప్రభ యత్యంతము శోభాయమానమగుచుండెను. మఱియును భాద్రపదమాసమునందలి భాగీరథివలె యౌవనలావణ్య తరంగములచే నామెసర్వాంగములును వ్యాపితములై శోభిల్లుచుండెను. సీతారామరాయ లనిమేష నయనములతో నా యపరూప రూపామృతరసమును పానముచేసి విమోహితచిత్తుఁడై పోయెను. ఆతని హృదయమున లోలతారూపమగు వహ్ని ప్రజ్వలింపనారంభించెను. ప్రజ్ఞావంతుఁడగు సీతారాముఁడు ప్రజ్ఞాబలముచే మహూర్తములో మఱల యథ స్థితికి వచ్చి యామెసహోదరుని రక్షించెదనని ప్రతిజ్ఞచేసెను. శ్రీ ప్రఫుల్ల చిత్తయై తన గృహమునకు మరలివచ్చెను.

మఱునాఁడు గంగారాముని జీవితావస్థయందే సమాధిచేయవలసినదినము. ఈ విచిత్రకార్యమును జూచుటకై వేనవేలు జనులు సమావేశమైరి. ఒక ప్రశస్తప్రదేశమున నొక పెద్దగొయ్యి త్రవ్వఁబడియెను. ఖాజీయును, ఫకీరును, బంధములతోనున్న గంగారాముని దీసికొని తలవరులును నాప్రదేశమునకు వచ్చియుండిరి. ఆసమయమున సీతారామరాయ లశ్వారోహకుఁడై యచ్చటకువచ్చి, గంగారామునకుఁ బ్రాణభిక్ష దయసేయుమని ఖాజీని వేఁడుకొనియెను. ఖాజీ యించుకంతయును సమ్మతింప డయ్యెను. సీతారామునకేమియు నుపాయము దోఁపలేదు. గంగారాముని ప్రాణములను రక్షించినచో వేయి మొహరీల నిచ్చెదననియెను. వేయి మొహరీ

లనుటతోడనే ఖాజీ హృదయ మించుక మెత్తవడి తన యభిప్రాయ మును సూచించు దృష్టితో ఫకీరు మొగమువంకఁ దిలకించెను. ఫకీ రందులకు సమ్మతింపలేదు. గంగారాముని కెప్పటియవస్థ తప్ప దయ్యెను. ఆతనిని రక్షించుట కుపాయములేదు. సీతారామరాయలు క్రమక్రమముగాఁ బదివేల వరహాలవఱకు నిచ్చెదననియును గంగా రాముని వదలివేయుఁడనియును వేఁడుకొనియెను. కాని ఫలము లేకపోయినది. దయాసముద్రుఁడగు ఫకీరించుకంతయును దన యభి ప్రాయమును మఱల్చుకొనుటకు సమ్మతింపలేదు. తుదకుభయానక మగు నాదారుణవధకార్యము జరుపుటకు సర్వమును సన్నద్ధమయ్యెను. ఆసమయమున సీతారాముఁడు గుఱ్ఱమునుండిదిగి ఖాజీతో " ఈ హతభాగ్యునివధ నిశ్చయమైనచో, మీాకీసంకెలల నష్టముకూడ నెందులకు ?" అనియెను.

ఖాజీ, సీతారామరాయలు చెప్పినమాటవిని, యోచించి, సంకెలలను దీసివేయుట కనుమతించెను. ఖాజీ యాజ్ఞప్రకారము సంకెలలఁ దీసినతోడనే సీతారాముని యింగితానుసారముగ గంగా రాముఁడు తటాలున నాగుఱ్ఱము నధిరోహించి విద్యుద్వేగముతోఁ బలాయనుఁడయ్యెను. గంగారామునకు బదులుగ సీతారాముని నాగోతిలోఁ బాతివేయుఁడని ఖాజీ యాజ్ఞాపించెను. ఆసమయమున శ్రీ యొక వృక్షముపై నెక్కియుండెను. ఆమె "యవనులను జంపుఁడు—చంపుఁడు" అని యచ్చటకువచ్చిన మానవ సమూ హమును బ్రోత్సాహపఱచుచుండెను. వృక్షారూఢయగు నాతేజో మూర్తిని సందర్శించి యెవరో యొకదేవియని యందఱు ననుకొనిరి. ఆనారీమూర్తి వాక్యములచే నుత్సాహితులై వారంఱును ఖాజీని, ఫకీరును జుట్టుముట్టిరి. ఖాజీ పలాయనుఁడై ప్రాణములను రక్షించు కొనియెను. కాని దుర్నయుఁడగు ఫకీరు పాఱిపోలేకపోయెను. అంద ఱును వచ్చి యాతనిని పాదములతోఁదన్ని యీడ్చివైచిరి. ఆ సమ

యమున నగరమంతయు భీభత్సమై మహాసంకులమై యుండెను. ఖాజీ క్రోధమునకు మితి లేకపోయెను. ఈవ్యాపారమున కంతకును సీతారామశాయలే మూలమని ఖాజీస్థిరపఱచుకొనియెను. విద్రోహుల నందఱను బట్టుకొనుఁడని యాజ్ఞయొసఁగెను. క్షణకాలములోనే యసంఖ్యాకులగు విద్రోహులను బట్టుకొనిరి. ఖైదీలతోఁగారాగారము సంపూర్ణముగా నిండిపోయెను. సీతారాముని, శ్రీని గూడఁబట్టుకొని చెఱసాలయం దుంచిరి.

జయంతీదేవి యీపూర్వకథను వర్ణించి చెప్పుచున్న సమయమున నా లోలాహితకేశయగు శ్రీ సన్యాసినీవేషముతో మ్లానయై యార్ద్ర వస్త్రముతో నచ్చటికి వచ్చెను. అందువలన జయంతి కా కథ నింకను సాగించుట కప్పు డభ్యంతరము గలిగినఁ గలిగియుండ వచ్చును.

పాఠకమహాశయు లీ రమణీరత్నమును పూర్వమేరూపముతో నుండగాఁ జూచియున్నారో, ఇప్పుడారూపములేదు. అప్పటికి నిప్పటికిని విశేషభేదమున్నది. ఆమెశరీరమున భూషణాదులు నామమాత్రమునకైన లేవు. ఆమె యొక సామాన్యమైన గైరిక వస్త్రమును దాల్చియుండెను. రెండుచేతులకును గౌరవచిహ్నములగు నెఱ్ఱనిదారములు మాత్రము రెండుండెను. అయినను వానిమూలమున నామె దివ్యసౌందర్యము నూఱురెట్లధికమగుచుండెను. ఆకస్మికముగ జూచినచో నవతెయో యొక స్వర్గభ్రష్టయగు దేవియని భ్రమగలుగును. ఈశ్వరుఁ డెవరికి రూపమును బ్రసాదించునో, వారికి వస్త్రభూషణాది కృత్రిమాలంకారములతోఁ బనిలేదు.

శ్రీ రూపవతియను మాట సత్యము. ఇంతేకాదు. ఆమె యపరూపరూపరాశి. మహాసాగరమువలె స్థిరమైనది. దానియందెట్టి తరంగ చాంచల్యములును లేవు. ఈ యనిందిత రూపరాశిని జూచినప్పుడు విలోలహృదయుల హృదయవహ్ని బ్రజ్వలించుటలేదు.

వాసనాబద్ధులకా కాంక్ష జనించుటలేదు. ఇంద్రియసేవకులును నీచపథగాములునగు కాముకు లీరూపానలమునఁబడి భస్మమగుటకు సాహసించుటలేదు. ఆలోచనాపరులగు మానవులు కేవల విస్మయ విస్ఫారిత నేత్రములతో, స్తంభితహృదయముతో, నితాంతపవిత్ర భావముతో, దూరముననుండి నిరీక్షించుచు భక్తిరస నిమగ్నులై పరమశిల్పియగు విధాత శిల్పనైపుణ్యమును ప్రశంసించుచుందురు. మఱియు వారిహృదయభూమి పవిత్రభావశాద్వలముతోఁ బరిపూరిత మగుచుండెను.

స్త్రీ పురుషుల యంతర్భావములు వారి బాహ్యరూపములఁ బరిదృశ్యమానము లగుచుండునని పండితులు నుడివెడి మాట యథార్థము. రూపవతుల యంతరంగములు పిశాచీప్రియ నివాసభూములు. ఉత్కటవాసనాపవనోద్వేలితములు. ఐహికభోగలాలస బంధనాబద్ధములు. కావుననే వారిబాహ్యరూప మీవిధముగఁ జాకచక్యముతోఁ గూడిన యాకర్షణశక్తిగలది యగుచున్నది. ఈశ్వరునియందు యథార్థప్రేమగల భోగవిలాసవిరతలగు సాధ్వీమణుల యపరూప రూపప్రభయం దట్టిదాహకశక్తి లేదు. అంతియేకాదు. దానియందు విశేష మాధుర్యముగూడఁ గలదు. అట్టి సాత్త్వికరూప సాగరమునం దవగాహనముచేసినవాఁ డెప్పుడును నాత్మవంచకుఁడు గాఁబోఁడు. మఱియును వాసనావహ్నియం దాత్మాహుతిఁజేయుట కిచ్ఛగింపఁడు. కేవల పవిత్రభావమున ననిమేష నయనములతో దివ్యశిల్పియగు విధాతృని శిల్పచాతుర్యమును సందర్శించుచుండును.

శ్రీ పూర్వముకంటెఁ జాలఁ జిక్కిపోయి యున్నది. అందుచేఁ గొంచెము పొడగరివలెఁ గాన్పించు చున్నది. కాని సౌందర్యమున మాత్రము లేశమైనను కొఱఁతవడలేదు. నివురుగప్పిన నిప్పువలె గైరికవస్త్రమధ్యముననుండి యామెదివ్యసౌందర్య లావణ్య కాంతులు నాల్గుదిక్కులకును వ్యాపించుచుండెను. సీతారామరాయుల

వంటి స్థిరప్రతిజ్ఞుఁడగు పురుషసింహుఁ డీరూపాలనమునకు శలభమై పోయినాఁడు. అన్నివిధములచేతను కర్తవ్యకార్యములకును జలాంజలి యొసంగి యున్మత్తుఁడైనాఁడు. రవికిరణప్రసారములచే శిశిరబిందువు నశించిపోయిన ట్లీతుచ్ఛరూపప్రభచేఁ బ్రజ్ఞావంతుఁడగు సీతారాముని హితాహితజ్ఞానము సంపూర్ణముగా విలుప్తమైపోయినది. దీనినిగూర్చి మన మాశ్చర్యపడనక్కఱలేదు. ప్రపంచమునం దిట్టి సామాన్య సూత్రావలంబనముననే యిట్టి విచిత్రము లెన్నియో సంఘటిల్లు చుండును.

మనోహరమగు నుషఃకాలమునఁ గమలిని యెట్లు వికసిత యగునో, అట్లే జయంతీసందర్శనమున శ్రీముఖకమల మానందముచే వికసించెను. పూర్వమునుండియును వారిరువురును పరస్పర ప్రేమ బద్ధులైయుండిరి. అందుచే మాతాశిశుసంపర్కము పరివర్తనమై సోదరసంపర్కము లభించినది. రెండుతావులనున్నను ఏకశ్రుతిని గలిగియున్న వీణ లేకస్వరమును బలుకునట్లే, వేలువేలు తావుల నున్నను స్నేహాతిశయముచే హృదయము లొక్కటిగా లీనమైపోవు చుండును. వేలువేలు తావులనున్నను అట్టి హృదయ ప్రవృత్తులును గతులు నొక్కతీరుననే యుండును. ఒకవిధమగు వస్తుసామగ్రిచేత నేహృదయములు నిర్మింపఁబడునో వానికిట్టి నిష్కపట ప్రణయము గలుగుచుండును. భీమపరాక్రమమగుకాలము విచ్ఛిన్నము గల్పింపక పోయినచో, వానిప్రేమ కించుకంతయును విచ్ఛేదము గలుగదు. ఏమనిన నట్టి పవిత్ర ప్రేమాభ్యంతరమున స్వార్థపరత్వవాసనగాని స్వకార్యోద్ధారకత్వవాసనగాని నామమాత్రమునకైనను లేవు. స్వార్థ హీనమగునటి యకపట ప్రణయము స్వర్గఖండము. అపార్థిపథనము. ఆముష్మికమునం దిట్టి ప్రేమలాభమును బడసినవా రత్యల్పము.

ఈశ్వరసేవా పరాయణయు గుణవతియు నగు శ్రీ యార్ద్ర వస్త్రములను విసర్జించి పొడిబట్టనుదాల్చివచ్చి జయంతీదేవి పార్శ్వమునఁ గూర్చుండి వీణామధురస్వరమున "మీసోదరియగు నీచిరదుఃఖిని మీరిరువురునుగూడ మఱచిపోయినట్లు తోఁచుచున్నది. అందుచేతనే చాలకాలమునుండి నావిషయమైన ప్రశంసయేలేదు." అనియెను. జయంతీదేవి యించుకచిఱునగవుతో "ఈదేహపంజరమున నాప్రాణవిహంగ మెంతకాలము వాసముచేయుచుండునో, ఎంతకాలము నా నాసికారంధ్రమున నూపిరి నడయాడుచుండునో, అంతకాలము నొక్కనిమిషమైనను నించుకంతయును నిన్నుమఱచి యుండఁజాలను. ఈప్రపంచమున నేనెవరిని నెప్పుడు ప్రేమించియుండలేదు. ఎవరియందును నింతబలమైన ప్రేమను జూపియెఱుంగను. నీయెడల నాకీప్రేమ నూతనముగా జనించినది. నూతనాస్త్రముయొక్క వాడి యెంతతీక్ష్ణముగ నుండునో నా యీనూతనప్రేమముగూడ నాహృదయమునఁ బ్రగాఢముగ నాటి యంతతీక్ష్ణముగ నున్నది. ఱాతిపై మలచిన మూర్తివలె నీ నిష్కళంక ముఖచంద్రమండలము నా హృదయఫలకమునఁ జిత్రింపఁబడియున్నది. అది యటుండనిమ్ము సోదరీ! నీకిచ్చట నేమికష్టములు సంప్రాప్తమైనవి?" అనియెను.

శ్రీ—ఇట నే ననుభవించుచున్నంత సుఖమును మున్నెన్నఁడును నాజీవితమునం దెచ్చటను ననుభవించియుండలేదు. ఈపృథివియం దిట్టి పవిత్రస్థానము నిట్టి శాంతిమయ ప్రదేశమును మఱెచ్చటను జూచియెఱుంగను. ఈపవిత్రస్థానమునకు వచ్చి పరమశిల్పియగు నీశ్వరుని శిల్పచాతుర్యము నొక్కమారు నిశ్చలహృదయముతో సందర్శించినచో నెట్టివారికిని స్వభావముగ హృదయమున విరాగముదయించును. మఱియు భక్తిరసముచే హృదయము పరిపూరితమగును. ఇంతేకాదు. ఇఁక నాహృదయకుసుమమునఁ గీటముప్రవే

శింపదు. స్వార్థముకొఱకు పాషండమనుష్యవేషధారణ మొనర్చి సరళహృదయులగు తోడిమానవుల వంచింపవలయునను బుద్ధి వొడమదు. తుచ్ఛవిషయ సంతృప్తికొఱకసత్యమాడ నిచ్ఛ జనింపదు. మిశ్రిమహాశయుఁడు మహానుభావుఁడు. ఆతనివంటి సాధువ్యక్తి యీకంఖాళమున మఱియెచ్చటనులేడు. ఆతని యనుగ్రహవశమున నాహృదయ మన్నివిధముల నిర్మలమును శాంతమునై యున్నది. ఆతఁడు నన్నుఁ దనతనయవలెఁ జూచుకొనుచున్నాఁడు. ఆతని యాదర్శ సందర్శములచే నాదుఃఖమయజీవనమునకుఁ బ్రశాంతికలుగుచున్నది. నాయీజీవితమునందా మిశ్రిమహాశయుని ఋణమును నేను దీర్చుకొననేరను. శోకతాపమయమును దుఃఖనిలయమునగు నీప్రపంచమున నాతఁడొక దేవతాస్వరూపుఁడని చెప్పినచో నది యత్యుక్తి కాఁజాలదు. స్వార్థత్యాగులగు నిట్టిపరోపకారపరాయణుల పుణ్యఫల సూత్రమున బద్ధులయియే సూర్యచంద్రులు నియమితసమయముల నాకాశపథమున నుదయించుచున్నారు. ధరారమణి యధోగతి నందకుండ నిలిచియున్నది.

జయంతి— నీవు చెప్పినది నిజము. మిశ్రిమహాశయుఁడు చాల మంచివాఁడు. అందుచేతనే నిన్ను నేనాతని యాశ్రమమున నుంచియుంటిని. గంభీరమగు సముద్రమున ననర్ఘములగు మంచి ముత్యములును, స్వల్పమూల్యములగు గుల్లముత్యములును గూడ చేరియుండునట్లే పుణ్యతీర్థములయందు దేవతాస్వరూపులగు మానవ శ్రేష్ఠులును, రాక్షసస్వరూపులగు నీచమానవులును గూడ గనుపట్టుచుందురు. ఈకాలమున సాధువేషములనుదాల్చి సంచరించెడు నీచ మానవులు మెండుగనున్నారు. మేకపన్నె పులులవలె మనుష్యనామమునుదాల్చిన రాక్షసు లీప్రపంచమున వేలకొలఁదిగ సంచరించుచున్నారు. సంపూర్ణముగ నాత్మగోపనముచేసికొని పరులవినాశ

మునకై వంచకులగువా రనేకులు గలరు. అట్టివారి సంఖ్యకు మితి లేదు. వెలుఁగుచీఁకటులవలె మంచిచెడ్డ లీప్రపంచమున సమకూరు చుండును. అవి వచ్చుచుఁ బోవుచుండును. అదియటుండనిమ్ము. నేనిటకిప్పుడెందులకు వచ్చితినో చెప్పెదవినుము.

శ్రీ—అతి కష్టభావముతో "ఎందుకొఱకు? ఎట్టి కష్టముల ననుభవించుట కిటకువచ్చితివో శీఘ్రముగాఁ జెప్పుము. వినుట కాతురమునొందుచున్నదానను." అనియెను.

సాక్షాద్దేవీరూపయగు జయంతి చిఱునగవుతో "ఎన్నియో దినములకుబిదపనదృష్టదేవతనీయెడలఁ బ్రసన్నమైనది. గ్రహగణము యొక్క సుదృష్టి నీపైఁ బ్రసరించినది. త్రికాలజ్ఞుఁడును తత్త్వజ్ఞాని యు నగు గురుదేవుఁడు నిన్నుఁ జూడవలయునని యభిలాషపడుచున్న వాఁడు. నీవు నాతోఁగూడ నాపుణ్యాశ్రమమునకు రావలయును. ఈశ్వరావతారమగు గురుదేవుని పాదపద్మములను, శాంతినికేతన మగు పుణ్యాశ్రమమును, సందర్శించినచో నీనయనములు సార్థకము లగును. నీహృదయభూమి భక్తిరసముచే నభిషిక్తమగును. అచ్చట స్వార్థపరాయణుఁడగు మానవుఁడొక్కఁడైనను లేఁడు. గురుదేవున కచ్చట శిష్యులుకొందఱున్నారు. వారు రాత్రిందినము లీశ్వరధ్యాన పరాయణులై యుండుచుందురు. ఎట్టి విషయవాంఛలును వారి హృదయమునఁ జొరనేరవు. ప్రకృతిశోభాపరిపూర్ణమును, స్వభావ దత్తమును, సుసజ్జితమును, శాంతిరసాస్పదమునగు నాపుణ్యాశ్రమ మును సందర్శించినచో, భక్తిభావముచే నీశరీరము పులకితమగుటయే గాక, సర్వజగత్తునకు నాదికారణుఁడైన పరాత్పరుని యపార మహిమ నీ నేత్రములకుఁ జక్కఁగా గోచరమగును" అనియెను.

జయంతినుడివిన వాక్యములనువిని శ్రీ పులకితగాత్ర యయ్యెను. విపుల సంతోషచిహ్నము లామెముఖమండలమునఁ బ్రకాశింపఁ

జొచ్చెను. ఆమె యేమియు మాటాడకుండ వెంట చేయునలయునను నభిప్రాయముతోఁ శాకశాలలోని కరిగెను.

దివాకరుఁడు దినమంతయు నడచి నడచి తుదకుఁ బశ్చిమ గగనము నాశ్రయింపఁబోయెను. ధరాసుందరి మనోహరరూపమును దాల్చి సంధ్యామూర్తి నభ్యర్చించుటకై సిద్ధముగానుండెను. స్నిగ్ధస మీరణుఁడు మెల్ల మెల్లగ నడచుచుఁ బ్రపంచమున కీసుసమాచారమును తెలియపరచుటకై బయలువెడలెను. కుసుమకులము హాస్యముఖము లతోఁ దమహృదయకథలను పరస్పర చెప్పుకొనఁ దొడఁగెను. మధుపానాశానుగతులగు మానవులవలెఁ దుమ్మెదలు గుణగుణధ్వను లతో గీతములు పాడనారంభించి కుసుమసుందరులను స్తోత్రము సేయవలయునను నుద్దేశముతో మస్తకసంచాలనము సేయుచు సమీ పమునకువచ్చి నివారింపబడుచుండెను. నానావిధపక్షులు నీప్రాపంచిక వ్యాపారమును జూచి నవ్వుచు నవ్వుచు మెల్ల మెల్లఁగఁ దమతమ గూండ్లను జేరుకొనుచుండెను. పతివిరహముచేఁ బతిప్రాణయగు కమలిని దుఃఖసలిలమున నిమగ్నయయిపోయెను. పిదపఁ గాతరయగు కుముదిని కమలినినిజూచి యానందముతో హృదయమున హోహో యనుకొనుచు నవ్వుచుండెను. చూచుచుండఁగనే యంధకార రాక్షసుఁడు ధరారమణి నాక్రమించుకొనియెను. ప్రదోషకాలమందలి సుషమ ముహూర్తకాలములో నంతర్హితమైపోయెను.

రాత్రి యించుక ఫలహారముచేసి జయంతీశ్రీదేవు లేకశయ్యపై శయనించిరి. ప్రభాతమున విషాదినియగు శ్రీ సంతోషహృదయముతో జయంతీదేవితోఁగూడఁ బుణ్యాశ్రమాభిముఖులై బయలు దేరి పోయెను.

---

## మూఁడవ ప్రకరణము

### పూర్వకథ

దేవీరూపలగు సన్యాసిను లిరువురు పర్వతములతోఁగూడిన యొకమార్గమును దాటి చనుచుండిరి. అట్లు చనుచున్నవారిలో గుణవతియగు శ్రీ కఠిన వ్రతాచరణమున నియుక్తయైయుండెను. అనేకదినములనుండి యనశనవ్రతమును దాల్చియుండెను. కాని యందుమూలమ్మున నామె దేహారోగ్యమున కించుకంతయును గొఱంత వాటిల్లలేదు. రవికిరణస్పర్శముచేఁదప్తకాంచన వర్ణమున భాసిల్లు హీరమువలె నామె సముజ్వలయై ప్రకాశించుచుండెను. ఈశ్వరుని దివ్యజ్యోతి యామెసర్వాంగములయందును బరివ్యాప్తమై యుండెను.

ఉషఃకాలముననే వారిరువురును మిశ్రమహాశయుని కుటీరమును విడిచి బయలుదేరిరి. మనోహరమగు నాసుసమయమున నెచ్చట జూచినను ప్రకృతిశోభ పరిపూర్ణముగా నిండియుండెను. స్వభావ సుందరి యపరూపసౌందర్యమును గాంచుచు హృదయమున నానందించుచు వారిరువురు నేమియు మాటలాడకుండ నొక క్రోశము దూరము నడచిపోయిరి. పిదప ముందుగా జయంతీదేవి స్నేహస్వరముతో చాలదినములకుఁ బూర్వ మొకనాఁడు మనమిట్టి నిర్జనపథమున నీవిధముగానే పయనముచేసితిమి. అదినీకు జ్ఞాపకముగనున్నదా?'' అని యడిగెను.

శ్రీ—ఆకథనే మఱచిపోయియుండినచో నింకను నాహృదయమేల దగ్ధమగుచుండును? ఈవైతరణీతీరమునఁ బ్రథమమున నిన్నుఁ గలిసికొనినప్పుడేమేమి సంప్రాప్తమయ్యెనో యవియన్నియును నా ప్రాణములనడుమఁ జేరి లీనమైయున్నవి.

జయంతి—మంచిది. ఈగుహావాసియైన మహాపురుషుఁడు నీ హస్తమును జూచియున్నాఁడు. జ్ఞాపకమున్నదా?

శ్రీ—గంగాధరస్వామిని భగవంతునిగాఁ దలంచుచున్నాను. ఆతని యెడల నాకపారమైన భక్తి.

జయంతి—ఆగంగాధరస్వామి యిప్పుడు పుణ్యాశ్రమమునందున్నాఁడు.

శ్రీ—నిర్జనమైన యీగుహనువిడిచి యటకేగుట కేమి కారణము?

జయంతి—గంగాధరస్వామియును, నేను నొకమహాపురుషుని కడ మంత్రోపదేశము వడసితిమి. ఆమహాపురుషుని పేరు రామానందస్వామి. ఆయన యాజ్ఞప్రకార మాతనిశిష్యులు వేలువేలురూపములతో వేలువేలు కార్యములయందుఁ బ్రవేశించి యున్నారు. ఎవరు వారివారి కర్తవ్యకార్యములను జక్కఁగ నిర్వర్తించెదరో, వారిని మరల నాయాశ్రమమునకుఁ బిలిపించుకొని గురుదేవుఁడు వారల గౌరవించి కృతార్థులనుగాఁ జేయుచుండును. గంగాధరస్వామి నిర్వర్తింపవలసినకార్యము లనేకములుండినను వానినన్నిటిని తన ప్రజ్ఞాబలముచే నాతఁడు ముందుగనే నెరవేర్చియున్నాఁడు. అందుచే దయాసాగరుఁడగు గురుదేవుఁ డాతనిని దనకడనుంచుకొని నిగూఢములగు ధర్మతత్త్వములనన్నిటి నుపదేశించుచున్నాఁడు. జగదీశ్వరుని బ్రత్యక్షముగాఁ జూచుటకు సుగమపథమును నిర్దేశించి తెలుపుచున్నాఁడు. నీవు మాగురుదేవుని సౌమ్యమూర్తిని దర్శించి యుపదేశపూరకములగు నాతని వాక్యరత్నముల నాలకించినచో, నాతఁ డొక త్రికాలజ్ఞుఁడగు మహాపురుషుఁడని నీవు తెలిసికొనఁగలవు. మఱియును నీక్షుద్రహృదయము భక్తిరసముచే నాప్లుతముకాఁగలదు. పవిత్రతపోవనమునఁ దేజఃపుంజుఁడగు నొకమహర్షికడ నిలుచుంటినని యప్పుడు నీ వనుకొనఁగలవు.

శ్రీ—నీకును తత్వజ్ఞానియగు గంగాధరస్వామికిని నిష్టదైవమగు నాతఁడు సామాన్యవ్యక్తియైయుండఁడు. నే నాతనిపాదపద్మములకు వందనసహస్రము లర్పించెదను. నీనిర్హేతుక కటాక్షముచే నాయీపాపనేత్రములతో నామహాత్మ్మని సందర్శించి కృతార్థను కాఁగలుగుచున్నాను. పూర్వజన్మమున నిశ్చయముగ మనమిరువురము నేకమాతృగర్భజనితులము. అట్లే కాకపోయినచో నీకు నాపై నిప్పుడింత స్నేహమేల యుదయించును? నానిమిత్త మింతటిప్రయాస నొందుటెందులకు? నీవెప్పుడైన నితరులకొఱ కింతటి కష్టముల ననుభవించియుంటివా?

జయంతి—నీవు చెప్పినమాట యనిశ్చయమైనది. నీవీయవస్థయందున్నప్పు డిట్టిమాటలు నీనోటనుండి రాఁదగినవికావు. నీవెవరు? నేనెవరు? అని యోచించిచూచినచోఁ బ్రపంచమందలి స్త్రీ పురుషులందఱును మనవారే. కాని నాప్రాణముల కాత్మీయులైనవా రొక్కరును లేరు.

పరిమళ సమ్మిళితమగు పుష్పముకడ నుండుటచే గంధవిహీనమగు తిలపుష్పమున కల్పకాలములోనే మరిమళమబ్బిన ట్లీకొలఁది సంవత్సరముల కాలమును నీకు సాధు సహవాసలాభ మబ్బుటచేఁ జంచలమగు నీహృదయము నీకు స్వాధీనమైనది. కృపాసింధువును దీనబంధువునగు నీమహాత్మ్మనిపై నత్యంతవిశ్వాసమును ప్రగాఢమగు భక్తియు నలవడినవి. నీహృదయమాలిన్యము సంపూర్ణముగ నశించిపోయినది. శిశిరవిఘాతమగు కమలమువలెను, శరదాత్రియందలి కౌముదిపోలికను, నీహృదయమిప్పుడు శోభనువహించినది. ఇట్టి సమయమున నీవెవరవో యోచించి చూచుకొనుట చాలమంచిది. అన్నిటికంటె నధికముగ నతియత్నముతోఁ గాపాడుచున్నను నీదేహమునందు రోగముత్పత్తి యగుచున్నది. కాని ఆరోగము వనము

నందలి మోహఘులమూలమునకదా నివాణమగుచున్నది. అట్లే ప్రపంచమున నీవారనుకొనువారు నిమిషములో నీకుఁబరులగుచున్నారు. ఎప్పుడు నెఱుఁగని యపరిచితజనుఁడు నీకత్యంత స్నేహితుఁ డగుచున్నాఁడు. ఇది ప్రాపంచికధర్మము. అట్లేకాకపోయినచోఁ బ్రపంచమున నెవ్వరికంటె నీకధికుఁడు లేఁడో అట్టి నీపతి నిన్నుఁబరిత్యజించి నైచుట యేలతటస్థించును? అప్పుడు మీ సంబంధమేమైనది? మహారాజుకంటె నేను నీకెట్లధిక సంబంధముగలదాన నైతిని?

శ్రీ—అదినిజము. అత్యల్పానుభవముగల యువగుణులకించుక దూరమునందుండుటయే మేలనియోచించి నేను నీకడకు వచ్చి చేరితిని. అప్పుడంతకంటె నాకు వేఱుపాయమేమియుఁ గన్పట్టలేదు. ఇంతేకాక, నాయెడల నేనంత విశ్వాసముంచుటకు సమర్థను గాకపోయితిని. స్వర్గసోపానములనుండి యొక్కమాఱుగ నరకకుండమునఁ బడిపోవుచుంటిననియు, ఉపకారమునకు బదులుగ నపకారమే సిద్ధమగుచున్నదనియుఁ దెలిసికొంటిని. నే నీయవస్థయం దచ్చుటనుండి బయలువెడలియింతదూర మరుదెంచితిని. నేనుస్త్రీజాతిలోనిదానను. స్త్రీలు, దావానలమువంటి భయంకరాగ్నినిగూఢఁ దమ హృదయమున దాఁచియుంచుకొనఁగలరు. నూఱు వజ్రపాతముల నైనను ఓర్పుతో సహించుకొనఁగలరు. కాని చంచలచిత్తులగు పురుషులంతటి సామర్థ్యముకలవారుకారు. ఒక్కముహూర్తములో వారి హృదయమున భావాంతరము లుత్పన్నమగుచుండుననిన నందసంభవము లేదు. అట్టి ప్రలోభులను బరిత్యజించుటకంటె వేఱుపాయమేమున్నది?

జయంతి—ఆమాట నిశ్చయము. కాని చాలకాలమునకుఁ బూర్వ మీదుర్గమారణ్యపథమున నీనోటినుండి యెట్టిమాటలు వెలువడినవో జ్ఞాపకముగ నున్నదా?

శ్రీ—నేనేమిచెప్పితినో యించుకంతయును జ్ఞాపకముగ లేదు. ఏమిచెప్పితినో స్ఫురణకుఁ దెచ్చెదవా?

జయంతి—ఈ శ్రీక్షేత్రమందలి నిర్జనపథమున మనము ప్రయాణము సేయుచున్నప్పుడు నీహృదయావేగమును శాంతింపవలయునను నభిప్రాయముతో నేను "క్షుద్రమానవుఁడగు నీనాథునిఁగూర్చినచింత నీహృదయమునుండి పాఱఁదోలుము. నీనాథున కెవఁడుప్రభువో అట్టి యీశ్వరునిపై నీహృదయమును నిలుపుకొనుము" అని యుపదేశించి యుంటిని. అప్పుడు నీ వవనత వదనవై, "ఈశ్వరుఁడు నా నాథునకు నాథుఁడు. కాని నా కేమియునుగాఁడు. అట్టియెడల నాభావము లీశ్వరునిపై నేల యుంచవలయును? నేనీశ్వరుని ప్రేమించుటలేదు. నా నాథునే ప్రేమించుచుంటిని. ఏమనిన నీశ్వరుఁడు నావాఁడగునో కాదో నిశ్చయములేదు. కాని నా నాథుఁడుమాత్రము నావాఁడే. అందుల కణుమాత్రమును సందేహములేదు." అని ప్రత్యుత్తర మొసంగియుంటివి. ఆప్రత్యుత్తరమును విని నీవెప్పుడు ప్రపంచ సంబంధమగు మాయాజాలమును త్రెంపివేయఁజాలవని యనుకొంటిని. నీవెప్పుడో యొకప్పుడు పంజరమున బంధింపఁబడుట నిశ్చయము.

శ్రీ యించుకమందహాసముసేయుచు నిట్లు చెప్పఁదొడంగెను. "అట్టి నీయనుమానము భ్రమపూర్వకమైనది. నేను దుర్బలహృదయనగు స్త్రీనైనను నీకృపావశమున నాకు నూతనజీవము లభించినది. ఆశ్రీ యిప్పుడులేదు. చచ్చిపోయినది. ఆశ్రీకిని, ఈశ్రీకిని ఇంచుకంతయును సంబంధములేదు. మహమ్మదుపురరాజ్యము మరలఁ బ్రతిష్ఠింపఁబడినదను చిత్తవిశ్రాంతికరమగుమాట యాకస్మికముగ విన నేతెంచినను నదియంతయునుగూడ నాయీహృదయము నేమియును పరీక్షింపఁజాలదు. నేనిప్పుడు నాహృదయబంధముల నించుక సడలింపఁగలిగితిని. వాసనారూప సముద్రమును ధైర్యముతో నతిక్రమించుటకు సమర్థురాలనైతిని. కాని, యిరువురు మనుష్యులను

గూడఁదీసికొని మరియీఁదవలయుననినచో వారిమూలమునఁ గూలము నకుఁ దిరిగివచ్చుటయేయుండదు. ఎవనిపవిత్రపాదపద్మములకడ నా యాత్మవిక్రియముచేసియుంటినో, ఆతఁడు నాహృదయమునలేకపోయి నచో, భయంకరమగునీపరీక్షనుండి యుత్తీర్ణను గాఁజాలకపోవుదును. ఎవనినిప్రాణములకంటె నధికునిగా నేనుప్రేమించుచుంటినో, ఎవనికా పదలురాకుండుటయేనాయీక్షుద్రజీవితమునకుఁ బ్రధానలక్ష్యమైయుం డెనో, ఆతని కందుమూలమునఁ గాతరము గన్పట్టినచో నీనాపాషాణ హృదయమును బెట్టుకొనియుండుటవలనఁ బ్రయోజనమేమి? ప్రపంచ సుఖముల నాశించినచో నిట్లేయుండును.

జయంతి—బాగుగానున్నది. కాని యాతుది దినమున నాతని కడ నీవెట్లు మాటలాడితివో నీకు జ్ఞాపకముగ లేదు.

శ్రీ—ఏమిజరిగినదో జ్ఞాపకముగ లేదు. దయయుంచి జ్ఞాపకము చేయవా?

జయంతీదేవి యించుక మందహాసముసేయుచు నిట్లనియెను. "నీవానాఁడా తల్పముకడ మహారాజు పాదములపైఁబడి "రాజోత్త మా! నీ దక్షిణహస్తముతో నాకభయమిమ్ము. నేనిఁక సన్యాసినీ వేషముతో నుండను. నాయపరాధముల నన్నిటిని క్షమించి నన్నుఁ జెట్టపట్టవా?" అని యడుగలేదా? నీప్రార్థననాలకించి మహారాజు నిన్ను "పట్టమహిషీ!" యని సంబోధింపలేదా? నీవత్యంత ప్రఫుల్ల హృదయముతో నాతనిపాదధూళిని శిరమున ధరింపలేదా? ఇవి యన్నియును జ్ఞాపకముగ నున్నవా?

శ్రీ—హా! హృదయావేగము నణఁపఁజాలక యట్టి గర్హిత కార్యముల నాక్షణమున నొనర్చినమాటనిజము. ఇప్పుడు ఘోరాను తాపాగ్నిచే నాహృదయ దగ్ధమైపోయినది.

జయంతి—పాపము చేయకపోయినచో ననుతాపముదయింపదు.

పూర్ణిమారాత్రివలె, నీహృదయము మాలిన్యపరిశూన్య మైనచో నీహృదయమున ననుతాప ముదయించుటేల ?

శ్రీ—అన్నియు నెఱింగియున్న నీవీప్రశ్నము వేయుటెందులకు ? అభాగినినైన నామూలమున శోణరాజ్య మకాలమున ధ్వంస మైపోయినదనియు మహారాజువంటి ధీశక్తిసంపన్నుఁ డొక్కమారుగ బాపపంకిలమున నిమగ్నుఁడై పోయెననియుఁ దెలిసికొనుటచే నావివేక మంతయుఁ దిరోహిత మైపోయినది. తన్మూలమున నాహృదయమున ననుతాపోదయ మైనచో నందాశ్చర్యమేమున్నది ? గంగాధరస్వామి యాజ్ఞానుసారముగ మహమ్మదుపురమున కేగియుంటిని. ఇంచుకంత యును శుభఫలము లభియింపలేదు. "కేవల ప్రియజనప్రాణహంత్రి" యను మాటమాత్రము సార్థకమై నాయెడల వర్తించినది.

జయంతి—ఇప్పుడు మరల నాప్రశంసయంతయు నెందులకు ? గంగాధరస్వామి యాజ్ఞానుసారముగా నీవును నేనును మహమదుపుర మునకుఁ బ్రయాణమైపోవునప్పుడు నీవునాతో ఒకరినొకరుచంపుట కెన్నటికిని సమర్థులుకారు. ఈప్రపంచమున లయకర్త యొక్కఁడే కాని యిందఱులేరు. ఆమృత్యువే యాతని నింతవఱకుని మరణము నుండి రక్షించినది. నాచేతియందైనను మఱియొకరిచేతియందైనను నాతనికి మరణము నిశ్చయమైనప్పు డాతని రక్షించుట కెవ్వరును సమర్థులుకారు. నేను బుద్ధిపూర్వకముగ నాతని హత్య యొనర్పఁ బోను. అట్లయిన నాచేత నాతనికి మరణము విధింపఁబడి యున్నచో దాని కన్యథాయొనర్చుట కెవ్వరికిని సాధ్యముకాదు. నేను ఘోరా రణ్యములఁ దిరుగాడుచున్నను సముద్రమున కావల కేగినను విధి నియమమునకు వశీభూతనగుట యెట్లును తప్పదు" అనినుడివియుంటివి. నీనోటినుండి వెలువడిన యీవాక్యములను విని నేనెంతయో సంత సించితిని. అప్పటికంటె నిప్పుడు నీవు తత్త్వజ్ఞానము నధికముగా

సంపాదించియుంటివి. నీహృదయ మప్పటికంటె విమలమై యున్నది. అట్టియెడ నిప్పు డిట్టిమాట లేలపలుకుచున్నదానవు ? నీహృదయమున వేఱుభావము లుత్పన్నములైనచోఁ బురాకృతపాపమునకుఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనవలయునను నిచ్ఛ వొడమినచో, రాజమహిషివి కాకపోయినను, గృహిణివై సంసారధర్మపరిపాలన మొనర్పుము. విశేషించి సీతారామరాయలు నిన్ను తప్పకస్వీకరించును. పతిసన్నిధి నున్నప్పుడు స్త్రీనేత్రములకు చెట్టునీడయైనను, నందనోద్యానము కంటెను నధిక మనోహరమై ప్రీతిప్రదమై కన్పట్టఁగలదు. కోర్కెయున్నచోఁ బారములేని యీసముద్రమునుండి దరిచేరుటకై ప్రయత్నింపుము. నౌకమధ్యమునఁ గూర్చుండి ప్రయాణముసేయునప్పుడు తుపానునుజూచి భయపడినందువలనఁ బ్రయోజనమేమి ?

శ్రీ— నీయీయుపదేశ మూషరక్షేత్రమందలి బీజావాసనమువలె నిరర్థకమైనది. పూర్వపు శ్రీ నీచేతియందే మరణించినది. ఆశ్రీ యిప్పుడు లేదు. ఈశ్రీ నౌకాభారమంతయు వేఱొకరిహస్తమునం దిడి సంపూర్ణమైన నిశ్చింతతోనున్నది. తుపానునుజూచి యించుకంతయును భయముచెందుటలేదు. భయభావములను ద్రింగివైచి ముక్తిలాభమునుబడసినది. సౌధాంతరాళమున సుఖముగఁగూర్చుండి యున్న వారనర్థమును, భీషణతరంగవిశిష్టము నగు సముద్రావాసమెందుల కపేక్షింతురు ? కాంచనమును బరిత్యజించి కంచుగ్రహించుట కెవ్వరు ప్రయత్నింతురు ? సుకంఠయగు కోకిలనువీడి నీచమగు కాకిని పంజరమునందుంచి యెవ్వరు పెంచుదురు ? అమృతకిరణుని మధురజ్యోత్స్ననుమాని ఖద్యోతకాంతి నెవ్వరాసింతురు ? అమృతపానముచేఁ బిపాసశాంతి నొందియున్నప్పుడు నూతిజలమును గోరువార లెవ్వరుందురు ? జ్ఞానమువచ్చి సంసారమునఁ బ్రవేశించినపిదప బాలికాత్వమునందలి యాట లెట్లు రుచించును ?

పరిణామశీలమును, నీరసమును, తిక్తమునగు నీప్రాపంచిక సుఖాస్వాదనమునందు నాకించుకంతయు నిష్టములేదు. ఎవరి పవిత్రప్రణయమునకు విచ్ఛేదము కలుగదో, అట్టివారి ప్రేమకు పాత్రభూతులము గావలయును. అల్పమగు పర్ణకుటీరమును విడిచి సుదృఢమగు సౌధాంతరాళమును వాసస్థానముగాఁ జేసికొనవలయును. హృదయమునందలి సమస్తచింతలును ఆపరాత్పరుని శ్రీ చరణములకడ నర్పించి నిశ్చింతగా నుండవలయును. కాని మాయాశృంఖలములచే బంధింపఁబడి యధఃపతనమునందుట మంచిదికాదు. పవిత్రములగు గంగాజలములను వీడి కూపోదకములయందు తర్పణము సేయువారెవ్వరు? ఈశ్వరుని పవిత్రప్రేమనువీడి ఆశాదాసులగు పృథివీపతుల నీచభోగవిలాసపరమగు ప్రేమ నపేక్షించుట, యనర్ఘమగు వజ్రమునువీడి గులకరాతిని చేపట్టుటవంటిదికాదా?

జయంతి—నిశ్చయముగా నట్టిదే. అట్లెవ్వరునుచేయరాదు. అగతికులకుగతి శ్రీపతి. ఆతఁడే సర్వవిధములఁ దోడయి యనాథలను రక్షించుచుండును. భక్తుల నాదరించుచుండును. అందుచేతనే యాతనికనాథనాథుఁడని పేరువచ్చినది. కాని నీవు సంసారమునందున్నప్పుడా శ్రీహరిపై నీమనసు నిలిచెనా?

శ్రీ—మానవుల నిందాస్తోత్రములను నేను సమబుద్ధితోఁ జూచుచున్నాను. నిశ్చయముగా నీప్రపంచమునఁ బరార్థపరులులేరు. ఏదోయొకవిధముగ స్వార్థసంబంధముండిననేగాని యెవ్వరు నితరులను ప్రేమించుటలేదు. స్వార్థమిశ్రితమును నికృష్టేంద్రియతృప్తిప్రదమునగు నీప్రణయమను వలలోఁ దగుల్కొన్నచో, నీశ్వరచరణసందర్శనమగుట యసంభవము. ప్రేమపంజరమున మాయాశృంఖలములచే బంధింపఁబడిననా ప్రాణవిహంగము అనంతాకాశపథమున కెగిరినప్పుడు నిర్వాణరూపవృక్షమునందక్క మఱియెచ్చటను నిలువదు. భూమ్యాకాశములయందెచ్చటనైననుసరియే, ఎట్టి కుటిలమానవ హృదయ

మైననుసరియే ఆపరాత్పరుని కృపాదృష్టి కధీనమైనచో నిఁక భయ మేమియునుండదు. నిశ్చయముగా నాహృదయము నాతనియధీనము చేసినచో నీపప్రపంచవృక్షమున సుధామయఫలము లభించి నారీ జన్మము సార్థకముకాఁగలదు. బొమ్మరింటియందలి యాటవలె ననిత్య ములైన యైహికసుఖములపై మనసుంచుట వట్టి వెఱ్ఱితనము.

ఈమాటలన్నిటిని విని జయంతీదేవి నిరుత్తరయై యూరకుం డెను. అత్యల్పమగు పారిజాత కోరకమునుండి బయలువెడలెడి పరి మళము చాలదూరము వ్యాపించునట్లే శ్రీ యల్పహృదయమునందలి యామహద్భావము లామె హృదయమున కత్యంతముసంప్రీతినొసంగి నవి. వారిరువురును మాటలాడకుండఁ ద్వరత్వరగ నడచుచుఁ బోవుచుండిరి.

క్రమక్రమముగా మధ్యాహ్నము కావచ్చుచుండెను. మనో హరమగు ప్రభాతస్వభావ సుందరీమూర్తి యదృశ్యమయినది. దివాకరుఁడు గగనమధ్యమున నగ్నిసమానకిరణరాశిఁ బ్రసరింపఁజేయు చుండెను. ప్రకృతిసతి పెంచుచుండెడి సుకంఠగాయకవిహంగకుల మతి భీతిచే నిబిడములగు పత్రగుచ్ఛములనడుమ దాఁగికొనియుండెను. గోగణము మేతమేయుటమాని చెట్లనీడల మెల్లగఁబరుండి నెమరువేసి కొనుచుండెను. జనశూన్యమగు నీసాంతమునఁ బ్రకృతిదేవి గంభీర మూర్తిందాల్చి ధ్యాననిమగ్నయై యుండెను. పిపాసాపీడితములగు చాతకముల యారావములుమాత్రము విరామములేకుండవినవచ్చుచు నాగాంభీర్యమున కించుకభంగమును గల్పించుచుండెను. జలమునకు జీవనమనుపే రీసమయమున సార్థకమగుచుండెను. పిపాసాతురులగు నన్యులమాట యటుత్రోసివేసి సహస్రకరుఁడు తనసహస్రకరముల తోడను జలాశయములయందలి జలరాశిని శోషింపఁజేయుచుండెను.

మానవులకు మధురమగు బాల్యముగడచిపోయినపిదప నాకాం క్షావిశిష్టమగు యౌవనకాల మరుదెంచునట్లే నయనమనోజ్ఞకమగు

ప్రభాతకాలము చనినపిదప భీషణభావసంయుతంబగు సూర్యకిరణములు మధ్యాహ్నకాలమున ధరాతలము నెట్లుతప్తముచేసివేయునో, అట్లే యింద్రియములు యౌవనకాలమున మానవహృదయమును తపింపఁజేయుచుండును. మధ్యాహ్నకాలమున వాయువెట్లుప్రతప్తమై యుండునో, యట్లే యౌవనకాలమందలి వాసనారూప పవనము తీక్ష్ణభావమును దాల్చియుండును. మధ్యాహ్నకాలమున దాహ మెట్లధికమగునో యట్లే యౌవనకాలమున సుఖాపేక్ష బలవత్తర మగుచుండును. మధ్యాహ్నకాలమున విహంగగణమధురారావము లెట్లు శ్రుతిగోచరములు కావో, యట్లే యౌవనకాలమున వివేకవంతుల సదుపదేశములు శ్రుతిగోచరములు కాఁజాలవు. మధ్యాహ్నకాలమున దివాకరుని ప్రతిభ యెట్లు వర్ధమాన మగుచుండునో, యట్లే యౌవనకాలమున భోగతృష్ణ తీక్ష్ణభావమును వహించి నానా ణెట్లభివృద్ధినొందుచుండును. మధ్యాహ్నకాలమున నసహనీయపిపాసాతురములగు కురంగములు భ్రమపడి మృగతృష్ణలకై పరువిడిట్లే ఇంద్రియలోలురై యౌవనకాలమున ననిత్యములగు సుఖతృష్ణలకు లోఁబడి మానవు లమూల్యమగు తమకాలమును వ్యర్థముగాఁ గడుపుచుందురు. దివసమునందుమధ్యాహ్నకాలమునుజీవనమునందుయౌవనకాలమును ననేకవిషయములలో సమానధర్మములను గాంచియున్నవి. ప్రదోషసమయమున గగనతలమునుండి దినమణి తనకిరణములతోఁ గూడ మఱుఁగువడిపోవ, ఘోరాంధత మసమువనీతలము నెట్లాక్రమించునో, యట్లే యౌవనముజాఱిపోవ జరాసతి మానవు నాక్రమించుచున్నది. అప్పు డాతని సకలేంద్రియములును నిస్తేజములై పోవును. అప్పు డాతఁడు నిరాశచేఁ గ్రుంగుదువడిపోవును.

ఎవరియెడ నదృష్టదేవత సుప్రసన్నయగునో వారి హృదయమున వైరాగ్యరూపచంద్రోదయమైజీవనారణ్యనమంతయు వారికి స్పష్టముగాఁ గాన్పించుచుండును. కేవలము ననిత్యసుఖ పిపాసా

పీడితులగు మానవుల యదృష్టమున నిట్టిశుభము లభించుటరుదు. విశేషించి వారిజీవితము సర్వదా దురదృష్టాంధకారము చేతనే సమాచ్ఛన్నమై గడచుచుండును.

మధ్యాహ్నమగుటతోడనే యాసన్యాసినులిరువురు నొకపాంథశాలలోనికేగి యట యానాఁడు విశ్రమించిరి. మఱునాఁ డుదయముననేలేచి మరలఁ బయనము సేయఁజొచ్చిరి.

గుణవతియగు శ్రీ కష్టములనన్నిఁటికోర్చి యైహికచింతలను వీడి పరమేశ్వరునియందే మనసును లీనముచేసికొనియుండెను. కాని జలప్రవాహమున కడ్డముగవైచి యాపినపిదప నెప్పుడైన నాయడ్డుకట్ట తెగిపోవుట తటస్థించెనేని ద్విగుణీకృతవేగముతో నాజలరాశి మరలఁ బ్రవహించునట్లే, జయంతీదేవి వాక్యములచేఁ బూర్వకథ జ్ఞప్తికి వచ్చినతోడనే శ్రీహృదయభారము మఱింత యధికమయ్యెను. ఆమె యొక్కమాఱుగ గభీరచింతాకూపమున నిమగ్నయైపోయెను. ఆవరణశూన్యస్థలమందుంచిన కర్పూరమువలె నామెధైర్యమంతయు నంతలో హరించిపోయెను. ఇందుచేతనే తత్త్వజ్ఞానులగు పండితులు మనసు తృణముకంటె లఘువైనదనియుఁ బద్మపత్రస్థిత జలబిందువువలెఁ జంచలమైపోవునదనియు నుడివియున్నారు. జలపూర్ణమగు నొకపెద్ద కడవ కేమాత్రపు రంధ్రమున్నను క్రమక్రమముగా నాజలమంతయు హరించిపోవునట్లే సామాన్యేంద్రియము దుర్బలమైనను హృదయము క్రమక్రమముగా మాలిన్యమైపోయి మానవుఁ డధోగతిపాలుగాఁ గలఁడు. కాని ఎవని హృదయము భక్తివిశ్వాసములకు నిలయమై యుండునో, అట్టి మానవుఁడుమాత్రము సామాన్యముగాఁ బతితుఁడు కాఁజాలఁడు. నడుమనడుమ నాతని హృదయము మంచుతోఁ గప్పఁబడినను భక్తిజ్ఞానాతపతాపముచే నామంచు విడిపోవుచుండును.

గుణవతియగు శ్రీహృదయము పూర్వసంచిత పుణ్యఫలముచేతను, గాఢప్రయత్నముమూలమునను, నిశ్చలత నందియుండెను.

మంచునుండి విడిపడినపద్మమువలె మాలిన్యశూన్యమై యుండెను. పరాత్పరునిపై భక్తి విశ్వాసము లామె హృదయమున గాఢముగా నాటుకొనియుండెను. తుచ్ఛభావము లామెకడఁ జేరవెఱచి దూరముగాఁ బలాయనము లైపోయినవి. ఆమెమనసున నీచింతదక్క-మఱియేచింతలును లేవు. చాలకాలమునకుఁ బిదప నిప్పుడు మఱలఁ బూర్వపుఁగథలన్నియు స్మరణకు వచ్చినవి. ఒక్క ముహూర్తములో జీవితమునందలి ఘటనాపరంపరలన్నియు నొక్కమాఱుగఁ గన్నుల యెదుటఁ గన్పట్టినవి. ఆమె యధరముపై నించుక మందహాసము చూపెట్టెను. అప్పుడించుక యన్యమనస్కయైయుండుటచే జయంతీదేవి యామెను చూడలేదు. అందుచే శ్రీ మందహాసకారణము చెప్ప నవసరము లేకపోయినది.

ఈవిధముగా వారిరువురును మాటలాడకుండ రెండుక్రోశముల దూరము నడచిపోయిరి. అంతసేపును వారిజిహ్వేంద్రియములు నిశ్చలములై యుండెను. జయంతీదేవి శ్రీ ముఖమువంకఁ దిలకించి యించుక మందహాసముతో "ప్రియజనప్రాణాపహారకథ నీహృదయమునకు మఱలజ్ఞప్తికివచ్చెనాయేమి?" అనియడిగెను. పవిత్రహృదయయగు శ్రీ నవ్వుచు "ఔను. ఆకథయే. చాలదినములనుండి యొకే విధమగు భ్రమకు లోనగుచున్నాను. ఐహికేచ్ఛవీడి మోక్షము నపేక్షించుచున్నాను. కాని నడుమనడుమ ప్రాణములపై నాశ నన్ను వీడకున్నది. సంపూర్ణమైన విస్మృతి నొందఁజాలకున్నాను. అందుచే నీశ్రీ చరణప్రాసాదమును జేరుటకు నాకుశక్తి చాలకున్నది. తృణసంలగ్నమగు నగ్నివలె జ్ఞానము ప్రజ్వలితమై తత్క్షణమే చల్లారిపోవుచున్నది. విశేషించి గంగాధరస్వామి గణనము నష్టేయున్నది. నా సహోదరుఁడు నానిమిత్తముననే యిహలోకమును వీడిపోయినాఁడు. నేనే యాతనిమరణమునకుఁ గారకురాల నైతిని. ఆతఁడు పాపపంకిలమునఁ గంఠమునఱకును దించుకొనిపోయినాఁడు. హృదయమంత

యుఁ బాషాణమయమైపోయినది. హృదయరత్నమును రాక్షసా ధీనము చేసినాఁడు. అయినను తుపాకికెదురుగ నేను నిలువఁబడితిని. అందుచే నాతఁడు తుపాకిని ప్రేల్చలేకపోయినాఁడు. ఈయవకాశము చూచి మహారాజు ఖడ్గముచే నాసహోదరుని రెండుఖండములుగా నఱికివైచినాఁడు. గంగారామిరాయలు తుపాకిని ప్రేల్చినచో మహా రాజును బరివారజనులును విభిన్నశరీరులై యుందురు. అందుకొఱకే నే నట్టికార్యము చేయవలసివచ్చినది. మహారాజున కాపదకలుగ కుండఁ జేయుటలోఁ నాసహోదరుని ప్రాణములను గైకొనుటకుఁ గారకురాల నైతిని.” అనియెను.

జయంతి—ప్రపంచములో జనియించిన ప్రతిమానవునకును మరణముతప్పదు. అందొక్క మానవునకు నీవు మరణ కారణమవని తలంచుట వెఱ్ఱితనము. ఈప్రపంచమున భగవంతుఁ డెవ్వని కేకాల మున కెట్టి ఘటనలు విధించియుంచెనో వానిని తప్పించుటకు నీవు సమర్థురాలవు కావు. నీవు వేయికార్యములను చేసియైనను విధివిధా నముల కన్యథా యొనర్పఁజాలవు. ప్రియజనులప్రాణములను హరిం చుటకుఁ నీకు విధించియున్నచో, ఆసమయము ప్రాప్తించినప్పు డాకార్యమట్లు జరిగిపోఁగలదు. నీవెంత విచారించినను దాని కన్యథా చేయుటకు నీకు శక్యముకాదు.

శ్రీ—ఆమాటనిజము. కాని నేను బుద్ధిపూర్వకముగ నట్టి యనిష్టములు నెప్పుడును చేయలేదు. ఇఁకనీజన్మమున నీదురదృష్ట వంతురాలి ముఖమున నట్టివి జరుగఁబోవు. ప్రాణముండఁగా నీభూమి పై నాతఁడున్నచోటనుండఁబోను. ఆతఁడు వాసముచేయుతావునకు మిగుల దూరములో నేను వాసముచేయుచుందును. ఆతనిఛాయ నైనను నేనీజన్మమున స్పృశింపను. అట్లయ్యు నాతని కనిష్టము సంప్రాప్తమైనచో నేను దోషినిగాను.

జయంతి—సోదరీ! ఈభూమిపై మానవుల యూహాల ననుస

రించియే కార్యములు జరుగుటతటస్థించినచో నిదియొక్కమాఱుగ దేవతాలోకముగాఁ బరిణమించిపోదా? మఱియనల్పమైన నీకర్మ భూమియందుఁ బ్రవేశించుట కెవ్వరును లేశమాత్రము నంగీకరింపరు. శూన్యపదమున వారు ప్రాసాదనిర్మాణ చేసికొని సుఖముగా వాసము సేయ యత్నింతురు. తమబుద్ధిననుసరించి నిర్భయకార్యములనే చేయ తలపోయుచుందురు. కాని యట్లెన్నఁడును జరుగఁబోదు. మానవుని యాశలన్నియు జలమునందలి జలబిందువులవలె మనసుననే లయమయి పోయి ఫలకాలమున వారికి విపరీతఫలము లభియించుచుండును. భవిష్యత్కాలమును దూరదృష్టితో యోచించిచూచుట కెవ్వరికిని సాధ్యముకాదు. ప్రవాహవేగమునఁబడిన గడ్డిపోచవలెఁ గాలసాగరమునఁబడి సర్వమును గొట్టుకొని పోవుచున్నది. అదృష్టపవనమెవరి నేవంకకీడ్చుకొనిపోవునో యట్లు పోవలయునేకాని వేఱుమార్గమున నాసాగరమునుండి విడివడివచ్చుటకునశ్వరదేహధారియగుమానవుఁడు సమర్థుఁడుకాఁడు. సీతారామరాయల కనిష్టము గల్గింపవలయునను నూహ నీకు లేదనుమాట సత్యమే. కాని యిచ్ఛామయుఁడగు నా పరాత్పరునియిచ్ఛ యదియేమైయున్నచో నీకిష్టము లేకపోయినను నాకార్యము జరిగిపోఁగలదు. ఆపరమేశ్వరుని యిచ్ఛను వ్యర్థము సేయుటకు నీవు సమర్థురాలవుకావు. ఏరూపమున నట్టి ఘటనము సంప్రాప్తమగునో యూహించిచెప్పుట కెవ్వరికిని సాధ్యముకాదు. మానవులు తాముచేయు కార్యముల ఫలోద్దేశములనుతెలిసికొనునట్టి శక్తి నీశ్వరుఁడీప్రపంచమునం దేమానవునకును ప్రసాదించియుండ లేదు. అందుచేమనము చేయు ప్రతికర్మఫలమును నీశ్వరపాదపద్మములకడ నర్పించి నిర్లిప్తభావముతోఁ బ్రపంచయాత్రను చేయుచుండుటయే మనకర్తవ్యము. ఒక్కక్షణికము మహాసుఖము ననుభవించుచు నది శాశ్వతమనుకొందుము. కాని యింకొక క్షణములో నచ్చు మహాపదను తెలిసికొనఁజాలము. విపత్సంపదలయందును,

సుఖదుఃఖములయందును లేశమాత్రమును చలింపక యచలమువలె స్థిరభావముతో నుండఁగలిగినచో నశాంతిమయమగు నీప్రపంచమున శాంతిని సంపాదించుకొని సుఖింపఁగల్గుదుము.

శ్రీ—ఔను. అందులకు సందియమేమున్నది? సుఖదుఃఖములు మనహృదయమునందలిభావాంతరములు. మానవులెంతకాలముతత్త్వజ్ఞాన శూన్యులై యుందురో, అంతకాలమును సుఖమును బడయఁజాలరు. వారు సాధుసహవాసమును చేసినచో నీరసమైనవారి హృదయమున భగవద్భక్తి, ప్రేమ యుదయించును. సాధుసంగముచేఁ బాపకార్యాసక్తి వారి మనసునుండి దూరమైపోవును. పరిమళమిళితపుష్పములతోఁగూడిన తిలపుష్పమునకుఁగూడ బరిమళమబ్బినట్లుసాధుసహవాసముచే సామాన్యమానవులకుఁగూడ క్రమక్రమముగ జ్ఞానమలవడి సుఖింపఁగల్గుదురు. ఇందులకభాగినినగు నాజీవనమే తార్కాణము. నేను నీ సహవాసమును పొందఁజాలకపోయితినేని నాదుర్గతికిఁ బారమేయుండదు. ఇట్టి విమలానందము ననుభవించుట యీజన్మమున నాకు లభించియేయుండదు. నీయనుగ్రహవశమున నేనుకృతార్థనైతిని. నీఋణమును నాయీజన్మమునఁ దీర్చుకొనఁజాలను.

జయంతీదేవి యించుకనగవుతో "నేను నాకర్తవ్యకార్యమును చేసితిని కాని యంతకంటె నధికమేమియుఁ జేసియుండలేను. ఆకార్యమును కొనసాగించుటకును నట్టిబుద్ధినాకొసంగుటకునునాయీశ్వరుఁడే కారణుఁడు. అందుచే నీవామహాత్ముని మహిమకు వందనసహస్రములర్పించి కొనియాడుము. వర్షముపడినపిదప నింటిచూరునుండి జలము వచ్చుచుండును. ఆజలము వర్షసంబంధమైనది. కాని చూరునుండి యుదయించినదికాదు. అట్లే మనముచేయు ప్రతికార్యమునకు నీశ్వరుఁడు కారణుఁడు. కానిమనబుద్ధి ప్రధానముకాదు. ఏసమయమున నెవని కెట్టిబుద్ధి నీశ్వరుఁడుప్రసాదించునో, దానిననుసరించియే మానవుఁడు ప్రవర్తించు చుండును. నీ పూర్వపుణ్యబలముచే నిట్టి పవిత్ర

ప్రదేశమునఁ బ్రయాణముచేయుట నీకుఁదటస్థించినది. కాని నామూలమునసీకుజరిగినగొప్పయుపకారమేమియును లేదు. ఏమంటివా నాశక్తియత్యల్పమైనది. నేను చేయఁగలిగిన దేమియును లేదు. ఒకచిన్న పారిజాతకోరకమునుండి యోజనదూరమువఱకును వ్యాపించు పరిమళము బయలుదేఱునట్లే నీసామాన్యహృదయమున నింతటిభక్తిజ్ఞానము లుదయించి ప్రకాశించుచున్నవి. అట్టి భక్తిజ్ఞానములను ప్రసాదించిన యాపరాత్పరుని మహిమను గీర్తింపుము. తన్మూలమున నీహృదయము చల్లఁబడును. నారీజన్మమునందినవారిలో—పాపము! నీతో సమానముగా వంచింపఁబడినవారుండరు" అనియెను.

వర్షహీనమగు మేఘమువలె మిగులగంభీరభావముతో శ్రీ యిట్లనియెను. "నాజీవితప్రవాహము వేఱుత్రోవను ప్రవహించుచున్నదని నావేషమువలన నేస్పష్టపడుచున్నది. నేనేదియో వంచింపఁబడితినని వచియించియుంటివి. ఆమాట నాకర్థముకాలేదు. ఈ ప్రపంచమున జీవించియున్నంతవఱకు దేనితో సంబంధము కలిగియుండునో రెండుదినము లాస్వాదించుటతోడనే యేదితిక్తమైపోవునో పదిబొమ్మరింటియందలి బొమ్మలాటవంటిదో, అట్టి యైహికసుఖము అనిత్యసుఖము. ఆయనిత్యసుఖమునుండి వంచింపఁబడుటవలన నాకపకార మేమియును గలుగలేదు. విశేషించి యుపకారమేయైనది. భేదింపశక్యముకాని యైహికబంధములచే నెవరు బంధింపఁబడుదురో వారి కీశ్వరధ్యానము లభింపఁజాలదు. మరణశీలుఁడును నశ్వరదేహుఁడు నగు పృథివీపతిని ప్రేమించుటమాని, ఎవనిప్రేమ విచ్ఛేదము కాదో యట్టి పరాత్పరుని మనసారఁ బ్రేమించుచున్నాను. తుచ్ఛమగు పర్ణకుటీరమునువీడి దివ్యసౌధమున వాసముచేయుచున్నాను. ఖద్యోతకాంతిని విడిచి మధురజ్యోత్స్న ననుభవించుచున్నాను. ఒకచిన్నరాతితో నమూల్యమగు వజ్రమును విలిచికొంటిని. ఇఁకనేను వంచింపఁబడినదాన నెట్లయితిని?

జయంతి—నీయీవాక్యములు చక్కగానున్నవి. నిశ్చయముగా సత్యములైనవి. కాని అన్నియెడలను నవి యంతగా నుపయుక్తము లైనవికావు. ఏమంటివా? ప్రజలందఱిహృదయములందును నిట్టిభావములే యుదయించినచో సృష్టికర్తయొక్క సృష్టియంతయు నల్పకాలములోనే ధ్వంసమైపోఁగలదు. సశ్యశ్యామలయగు ధరణియొక్కమాఱుగ భయంకరముగాఁ బరిణమించిపోవును. సృష్టికర్తయేదియో యొకవిశేషోద్దేశముతో నీప్రపంచరంగభూమిపై మానవులను సృష్టించి యాడించుచున్నాఁడు. అందఱకును గర్తవ్యకార్యములను నిర్దేశించియున్నాఁడు. ఎవఁడు తనకర్తవ్యమును విడిచి యనర్థకారకార్యములయందుఁ బ్రవర్తించునో, అట్టివాని కెన్నఁడును మేలుకలుగఁబోదు. నీజీవితమువలెనే యందఱి జీవితమును శుష్కకాష్ఠముపోలిక వ్యర్థముకానేరదు. నీయదృష్టము వేఱుపకరణములచే సమకూర్పఁబడినది. నీవలెనే జీవితమునంతను గడపయత్నించువానికి మంగళముచేకూరదు. నీలవర్ణపు టద్దమును ధరించి తిలకించినచో జగత్తునందలి పదార్థములన్నియు నీలవర్ణమయములై కనుపట్టినట్లు జగమంతయు నీవలెనే యున్నదని నీకుఁ గన్పట్టుచున్నది. చాలమంది స్వామిపుత్రులతోఁగూడ సంసారయాత్ర చేయుచుండియు నీశ్వరుని యనుగ్రహమును బడసియున్నారు. నీవు చాలకాలమునుండి నిరాశాసాగరమున నీఁదులాడుచున్నావు. అందుచే నారహస్యమును గ్రహించుటకు నీకు శక్తిచాలదు. నిర్మలకమలతుల్యమగు స్వామి వదనపద్మమెట్టి శోభ కాస్పదమైయున్నదో దానినినీవెఱుంగవు. అందుచేతనే నీవిట్టివాక్యములను బలికితివి. త్రికాలజ్ఞుఁడును నీశ్వరావతారుఁడునగు గురుదేవుఁడు తనంతటతాను నిన్నుఁజూడవలయునని యభిలాషపడినాఁడు. ఇఁక నీహృదయాంధకారము నశించిపోఁగలదు. నీకు దేనిని తెలిసికొనవలయునని యిచ్ఛకలదో దానినంతను గురుదేవు నడిగి తెలిసికొనుము. ఇన్నిదినములకు విధాత నీయెడలఁ బ్రసన్నుఁ

డైనాఁడు. అందుచేతనే యామహాత్ముని సందర్శనము నీకు లభియించుచున్నది. ఆమహాత్ముని సందర్శించిన క్షణముననే నిశ్చయముగా నీహృదయము సంతోషసాగరమున నిమగ్నము కాఁగలదు. ఆప్రదేశమందలి మనోహరశోభ నొక్కసారి వీక్షించితివా, ఆప్రదేశము నిఁక నెన్నఁడును విడువఁజాలవు.

జయంతీదేవి వాక్యములనువిని శ్రీ పులకితగాత్ర యయ్యెను. ఇఁకఁ గొన్ని నిమిషములలో నామహాపురుషుని సందర్శన మగు ననియును, తనహృదయము శీతలభావము నందుననియును నామె యనుకొనుచుండెను. ఒక్కొక్క నిమిషమును ఒక్కొక్క వత్సరము వలె గడచుచుండెను. అయస్కాంతముచే నాకర్షింపఁబడిన లోహము వలె, నామహాపురుష సందర్శనాభిలాషచే గుణవతియగు శ్రీ యతి వేగముగ నడచిపోవుచుండెను. జయంతి కోమలదేహ యయ్యును నీప్రయాణముచే నించుకంతయును శ్రమనొందలేదు. జలబిందువు నైనను పానముసేయకుండ వారిరువురును కొన్నిదినములు ప్రయాణము సేయఁగలిగిరి. నడచుచున్నది పవిత్రప్రదేశము. ఆదర్శము దివ్యమైనది. ఇఁక శ్రమయేలయుండును? క్లేశమన్నమాటయేలేదు. అనవరతప్రయాణముచేసి రాత్రి వారిరువురును పుణ్యాశ్రమమును చేరిరి. ఆరాత్రి వారామహాపురుషుని దర్శనముచేయలేదు. జయంతి శ్రీని తనకుటీరమునకుఁ దీసికొనిపోయెను. వారిరువురు నారాత్రి యటగడపిరి. ప్రయాసమునొందియుండుటచే వారిని నిద్రాదేవి యనతికాలములోనే శాంతిమయమగు తనతొడపైఁ జేర్చికొనియెను.

—♦—

# నాల్గవ ప్రకరణము

## బాజీరావు

ప్రవాహవేగముచే నొకయొడ్డువిరిగి నదీపాత మైపోవుచున్నప్పుడు వేఱొకయొడ్డున నదిమరల పెఱిఁగి పరిపూరితమగుచుండునట్లే ఈశ్వరుని నియమానుసారముగాఁ గాలప్రవాహవేగమున లబ్ధప్రతిష యగు మహాసామ్రాజ్యము నశించిపోవుటయును సమయానుకూలముగ నొక సామాన్యరాజ్యము మహోన్నత్య దశనంది ప్రకాశించుటయును నప్పుడప్పుడు సంభవించుచుండును. పరివర్తనశీలమగు నీప్రపంచమునం దిట్టిమార్పు లనాదినుండియు సంభవించుచున్నవి. దీని కిదికారణమనిగాని, ఇది యిట్టివిధము గలదనిగాని, స్థిరముగా నిర్ణయించుట కల్పప్రాణులగు మానవులకు శక్యముకాదు. అది కవి కల్పనాతీతమైనది.

క్రూరకర్ముఁడును, చపలచిత్తుఁడు నగు నౌరంగజేబు రాజ్యము సేయునప్పుడు మొగలాయీ ప్రభుత్వ మత్యున్నతదశయం దుండెను. కాని యాకాలమునుండియే మొగలాయీ రాజ్యమునకుఁ బతన మారంభమైనది. ప్రభాతమునందలి శశికాంతివలె, మహారాష్ట్రుల యభ్యుదయముచే మొగలులరాజ్యము క్రమక్రమముగ క్షీణింప సాగెను. వర్షాకాలమునఁ గోకిలారావములు నశించిపోయి మండూకముల బెకబెకధ్వను లతిశయించునట్లే మొగలాయీల ప్రభ క్షీణింప నారంభించుటతోడనే యదివఱకు వారి యధీనముననున్న పరతంత్రు లందఱును స్వతంత్రులు కాఁజొచ్చిరి. రాజవిద్రోహులగు సుబేదారులు తమ ప్రభువులకు వ్యతిరేకముగ సంచరింప మొదలిడిరి. అందుచే నాకాలమున నెన్నియో చిన్నచిన్న స్వతంత్రరాజ్యము లుత్పన్నములయ్యెను.

మేమిప్పు డాకాలమునాఁటి కథనే వ్రాయుచున్నాము. అప్పటికి మహమ్మదుషాహా యనునాతఁడు డిల్లీసింహాసనము నధిష్టించి

యుండెను. బాల్యమునుండియు నాతఁడు మిగుల భోగవిలాస తత్పరుఁడై యుండెను. అందుచే రాజోచితగుణము లేవియు నాతనికలవడినవి కావు. తుదకాతఁడు క్రిందియుద్యోగియుల చేతియాటబొమ్మవలె నయిపోయెను. వారిహస్తమునుండి తప్పించుకొనుట యాతని కవసరమయ్యెను. అసఫ్‌జాన్ అనునాతనిని మంత్రిపదవిని స్వీకరింపుమని యాహ్వానమంపెను. పాదుషహాను శత్రువులనుండి రక్షించుటకై యాతఁడు ఢిల్లీకివచ్చెను. అసఫ్‌జాన్ వివేకముకలవాఁడు. రాజనీతిజ్ఞుఁడు. శక్తిశాలి. సామాన్యులగు నుమారావులవలె విలాసములతోఁ గాలము గడపువాఁడుకాఁడు. ఈవిశాలసామ్రాజ్యమును బరిపాలించుట కాతఁడు చాలసమర్థుఁడు. ఈకాలమునఁ గ్రమక్రమముగా నొక్కొక్కరాజ్యమును పాదుషహా చేతినుండి జారిపోవుచుండెను. శత్రువులు నాల్గుదిక్కులను బ్రబలుచుండిరి. నదీమధ్యమున నుండఁగాఁ దుపానువచ్చినప్పుడు నౌకను రక్షించుటకుఁ బ్రవీణుఁడగు మాలిమికాఁ డెట్లవసరమో, అట్లే యాపత్సమయమున రాజ్యమును రక్షించుటకు సమర్థుఁడగు నమాత్యుఁడవసరము. అట్టివాఁడు లేకపోయినచో నాయాపదనుండి తరించుట దుర్ఘటము. అందుచే మహమ్మదుషాహా సుప్రసిద్ధ రాజనీతిజ్ఞుఁడగు నసఫ్‌జాకా కమాత్యపదవి నొసంగి గౌరవించెను.

మహమ్మదీయులలో నసఫ్‌జాన్‌తో సమానుఁడగువాఁడింకొకఁడు లేఁడని చెప్పిన నది యతిశయోక్తి కానేరదు. రాజనీతిఘట్ట మీాతని కీర్తి సువర్ణాక్షరములతో లిఖింపఁబడియుండెను. కాలప్రవాహము నందలి సుడిగుండములలో నీతఁ డెప్పుడును బడిపోలేదు. ఈయసఫ్‌జాకా దక్షిణహిందూదేశమున నొకస్వతంత్రరాజ్యమును బ్రతిష్ఠించి యుండెను. రణదుర్మదులగు మహారాష్ట్రు లంతరాయముగ నుండకపోయినచో దక్షిణహిందూదేశమంతయు నీతనియేలుబడికి లోనై యుండి యుండును. ఈ యసఫ్‌జాకా వంశీయులే నిజామ్

అను పేరుతో దక్షిణదేశమున రాజ్యము చేసెడివారు. అసఫ్‌జాహు తన బుద్ధిబలముచే నెప్పటికిని తరిగిపోవనంతటి విశేషధనమును సంపాదించెను. ఆతని వంశీయులు హైదరాబాదును రాజధానిగాఁ జేసికొని యింగ్లీషువారికి మిత్రులై రాజ్యభోగముల ననుభవించుచుండెడివారు. కాని అత్యంతప్రతాపాన్వితులగు మొగలాయీబాదుషాల వంశమంతయు సంపూర్ణముగా నశించిపోయినది. ఢిల్లీచక్రవర్తి వంశ మీవిధముగా నంతరించిపోవునని యెవ్వరును స్వప్నమునం దైన ననుకొనియుండలేదు. క్షుద్రనీరదఖండముచే సుధాకరునికాంతి కప్పఁబడి పోయినది. గర్వపూరితహృదయులగు మానవుల ప్రజ్ఞాబల మెప్పుడు నప్రతిహతమైనదని చెప్పవలనుపడదు. మానవుని బుద్ధివృత్తి సర్వదా తీక్ష్ణముగా నుండునని తలంపరాదు. విచిత్రమయమగు నీప్రపంచమునం దెప్పుడెప్పుడెట్టి విచిత్రవ్యాపారములు సంఘటించుచుండునో నిర్ణయించి చెప్పుట కెవరికిని సాధ్యముకాదు. పరమేశ్వరుఁడు మానవులకు జగత్తునందు వారుచేయు కార్యములయందలి గూఢమర్మములను తెలిసికొను నంతటిశక్తిని ప్రసాదించియుండలేదు. ప్రవాహమున కెదురుగనున్న గడ్డిపోచవలెఁ గాలప్రవాహమున మరణమున కెదురుగనున్న మానవుఁ డాప్రవాహమున కెదురునడచుటకు సమర్థుఁడుకాఁడు.

ఈకాలమున రణనీతిజ్ఞులును శ్రమసహిష్ణులు నగు మహారాష్ట్రులు మిగుల నుచ్ఛదశయందుండిరని చెప్పియుంటిమికదా! ధనధాన్యములయందును, బలవీర్యములయందును వారితో సమానులగు వా రింకొకరులేరు. దుర్బలుఁడగు ఢిల్లీబాదుషహా వారినిజూచి యనుక్షణమును మిగుల భయపడుచుండెడివాఁడు. దుగ్ధఫేననిభమగు కోమలశయ్యపైఁ బరుండినను సుఖముగా నిద్రించుట కాతనికి ప్రాప్తములేదు. రాజనీతిజ్ఞుఁడగు మంత్రిమూలమున తనరాజ్యము రక్షింపఁబడుననియాతఁడు సర్వదాతలపోయుచుండెను. మహారాష్ట్రుల

రణకౌశలమును నభ్యుదయమునుజూచి యనేకులు సమస్తభారత వర్షమును వారి స్వాధీనమగునేమోయని తలపోయఁ జొచ్చిరి.

ఇట్టి సమయమున మహారాష్ట్రులలో నొక మహాపురుషుఁడు జననమందెను. ఆమహాత్ముని పేరు బాజీరావుపీష్వా. ఛత్రపతిశివాజీ మహారాజు లోకాంతరగతుఁడైన పిదప నితనితో సమానుఁడగు పరాక్రమశాలియు రాజనీతిజ్ఞుఁడును మహారాష్ట్రులలో జన్మించియుండలేదు. ఈమహాపురుషుని యధినాయకత్వమువలనను శిక్షాకౌశలము మూలముననను మహారాష్ట్రు లింతటి యౌన్నత్యస్థితికి రాఁగలిగిరి. ఈతఁడు బ్రాహ్మణకులమున జననమునందెను. బాల్యమునుండియు వీరోచితవిద్య నభ్యసించి రణదుర్మదుఁడై ప్రఖ్యాతిఁగాంచెను. మహారాష్ట్రుల ప్రధానమంత్రికి పీష్వా యని పేరు. ఈపదవి వంశపరంపరానుగతమై వచ్చుచుండును. చాలముసలివాఁడగు తండ్రి గతించిన పిదప బాజీరావు పీష్వాపదవి నధిష్ఠించెను. ప్రస్తుతమున నున్న రాజుకంటె నీపీష్వాయే మిగుల సమర్థుఁడు. ఆరాజు విషశూన్యమగు సర్పమునంటివాఁడు. ఱెక్కలులేని పక్షివలె తేజోవిహీనుఁడై యుండెను. రాజ్యమును పరిపాలించుటకును, వీరాధివీరులగు మహారాష్ట్రుల నుచితమార్గమున నడపించుటకును నాతనికడ సమర్థత లేదు. ఆతఁడు రాత్రిందివములు సుందరీపరివృతుఁడై యైహికభోగములతోఁ గాలముగడపుచుండెను. మహమ్మదీయ రాజపుత్రులవలెనే యాతఁడును విలాససాగరమున సంపూర్ణముగా నిమగ్నుఁడైపోయెను. కాని బాజీరా వట్టివాఁడు కాఁడు. ఆతఁడు శిబిరమున జననమందెను. సైనికునకు యుక్తమగు విద్య నభ్యసించెను. అశ్వారోహణమునందును ఖడ్గవిద్యయందును మిగులఁ బ్రవీణుఁడయ్యెను. నాల్గుదినములు గుఱ్ఱముపైనుండి దిగకుండనున్న నాతఁ డించుకంతయును శ్రమఁ జెందఁడు. సామాన్యమైన యాహారముతోఁ దృప్తిచెందును. నామమాత్రమునకైనను విలాసవాసన లాతనిహృదయము నాశ్రయింప

లేదు. మహమ్మదీయ గర్వాపహరణమును, మహారాష్ట్రుల యభ్యుదయ ప్రయత్నములును నాతని హృదయమునందలి మూలమంత్రములు. అయస్కాంతము లోహము నాకర్షించినట్లు సద్గుణములుగల మానవుఁడు మానవమాత్రులనెల్లఁ దనప్రక్క కాకర్షించుకొనును. స్వదేశాభిమానియు, క్షమాశాలియు వీరధర్ముఁడు నగు బాజీరావునకు సమస్త మహారాష్ట్రదేశమును వశీభూతమయ్యెను. యావత్సైన్యము నాతనిననుగమించి వర్తించుట కాశ్చర్యమేమి? అదృష్టదేవత మహారాష్ట్రులయెడఁ బ్రసన్నయయ్యెనేని, గ్రహగణముల దృష్టి ప్రసరించెనేని, నిశ్చయముగ నీమహాపురుషుని యాశాలతకు ఫలముదయించి శోభించియుండును. కాని విధాతయభిప్రాయము వేఱువిధమున నున్నది. అందుచే ఘటనాప్రవాహము వేఱుమార్గమునఁ బ్రవహింపనారంభించెను. మహాత్ముఁడగు బాజీరావుని ప్రయత్నములును నాతఁడుచేసిన మహాకార్యములును చిరకాలము చారిత్రములయందు సువర్ణాక్షరములచే లిఖింపఁబడి ప్రకాశించుచు నుండఁగలవు. ప్రపంచమున నెంతకాలము సద్గుణములకు గౌరవాదరములు గలిగియుండునో, అంతకాలమును నాతని కీర్తి దీప్తదివాకరునివలెఁ బ్రపంచాకాశమున దేదీప్యమానముగాఁ బ్రకాశించుచుండును.

సుప్రసిద్ధ మహాపురుషుఁడగు నీమహాత్ముని యధీనమున సుశిక్షితులగు నలువదివేల గుఱ్ఱపురౌతులుండిరి. వీరందఱు మిగులశూరులును, రణ నిపుణులును, నతిసాహసులునై యుండిరి. బాజీరావు స్వయముగ వీరికందఱకును రణమర్మములను నేర్పి నిపుణులనుగాఁ జేసెను. ప్రభుభక్తి పరాయణులును, అత్యంత సాహసికులును ప్రతాపశీలురు నగు నీయశ్వారోహకుల సాహాయ్యమున సర్వభారతవర్షమునందలి హిందూమహమ్మదీయ రాజులకడ నుండియును బాజీరావు "చౌద్" అను పన్నును గైకొనుచుండెను. (సర్వరాజస్వమునందును నాల్గవభాగమునకు "చౌద్" అనిపేరు) మహారాష్ట్రులవలని

భయముచే భారతవర్షమునందలి సమస్తరాజులును "సీచౌద్" అను పన్నును వారికర్పించుచుండిరి. అట్టి పన్నునీయకుండ నిరాకరించుట కెవ్వరికిని శక్తిలేకపోయెను. ఎవ్వరేని నిరాకరించినచో వారిరాజ్య మచిరకాలములోనే భస్మావశేష మైపోవలసినదే!

అసఫ్‌జా మాత్రము మహారాష్ట్రుల ప్రభుత్వాధిపత్యము నంగీకరింపలేదు. చౌద్ పన్ను నిచ్చుటకును నిష్టపడఁడయ్యెను. అందుచే బాజీరావు తనసైన్యముల నాతనిరాజ్యముపైకి బంపి బహు జనాకీర్ణమైన యనేకగ్రామములను నాశనముచేయించెను. వేలకొలఁది ప్రజలు మహారాష్ట్రులకత్తుల కెఱయైపోయిరి. ఎన్నియోగ్రామములు స్మశానములై పోయెను. బాజీరావు నలువదిలక్షలరూపాయలు రొక్కమును, ఒకకోటిరూపాయల విలువగల వస్తుసామగ్రిలను నాదేశము నుండి కొల్లగొట్టుకొని పోయెను. ఈదారుణము జరుగునప్పుడు, అసఫ్‌జా నమాత్యపదవిని స్వీకరించుటకై ఢిల్లీ కేగి యుండెను. పఠానుసైనికులలోఁ జాలభాగ మాతనికడనుండిరి. మత్తగజము పద్మవనమును భేదించునట్లే మహారాష్ట్రసైన్యము లెదురించువారు లేక గుజరాతునకు దక్షిణభాగమంతయు ననాయాసముగాఁ గొల్లకొనఁ గలిగెను. ఈవిపత్తునుండి ప్రజలనురక్షించుటకుఁ దగినయుపాయ మేమియు లేకపోయెను. కొల్లగొట్టినద్రవ్యముతోఁగూడ స్వదేశాభిముఖుఁడై బాజీరావు విజయోల్లాసముతో బయలుదేరి వచ్చుచుఁ గోలాపురప్రాంతమున ససైన్యముగ విశ్రమించెను.

చక్కగ నలంకరింపఁబడిన యొకశిబిరమున బాజీరా వొక్కఁడును గూర్చుండియుండెను. ఆతని హృదయార్ణవమున నానావిధ చింతాప్రవాహములు వచ్చిపడుచుండెను. ఇట్టిసమయమున ద్వారరక్షకుఁ డరుదెంచి "ప్రభువరా! ఎవ్వఁడో యొక యపరిచితుఁ డేలిక సందర్శనార్థ మరుదెంచి ద్వారముకడ వేచియున్నాఁడు" అని విన్న

వించెను. బాజీరావు విస్మితహృదయుఁడై యిట్లనియెను. "ఆతఁ డెచ్చటనుండివచ్చినాడు ? ఎందులకు వచ్చినాఁడు ?"

"వంగదేశమునుండి యేలికదర్శనార్థము వచ్చిన ట్లాతఁడు చెప్పినాఁడు."

"ఆతఁడు హిందువుఁడా ? మహమ్మదీయుఁడా ?"

"హిందువుఁడే. బంగాళాదేశీయుఁడని తోఁచుచున్నది."

బాజీరావు నిమిషమాత్రము చింతామగ్నుఁడైయుండి పిదప "ఆతఁడొక్కఁడే వచ్చెనా ? ఆతనితో మఱియెవ్వరైన నుండిరా ?" అని యడిగెను.

ద్వార—ప్రభూ ! ఒక్కఁడే వచ్చినాఁడు. వానితోఁగూడ నెవ్వరును లేరు.

బాజీ—మంచిది. ఆతనిని లోనికిఁ గొనిరమ్ము.

ద్వారరక్షకుఁడు వందనముచేసి వెడలిపోయెను. ఆతఁడు దృష్టిపథమును దాఁటి చనినతోడనే బాజీరావు తనలో నిశ్చయముగా నాతఁ డేదియో విశేషోద్దేశముతో నిటకువచ్చియున్నాఁడు. ఒరిస్సా వంగవిహారదేశముల సుబేదారుని శత్రువెవ్వఁడో యొకఁడు తనశత్రువులను నిర్జించుటకై నాకడకు దూతను బంపియుండునని తోఁచుచున్నది. వంగదేశము ధనధాన్య సంపూరితమని విని యున్నాను. భాగ్యవంతములగు ననేకగ్రామములును నగరములు నా దేశమునందుఁ గలవు. కృతఘ్నులును దేశద్రోహులును నా దేశమున జన్మింపనేలేదు. ఇతని యాగమనముమూలమున నాయాశ ఫలియింపఁగలదని తోఁచుచున్నది. ఈయాగంతకుఁడు మొదట తన యభిప్రాయము నేమని చెప్పునో చూచెదనుగాక" అని యనుకొని యెను.

బాజీరావిట్లు యోచించుచుండ ద్వారపాలకుఁడు, దీర్ఘకాయుఁడును తేజోవిశిష్టుఁడునగు నొకమనుష్యునితోఁ గూడవచ్చి పీష్వా యింగితానుసారముగాఁ దానటనుండి వెడలిపోయెను.

దూరదర్శియగు బాజీరావా వచ్చినమానవు నని మేషనయన ములతోఁ జూడనారంభించెను. ఆగంతుకుని వయ సించుమించుగ నేబది వత్సరములుండును. ఆతఁడు తప్తకాంచన సన్నిభమైన దేహ చ్ఛాయయును, ఆకర్ణాంతములైన సముజ్జ్వలములును నుత్సాహ సూచకములు నగు విశాలనేత్రములును, ఉన్నతమగు నాశికయును, పరస్పరచుంబనాభిలాషగల భ్రమరములంటి భ్రూయుగ్మమును, విశాలఫాలప్రదేశమును, తన్మధ్యభాగమున రాజచిహ్నమగు తిలక మును గలిగి ప్రకాశించుచుండెను.

వీరపురుషోచితములగు నాతని యాజానుబాహువులును, నిష్క ళంకమును, గాంభీర్యపరిపూర్ణమునగు నాతని ప్రశాంతముఖమండల మును, ఫాలప్రదేశమందలి రాజతిలకమునుజూచి సుచతురుఁడగు బాజీరా వాతఁ డేదో మాఱువేషమునుదాల్చిన యొకమహావ్యక్తియై యుండునని యనుకొని యాతని తనసమీపమునఁ గూర్చుండబెట్టు కొనియెను.

అల్పమేఘఖండముచే దివాకరుఁడు కప్పఁబడినను, ఆతని ప్రతా పము లోకమున నెట్లువ్యాపించుచుండునో భస్మరాశిచే మఱుఁగు వడినను, అగ్నియందలి వేడిమి యెట్లు మఱుఁగువడదో, అట్లే యొక మహావ్యక్తి మాఱువేషమునుధరించినను, స్వాభావజన్యమగు నావ్యక్తి సౌందర్యకాంతులుమాత్రము మఱుఁగువడ నేరవు. ఇంతేకాదు. మానవ హృదయమునకు ముఖమండల మద్దమువంటిదని పండితులు చెప్పుచుందురు. మానవుని మనోభావములును హృదయగతులును వాని ముఖముపై స్పష్టముగాఁ గనుపట్టుచుండును. అందుచే సాధు వెవఁడో, పాషండుఁడెవఁడో, కఠినుఁడెవఁడో, దయాళువెవఁడో తెలిసికొనవచ్చును.

మే మేకాలపుఁ గథనువ్రాయుచుంటిమో, ఆకాలమునాఁటికి బాజీరావుని వయసు నలువదివత్సరములకంటె నధికములేదు. సాధా

రణ మహారాష్ట్రులకంటె నాతఁడించుక పొడవయినవాఁడు. ఉజ్వల మైన దేహచ్ఛాయఁగలవాఁడు. ఆతనినిజూచినఁ బ్రతిమనుష్యుఁడు నాతఁడొక ప్రతిభాశాలియని చెప్పుట కనుమానింపఁడు మణులుగల వాఁడు మణిని బాగుగా నెఱిఁగియుండునట్లే, గుణయుతుఁడు తన సన్నిధినున్న గుణవంతుని గుణములఁ దెలిసికొనుటకు సమర్థుఁడగును. అందుచే బాజీరావు ప్రథమసందర్శనముననే ఆగంతుకుఁ డొక్క సత్కులప్రసూతుఁడగు మహావ్యక్తి యని తెలిసికొని యుచిత గౌర వాదరములతో నాతనిఁదనసమీపమునఁ గూర్చుండఁబెట్టుకొనియెను.

అన్యోన్య వందనాది శిష్టాచారములు నడచినపిదప వారిరు వురు నిట్లు సంభాషింప మొదలిడిరి.

బాజీ—మీ వాసస్థల మెచ్చట ?

ఆగం—పూర్వబంగాళము.

బాజీ—మీనామము ?

ఆగం—రఘునాధరాయలు.

బాజీ—మీచేఁ బ్రకాశింపఁజేయఁబడుచున్న వంశమెయ్యది?

ఆగం—ఈసామాన్యుఁడు కాయస్థకులమున జననమందినాఁడు

బాజీ—మీరు బంగాళీయులా ?

ఆగం—చిత్తము.

బాజీ—మీరిదివఱ కేవృత్తియం దున్నారు ?

ఆగం—నేను బాల్యమునుండియు సైనికవృత్తిమును గ్రహించి యున్నాను. ఈనిశితఖడ్గమే సేవకాజీవితమునకు నాకుఁ బ్రధానో పాయము.

బాజీరావు చిఱునగవుతో "బంగాళీయులకుఁ గత్తితోఁ బ్రయోజనములేదు. ఖడ్గమునకుబదులు కలమని చెప్పినచో బాగుగ నుండునని తోఁచుచున్నది."

బాజీరావు నుడివిన శ్లేషపరిపూర్ణవాక్యములను వినినతోడనే యాగంతుకుని ముఖమండలము ప్రభాతమందలి తరుణతపనునివలె రక్తిమం గాంచెను. పవనతాడితమగు కిసలయముపోలిక నాతని యధరము కంపింపఁదొడంగెను. కాని మహారాష్ట్రుల శిబిరములనడుమకు వచ్చి వేఱువిధముగఁ బ్రవర్తించు టాతని కంతమంచిదిగాఁ దోఁచలేదు. అందుచే నొకముహూర్తములో మరల నాత్మ సంయమనము గావించుకొని వినీతభావముతో "ప్రభూ! విదేశీయుల బాహ్యాచాకచక్యమునుజూచి కృత్రిమమగు నాగరికతలోఁ బడిపోయి మా దేశీయ సోదరులలోఁ జాలమంది యాత్మగౌరవశూన్యులై కాపురుషులగుచున్నారు. అందుచే మీరిట్లు నుడువుట కవకాశముకలిగినది. అయినను సర్వశక్తిశాలియగు నీశ్వరుఁ డొక్కఁడే రాజపుత్రులకును మహారాష్ట్రులకును, శిక్కులకును, బంగాళీలకునుగూడ సృష్టికర్తయనియు, ఆతఁడీదేహముల నన్నింటి నొకేవిధమగు నుపకరణముల చేతనే నిర్మించెననియుఁ దెలిసికొనవలసియున్నది. కృషియత్నచేష్టానైపుణ్యాదులవలన మానవులందఱుఁగూడ దుర్ఘటకార్యములను నెఱవేర్చుటకు శక్తిగలవా రగుచున్నారు. ప్రతిభ, హితాహితజ్ఞానము శౌర్యము, మానవులందఱియందును గలదు. అట్టిచో బంగాళీయులయందు వీరధర్మ మేలలేకపోవును? వాడుచుండనిచోఁ గత్తి త్రుప్పు పట్టిపోయి, ఖండించుటకెట్లు నిరుపయోగ మగుచున్నదో, అట్లే, అభ్యాసము లేకపోవుటచే బంగాళీలు క్రమక్రమముగాఁ బౌరుషహీనులగుచున్నారు. అభ్యాసము నుత్సాహమునున్నచో, మానవునకు సాధ్యములగు కార్యముల నన్నిటిని బంగాళీయులుగూడఁ జేయఁగలరు. ఈయధముఁ డొక్క బంగాళీయుఁడేయైనను బాల్యకాలము నుండియు వీరధర్మములయందే ప్రవృత్తుఁ డగుచున్నాఁడు, సేవకావృత్తి కొఱకుఁ గత్తిని చేతఁబూనినాఁడు. పౌరుషశాలియను గొప్ప కీర్తిని బడయలేదనుమాట సత్యము. కాని క్షణభంగురమగు నీశరీర

మును రణముఖమున విడువసిద్ధముగానున్నవాఁడు. రణమున నెను జూపు నెన్నఁడు నీతఁడెఱుఁగఁడు—" అనియెను.

బాజీరా వీవాక్యముల నన్నిటిని విని ప్రఫుల్లచిత్తముతో "నీవాక్యములను విని చాల సంతసించితిని. నీవు సాహసుఁడవును, వీరపురుషుఁడవును, నగుదువు. అందుల కణుమాత్రమును సందియము లేదు. నీవేమహమ్మదీయ సుబేదారునికడ నెట్టి యుద్యోగమునం దున్నావో చెప్పుము" అని యడిగెను.

ఆగం—నే నేమహమ్మదీయునికడను నుద్యోగముచేయలేదు.

బాజీ—అట్లయిన నెవరికడ నుంటివి?

ఆగం—మహారాజగు సీతారామరాయలకడ సర్వసేనాధిపత్యము వహించితిని.

బాజీ—ఆమహారాజు రాజధాని యెచ్చట?

ఆగం—తూర్పు బంగాళమునందలి మహమ్మదుపుర మాతని రాజధాని.

బాజీ—హిందూరాజు రాజధానినామ మట్లున్నదేమి?

ఆగం—మహారాజీనగరమును స్వయముగఁ బ్రతిష్ఠించినాఁడు. కాని మహమ్మదీయ సుబేదారునకుఁ బరితృప్తికలుగఁ జేయుటకై యట్టి నామము నుంచినాఁడు.

బాజీ—నీ వాతనిని విడిచిపెట్టుటకుఁ గారణమేమి?

ఆగం—మహమ్మదీయుల కోపాగ్నిచే నాతని రాజ్యమంతయు ధ్వంసమైపోయినది—రాజధాని మహమ్మదీయుల హస్తగతమైనది. నేను చేయఁదగినదంతయుఁ జేసితిని. కాని అతి ప్రతిహతమగు కాల ప్రవాహమున కడ్డముగట్టుటకు నాకు సాధ్యమైనదికాదు. యవను లభ్యుదయము నొందుటయే సర్వజనపూజితుఁడగు విధాతృని యుద్దేశమని తోఁచుచున్నది. అందుచే నేను ప్రాణపణకార్యము లెన్నియేని జేసియుఁ గృతార్థుఁడను గాలేకపోయితిని.

బాజీ—మీా మహారాజెచ్చటనున్నవాఁడు?

ఆగం—అది నాకుఁదెలియదు. రాజ్యము మహమ్మదీయుల చేతఁబడఁగానే పరివారముతోఁగూడ నాతఁడెక్కడకో వెడలిపోయి నాఁడు. ఇంతవఱ కెచ్చటను నాతనిజాడ నాకుఁదెలియలేదు.

బాజీ—నీకు నాసాహాయ్యముచే ముసల్మానులను జయించి మీాప్రభురాజ్యమును పునరుద్ధారణము చేయవలయునను కోర్కె యున్నదా? ఈయుద్దేశముతోడనే యింతదూర మరుదెంచితివా?

ఆగం—లేదు. నే నెందుకొఱకు రాజ్యమును పునరుద్ధారణము చేయవలయును? అందువలన నాకేమి ప్రయోజనమున్నది? ఱాతిపై గ్రుద్దినచోఁ జేయి నొప్పియెత్తుటయేగాని వేఱులాభ మేమియు లేనట్లు, మహమ్మదీయాభ్యుదయమున కంతరాయముగ నుండుటవలన నేదియో విపత్తు సంభవించుటయేగాని, శుభఫలము చేకూరదని నా నిశ్చితాభిప్రాయము. ఏలికసెలవైనచోఁ బ్రాణ ములనైన విడుచుటకు సిద్ధముగానున్నాను. కాని మీాసెలవులేనిదే యొక తృణాంకురమునైనను భేదించుటకు మనసుగోలుపుట లేదు. మహమ్మదీయులకు విరుద్ధముగా నేనెందులకు యుద్ధము చేయవల యును? నేనీవిధముగా ననవసర ప్రసంగముచేయుట కావశ్యక మేమియునులేదు.

బాజీ—నీవు నన్నుఁజూడవచ్చిన యుద్దేశమేమి?

ఆగం— సేవకావృత్తికొఱకు మీా శరణుజొచ్చితిని. నిశిత ఖడ్గమే సేవానిర్వాహణమునకుఁ బ్రధానోపాయమని విన్నవించి యున్నాఁడను. కాని ఎవఁడే నొక సామాన్యమానవుని యొద్ద మాత్రము నేను సేవసేయను. ఇంతేకాదు. ఏదేని సామాన్య స్వార్థమునుగోరి యస్త్రమును స్పృశింపను. పిపాసచే నత్యంతమును పీడింపఁబడుచున్నను, చాతకములు వర్షోదకమునేగాని, యేజలాశయ ము నందలి యుదకమును గ్రహియింపనట్లు, దారుణదారిద్ర్యాగ్నిచే

దగ్ధము సేయఁబడుచున్నను. నేనెన్నఁడును నీచసేవఁ జేయఁజాలను. మహారాజట్లు పోయినపిదప నే మహాపురుషుని యాశ్రయమైనను దొరకినచో, నాతనికడ వస్త్రమును జేతఁదాల్పవలయు ననియు లేనిచో ఖడ్గమును నొరయందే బంధించి యుంచవలయుననియు నా హృదయమున శపథము చేసికొంటిని. నేనిందుకొఱకు మొట్టమొదట ఢిల్లీ కేగియుంటిని. అచ్చటి ప్రభువులందఱును విలాసరతులును, ఇంద్రియలోలురునై యుండుటచే నావంకఁజూచినవారే లేకపోయిరి. అటనుండు ఎకు నాకిష్టములేకపోయినది. ఎవఁడు వీరపురుషుఁడు కాఁడో, వాని కితరుల వీరత్వము హృదయంగమము కాఁజాలదు.

బాజీ—ఆమాట యథార్థము. నీవు చూచునప్పటికి ఢిల్లీస్థితి యెట్లున్నది ?

ఆగం—ఢిల్లీ, అతి శోచనీయ స్థితియందున్నది. అల్పకాలములోనే సమస్త సామ్రాజ్యమును మొగలాయీలచేతినుండి జారి మహారాష్ట్రుల హస్తగతమగునని నాకుఁదోఁచినది.

బాజీ—నీకట్లుతోఁచుటకుఁ గారణమేమి?

ఆగం—వీరధర్ములును, ఉద్యమశీలురునగు మహారాష్ట్రుల యభ్యున్నతియు, నిస్తేజులును విలాసరతులునగు మహమ్మదీయుల యవనతియును నిశ్చయములు. నేను దివ్యచక్షువులతోఁ జూచి నాఁడను. మొగలాయీల రాజ్య మిఁక నెన్నిరోదినములుండదు. అచిరకాలములోనే యంతరించి పోఁగలదు. మొగలాయీలు రాజ్యభ్రష్టులైనప్పుడు భారతనౌకకుఁ గర్ణధారులగుటకు మహారాష్ట్రులు దక్క మఱియొకరు సమర్థులుకారు. ఈప్రపంచమున లక్షలకొలఁది ప్రజల కొక్కఁడు రాజగుచున్నాఁడు. ఆతఁడు మానవుఁడే యైనను నీశ్వరప్రతిరూపుఁడు. ఆతఁడు శాసనకర్త. పరిపాలకుఁడు. దుష్టజన శిక్షకుఁడు. శిష్టజన సంరక్షకుఁడు. లక్షలకొలఁదిజను లాతని పరిచర్య యందు నియుక్తులై యుందురు. వారినందఱిని మిగులదయతోఁ

జూచుచుఁ బోషించుచుఁ బరిపాలనము జేయుచుండవలయును— ఏనృపతి సాధారణమానవులవలెనే యైహికసుఖములం దగులుకొనునో ఏరాజు కంఠపర్యంతము పాపపంకిల హ్రదమున దిగఁబడి హృదయ సింహాసనమున రాక్షసుని ప్రతిష్ఠించునో, ఎవఁడు ప్రజాపాలనమునెడల నుపేక్ష నహించునో, ప్రజలను గన్నబిడ్డలవలెఁ బరిపాలింపఁడో, అట్టివానికడ నుండనొల్లక రాజ్యలక్ష్మి, సద్గుణాత్మకుఁడగు మఱి యొక మహాపురుషు నాశ్రయించుచుండును. ఇప్పుడు పాదుషహా పదవి నధిష్ఠించియున్న యాతనికడ మందునకైనను రాజోచితగుణ మొక్కటియును గానరాదు. అట్టివానిని రాజనిపిలుచుటచే రాజ శబ్దమున కవమానము తెచ్చిపెట్టినవార మగుచున్నాము. ఆతఁడు రాత్రిందివములు విలాససాగరమున నిమగ్నుఁడై యుండుచున్నాఁడు. రాజ్యభారమును వహించుశక్తి యాతనికడలేదు. పిశాచీప్రియసంగు డును, సైతానుని సహోదరుఁడును, భోగవిలాసతత్పరుఁడు నగు నిర్గుణపురుషుఁ డెప్పుడును రాజ్యపాలనమున కర్హుఁడుకాఁడు. చిర భోగ్యయగు వసుంధర వారిహస్తమునుండి విడివడిపోవుటనిశ్చయము. సందియములేదు. ఢిల్లీయందలి ప్రతివిషయమును కన్నులారఁజూచి నాహృదయమున నిట్లు నిర్ధారణముచేసికొంటిని. అచిరకాలములోనే మొగలులు ధరాతలముపై లేకుండఁబోవుదురు. అందుచే పాదుషహా కడ నుండుటకు నాకిష్టము లేకపోయినది.

బాజీ—నీ వతిదూరదర్శివివలె మాటలాడుచున్నాడవు. నీవు చెప్పినమాట లసత్యములుకావు, కాని సమర్థుఁడును రాజనీతిజ్ఞుఁడు నగు నొకపురుషుఁడు మంత్రిపదవిని స్వీకరించియున్నాఁడు. ఆరాజ్య ము నాతఁడు రక్షింప సమర్థుఁడు. ఆతఁడు పాదుషహాను సన్మార్గ మున నడపింపఁగలఁడు.

ఆగం— అట్లెన్నఁడును సంభవింపదు. అగ్ని జలముతోఁ గలసియుండు టెట్లసంభవమో యట్లే భోగవిలాసపరులగు కాపురుషులతో వీరపురుషులు కలిసియుండు టసంభవము. పంది బురదను మెచ్చునుగాని, పన్నీటిని మెచ్చనట్లు కాపురుషులు తమ మనోవృత్తులతోఁ గలియువారితోడనే స్నేహముసేయుదురుగాని, సత్పురుషులతోఁ గలసిమెలసి యుండఁజాలరు. వీరధర్ముఁడగు నామంత్రికిని మానవనామమాత్రుఁడును నయోగ్యుఁడునగు నా పాదుషహాకును సరిపడదు. పాదుషహా ప్రవర్తనమును జూచి విసుఁగుఁజెంది అసఫ్ జాన్ తన పదవిని వదలుకొనవలెనని కృతసంకల్పుఁ డైనాఁడు. అచిరకాలములోనే యాతఁడు మంత్రిపదవిని విడిచి, సైన్యసామంత సహితముగా దక్షిణదేశమునందలి తన స్వారాజ్యమునకు రానై యున్నాఁడు.

బాజీ—ఇది నాకొకశుభవార్త. అసఫ్‌జాన్ తన సైన్యముతో గూడ ఢిల్లీని విడిచి వచ్చినచో ఢిల్లీనగరమును రక్షించువారుండరు. నన్నెదిరింపఁగల సమర్థులును లేరు. నీయుద్దేశములును నీవాక్యములును జూడఁగా నీవొకగొప్ప రాజనీతిజ్ఞుఁడవనియు, పరాక్రమశాలివనియు నీమూలమున నాకోర్కెలు సఫలీకృతములగు ననియు నాకుఁ దోఁచుచున్నది. నీవు నీయిష్టమువచ్చినట్లిట నుండవచ్చును. నీ యిష్టమువచ్చిన పదవిని స్వీకరింపుము.

ఆగంతుకుఁడు బాజీరావు పలికిన వాక్యములను విని సంతుష్ట హృదయుఁడయ్యెను. అప్పటినుండియు నక్కడనే యుండెను.

ఈయాగంతుకుఁడు కృత్రిమవేషముతో వచ్చి తనస్వరూపమును సంపూర్ణముగా మఱుఁగుపఱచుకొని యున్నాఁడు. తనపేరును దాచికొని రఘునాథరాయలని కల్పితనామమును ధరించియున్నాఁడు.

అందుచేఁ బాఠకమహాశయు లీతని నెఱుంగుటకు సమర్థులుకాఁజాలరు. అయినను, అగ్ని విశేషకాలము వస్త్రమున మఱుఁగువడియుండనట్లే యీతని నామరూపములును చాలకాలము మఱుఁవడి యుండఁ జాలవు. సమయము వచ్చినతోడనే నిజము బయల్పడును.



## అయిదవ ప్రకరణము.

### గంగాధరస్వామి

మఱునాఁ డుదయమున జయంతీదేవియును శ్రీయును స్వామి దర్శనార్థమేగిరి. అపూర్వ దివ్యతేజశ్శాలియగు స్వామిని గాంచిన తోడనే శ్రీ మహానందనిమగ్నయయ్యెను. అత్యంతభక్తిభావముతో నామహాపురుషుని పాదముల కుఁ బ్రణమిల్లెను. స్వామి యొకమారు శ్రీని ఆపాదమస్తకము నిరీక్షించి యించుకచిఱునగవుతో నామెను దనసన్నిధిని గూర్చుండుమని యాజ్ఞ యొసంగెను. ఇంతలోనచ్చటకు గంగాధరస్వామికూడ వచ్చి కూర్చుండెను. పూర్వమునుండియు శ్రీ నాతఁ డెఱుంగును. అందుచే శ్రీ గంగాధరస్వామికి నమస్కరించెను. గంగాధరస్వామి చిఱునగవుతోఁగూడిన మొగముతో నామె నాశీర్వదించి, చిరకాలము పంజరమున బంధింపఁబడియున్న పక్షి పంజరము నుండి తప్పించుకొని పోయినచో సుఖముకలుగునా ? మాయాశృంఖ ములను ద్రెంపివైచి యనంతాకాశపథమున నెగురుచున్నచోఁ గుక్కలు మొదలగు మాంసాహారమును దిను జంతువులచే బాధలు సంభవింపవా ?" అనియడిగెను.

గంగాధరస్వామి నుడివిన వాక్యములను విని యందలి భావ మును గ్రహించి శ్రీ యిట్లని ప్రత్యుత్తరమిచ్చెను. "ప్రభూ!

ఎంతకాలము దారము తెగిపోకుండ నుండునో యంతకాలమును గాలి పడగ యాకాశపథమునుండి పడిపోవకుండ నుండునట్లే, మీపాదపద్మములు నాహృదయమున నున్నంతవఱకు నాకించుకంతయు నాపదగ నేరదు. మీయాశీర్వాదపరిభావముచే మోళ్ళు చిగురింపఁగలవు. సానుమయప్రదేశమున నిర్మలసలిలములు ప్రవహింపఁగలవు. అట్టిచో దుర్బలహృదయయగు నీయభాగిని మీయాశీర్వాదముచే నైహిక సుఖములను పరిత్యజించుటకు సమర్థురాలు కాఁజాలదా? అత్యంత మలినమూర్తులగు నంగారములు జ్వలించుచున్న యగ్నికుండమున బడినతోడనే తమ నీచరూపమునువీడి తేజోవంతము లైనయట్లే, మీకృపాబలముచే నేను భిన్నప్రపంచమునఁబడి వేఱుధర్మములతో సంచరించుచున్నదానను. నాహృదయమునుండి తుచ్ఛములగు నాశావాసన లదృశ్యములైపోయినవి. నాహృదయ కాననమున వైరాగ్య దావానలము ప్రజ్వరిల్లినది. మీకృపాపవన సాహాయ్యమున్నచో నాయగ్ని ప్రబలి, మైహికసుఖవాంఛా తృణరాశిని దగ్ధముచేసి వేయఁగలదు. మఱియు మీకృపామహిమచేఁ బరితప్తమైన యీ యభాగిని హృదయము చల్లఁబడఁగలదు."

ఈవాక్యములను విని సంతసించి గంగాధరస్వామి "సంతప్త హృదయమును చల్లఁబడునట్లుచేయుట కాపరాత్పరుఁ డొక్కఁడే సమర్థుఁడు. ఇతరు లెవ్వరును సమర్థులుకారు. ఆపరమపురుషుఁడు భక్తవత్సలుఁడు. భక్తు లేదికోరిన నదివారల కొసంగుచుండును. మానవు లాతనియెడ భక్తికలిగి యారాధించినచో, వారికి మోక్ష మొసంగి రక్షించుచుండును. తల్లి తనపిల్లల కాటవస్తువులు మొదలగు విన మొసంగి తన్మూలమున వారిచిత్తము లన్యథా లీనమగునట్లుజేసి తాను గృహకర్మములయందుఁబ్రవృత్తయగుచుండును. కానిపిల్లలలో

నెవరైనను నాయాటవస్తువులవంకఁ బోవక తల్లియే కావలెనని రోదన మారంభించినచోఁ, బ్రేమమయియగు జనని యన్నిపనులను విడిచి ముందుగా నాశిశువును జేరఁదీసి యోదార్చి తన్మనోరథ మీడేర్చుచుండును. అట్లే లీలామయుఁడగు భగవానుఁడు, ఆటవస్తువు వంటి సంసారమును మానవులకొసంగి తటస్థుఁడై యుండును. ఏపుణ్యపురుషుఁ డట్టి సంసారసుఖముల నపేక్షింపక మనోవాక్కాయ కర్మములయందును నాతనినే నమ్మియుండునో, అట్టివాని కీశ్వరుఁడు శాశ్వతానందము నొసంగి రక్షించుచుండును. నీవును నట్టి యాట వస్తురూపమైన యైహికసుఖమును బరిత్యజించి, రాత్రిందివములు నిష్కపట హృదయముతో నాశ్రీహరినిం గూర్చి మొఱ్ఱపెట్టు చున్నావు. నీమొఱ్ఱలాదయామయుఁడగు పరాత్పరుని కర్ణకుహరముల యందుఁ జొరఁగలవు, నీమనోభీష్టములు నెఱవేఱఁగలవు. అందు లకు సందియములేదు. అది యటుండనిమ్ము. స్వామి సందర్శనార్థ మీవు గుహనుండి బయలువెడలినది మొదలు నీయదృష్టమున నెట్టి ఘటనలు సంప్రాప్తములైనవో విననలయునని నాకుఁ జాలఁగోరిక గలదు. కావున జరిగినదంతయు స్పష్టముగాఁ జెప్పుము.” అనియెను. శ్రీ పూర్వకథనంతను సవిస్తరముగా గంగాధరస్వామికి విన్నవించెను.

స్వామి యాకథనంతనువిని నిట్టూర్పుతో “ఈప్రపంచము విచిత్ర మయమైనది. అందువిచిత్రమేమియును లేదు. ఇచ్ఛామయుఁడగు నాలోకేశుని యిచ్ఛామాత్రమున నొకచిన్న గోష్పద మునం దొక్క మహార్ణవ మిమిడిపోఁగలదు. మాయామయమగు నీమహాప్రపంచమునందు సత్పథమున నడచు మానవుల కనేకవిధము లగు ప్రతిబంధకములు పొడగట్టుచుండును. వారికి శత్రువులచే ననేకవిధములగు బాధలు సంప్రాప్తము లగుచుండును. అయినను మానవుఁడు వాని నెట్లో తప్పించుకొని గమ్యస్థానమును జేరఁగలఁడు. కాని, కామినీరూపమోహ మనియెడి వలలోఁజిక్కుకొనిన పురుషుఁడు

మాత్ర మంతశ్శూన్యుఁడైపోయి దరిజేరలేఁడు. వాతాంబుపర్ణాశను లగు మహర్షులే యింద్రియములనుజయింపలేక మతిభ్రష్టులగుచున్నా రన్నచో, నైహికసుఖలోలురగు సామాన్యమానవులమాట వేఱె చెప్ప నేల? అది యటుండనిమ్ము. సత్పథానువర్తనుఁడగు సీతారామరాయ లావిధముగఁ బరిణమించెనని వినినప్పటినుండియు నాకుఁ జాలవిచార ముగ నున్నది. తుదకాతనియదృష్టతరువున విషమయఫలముదయించి నది. దాని నాతఁ డనుభవించినాఁడు. అందు నీయపరాధ మించు కంతయును లేదు.” అనియెను,

శ్రీ—ప్రభూ! మీరు సెలవిచ్చినదంతయు సత్యము- కాని యీమందభాగిని యటకేగకయుండినచో, నీ యదృష్టహీనురాలి మొగ మాతనికిఁ గనుపర్చకయున్నచో, నిట్టిఘోరవిపత్తు సంభవించి యుండదని తోఁచుచున్నది. అపారప్రజ్ఞావంతుఁడును సంయతచిత్తుఁడు నగు మహారాజ హృదయసింహాసనముపై పిశాచ మధిష్ఠింపక యుండును. తియ్యని నదీజలము సముద్రమునఁ బడినతోడనే యుప్పన యైపోయిన ట్లీయభాగినీసమాగమకారణముచే, ననావృతస్థానమందలి కర్పూరమువలె నాతనిప్రజ్ఞాబల మంతయు హరించిపోయి యాతని యదృష్టముకూడ నాయదృష్టమువలెనే యైపోయినది. ఈతుచ్ఛ రూపమునందలి మోహముచే నాతఁడు కర్తవ్యకార్యములను విసర్జించి వైచినాఁడు. ఈపాపాత్మురాలిమూలమున శోణసామ్రాజ్య మకా లమున ధ్వంసమైపోయి మహారాజు మతిభ్రష్టుఁడైపోయినాఁడు. ప్రభూ! ఈయనుతాపానలముచే నప్పుడప్పుడు నాహృదయము దగ్ధ మైపోవుచుండును. ఎంతప్రయత్నించినను నాహృదయమున కప్పుడు శాంతికలుగుటలేదు.

గంగా—వత్సా! విధాతృనిచే నిర్మింపబడిన ఘటనాచక్ర మును వ్యర్థమగునట్లుచేయుట కెవ్వరును సమర్థులుకారు. లీలా మయుఁడగు పరాత్పరుఁడు మానవుని నిమిత్తమాత్రునిగా నుంచుకొని

యనేక విచిత్రవ్యాపారములను జేయుచు నానందించుచున్నాఁడు. ఆతనియిచ్ఛకు విరుద్ధమొనర్చుటకు క్షీణప్రాణులగు మానవులు సమర్థులుకారు. రాష్ట్రనాశనముగానిమ్ము; ప్రపంచనాశనముగానిమ్ము ఆతని కిచ్ఛలేనిదే యించుకంతయు జరుగదు. దానికి నీయిష్టానిష్టములతోఁ బనిలేదు. సూత్రమునందు బంధింపఁబడినబొమ్మ సూత్రధారునియిచ్ఛానుసారముగా నాట్యముసేయుచుండునట్లే మానవుఁడావిరాట్పురుషుని యిచ్ఛానుసారముగాఁ బ్రపంచరంగభూమియందు నృత్యముసేయుచుండును. అట్టిచో సత్పురుషుఁడగు సీతారామరాయలు పాపపంకిల హ్రదమున దిగఁబడిపోవుట కాయీశ్వరుఁడే కారణమన్నచో నందాశ్చర్య మేమున్నది? సీతారామరాయల యధఃపతనము విధాతృని యభీష్టము. అందులకొక సాధనమేదైన నుండవలయునుగదా! మహమ్మదుపురమునకు నీరాకయే యందులకు సాధనముగాఁజేసినాఁడు. ఆతనియభీష్టమున కన్యథా యొనర్చుటకు నీవు సమర్థురాలవు కావు. ఇంతేకాదు. సీతారామరాయల యదృష్టమున విధాత యేదిలిఖియించెనో యది జరిగినది. అందు నీయపరాధ మించుకంతైనను లేదు. నీవిప్పుడు పవిత్రపథమున సంచారము సేయనారంభించితివి. ఇఁక నైహికచింతల నన్నిటి నవలకుఁ ద్రోసి వేయుటయే నీకుఁ గర్తవ్యము.

శ్రీ—ప్రభూ! మీయాశీర్వాదము వలనను, జయంతీ దేవి క్షమాపణమూలముననను నాహృదయము నీశ్వరాయత్తముచేసి నిశ్చింతతో నుంటిని. కాని హృదయము దుర్బలమైనదగుటచే సంపూర్ణముగా స్థిరభావమును వహియించుటలేదు. నడుమనడుమ పూర్వకథ జ్ఞప్తికి వచ్చినతోడనే యశాంతి యుదయించి పీడించుచున్నది. ఆబాధ నుండి నేను తప్పించుకొనఁ జాలకున్నాను.

గంగా—బిడ్డా! సమయమువచ్చునప్పటి కన్నియును వాని యంతట నవియే చక్కఁబడుచుండును. ఇది ప్రపంచ ధర్మము.

నీకును మంచికాలము వచ్చునప్పటికి హృదయదుర్బలత్వము వీడి పోయి, ఈశ్వరధ్యానమునందు స్థిరముగానిలువఁగలదు. నేను నీ హస్తమును జూచి యేసంగతులను జెప్పితినో యవియన్నియుఁ దప్పక జరిగినవికదా !

శ్రీ—భూతభవిష్యద్వర్తమానకాలములు భవదీయ దివ్య దృష్టి కధీనములు అందుచే మీనోటినుండి వెలువడిన వాక్యము లమోఘములగునుగాని, యసత్యము లేలయగును ? మీరేమి సెల వొసంగితిరో యవియన్నియు నొక యక్షరమైనను దప్పిపోకుండ జరిగినవి.

రామా—ఈ బాలిక యేనక్షత్రమున నేరాశియందు జన్మించి నది ?

గంగా—ఈమెజన్మకాలమునకుఁ జంద్రుఁడు పుష్యమీనక్షత్ర మునం దున్నాఁడు. కర్కాటకరాశి—

రామా—జననచక్రమును లిఖించి గణనము చేసితివా ?

గంగా—చిత్తము. చేసితిని.

రామా—ఎట్లున్నది ?

గంగా—పూర్ణచంద్రుఁడు స్వక్షేత్రమందున్నాఁడు. సప్తమ స్థానమున బుధ బృహస్పతి శుక్రులు ముగ్గురునున్నారు—

రామా—అట్లయినచో నీమె కీయవస్థ యేమి ? శుభగ్రహ ములు మూఁడును సమావేశమై సప్తమమునందున్నప్పు డీమె మహా రాజ్ఞికావలయునే ! "జాయాస్థేచ శుభత్రయప్రణయి నీరాజ్ఞీభవే ద్భూపతేః" అని శాస్త్ర ముద్ఘోషించుచున్నది.

గంగా—ఔను. మేమును మొతట నిట్లే సందేహమునొంది తిమి. కాని పిదప నాలోచించిచూడఁగా నీమె కీప్రస్తుతపు దశ పట్టుటకుఁ గలకారణము తెల్లమయినది.

రామా— ఏమది ?

గంగా— సప్తమము బృహస్పతికి నీచస్థానమైనది. శుభ గ్రహములు మూఁడింటికిని పాపగ్రహక్షేత్రమునం దునికిసంభవించి నది. మఱియును వారికిఁ బాపగ్రహదృష్టికూడఁగలదు. అందుచే నీమె యదృష్టమున రాజ్యసుఖభోగము లభింపలేదు. విశేషించి చంద్రుఁడు శనికి త్రింశాంశగతుఁడై యున్నాఁడు. అందుచే నీమెకిట్టి యవస్థ సంప్రాప్తమైనది. శుభగ్రహములు శుభఫలము నీయలేక పోయినవి.

గంగాధరస్వామి చెప్పిన యీవాక్యములను వినినతోడనే రామానందస్వామి యధరముపై నించుక చిరునగవు కనుపట్టెను. కాని యాతఁడేమియుఁ బలుకలేదు. మరలనూరవుఁడై యట్లే యూర కుండెను.

శ్రీ—మీరు లలితగిరియందలి నిరసమగు నాగుహానువీడి యిక్కడకువచ్చి యెన్ని దినములైనది ?

గంగా—ఆఱుమాసములైనది.

శ్రీ—ఇక్కడ కెందులకువచ్చితిరి ?

గంగా—గురుదేవుని పాదపద్మములను దర్శించుటకై వచ్చి తిని. గురుదేవునికడ మంత్రోపదేశమువడసి నిర్జనమైన యాగుహ యందు ముప్పదిరెండు సంవత్సరములనుండి జపముచేసికొనుచుంటిని. ఆప్రదేశమునఁ బ్రాపంచిక విషయవాసన లేవియునులేవు. అందుచే జాలకాల మచ్చటనేయుండి చంచలస్వభావమగు హృదయము నీశ్వరాయత్తముచేసి తదేకధ్యానతత్పరుఁడనై యుంటిని. ఇప్పటికి నాపై గురుదేవునకుఁ గటాక్షము వచ్చినది. తమసన్నిధికి రావలయు నని యాజ్ఞాపించినారు. ఆజ్ఞానుసారముగ నొక్క క్షణికమైనను విలంబనము సేయకుండ నీపవిత్రాశ్రమమునకు వచ్చితిని. అదృష్ట

దేవత నీయెడలఁ బ్రసన్నయైనది. అందుచే నీశ్వరప్రతిరూపుఁడగు గురుదేవుని దర్శనము సులభముగా నీకులభించినది. కృతార్థురాల వైతివి. పాపతాపమయమగు నీప్రపంచమున గురుదేవునితోఁ దుల్యుఁడగు మహాపురుషుఁ డింకొకఁడు లేఁడన్నచో నది యత్యుక్తి కానేరదు. నావంటి మలినబుద్ధులెందఱో యీమహాత్ముని యనుగ్రహముచేఁ గృతార్థులైరి.

శ్రీ—ప్రభూ! ఆమాట యథార్థము. నావంటిదాని కీమహాత్ముని దర్శనములభించుట పుణ్యముచేయనిదే స్వర్గము లభించుట వంటిది. దీని కంతకును జయంతీదేవికి నాపైఁగల యనుగ్రహమే కారణము. ఆమెదయచేత నేనీగురుదేవుని దర్శనలాభమును బడయఁ గలిగితిని. ఆమె నన్ను సహోదరివలెఁ జూచుకొనక పోయినచో నాయెడల సహానుభూతిని గనుపఱుపక పోయినచో, నేనీపాటి కెట్టి యవస్థను బొందియుండెడిదాననో చెప్పఁదరముకాదు. ఆత్మహత్య చేసికొని సకలబాధలనుండియును విముక్తనై యుండియుందును.

గంగా—వత్సా! ఇదియును నాభగవద్విలాసమే. బాల్యమునుండియును నీహృదయము భగవదాయత్తమై యున్నది. నిన్నుఁ బాపపంకమున మునుఁగకుండ రక్షించుభార మాతనిది. అందులకనియే రమణీరత్నమగు జయంతీసహవాసము నీకులభింపఁజేసినాఁడు. ఆమెమూలమున నీసర్వాభీష్టములును నెఱవేఱఁగలవు.

శ్రీ—ప్రభూ? ఆమాట సత్యము. ఆమె నాకుఁ జేసినయుపకారమును నేనీయొక్క ముఖముతో నుడువఁజాలను. నాయీజీవిత మామెకుఁ జాలదినములక్రిందటనే విక్రయించివైచితిని. నేనీజన్మమున నామెఋణమును దీర్చుకొనఁజాలను. ప్రభూ! నేనొక్కసంగతిని దెలిసికొనవలసి యున్నది. ఆవిషయమునుగూర్చి జయంతీదేవి నడుగుటకు నేనింతవఱకును సాహసింపలేకపోయితిని.

గంగా—నీయభీష్టమును మాకడఁదెలిపినచో భయమేమియును లేదు. మే మెఱిఁగియున్న విషయమైనచో నిశ్చయముగా దానిని నీకెఱింగించెదము.

శ్రీ—ప్రభూ! మీరు సర్వజ్ఞులరు. ప్రజ్ఞాబలముచే జగత్తునందలి యావద్వృత్తాంతములును మీదివ్యదృష్టికి గోచరము లగుచుండును. నాహృదయమునందలి కౌతూహలమును నివృత్తి చేయుట మీ కతిసులభము.

గంగా—నీమనసునం దేమి తెలిసికొనవలయునని యున్నదో తెలుపుము.

శ్రీ—ప్రభూ! జయంతీదేవి యేలసన్యాసినియైనది? ఆమె పూర్వపు టవస్థ యెట్టిది? ఆమె యేకులమందు జన్మించినది? ఈ విషయములను దెలిసికొనవలయునని నాకెన్నాళ్ళనుండియో కోర్కె కలదు. కాని యింతవఱకు నెవరినడుగుటకును నాకు సమయము దొరకినది కాదు. ఆమె యావదుదంతమును మీ రెఱిఁగియుందురు. అందుచే రమణీజాతికి స్వభావమగు చాపల్యము నడఁచుకొనలేక మిమ్మడిగితిని క్షమింపవలయును.

గంగాధరస్వామి యామాటలను విని యేమియు మాటాడకుండ నిర్వాతస్థానమందలి దీపకళికవలె నీరవుఁడై యుండెను. రామానందస్వామి యించుకచిఱునగవుతో "వత్సా! జయంతి నిన్ను సహోదరివలెఁ జూచుచున్నప్పు డామెవృత్తాంతము నీకుఁదెలిపినచో నందువలన నించుకేనియు హానిసంభవింపదు. కాని యదియొక మహారహస్యము. ఆరహస్యమును జయంతికూడ నెఱుఁగదు. నాయనుమతిలేకుండ నీకథను జయంతికిఁ దెలుపనని నీవు శపథముచేసినచో నీమనోభీష్టమును నెఱవేర్చెదను" అనియెను.

శ్రీ యత్యుత్సాహముతో "ప్రభూ! మీయనుజ్ఞలేనిదే యీ వృత్తాంతమును నెవ్వరికడఁ దెలుపనని శపథము చేయుచున్నా" ననియెను.

రామా—వత్సా! ఆవిషయమును దెలుపుట కిదిసమయము కాదు. నీ వేకాకినివై రాత్రియొకజాము గడచినపిదప నాకుటీరము నకు రమ్ము. అప్పుడు జయంతి జీవనచారిత్రమును నీకు సవిస్తరముగా నెఱింగించెదను.

శ్రీ యీమాటలనువిని సంతుష్టచిత్త యయ్యెను. పిదప మరల నేమియుఁ బశ్నింప సాహసింపలేకపోయెను.

ఇంతలో సంధ్యాకాలమాసన్న మయ్యెను. దివాకరుఁడు గగన గర్భమున మఱుఁగువడిపోయెను. ధరణి నిస్సహాయయగుటఁ గాంచి దుష్టుఁడగు నంధకార రాక్షసుఁడామె నాక్రమించుకొనియెను. విహంగగణము భీతచిత్తముతోఁ గలరవములను చేయుచుఁ దమతమ గూండ్లం జేరుకొనుచుండెను. ప్రపంచమున నొకేసమయమున నొకచో నానంద ధ్వనులును వేఱొకచో హాహాకారధ్వనులును బయలువెడలు చుండునట్లే, సరోవరమున నొకప్రక్క పతివిరహయగు పద్మిని ముకుళిత ముఖమండలయై దుఃఖజలనిమగ్నయై యుండ, వేఱొక ప్రక్క నానందవారిధిం దేలుచుఁ గుముదిని శోభాయమానయై ప్రకాశించుచుండెను. ఈ విషమవ్యాపారమునుగని ఝిల్లీకుల ముచ్చ కంఠముతో ధిక్కారమును జేయనారంభించెను. ఈరంగము నీక్షించుటకై వచ్చి యొకటిరెండు నక్షత్రములు గగనగవాక్షమునుండి తొంగిచూచుచుండెను.

సంధ్యాకాలము సమీపించుటతోడనే యాశ్రమమునందలి తపస్వులు సంధ్యావందనము చేసికొనఁదొడంగిరి. వారికంఠముల నుండి వెలువడు వేదధ్వనులు నాల్గుదిక్కులను వ్యాపించుచుండెను.

శాంతస్వరూపయు, ఆధ్యాత్మిక భావప్రపూర్ణయు నగు నీపవిత్రాశ్రమమునందలి సాయంశోభను దిలకించి పవిత్రచేతస్కులును మహాత్ములునగు నీతపస్వుల కంఠములనుండి వెలువడియెడి దివ్యసంగీత సన్నిభ పవిత్రధ్వనులను వీనులార నాకర్ణించినచో, నెట్టి పాషండుని హృదయమునందైనను నర్ధనిమిషములో భక్తిరస ముదయించి ప్రవహింపఁగలదు. స్వార్థమిశ్రితములగు నైహికసుఖవాంఛలు వారి హృదయములనుండి యదృశ్యము లైపోఁగలవు. ఏవిమలానందము ప్రపంచమున సామాన్యముగా మానవులకు లభింపదో, ఆ విమలానందము, అమరావతీతుల్యమగు నీపుణ్యభూమికివచ్చి ప్రాపంచికవిషయములను మఱచిపోఁగలిగిన మానవుల కతిసులభముగా లభింపఁగలదు. అందుచేతనే పూర్వకాలమున రాజశ్రేష్ఠులు తమ వార్ధక్యమున రాజ్యభారమును తనయులపైనిడి యైహిక సుఖవాంఛావిరహితులై నిర్మలానందము ననుభవించుటకై యీ పుణ్యాశ్రమముల కేతెంచుచుండెడివారు—ఈపవిత్రస్థానమందలి స్థావరజంగమపదార్థములన్నియు నాపరాత్పరుని యపారమహిమను సర్వదా ప్రకటించుచుండును. పుష్పములతోఁ గూడిన జలమునకుఁగూడఁ బరిమళమబ్బినట్లు ప్రకృతిశోభాపరిపూర్ణమును, ఆధ్యాత్మికభావ మయము నగు నీపుణ్యాశ్రమమునకు వచ్చినచో, అత్యంతమలిన బుద్ధులుగూడ బవిత్రహృదయులగుదురు, మఱియు వారిహృదయము లీశ్వరాయత్తములు కాఁగలవు.

స్వామి చెప్పిన వాక్యములను వినుచు శ్రీ యస్థిరచిత్తయై యుండెను. జయంతీదేవి పూర్వకథ కొన్నినిమిషములలోఁ దెలియఁగలదను నుత్సాహముతో నామె యాసమయమునకై నిరీక్షించుచుండెను. ఒక్కొకముహూర్త మొక్కొక్క వత్సరమువలె నామెకుఁ దోఁచుచుండెను. కాని యాహృదయచాంచల్యము పైకిఁగనఁబడ

కుండఁ గప్పిపుచ్చుచుండెను. ఈవిషయ మించు కేనియు జయంతీదేవి యెఱుంగదు.

ఫలాహారమును జేసి జయంతీదేవియును శ్రీయును నొకపర్ణ శయ్యపైఁ బరుండిరి. కాని చింతాకులయగు శ్రీకి నిద్రవచ్చుట లేదు. జయంతీదేవి నిద్రించినతోడనే స్వామి కుటీరమునకుఁబోయి యామె పూర్వకథను తెలిసికొనవలయునను నుత్సాహముతోఁ గనులు మోడ్చి స్థిరభావముతో నిద్రించుచున్నయట్లు శ్రీ పండుకొని యుండెను. కాని వాయుసంక్షోభిత రత్నాకరమువలె నామె ప్రశాంత హృదయార్ణవము విషమ విప్లవస్థితికి లోనయ్యెను. హృదయకాననమందలి కౌతూహలాగ్ని ప్రజ్వలింపనారంభించెను. దాని నార్పుట కామెకు శక్తిలేకపోయెను.

కొంతసేపటికి జయంతీదేవి గాఢనిద్రావివశయయ్యెను. శ్రీ క్షణమైన నాలశ్యముసేయకుండ మెల్లమెల్లగాఁ గుటీరమునుండి యివ్వలకు వచ్చి స్వామికుటీరాభిముఖియై నడచుచుండెను.

శ్రీ స్వామికుటీరమునఁ బ్రవేశించినప్పటి కాతఁడు ధ్యాన నిమగ్నుఁడై యుండెను. నామమాత్రమునకైనను చలనచిహ్నములు గన్పట్టుటలేదు. నిదాఘకాలమందలి మాధ్యాహ్న సూర్యునివలెఁ, బ్రదీప్త కృశానునిపోలిక, నాతని దేహము ప్రజ్వలితమగుచుండెను. ఆతని సర్వాంగములయందును దివ్యతేజస్సు పరివ్యాప్తమైయుండెను. నిర్మల కమలమువంటి స్వామి విమలముఖమండలమునఁ బ్రసన్న భావము స్పష్టముగాఁ గన్పట్టుచుండెను. ఆమహాత్ముఁడు పాపతాప మయమగు నీప్రపంచమును బరిత్యజించి శాంతిమయమగు వేఱొక రాజ్యమున సంచరించుచుండెను. శరత్కాలకౌముదివలెను, శిశిర విఘాత కమలమువలెను, మాలిన్యపరిశూన్యమైన యాతనిహృదయము

సర్వదా యీశ్వరాయత్తమై యుండెను. ఆమహామహుని యుదంత మును దెలిసికొను సమర్థులీప్రపంచమునఁ జాలనరుదుగ నున్నారు.

వర్షశూన్యమగు మేఘమువలెను, నిర్వాతస్థలమందలి ప్రదీప్త దీపశిఖవలెను, ధ్యానాసక్తుఁడైయున్న యాతని సౌమ్యమూర్తిని గాంచినతోడనే శ్రీ యల్పహృదయమున భక్తిరసము పొంగిపొరల సాగెను. ప్రపంచముననానంద మనునది యున్నచో నది యా మహాత్ముని హృదయ భాండారమున సంచితమైయున్నట్లు స్పష్టముగాఁ గన్పట్టుచుండును. పూర్వజన్మమందలి యపారపుణ్యఫలముచేఁగాక యిట్టి విమలానందము మానవులకు లభియింపనేరదు.

శ్రీ భక్తిభావముతో నామహాత్మునకుఁ బ్రణామముచేసి, పార్శ్వమునఁ గూర్చుండెను. ధ్యానాసక్తుఁడై యున్న యామహా పురుషుని ధ్యానమునకు భంగముచేయుట కామె సాహసింప లేక పోయెను. నవవికసిత పద్మమువలెఁ బూర్ణిమా శశాంకమండలము పోలిక నత్యంత శోభాయమానమైయున్న యాతనివదనమండలమును తదేకదృష్టితో నీక్షించుచుండెను.

ఒకించుక సేపటికి స్వామి నేత్రోన్మీలనమొనర్చెను.

శ్రీ యాతని పాదపద్మములకు సాష్టాంగవందనము చేసెను. స్వామి మధురస్వరముతో "నీవువచ్చితివా! మంచిది. నేను నీ సంశయమును దీర్ప నుద్యుక్తుఁడనగుచున్నాఁడను. వినుటకు నీకిప్పు డిష్టమున్నచో నిప్పుడే చెప్పెదను" అనియెను,

శ్రీ కరకమలములు ముకుళించి నమ్రస్వరముతో "ప్రభూ! నాకత్యంతోపకారిణియు, సహోదరీసమానయు నగు జయంతి జీవన రహస్యమును దెలిసికొనుటకు సంసిద్ధురాలనై యున్నాను. అనుగ్ర హింపుఁడు" అనియెను.

రామానందస్వామి యించుకచిఱునగవుతో—

"వత్సా! ఆకథ చాలరహస్యమైనది. విధాత యీరమణీ రత్నమును భిన్నోపకరణములచే సృష్టించినాఁడు. మొట్టమొదటి నుండియు నీమెజీవనప్రవాహము స్వతంత్రమార్గమునఁ బ్రవహించుచు వచ్చినది. అన్ని వెదుళ్ళయందును గర్పూరముండదు అన్నిహస్తి మస్తకములయందును ముత్యములుండవు. అట్లే యంతటను జయంతి వంటి సుకృతసంపన్నులుండు టరుదు. కాననమునం దెచ్చటనో యొకచోట, వికసించిన కుసుమమున్నచోఁ దత్పరిమళ మాకాననము నందంతటను వ్యాపించునట్లే, జయంతివంటికన్య యేకులమునం దుద్భవించునో యాకులమంతయు దేదీప్యమానముగాఁ బ్రకాశింపఁ గలదు. ప్రపంచమునం దేమాత్రముపు గళంకము నామెహృదయము నంటఁబోదు. ఆమె యెప్పుడును మాయాపాశముచే బంధింపఁ బడదు. వన్యవిహంగినివలెఁ జిరకాల మిచ్చవచ్చినట్లు సంచరించు చుండును. మలినచిత్తులగు మానవులను బరిత్యజించి యీశ్వరుని ప్రేమరసమును పానముసేయుచుండుటకంటె నామెకుఁ గర్తవ్యకార్య మింకొకటిలేదు. హృదయమందలి ప్రేమను సంపూర్ణముగా భగవ దధీనముచేసి యామెనిశ్చలహృదయయైనది. ఆమె యీశ్వరునకు దాసి. అతని పరిచర్యయందే యామెజీవితమంతయు గడచిపోఁ గలదు. కొలఁదికాలములోఁ బాపంచికచ్ఛాయనైనను నామె స్పృశింపదు. ఇప్పుడు నేను నీకేదిచెప్పుచుంటినో దానిని నీవామెకడ నీషన్మాత్రమైనను వెల్లడింపఁగూడదని యింకొకమారు నిషేధించు చున్నాఁడను. అదియంతయును నీవిచ్చటనే మఱచిపోవలయును. ఛత్రపతిశివాజీ మహారాజుచేఁ బ్రతిష్ఠింపఁబడిన రాయదుర్గమున మలహరరావు అను పేరుగల యొకబ్రాహ్మణుడు వాసముచేయు

చుండెను. ఆతనిభక్తికి మెచ్చి నేనాతని కొకమంత్రము నుపదేశించితిని. మలహారరావు దక్క, గృహస్థులలో నాశిష్యు లితరులెవ్వరును లేరు. మలహారరావున కీప్రపంచమునఁ గోరఁదగిన దేమియును లేదు. కాని యాతని దేహవృక్షమున ఫలమొక్కటియును ఫలింపలేదు. అది యొక్కటియే యాతని హృదయమునకుఁగలచింత. ఇంచుమించు ముప్పదిరెండు వత్సరములకుఁ బిదప నేను ద్వారకాధామమునకుఁ బోవుచుండ మలహారరావుకూడ నాతో వచ్చినాఁడు. మార్గమధ్యమున నాతఁడు తన మనోవిచారమును నాతోఁజెప్పి తనయభీష్టమెట్లు నెఱవేఱునో తెలుపుమని యడిగెను. "నీయభీష్టమును దీర్చుటకు మానవులు సమర్థులుకారు. పరాత్పరుని యనుగ్రహమున్నచో దుర్ఘటములగు కార్యము లతిసులభముగా నెఱవేఱుచుండును. నీవు ద్వారకాధామమునకువచ్చి ద్వారకాపతి కేదైన సమర్పించి వేఁడుకొన్నచో నీయభీష్టము సమకూఱఁగలదు" అని నేను ప్రత్యుత్తరమిచ్చితిని మలహారరావు నేను చెప్పినట్లుగ ద్వారకాధామమునకు వచ్చి తన కిరువురుసంతానమును దయచేయవలయుననియు, అందుఁ బ్రథమసంతానము నీశ్వరుసేవ కర్పింతుననియు వేఁడుకొనియెను.

ఇట్లు జరిగిన నాల్గువత్సరములకుఁ బిదప మలహారరావు రెండు సంవత్సరముల యాఱునెలల వయసుగల యొకబాలికనుదీసికొని యీ పుణ్యాశ్రమమునకువచ్చి "మీయనుగ్రహముచే నామనోభీష్టము నెఱవేరినది. నాకుఁ బ్రథమసంతాన మీబాలిక. ఈమెతరువాత నొకపుత్రుఁడు కలిగినాఁడు. ప్రథమసంతానమును మీసేవకర్పించెదనని యప్పుడు నాహృదయమున నిశ్చయముచేసికొంటిని. కాని, ఈశ్వరుని మాయాప్రభావముచేఁ బ్రథమసంతాన మాడశిశువైనది. నాశపథమును నిలుపుకొనుటకై యీబాలికను మీపాదపద్మముల కర్పించుచున్నాఁడను. ఈమెతో నాకిఁక నేమియు సంబంధములేదు.

ఈ బాలికను మీరు స్వీకరించి మీ యిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును"
అనియెను.

సత్యనిరతుఁడగు మలహరరావు, యీవాక్యములను పలికి యా బాలికను నాపాదములకడనుంచి పుణ్యాశ్రమమునుండి వెడలిపోయి నాఁడు. అప్పటికి బ్రహ్మానందమిశ్రునకుఁ గళత్ర వియోగము కాలేదు. వారల కొకకుమార్తె కలదు. నేనీబాలికను తీసికొని కంఖాలమున కేగి బ్రహ్మానందమిశ్రునకిచ్చి కాపాడుమని చెప్పితిని. గుణవతి యగు నాతనిపత్ని పిల్లలిద్దఱి నతిప్రేమతోఁ బెంచుచుండెను.

నేనా బాలికకు జయంతియని పేరుపెట్టి యామెకు వలయు విద్యను నేర్పుమని బ్రహ్మానందున కాజ్ఞయిచ్చితిని. బ్రహ్మానందుఁడు నాశిష్యుఁడు. అందుచే నాతఁడు నామాటననుసరించి యామెకు విద్య నేర్పుచుండెను.

అనన్యసాధారణ బుద్ధిమతియగు జయంతి కొలఁదికాలము లోనే సంస్కృతభాష నభ్యసించెను. బహ్మానందుఁడు నాయాజ్ఞాను సారముగాఁ దర్కశాస్త్రమును వేదాంతశాస్త్రమును గొంతవఱ కామెకు బోధించెను. పదునేఁడువత్సరముల వయసువచ్చునప్పటి కామె విద్యాప్రవీణ యయ్యెను. అప్పుడామెకు నేను సన్యాస మంత్రము నుపదేశించి జగత్తునందుఁ దిరిగి రావలయునని యాజ్ఞ యొసఁగితిని. ఎక్కడెక్కడ నాశిష్యులున్నారో వారలకందఱకు నీమెను గాపాడుచుండుఁడని యాజ్ఞలనంపితిని. మఱియు దుష్టమాన వులనుండి రక్షించుకొనుటకొఱకు మంత్రపూతమైన యొక యమోఘ కవచమునుగూడ నొసంగితిని.

సన్యాసిని నాయాజ్ఞానుసారముగా సర్వతీర్థములను జూచి రావలయునని బయలు వెడలినది. కవచప్రభావముచేఁ గుత్సితమాన

వులు కుత్సితాభిప్రాయములతో నామెదగ్గరకు రాలేకపోవుచుండిరి. జయంతి యేకాకినియై కాశి, బృందావనము మొదలుగాఁగల ప్రధాన తీర్థముల నన్నిటిని దర్శించి పిదపఁ బురుషోత్తముని జూడవలయునని బయలుదేరెను. మార్గమధ్యమున నీసహవాస మామెకు లభించినది. అనంతరమున జరిగినదంతయు నీవు స్వయముగఁ జూచియేయున్నావు. కాని జయంతిమాత్ర మీమొదటికథ యేమియునెఱుంగదు. బ్రహ్మానందమిశ్రుని తండ్రియనియు, నాతనిధర్మపత్నిని తల్లియనియు మాత్ర మేయామెయెఱుంగును. నిజమైనతల్లియెవరో, తండ్రియెవరో, ఇప్పటికిని నామెకుఁ దెలియదు. ఎప్పుడవసరము తటస్థించునో అప్పుడీరహస్య మామెకడ వెల్లడించెదను. ఇప్పుడే యీరహస్యమును వెల్లడించితి మేని యనర్థము సంభవింపఁగలదు. మఱియు నామెహృదయమున నుత్కంఠ జనియించి యామె యాముష్మికసాధనములకు విఘ్నము తటస్థింపఁగలదు. కావున నామెకీయుదంత మిప్పుడు తెలుపఁదగదు.

ఈవృత్తాంతమంతయు వినునప్పటికి శ్రీహృదయ మాశ్చర్యముచే నాప్లుతమైపోయెను. ఒక్కక్షణ మట్లే యూరకుండి పిదప నిట్లు ప్రశ్నించెను.

శ్రీ—జయంతీదేవి తలిదండ్రులు జీవించియున్నారా?

స్వామి—చాలదినములకుఁ బూర్వమే యామెతల్లి చనిపోయినది. జయంతి తండ్రియు సోదరుఁడును జీవించియున్నారు.

శ్రీ—వారిరువురు నిప్పుడెచ్చట నెట్టి స్థితియందున్నారు?

స్వామి—ఆమెతండ్రి మహారాష్ట్ర శిరోమణియగు బాజీరావుకడ మంత్రిగానున్నాఁడు. సోదరుఁడచ్చటనే సైనికుఁడుగనున్నాఁడు.

శ్రీ—మీయనుగ్రహముచే నీవిచిత్రవ్యాపారమంతయు నాకుఁ దెలిసినది. నాహృదయమందలి కౌతూహలము తీరినది. పరితృప్తి

నొందితివి. మీయోగబలముచే జగత్తునందలి సమస్తవిషయము లును, నఖదర్పణమునందువలె మీనేత్రములకు గోచరమగుచుండును. మీకనుగ్రహము వొడమినచో నెట్టి విషయమునైనను యోగబల ముచే గ్రహించి చెప్పఁగలరు. అందుచే మిమ్ముల నీక నొక ప్రశ్న మడుగవలయునని యున్నది.

అనిపలికి శ్రీ నమ్రవదనయై యూరకుండెను.

స్వామి యించుక చిఱునగవుతో "లజ్జయెందులకమ్మా! నీ హృదయమునం దేమికలదో దానిని నాకడ దాపక తెలుపుచుండుము! నీ వెప్పుడు జయంతిశిష్యురాల వైతివో, ఎప్పుడుజయంతి నిన్ను ప్రాణ ములకంటె నధికముగఁ జూచుకొనుచుండెనో, ఎప్పుడు నీగుణముల యెడ నేను పరితుష్టచిత్తుఁడనైతినో, అప్పుడే నీవు నాదయకుఁ బాత్రురాలవైతివి. జయంతి ప్రపంచమున సుఖమనునది మొదటి నుండియు నెప్పుడు నెఱుఁగదు. నీవునునట్లే యైతివి. నీవు సంసా రమునఁ బ్రవేశించియును నామమాత్రమునకైనను సుఖము ననుభ వింపకపోయితివి. జయంతి ప్రపంచమున నెప్పుడును సుఖదుఃఖముల ననుభవించి యెఱుఁగదు. కాని నీవుమాత్ర మీలోకమున నపరిమిత దుఃఖమును మాత్రమే యనుభవించితివి. కాని సుఖమెఱుఁగవు. చాలకాలము నిరాశతోఁగూడిన యాతనల ననుభవించితివి. కాని యెన్నికష్టములువచ్చినను, ఎంతదుఃఖము సంప్రాప్తమైనను, ఆశ లన్నియు భగ్నములై పోయినను, నీవుపాపపథమునఁ బోకుండ సన్మా ర్గమున సంచారము సేయుచున్నావు. తప్తకాంచనమువలె నందు మూలమున నీచరిత్రమునకు వన్నె హెచ్చినది. నారీజన్మమును సార్థ కముచేసికొంటివి. అందుచేతనే శోకపరితాపవిరహితమగు నీశాంతి నికేతనమునకు రాఁగలిగితివి. నీవంటిధర్మపరాయణలగు నారీమణుల

కాశ్రీయమీరాయకపోయినచో మేము నిశ్చయముగా ధర్మవిరుద్ధ మాచరించినవారమగుదుము. అందుచేతనే బ్రహ్మానందుని యింటి కడనుండి యిక్కడకుఁ దీసికొనిరమ్మని నేను జయంతి నంపితిని. నీయిష్టమువచ్చినన్ని దినము లిచ్చట నీవుండవచ్చును. నీవిటనున్నచో నీహృదయమునకు వికాసము కల్గును. ఆత్మజ్ఞాన ముదయించును. నీకేదైన నావలనఁ దెలిసికొనవలసిన విషయమున్నచో నించుకంత యును సందేహింపక నన్నడుగుచుండుము" అనియెను.

శ్రీ యించుక లజ్జాభావమును సూచించు మొగముతో "ప్రభూ! నాహృదయమునం దప్పుడప్పు డేవియో యితరచింతలు పొడముచుండును. ఎంతప్రయత్నించినను నాహృదయమున కట్టి చాంచల్యము వీడినదికాదు. వెనుకటివిషయములను మఱచిపోవలయు నని ప్రయత్నించితిని కాని, సాధ్యమగుటలేదు. ఆవిషయమున నొక్కప్రశ్న యడుగవలయునని యున్నది. మీ ప్రత్యుత్తరమును వినుటచేతనే నాహృదయమునకు శాంతికలుగును. ఇంతకంటె నా కేకోరికయును లేదు" అనియెను.

స్వామి—మంచిది, నీకేది వినవలయునని యున్నదో నా కెఱింగింపుము.

శ్రీ—మహారాజెచ్చటనున్నాఁడు? ఎట్టిస్థితియందున్నాఁడు?

స్వామి ముద్రితనయనములతో క్షణకాలమూరకుండి పిదప నిట్లనియెను. "అమ్మా! ఆకథను దెలిసికొనినందువలన నీకేమి లాభము? జన్మప్రభృతి నీవా యాశకు జలాంజలియొసంగితివి. ఐహికమాయనుండి తరించితివి. నీస్వామి కెవఁడు స్వామియో యట్టి పరాత్పరుని ప్రేమకుఁ బాత్రురాలవైతివి. నీహృదయమునందలి ప్రేమానురాగములను సంపూర్ణముగ నీశ్వరునకర్పించి వైచితివి. అట్టి నీకీయుదంతమును తెలిసికొనుటవలనఁ గలుగులాభమేమి? నీకు

శుభముకలుగుట కొఱకై నీవు యోచించుకొనవలయునుగాని యితరులనుగూర్చి నీకేల? పద్మపత్రస్థితజలబిందువువంటి యీచంచల జీవనమునం దేదికర్తవ్యమో నీవు బాగుగా నెఱిఁగియుంటివి. దేనివలన హృదయమున నుద్వేగము కలుగునో దేనివలన హృదయచాంచల్యమభివృద్ధినొందునో, అట్టిపూర్వకథాస్మృతిని సంపూర్ణముగా నశింపఁజేయుము. నీహృదయమును గర్తవ్యకార్యములయెడఁ బ్రవేశపెట్టుము. అట్లుచేసినచో నీయదృష్టతరువున శుభఫల ముదయింపఁగలదు. నీ హృదయశాంతికొఱ కిప్పుడు కొన్ని విషయములను మాత్రమే చెప్పుచున్నాఁడను. మహారాజు కుశలముగా నున్నాఁడు. తనయభివృద్ధికై విశేషప్రియత్నము సేయుచున్నాఁడు. సర్వభారతవర్షమునందును నెవఁడు ధనమునందును, గౌరవమునందును, బలవీర్యములయందును నద్వితీయుఁడై యున్నాఁడో, ఆమహాపురుషుని యాశ్రయమునం దున్నాఁడు. ఆతఁడు సీతారామరాయలను గౌరవభావముతోఁ జూచుచున్నాఁడు. ఆతని సాహాయ్యముచే సీతారామరాయలు తన రాజ్యమును పునరుద్ధారణము చేసికొనఁగలడని తోఁచుచున్నది. ఆతని కొఱకు నీవు చింతింపవలసిన యావశ్యకమేమియును లేదు. ఆతఁడు నుఱలఁ బ్రాపంచికకార్యములయందుఁ బ్రవేశించినాఁడు. కీర్తిప్రతిష్ఠలను సంపాదించుటకై ప్రాణముల నొడ్డుచున్నాఁడు. అట్టియుద్యమశాలురగు పురుషసింహుల యభీష్టము నిశ్చయముగా నెఱవేఱఁగలదు. ప్రపంచాకాశమున మరల నాతనికీర్తిపతాక మెగురుచుండఁగలదు. ఇప్పుడింతవఱకుమాత్రమే విని యూరకుండుము. మఱియొక మంచి సమయమునఁ దక్కిన కథయంతయును నీకెఱింగించెదను. నీకు సీతారామరాయలను జూడవలయునని కోర్కెయున్నదా?

శ్రీ—నాకట్టికోర్కె లేదు. ఈజన్మమున నీపాపిష్ఠముఖము నాతని కిఁకజూపబోను. నాముఖము నాతనికిఁ జూపినచో నాతనిసుఖ

మార్గము కంటకవికీర్ణమైపోవును. ఆనందరూపమైన ప్రశాంతసాగరము దుఃఖప్రభంజనముచే నుద్వేలితమై పోఁగలదు. అందుచే నాతడుండు స్థానమునకు సమీపప్రదేశమునందైన నుండఁబోను. ఱాతిపై మలఁచిన మూర్తివలె నాచిత్తఫలకమునం దాతని దివ్యమూర్తి విరచింపఁబడియున్నది. నాకిష్టమున్నచో మానసనేత్రముతో నాదివ్యమూర్తిని సందర్శించెదను. ప్రత్యహమును నాయిష్టదేవునకు వందనముచేసి యాతనిపాదపద్మముల కర్ఘ్యప్రదానమును చేయుచుందును. ప్రత్యక్షముగా నీబాహ్యనేత్రములతో నాతనిఁ జూచుటకు నాకిఁకఁ బ్రాప్తములేదు. ఆతనికుశలవార్తలను వినుచున్నచో నదియే పదివేలు. అందుచే నాహృదయమునకు సంతోషము కలుగుచుండును. ఆతని యైహిక సుఖాభివృద్ధియం దించుకంతయును నాకిష్టానిష్టములులేవు. కేవల శ్రవణసుఖమును, చిత్తప్రసన్నతయునే, నేనభిలషించుచున్నాను.

స్వామి—నీవాక్యములనువిని సంతుష్టచిత్తుఁడనైతిని. సీతారామరాయలతో నీకుఁగల సంబంధము జలబిందువువలె క్షణస్థాయియైనదికాదు. అందుచే నీవాతని నొక్కమాఱుగ మఱచిపోఁజాలకున్నావు. నీవు పతిసుఖమునుగోరి నీసుఖమును బరిత్యజించుటయే కాక శుష్కకాష్ఠమువలె నీజన్మమును నీరసముగాఁ జేసికొన్నావు. అదియొక మహావిషయము. నీవంటిపరార్థపరాయణ స్వభావముగల మహిళారత్నము నింకొక తెనుగానము. కళ్ళెమేమాత్రము శిథిలమైనను గుఱ్ఱము రౌతును దుష్పథమున కీడ్చుకొనిపోవునట్లే యింద్రియమునకేమాత్రము స్వేచ్ఛగలిగినను ముహూర్తకాలములో మనసునకుఁ బదచ్యుతి గలిగించును. మండుచున్న పుల్లలనువిడఁదీసి వేఱుగ నుంచినచో మంటయాఱిపోయి పొగమాత్రముండును. అవి కలిసినచో నగ్ని ప్రజ్వలించునట్లే ప్రలోభవస్తువులు సమీపమందున్నచో మనసు

నం దగ్ని ప్రజ్వలించుచుండును. మఱియు నట్టి ప్రలోభవస్తు సమీపమందున్న ధైర్యసేతువును, భయంకరాకాంక్షా ప్రవాహ మెచ్చటనో యొకచోట ముహూర్తకాలములో తెగగొట్టివైచును. అందుచే సీతారామరాయల విషయమున నింక నెట్టిసంగతులును నీకు జెప్పఁజాలను.

శ్రీ స్వామినింక నేమియుఁ బ్రశ్నింప సాహసింపలేకపోయెను. ఆమె స్వామికిఁ బ్రణమిల్లి తనకుటీరమున కరిగెను. స్వామి మరల ధ్యాననిష్ఠుడయ్యెను.

---

## ఆఱవ ప్రకరణము.

## దౌత్యము

గుణవంతుల సద్గుణములు బయటపడకుండఁ బ్రచ్ఛన్నముగాఁ జాలకాలము దాఁగియుండవు. అచిరకాలముననే యవి ప్రకాశవంతము లగుచుండును. సుధాకరుని యమృతమయప్రకాశము మేఘములచేఁ జాలసేపు కప్పఁబడియుండదు. అగ్ని వసనమధ్యమున బ్రచ్ఛన్నముగాఁ జాలకాలముంచుట యసంభవము. దూరదర్శియుఁ బ్రజ్ఞావంతుఁడునగు బాజీరావు, రఘునాధరాయల సద్గుణములను గాంచి విమోహితుఁడగు నన్నచో నందాశ్చర్యమేమున్నది ?

బాజీరావు రఘునాధునితో మాటలాడినతోడనే యాతఁడు సర్వవిద్యలయందును బండితుఁడనియు, గొప్పరాజనీతిజ్ఞుఁడనియు, సమరతంత్ర ప్రవీణుఁడనియు గ్రహించెను. సైన్యాధికారి కాకపోయినచో నిట్టివివేక మొన్నఁడును గలిగియుండదని నిశ్చయించుకొని యెను. ఈసమయమున నట్టి ప్రజ్ఞావంతుఁడొకఁడు బాజీరావున కత్యవసరముగాఁ గావలసియున్నాఁడు. వివేకశాలియు, సమర్థుఁడును

వీరధర్ముఁడునగు రఘునాథునియెడ బాజీరావునకు విశేషానురాగ ముదయించెను. రఘునాథుని ప్రశాంతలలాట ప్రదేశమునఁ గుటిలతా చిహ్నము లేశమైనను లేదని బాజీరావు గ్రహించెను. గంగాజలము వలె రఘునాథరాయని హృదయము పవిత్రమైనదనియు, నందు స్వార్థపరత్వముగాని, విశ్వాసఘాతుకత్వముగాని, నామమాత్రమున కైనను లేవనియు బాజీరావనుకొనియెను.

ఇట్టి సత్పురుషుఁ డెన్నఁడును శత్రువులగూఢచారుఁడు గానేరఁ డని బాజీరావు నిశ్చయము చేసికొనియెను. ఇట్టిబుద్ధిమంతుఁ డట్టి నీచకార్యమున కెన్నఁడు నొడఁబడఁడు. అపరిచితుఁడైనను, విదేశీయుఁడైన రఘునాథరాయలయందుఁ బూర్ణవిశ్వాస ముంచుటకు బాజీరావున కించుకంతయును సందియముకలుగలేదు. అందుచే నల్పకాలములోనే రఘునాథుఁడు బాజీరావుదయకుఁ బాత్రుఁడయ్యెను. బాజీరావతనిసద్గుణములనుగాంచి యాతనికి రాజదూతపదవి నొసంగి గౌరవించెను. అది గౌరవమైనయుద్యోగము. ప్రవీణులగు పెద్దపెద్ద సేనానులందఱు నీపదవి నభిలషించుదురు. విదేశీయుఁడగు నొకక్రొత్తవాని కీపదవి యొసంగుటచే బాజీరావుకడ నున్నవారిలోఁ గొందఱకుఁ జాలగష్టముగనుండెను. కాని యెవ్వరును నోరెత్తి మాటలాడలేకపోయిరి. నిరపరాధియగు రఘునాథుని, తమయభివృద్ధి కంతరాయము గల్పించు శత్రునిగాఁ జూడసాగిరి.

ప్రపంచమునందలి ప్రాణులలోనెల్ల సర్పము చాలగ్రూరమైన దని చెప్పుచుందురు. కాని మానవులలో సర్పముకంటెను క్రూరు లగువారు కొందఱున్నారు. సర్పమున కేమియు బాధ గల్గింపక పోయినచో నదిమనలను కఱువదు. మానవుఁడుమాత్ర మట్లుకాదు. నిరపరాధులగువారినిగూడ నిర్నిమిత్తముగాఁ కఱచుచుండును. మంత్రౌ షధములచే సర్పవిషము తగ్గిపోఁగలదు. కాని మానవునిచేఁ గఱువఁ

బడినప్పు డావిషమునుదింపి ప్రాణములను రక్షించుట కేమంత్రౌష ధములును లేవు. కుత్సిత మానవవిషముచే, సుఖమయమైన ప్రపంచ మెంతవఱకు స్మశానముగాఁ బరిణమించునో, జ్ఞానదీప మెంతవఱ కారిపోయియుండునో, పతిప్రాణయగు నబల యెంతవఱకు నిరాశాసముద్రమున నీఁదులాడుచుండునో, చెప్పుటకలవికాదు. సర్పమును దూరమునుండిచూచి తెలిసికొనవచ్చును. కాని కపట మానవసర్పమును తెలిసికొనుట కేయుపాయమునులేదు. మానవుని ముఖము మధుసంయుతమును, హృదయము కాలకూటపరిపూరితమునై యుండును. మేషచర్మావృతమైన వ్యాఘ్రమువలెను, కుసుమ రాశిలో నణఁగియున్న కాలసర్పమువలెను, మానవుఁడు సంపూర్ణ ముగా నాత్మ గోపనముచేసికొని నిరపరాధులగు సాధుమానవు లను నిర్నిమిత్తముగఁ గఱచుచుండును. సర్పవిషమును తగ్గించి ప్రాణ మును రక్షింపవచ్చును. కాని మానవసర్పదష్టులగువారి ప్రాణము లను రక్షించుట దుర్ఘటము. కృపాపరాయణులగు మాపాఠకమహా శయు లీయాఖ్యాయికయం దిట్టిమనుష్యరూపసర్పము నొకచోఁ గాంచగల్గుదురు. ఆవిష మెంత తీవ్రమైనదో వారు గ్రహింపఁ గల్గుదురు.

అత్యంత రాజనీతిజ్ఞుఁడును, పరాక్రమశాలియు నగు అసఫ్‌జా కును, ఇంద్రియలోలుఁడును, విలాసతత్పరుఁడు నగు ఫాదుషహాకును క్రమక్రమముగ మనస్పర్థ లధికమయ్యెను. అందుచే నసఫ్‌జామంత్రి పదవిని పరిత్యజించి ససైన్యముగా దక్షిణదేశమునకుఁ బయన మయ్యెను. రాజనీతిజ్ఞుఁడగు బాజీరావుకడ ననేకవిధముల దేశదేశ ములఁదిరుగు గూఢచారు లెందఱో యున్నారు. వారిమూలమున ఢిల్లీయందలి యీవార్త యథాకాలమున బాజీరావునకుఁ దెలియ వచ్చెను. ఆకాలమునందు మహారాష్ట్రుల లాభవృద్ధియును, ఢిల్లీ

చక్రవర్తి బలహీనతయుఁ బరికించినచో, ననాయాసముగ ఢిల్లీ మహారాష్ట్రుల వశమైపోవలసినది. కాని సర్వజనపూజితుఁడగు విధాతృని ఘటనాప్రవాహము భిన్నమార్గమునఁ బ్రవహింప నారంభించెను. బాజీరావు మనోభీష్టము సఫలముకాలేదు.

ఆకాలమున నామహారాష్ట్రులకు బాహుబలదర్పితులగు శత్రువులు లేకపోలేదు. ముఖ్యముగా దురాణీవంశీయులగు నాఫ్ఘను రాజపుత్రులు వారియభివృద్ధి కంతరాయముగా నుండిరి. ఈదురాణీయుల బాహుబలముచే మహారాష్ట్రుల గర్వ మడఁగిపోవఁ జొచ్చెను. చరిత్రజ్ఞానముగల పాఠకమహాశయు లీ దురాణీకీర్తికలాపమును సంపూర్ణముగ నెఱిఁగియే యుందురు. ఈమాయాఖ్యాయికకును నా చారిత్ర తత్వమునకును సంబంధ మంతగా లేకపోవుటచే నాచరిత్ర విషయములను గూర్చి మేమిట నధికముగా వ్రాయుటలేదు.

సర్వభారతవర్షమునకును సార్వభౌముఁడను గావలయునని బాజీరావున కభిలాషకలదు. కాని దురాణీయులను జయింపనిదే తనయాశ నెరవేఱదని తలంచెను అందుచేఁ బ్రస్తుతమున ఢిల్లీని స్వాధీనపఱచుకొనవలయునను నుద్దేశమును ద్యజించి బాజీరావు దురాణీయులను జయించుటకొఱకు సైన్యములను సమకూర్చుకొనుటకై కృతసంకల్పుఁడయ్యెను. మహిశూరు (మైసూరు) ను పాలించుచున్న హిందూప్రభువును తనకు సాహాయ్యముగ రమ్మని వర్తమాన మంపవలయునని నిశ్చయించుకొని, యాపని రఘునాథరాయలపైఁ బెట్టెను. రఘునాథరాయలు దూరదృష్టికలవాఁడనియు, నుపాయశాలియనియుఁ దలంచి బాజీరావీ పనికాతని నియమించెను.

రఘునాథరాయల ప్రయాణమునకుఁ గావలసిన సన్నాహమంతయు సిద్ధమయ్యెను. ముప్పదినలుగు రశ్వారోహకులను, నొక హావల్దారును, కూడఁదీసికొనివెళ్లుటకు బాజీరా వాతని కనుజ్ఞ

యొసంగెను. ఆ హవల్దారుని వయ సిరువదియై దేండ్లకు మించ లేదు. మలయమారుతస్పర్శముచే వృక్షగణ మెట్లు శోభాయమానము వహించునో, అట్లే యౌవన సమాగమముచే నాయువకుని సర్వాంగములును తేజోవిశిష్టములై యుండెను. చంద్రబింబమువంటి యాతని ముఖమండలమునఁ గళంకచిహ్నమువలెఁ జిన్నచిన్న ముంగురులగుంపు శోభిల్లుచుండెను. పూర్ణిమాచంద్రికవలె నాతని ముఖమండలము సరళతకు నికేతనమైయుండెను. మఱియు శిశిరవిధౌత కుసుమము వలెను, శిశుహాసమువలెను, నాతనిముఖము పవిత్రభావసంయుతమై కన్పట్టుచుండెను. మఱియుఁ బ్రపంచమందలి పాపపంకిలమేమియు నాతని హృదయమున కంటుకొనియుండనట్లు ముఖమువలన స్పష్ట పడుచుండెను.

ఈక్రొత్త హవల్దారుని పేరు ద్వారకరావు; ఈతఁడు బాజీరావుకడ మంత్రిగానున్న మలహరరావు తనయుఁడు. వృద్ధవయస్కుఁడగు మలహరరావునెడల బాజీరావు మిగుల శ్రద్ధాభక్తులతో మెలఁగుచుండును. మంత్రిచెప్పినమాట కెన్నఁడును బాజీరావెదురాడి యెఱుంగఁడు.

మహారాష్ట్ర శిబిరమున మలహరరావుతో సమానవయసు గలవాఁ డింకొకఁడులేఁడు. ఆతని కెనుబదియేండ్లు గడచియుండవచ్చును. కాని శరీరమున బిందుమాత్రమైనను మాంసము కొఱఁత పడలేదు. ఆతఁ డారోగ్యదేవత యవతారమని తలంపవచ్చును. నడివయసునందున్నవారి నేత్రములవలెనే యాతని నేత్రములు ప్రదీప్తములై తేజఃపూర్ణములై యుండెను. బాహుయుగళము సుదృఢమై యుండెను. శ్వేతచామరమువలె నాతనిగడ్డము నాభిదేశమువఱకును బెరిగి వ్రేలాడుచుండెను. ఆకస్మికముగఁ జూచినచో నీతఁ డెవరో

మహాపురుషుఁడని తోఁచి, చూచినవారి హృదయములయం దాతని యెడ భక్తివిశ్వాసము లుదయించును.

మలహరరావు వయసునఁ బెద్దవాఁడను మాటనిశ్చయమే కాని యాతని హృదయతేజము మాత్రి మించుకంతయును తరిగి పోలేదు. ఎంతటి దుర్ఘటకార్యములయెడనైనను నాతఁడు వెనుకంజ వేయఁడు. నాల్గుదినములైనను నెడతెగకుండ నశ్వపృష్ఠము నధిరోహించియుండఁగలఁడు. బాజీరావు మంగళమే యాతని కేకమాత్రి మగు జపమాల. ఆతఁడనేక దినములనుండి బాజీరావు నాశ్రయమందున్నాఁడు. మఱియు నాతని యేకపుత్త్రిఁడగు ద్వారకరావు కూడ బాజీరావుకడనే యింతవఱకును సైనికుఁడుగ నున్నాఁడు. గుణగ్రిహణపారీణుఁడగు బాజీరావుకూడ నీతండ్రికొడుకుల నతిసన్మానముతోఁజూచుచు నాదరించుచుండెను. మహారాష్ట్రి సేనానులందఱును మలహరరావునందు శ్రిద్ధాభక్తులుగలిగి, యాతనియాజ్ఞ కడుగుదాటక మెలఁగుచుండిరి.

కొలఁదిదినముల పరిచయమేయైనను మలహరరావునకు రఘునాథరాయలయెడ గౌరవభావ మధికమయ్యెను. రఘునాథరాయల కీయున్నత పదవిలభించినందుల కాతఁడుమిగులసంతుష్టచిత్తుఁడయ్యెను. ఈయుద్యోగమునకుఁ దగినపురుషుఁడు లభించెనని యాతఁ డనుకొనియెను. ఇతరసేనానులవలె నాతనిహృదయమునం దించుకంతయును నీర్ష్యజనింపలేదు. ఒకమహారాష్ట్రిసేనాని తన హృదయమునందలి యసూయను దాఁపలేక మలహరరావుకడకు వచ్చి "కులశీలములు తెలియని యొక విదేశీయున కిట్టి యున్నతాధికార మొసంగుట మహారాజునకుఁ దగదు. ఏయుద్దేశమును మనసునం దుంచుకొని యాతఁడు మనయొద్దకు వచ్చినాఁడో తెలియదు. ఆతనియుద్దేశములు ప్రికృతమునందువలెనే యెల్లప్పుడునుండవు. క్రూరసర్పము నిద్రించు

చున్నవానిని కఱచినట్లు సమయము దొరకినప్పు డాతఁడు తనకార్యములను సాధించుకొనక మానఁడు.” అనిచెప్పెను.

ఉదారహృదయుఁడగు మలహరరావా వాక్యములను విని యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. “నేను నీకంటెఁ జాలఁబెద్దవాఁడను. లోకచరిత్రజ్ఞానము నాకధికము గాఁగలదు. మనుష్యునిముఖమును జూచి యాతని మనోభావములను చాలవఱకు గ్రహింపఁగలను. వంచకుఁడును నీచభావసంయుతుఁడు నగు మానవుఁడు నాతీక్ష్ణదృష్టి కెదుట నుండఁజాలఁడు. క్రొత్తగావచ్చిన యాపురుషుఁడు నీచోద్దేశములతో నిటకు రాలేదని దృఢముగాఁజెప్పఁగలను. ఆతఁడు స్వధర్మనిరతుఁడు ఈశ్వరునియెడ భయముగలవాఁడు. ఇట్టి సాధుపురుషుఁ డెన్నఁడును విశ్వాసఘాతుకుఁడు గానేరఁడు. నీహృదయమునఁ గలిగిన శంకలన్నియు నాధార రహితములు. ఆతఁడు విదేశీయుఁడనుమాట సత్యము. కాని అంతమాత్రముచేతనే యాతని ననుమానించుట తగదు. ప్రపంచమున నాత్మీయులెందఱో శత్రువులుగాఁ బరిణమించినవారు కలరు. ఎన్నఁడు నెఱుఁగనివారు తమప్రాణములనైనను లెక్కసేయక యాపదలయం దితరులకు సాహాయ్యము సేయువారు కలరు. చెఱకు కఱ్ఱను నూఱుముక్కలుగా ఖండించినను సందలిమాధుర్యము నశించిపోవనట్లే, అనుదినమును ఱాతిపైఁబెట్టి యరగఁదీసినను చందనమునఁ బరిమళము కల్గినట్లే, ధర్మభీరువులగు సత్పురుషుల కెట్టి యవస్థలు సంప్రాప్తములైనను స్వభావసిద్ధములగువారి సద్గుణము లించుకంతయును తగ్గిపోనేరవు. కావున నిర్భయముగా మీరు మీమీకర్తవ్యకార్యములను నెఱవేర్చుకొనుచుండ వచ్చును. మహాపురుషుఁడగు రఘునాథరాయల మూలమున మీకించుకంతయినను నాపదకలుగనేరదు. ఆతఁడు న్యాయమార్గమున పీష్వాసేవ సేయుచుండును. కాని యెన్నఁడును నేవిధమగు నక్రమకార్యములును జేయఁబోఁడు.”

మలహరరావు వాక్యములను విని కోపముతో నాసేనాని తన హృదయమున నేమేమో సణుఁగుకొనియెను. కాని పైకేమియు ననలేకపోయెను. అప్పటికేమియుఁ జేయలేక యూరకుండెను. కాని యాతని హృదయమునం దొకనిభృతస్థలమున నీర్ష్యానల మొక్కింత రగులుకొని పొగ రా నారంభించెను. మంచి సమయమనియెడి పవన సాహాయ్యమున్నచో నది చక్కగ ప్రజ్వలించుననుట కించుకంతయును సందియములేదు.

రఘునాథరాయల కొక్కమారుగ నింతటియున్నతోద్యోగము లభించినందులకు దుఃఖించువారిలో భాస్కరపండితుఁడును, కరమ్ చాంద్ భోన్సలాయును ముఖ్యులు. వారిరువురును చెరియొకయయిదు వేల యశ్వారోహకులకు నధిపతులై యుండిరి. సైన్యోద్యోగపదవుల నామములు మహమ్మదీయభాషలో నుండెను. వివేకవంతుఁడగు శివాజీ యీనామములకు మహమ్మదీయశబ్దములకుబదులుగ సంస్కృత శబ్దముల నేర్పఱచెను. కాని యాసంస్కృత నామము లాతనితోడనే యంతరించిపోయినవి. ఇప్పుడీయిరువురును మన్సబ్ దారులను బిరుదులతో పిలువఁబడుచుండిరి. అనేకసమయములలో బాజీరావు ప్రభుభక్తి పరాయణులగు నీమన్సబుదారుల సాహాయ్యముచే ననేకవిజయములను సంపాదించెను. బాజీరావు నిష్కళంకచిత్తముతో వారియెడల నమ్మకముంచి యనేక దుర్ఘటకార్యములయందు వారినే నియమించుచుండెను. కాని కుసుమగుచ్ఛమున నిశ్శబ్దముగాఁ గాలభుజంగము ప్రవేశించినది. నిర్మల గగనప్రదేశమున కాలమేఘ ముదయమయినది. హృదయస్థానము పిశాచగతమైనది. దీనిఫలితమెట్లు పరిణమించునో, ధైర్యశాలురగు పాఠకమహాశయులు మున్ముందు తెలిసికొనఁగలరు.

సకల సుగుణాకరుఁడును, మధురభాషియునగు రఘునాథ రాయలపై మలహరరావున కమితవిశ్వాస ముదయించెను. అందుచే

నాతనితోఁగూడ తనతనయునంపుట కించుకంతయును సంశయింపఁ డయ్యెను.

తండ్రివలెనే యువకుఁడగు నీహావల్దారు రఘునాథుని యెడల స్నేహభావముతో నుండెను.

ఏకస్వరముతో శ్రుతివేయఁబడిన రెండువీణలు వేరువేరు తావులనున్నను ఏకస్వరమును బలుకునట్లే, ఒకేవిధమగు ప్రవృత్తి గల హృదయములు వేఱుతావులనున్నను ఒకేవిధమగు నుద్దేశములఁ గలిగి పరస్పర ప్రణయబద్ధము లగుచుండును. వైశాఖమాసమున మాధ్యాహ్నమందు శీతలతరుచ్ఛాయ యెంతమనోహరమో, యెంత సుఖప్రదమో, పాపమయమగు నీమహాప్రపంచమునం దిట్టి యకపట ప్రణయ మంత మనోహరమును నంత సుఖప్రదమునునై యుండును. ఈప్రణయము జీవనరాత్రికిఁ గౌముదివంటిది. ఇది ప్రపంచమునఁ గొలఁదిమానవులకు మాత్రమే లభించుచుండును. మానవులలో సామాన్యముగా నేదియోయొకవిధమగు స్వార్థముండినఁగాని ప్రేమ యుదయింపదు. కాని అట్టి స్వార్థమిశ్రితప్రణయ మతిహేయమైనది. పవిత్రహృదయములకును నాప్రేమకును సంబంధములేదు. అది యించుక క్షీరములతోఁగలసిన విషమునకు సమమైనది. దానియుద్దేశము స్వకార్యోద్ధరణము. దానికిని పవిత్రప్రేమకును సంబంధము లేదు. ప్రపంచమునందు సామాన్యముగా నిట్టి స్వార్థమిశ్రితప్రణయమే మనకు సదా కన్పట్టుచుండును. అది జలబిందువువంటిది. పరిపక్వ ఫలమువలె క్షణస్థాయియైనది. స్వార్థశూన్యమగు ప్రణయముచే బద్ధులైనవారి శరీరములు నాశనమైపోయినను నాప్రణయము విచ్ఛిన్నముకానేరదు. అనిత్యమైన యీప్రపంచమునం దిట్టి ప్రణయము దుర్లభము.

ద్వారకరావునకును రఘునాథరాయలకును గల ప్రణయము సామాన్యముగా బ్రపంచమున జూపట్టు ప్రణయమువంటిది కాదు. ఆప్రణయాభ్యంతరమున స్వార్థమించుకయునులేదు. అందుచే నా ప్రణయము మరణశీలమగు నీజగత్తునందు దుర్లభమైనది. అది దివ్యమైనది. ద్వారకరావు నిర్మలస్వభావమును సదుద్దేశములును గల యువకుడు. మాలిన్యపరిశూన్యమైన యాతనిహృదయమునఁ బ్రపంచ సంబంధ కలుష మించుకంతయును బ్రవేశింపలేదు అనాఘ్రాత కుసుమమువలె నాతని హృదయ మతి పవిత్రమైయుండెను.

రఘునాథరాయలు విస్మయవిస్ఫారిత నేత్రములతో నొక్కమారు ద్వారకరావుపై ప్రేమమయవీక్షణములను బరపెను. ఆతని హృదయాకాశమున నేదియోవిచార మేఘ ముత్పన్నమైనట్లు పైకిఁ గన్పట్టుచుండెను. శిశిరసిక్తములగు కమలదళములవలె నాతనివిశాల నేత్రములు బాష్పావృతములయ్యెను. కాని యాతఁడేమియుఁ బలుకలేదు. మనసులో నిట్లనుకొనుచుండెను. "ఆశ్చర్యము! ఈప్రపంచమునం దెచ్చటఁజూచినను నిద్దరుమానవు లొక్కతీరుగనుండువారు కన్పట్టరుగదా! అట్లు కన్పట్టినచో విధాతృని శిల్పచాతుర్యమునకు గౌరవమేమియున్నది? కాని యీ యువకుని ముఖమును బరికించినచో నావెనుకటికథ నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. వీరిరువురి ముఖములు నొకేతీరున నున్నవి. ఇంచుకంతయును భేదముగాన్పించుటలేదు. కారణమేమి చెపుమా! ఆహా! ఆదినమున నేను మతిభ్రష్టుఁడ నైపోయితినిగదా? ఆనాఁడు పశువువలె సంచరించితిని. అయినను నామె హృదయమున నాపై నించుకంతయును గ్రోధము వహింపలేదు. ఈకష్టకాలమున నామె సాహాయ్యమున్నచో నేను రక్షింపబడియుందును. ఆనాఁటి దారుణకార్యము నాకు జ్ఞప్తికివచ్చినప్పుడు నాహృదయముదగ్ధమైపోవుచుండును. ఈప్రపంచమునం దా మహాపాతకమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు. చిరకాల మాయగ్ని

నాహృదయమునఁ బ్రజ్వలించుచునే యుండును. ఈశరీరము నశించి పోయినను నాయగ్ని యారిపోవదు."

రఘునాథరాయ లీకథయంతయును తన హృదయమునందే దాఁచుకొనియుండెను. కానియీయాపన్మాత్రమైనను నెవ్వరికి నెప్పుడును తెలిపియుండలేదు. రఘునాథరాయలు ద్వారకరావును స్నేహచక్షువులతోఁ జూడనారంభించెను. ద్వారకరావును రఘునాథు నెడల గురుభావమును జూపుచు భక్తిశ్రద్ధలతో మెలఁగుచుండెను.

మహామతియగు బాజీరావు, మహీశూరురాజుకడ రఘునాథరాయ లెట్లునడచుకొనవలయునో చెప్పి యాకార్యము ముగిసినపిదపఁ దిరిగి రాయఘడమునకు రావలయునని యాజ్ఞాపించెను.

రఘునాథరాయలు పరివారముతోఁగూడ యథాకాలమున మైసూరునందు సుఖముగాఁ బ్రవేశించెను. బాజీరావు పంపినకానుకలతోఁగూడ నాతఁడు రాజదర్శనము చేసెను.

ఆకాలమున బాజీరావు నిరంకుశప్రతాపము భారతవర్షము నందంతటను బ్రకాశించుచుండెను. సమస్తరాజన్యులు నాతనిమైత్రిని గోరుచుండిరి. మైసూరురా జత్యంత సన్మానముతో నాదూత నాదరించి, శిష్టాచార సాంప్రదాయానుసారముగా నాతని గౌరవించెను.

రెండుమూఁడు దినములుగడచినపిదప రాజు నిండుసభలోఁ గొలువుండి రఘునాథరాయలకు వర్తమానమంపి రాకకుఁగారణం బడిగెను. రఘునాథరాయలు వినయముతో "రాజా! రాజనీతి విశారదులగు పండితు లాలోచనా విశిష్టకార్యములు రాజు సర్వదా రహస్యముగా జరుపుచుండవలయునని నుడివియున్నారు. రాజకార్యాలోచనము నల్గురనుదాటి యయిదుగురితోఁ జేరినచో నది యూషరక్షేత్రము నందలి బీజావాపనమువంటి దగునని పెద్దలుచెప్పుదురు. అందుచే సంధివిగ్రహకార్యములు విజ్ఞుఁడగురాజు రహస్యముగాఁ

జేయుచుండవలయును. నేనేలిక యనుగ్రహమును గోరి వచ్చినవాఁడ నైనను నావకార్య మీనిండుసభలో నుడువఁదగినదికాదని నాయభిప్రాయము" అనియెను.

రాజు—యుక్తియుక్తములగు నీవాక్యములు నాకు మిగుల నామోదము నొసంగినవి. నీవొక గొప్ప రాజనీతిజ్ఞుఁడవని నాకు స్పష్టముగాఁ దోఁచుచున్నది. కాని నీవేషభాషలను, ఆకారమును బరికించినచో మహారాష్ట్రదేశీయునివలెఁ గాన్పించుటలేదు. అందుచే ముందుగా నీతోఁ బరిచయము గల్గించుకొనవలెనని నాయుద్దేశము.

రఘు—(వినయస్వరముతో) మహారాజుగారి యనుమానము భ్రాంతివిరహితమైనది. నేను మహారాష్ట్రుఁడనుగాను. వంగదేశము నా నివాసభూమి. వంగదేశపు కాయస్థజాతిలోనివాఁడను. బాల్యము నుండియు వీరపురుషోచిత కృత్యములయం దలవాటుపడినవాఁడను. మహాత్ముఁడగు బాజీరావు నాశ్రయమునం దున్నవాఁడను. కృపామయుఁడగు నాతఁడు నన్ను గౌరవముతో నాదరించుచున్నవాఁడు.

రాజు—బాజీరావుకడకువచ్చి యెన్నిదినములైనది?

రఘు—ఇంచుమించుగ నెనిమిదిమాసములైనది.

రాజు—ఆతనికినీకును పూర్వమునుండియుఁ బరిచయముండెనా?

రఘు—ఇంచుకంతయునులేదు. నాకును నాతని కెప్పుడును బరిచయము లేదు.

రాజు—అంతకుఁబూర్వము నీవేమిచేయుచుంటివి?

రఘు—వీరపురుషోచితవృత్తియం దున్నాఁడనని యిదివరకు విన్నవించుకొనియే యుంటిని. సుతీక్ష్ణమగు నీఖడ్గమే నాజీవితమునకు బ్రధానాధారమై యున్నది. పూర్వబంగాళమునందలి స్వతంత్ర రాజొకఁడు నాకు సేనాధిపతిత్వమునొసంగి గౌరవించినాఁడు.

రాజు—ఆరాజు పేరెవ్వరు ?

రఘు—మహారాజగు సీతారామరాయలు.

రాజు—నీవాతని నేలవిడిచి పెట్టితివి ?

రఘు—నేను బుద్ధిపూర్వకముగా నతనిని విడిచిపెట్టలేదు. విధాతృని నియమప్రభావముచే రాజ్యలక్ష్మి యాతనిని బరిత్యజించినది. అందుచే నేను నాతనిని బరిత్యజింపవలసి వచ్చినది.

రాజు—ఏమి ? రాజ్యలక్ష్మి యేవిధముగాఁబోయినది ?

రఘు—మహమ్మదీయులతో సఖ్యముగా నుండవలెనని మహారాజెంతప్రయత్నము చేసినను కొనసాగినదికాదు. మహారాజు రాజ్యమభివృద్ధి నొందినకోలఁదిని, మహమ్మదీయుల యీర్ష్యానలమును నభివృద్ధి నొందఁజొచ్చెను. సుబేదారు బహదూ రాజ్ఞాప్రకారము ఫౌజుదారు ససైన్యముగావచ్చి మహారాజునగరమును ముట్టడించెను. ప్రాణములనొడ్డి మేమెంతప్రయత్నము చేసియును నగరమును గాపాడలేకపోయితిమి. వేఱుపాయమునుగానక మహారాజు సపరివారముగా నెచ్చటికో పలాయనమైపోయినాఁడు. మేమును చేయునదిలేకనగరమును విడిచి దేశదేశములు తిరుగుచుంటిమి. తుదకేను బాజీరావు నాశ్రయముచేరితిని. ఆతని ఆజ్ఞానుసారముగా దూతనై మీకడకు వచ్చితిని.

రాజు— బాజీరావు మిగులయోగ్యుఁడు. రాజనీతిజ్ఞుఁడు. మీవాక్యములనువిని చాలసంతసించితిని. వంగదేశీయులలో నింతటి యుత్సాహ పరిపూర్ణుని, పరాక్రమశాలిని నేనెన్నఁడును జూచియుండలేదు. నానావిధ పదార్థసంయుతంబగు సముద్రమధ్యమున ననర్ఘ ముక్తాఫలములు ప్రచ్ఛన్నముగ నుండునట్లే పరపదసేవానురక్తులును, పరాన్నభుక్తులును, కర్తవ్యజ్ఞానశూన్యులును కాపురుషులునగు వంగదేశీయులలో నీవుజన్మించి ప్రచ్ఛన్నముగా నున్నాఁడవు. పరిమళ

మిళితమగు నొక్క కుసుమముచే వనమంతయుఁ బరిమళించునట్లే యుత్సాహశీలుఁడును పురుషసింహుఁడునునగు నీవంటి పుణ్యపురుషుని మూలమున జాతియంతయును శోభింపఁగలదు. అదియటుండనిమ్ము. ఇప్పుడు బంగాళాసుబేదా రెవ్వరు ?

రఘు—మానవులలోకెల్ల నయోగ్యుఁడును, ప్రజాపీడన తత్పరుఁడునునగు ముర్షద్‌కులీఖానిప్పుడు సుబేదారు పదవి నధిష్ఠించి యున్నాఁడు. ఆతని యమానుషిక ఘోరకార్యములనుజూచి ప్రజలాతనియెడ మిగుల ద్వేషభావముతో నున్నారు. విషశూన్యసర్పము వలె ఢిల్లీచక్రవర్తి తేజోవిహీనుఁడై యుండుటచే సుబేదారు నిరంకుశుఁడై యున్నాఁడు. విశేషాభివృద్ధి పతనసూచకము. ఇది ప్రపంచ ధర్మము. మంగళమయమగు నీరాజ్యమునఁ బాపకార్యములు చేయు వాఁడెవ్వఁడును చిరకాలమునిలువనేరఁడు. అత్యాచారములచేఁ బీడింపబడిన దుర్బలమానవుల మొఱ్ఱలు పరమేశ్వరుని కర్ణకుహరములయందచిరకాలముననే ప్రవేశింపఁగలవు. తృణసంలగ్నమగు నగ్నివలె నాపాపాత్ముల సౌభాగ్య మొక్కసారి ప్రజ్వరిల్లినను నంతలోనే యారిపోఁగలదు.

రాజు—ఆమాట సత్యము. కాని విధాతయిప్పుడు ముసల్మానుల యెడ సదయుఁడై యున్నాఁడు. వారి యభివృద్ధి యాతని కిష్టముగా నున్నది. అందుచే హిందూస్థానమంతయు వారికిఁ గరగతమైనది.

రఘు—మీవంటి విజ్ఞులగు భూపాలు రట్లు పలుకఁదగదు. సర్వేశ్వరుని కృపాదృష్టి యందఱిమీఁదను సమానముగనే ప్రసరించుచుండును. ఎప్పుడును నాతఁడెవరిమీఁదను నిగ్రహానుగ్రహములను జూపువాఁడుకాఁడు. ప్రతికార్యమును మానవుని యదృష్టమునుబట్టియును కృషినిబట్టియును జరుగుచుండును. జలమువలెనే లక్ష్మియు నీచగామిని యని పండితులు వక్కాణించుచుందురు. లక్ష్మిచిరకాల మెవ్వరి యెడలను సదయమై యుండదు. పోటుపాటులవలెనే సుఖ

దుఃఖములును పర్యాయక్రమమున వచ్చుచుఁబోవుచుండును. మహమ్మదీయులు న్యాయమునువీడి యథేచ్ఛముగా సంచరింప నారంభించినారు. ఇఁక వారిపతనమున కెంతయోకాలముపట్టదు. దుష్టశిక్షణము కొఱకును శిష్టసంరక్షణము కొఱకును బాజీరావువంటియును, మీవంటియును పురుషసింహులను విధాత సృష్టించినాఁడు. మీయను గ్రహవశమున హిందూదేశము దుఃఖమునుండి తరింపఁగలదు. నిస్తేజమైపోయిన హిందూగౌరవము మీవలనఁ బునరుద్ధారణమై ప్రపంచాకాశమునఁ బ్రకాశింపఁగలదు.

రాజు—నీతో మాటలాడుటచే నేనెంతయో పరితుష్టచిత్తుఁడనైనాఁడను. ఱేపటి యుదయమున మనమిరువురము నేకాంతముగ రాజనగరునఁగూర్చుండి యీవిషయమై మాటలాడుదము.

రఘునాథరాయలు రాజుకడ సెలవుగైకొని తన విశ్రామస్థానమునకు వెడలిపోయెను.



## ఏండవ ప్రకరణము.

### పట్టపగలు బందిపోటు.

మహిశూరురాజ్యాధిపతి కిప్పటికి ముప్పదిరెండు సంవత్సరములకంటె నధికవయస్సు లేదు. వయసునఁ జిన్నవాఁడైనను రాజకార్య నిర్వాహణమున నాతఁడు మిగులఁ బ్రవీణుఁడై యుండెను. అత్యంత విస్తీర్ణమగు సామ్రాజ్యమును బరిపాలించుట కాతనికడఁ జాలసమర్థత గలదు. విశేషించి యాతనిసామర్థ్యము నాతఁ డెఱింగి యున్నవాఁడు. అందుచే మహమ్మదీయరాజ్యమును పతనమొందించి స్వరాజ్యము నుద్ధరింపవలయునను నభిలాషతో నందులకుఁ దగినప్రయత్నము లొనర్చుచుండెను. ఆనాఁటి కానాఁడు తనసైన్యము నభివృద్ధి

జేయుచు నాహారపదార్థములను నిలువచేయుచుండెను. మహమ్మదీయులతోఁ దప్పక యుద్ధము పొసఁగఁగలదని యాతని నిశ్చితాభిప్రాయము. ఏమనిన, ఒకసారి రక్తపానముచేసిన వ్యాఘ్రము సదా ప్రాణిహింస చేయుటకే యత్నించుచుండునట్లీనిరంకుశ ప్రభుత్వమున కలవాటుపడిన మహమ్మదీయులు ప్రభుత్వాకాంక్షచే దుర్ధర్షులై యున్నారు. వారొక్కచో నాగియుంటు టసంభవము. స్వదేశ ద్రోహియగు నెవఁడో యొకనరాధముఁడు వారిలోఁగలిసి వారికి సహాయ్యమొనర్ప వారు క్రమక్రమముగా రాజ్యము నాక్రమించు కొనుచున్నారు. అందుచే నీమహారాజ్య మొక్కమాఱుగ స్మశానముగాఁ బరిణమించిపోఁగలదని తోఁచుచున్నది. కావున వారి నాఁపుటకు యుద్ధముతప్పదని యాతఁడు నిశ్చయించుకొని యందులకు వలయు యత్నములు సేయుచుండెను.

అప్పుడు ఢిల్లీచక్రవర్తి నిస్తేజుఁడై యున్నాఁడనియు నచిర కాలములోనే బేబరువంశీయులకీర్తి ప్రతిష్ఠలు సంపూర్ణముగా నశించి పోఁగలవనియు మైసూరుప్రభువు నిశ్చయించుకొనియుండెను. ఢిల్లీ చక్రవర్తి కపకారము చేయుటకు సమర్థుఁడైయున్నను నాతఁడాపని కీయకొనకుండెను. ఆతని క్రోధమంతయును అసఫ్‌జాపైమాత్రమే చూపుచుండెను. మనోహరమగు మైసూరురాజ్యమును ధ్వంసము చేయవలయునని అసఫ్‌జా తలపోసి యదివఱకనేక పర్యాయములు సుశిక్షితులగు సైనికులతోడను అశ్వారోహకుల తోడను వచ్చి యుద్ధమునకుఁ దలపడుచుండెడివాఁడు. కాని మేధావంతుఁడగు మైసూరురాజుయొక్క బుద్ధికౌశలముచే నాతని యాటలు సాగినవి కావు. మైసూరురా జెప్పటికైనఁ బగతీర్చుకొనవలయునని యనేక ప్రయత్నములు సేయుచుండెను. అసఫ్‌జా ఢిల్లీ కమాత్యపదవి వహించుటకై వెడలినప్పటినుండియు, రాజు నిశ్చింతతో నుండెను. కాని యుద్ధప్రయత్నములయెడ మాత్ర మశ్రద్ధవహింపలేదు. ఎప్పటికైనను

యుద్ధముతప్పదని నిశ్చయించుకొని యందులకుఁ గావలసిన ప్రయత్నముల నత్యుత్సాహముతోఁ జేయుచుండెను.

రాజనీతివిశారదుఁడగు బాజీరా వీవిషయమంతయు నెఱిఁగియుండి యుత్సాహశీలుఁడగు మైసూరురాజునకుఁ దన యుద్యమ మెఱింగించెను. అసఫ్‌జాను జయించుటకై ధనరాసులను, ఆహార పదార్థములను రణపటిష్ఠులగు ననేకసైనికులను సమకూర్చియుంచు టెఱింగి బాజీరావు స్వకార్యోద్ధరణోద్దేశముతో మైసూరురాజుకడకు రఘునాథరాయలనంపి నీసాహాయ్య మలవడినచో నఱనిముసములో దురాణీయులను సింధునదిని దాటించెదనని వర్తమాన మంపెను. బాజీరా వీకార్యము నెఱవేరినచోఁ దప్పక దురాణీయునను జయింపఁ గలనను దృఢవిశ్వాసముతో నుండెను.

ఈరాయభారముయొక్క ఫలిత మేమయినదియు నితిహాసముల యందుఁ జక్కఁగా వర్ణింపఁబడియున్నది. మాయిాకథకును నాదాత్మ్యమునకును నంతగా సంబంధములేదు. కావున దానినిగూర్చి మేమిట నధికముగా లిఖింపఁబోము. రఘునాథరాయలు వచ్చిన కార్యము సఫలీకృతమైనది. బాజీరావంపిన సందేశమునకు మైసూరు రాజ్యాధిపతి తనయంగీకారము నొసంగి యాతనితో మైత్రి నెరపెను. వారుభయులునుగూడ రాజనీతివిశారదులు. బాహుబలదర్పగర్వితులు. వారి యుద్దేశముల నొరులు గ్రహింపలేరు. వారిక్లేలమిత్రులైరో యెవ్వరును దెలిసికొనఁజాలరు. కంటకమును కంటకముచేతనే తీసి వేయ వలయునని వారియభిప్రాయము. ఆయుద్దేశముతోడనే వా రిరువురును తమతమ మనోభీష్టసిద్ధికై మిత్రులైరి. హృదయమున మాత్రము వారిరువురకును మైత్రిలేదు. వారిహృదయము లొకవిధ ముగాలేవు. నాటకరంగ ప్రదేశమున రాజుమంత్రి సేనానిమొదలగు పాత్రము లభినయించునట్లే స్వార్థముకొఱకుఁ బ్రపంచరంగభూమి యందుఁ గపటమానవులు బంధుమిత్రరూపముల నభినయించుచు నిత

వులకన్నులలో నిసుక పోయుచుందురు. బాజీరావు మైసూరురాజు సాహాయ్యముతో దురాణీయులను జయింపవచ్చునని యీమైత్రి నెరపెను. మైసూరురాజును బాజీరావు సాహాయ్యముతో అసఫ్జా నడగఁద్రొక్కవచ్చునని యీమైత్రి కంగీకరించెను. ఉభయుల ముఖములందును మధువుండెను. హృదయములయందుఁ గాలకూటము ప్రచ్ఛన్నముగా నిమిడియుండెను. పైకుభయులును జక్కగానడచుచుండిరి. వారి హృదయములుమాత్రము రాజనీతిచక్రములచేఁ ద్రిప్పఁబడుచుండెను. కాని, యావిషయముమాత్ర మెవ్వరికిని గోచరముకానేరదు. కార్యకాలమున నెవరెవరేమిచేయనుద్దేశించిరో ఎవరిమనోభీష్టము సిద్ధించునో, అది భవిష్యత్కాల తమోగర్భమున నిమిడియుండుటచే నెవ్వరికిని నూహించుటకైనను శక్యముగాకుండెను.

మైసూరురాజు తన యమాయకత్వమును జక్కఁగా బైకి వెల్లడించెను. రఘునాథరాయలను సన్మానించుటలో నించుకంతయును కొఱఁతసేయలేదు. అనేకవిధములగు నమూల్యోపహారములను రెండువేలరూపాయల నొసంగి గౌరవించెను. కాని, కుశాగ్రబుద్ధియగు రఘునాథరాయల కివియన్నియు రుచింపలేదు. రాజుహృదయము నిష్కళంకముగాలేదనియు, నుడివెడివాక్యములును హృదయగతులును, వేఱువేఱుగనున్నవనియు గ్రహించెను. బాజీరావుయొక్క యభివృద్ధియును కీర్తిప్రతిష్ఠలును మైసూరురాజునకు నానందదాయకములుగా లేవు. విశేషించి విచారకారణములే యయ్యెను. బాజీరావింతటి శక్తిశాలియని మొట్టమొదట నాతఁడెఱుంగఁడు. సంధిసంబంధములగు మాటలు జరుగుచున్నను వానికేమియు విలువలేదు. స్వకార్యోద్ధరణముకొఱకు స్నేహభావము నభినయించుచు వారిరువురును కపటపాశముచే బద్ధులైరి.

స్వార్థపరత్వముతోఁ దమమనోభీష్టసిద్ధి గావించుకొనుట కొఱకెవ్వరు ప్రేమబద్ధులయ్యెదరో, అట్టివారి ప్రేమము జలబిందువు వంటిది. అది యెంతయోకాల ముండనేరదు.

రఘునాథరాయలు మైసూరురాజుచేష్టలను, అభిప్రాయములను బూర్తిగాగ్రహించెను. కాని, పైకేమియుఁబలుకఁడయ్యెను. రాజుకడ సెలవుగైకొని బయలువెడలెను. మైసూరుభూపతి ప్రేమను గనఁబఱచుట కొకముత్యాలహారమును నానావిధరత్నఖచితమగు నొక ఖడ్గమును బాజీరావున కుపహారముగా నొసంగెను. మఱియు విశేషాడంబరమును జూపునట్టి మృదుమధుర పదవిరచితమగు నొకయుత్తరమునుగూడ వ్రాసి పంపెను. రఘునాథరాయలు వీని నన్నిటిని గ్రహించి మరల రాయగడమునకుఁ బయనమయ్యెను.

మార్గమధ్యమున రఘునాథరాయలకును ద్వారకరావునకును నీ క్రిందివిధముగ సంభాషణము జరగెను.

ద్వా—నీవిచ్చటకు విచ్చేసిన కార్యము నెఱవేఱినదా ?

రఘు—నెఱవేఱినదో లేదో నేను బాగుగా గ్రహింపలేకపోయితిని. వారిరువురు నొకరినొకరు మోసగింపఁజాలరు. మైసూరురాజు వయసునఁ జిన్నవాఁడైనను, మిగులచతురుండు. మానవచారిత్రము నందలి విషయములను బాగుగా దెలిసికొనినవాఁడు. ఆతఁడు పీష్వాయభిప్రాయానుసారముగాఁగూడనడచువాఁడుకాఁడు. ఆతఁడే ప్రక్కను జేరకుండఁ దప్పించుకొని తనకార్యమును చక్కజేసుకొనునంతటి బుద్ధిమంతుఁడు. ఆతనిని స్వాధీనమునందుంచుకొను నంతటిశక్తి బాజీరావునకు లేదు.

ద్వార—బాజీరా వభిప్రాయమేమి ? మైసూరుప్రభువు తెలిసికొనినదేమి ?

రఘు—ఇరువురును సంధిసూత్రమున బద్ధులుకావలయునని బాజీరావు సందేశము. కాని వారి హృదయములుమాత్ర మైక్యము నొందలేదు. వారిరువురి హృదయముల యందునుగూడ వేఱువేఱభిప్రాయములు రహస్యముగా నెలకొనియున్నవి. వారి లోలోపలి

యభిప్రాయములను సూచనగా నైనను నితరులకుఁ దెలియనిచ్చుట లేదు. పైకి వేఱొకరీతిగ మాటలాడుచుఁ దమతమ కార్యములను నిర్వహించుకొనవలెనని యిరువురును గూడ తలంచుచున్నారు. అందుచే నిప్పుడు వారిరువురును సంధిసూత్రమున బద్ధులైయున్నను, అవసరము వచ్చినప్పుడీస్నేహమునందించుకంతయును బలముండదు. ఈమైత్రియొక్క యుద్దేశ మన్యోన్య సహాయ్యముకాదు. కేవల స్వకార్యోద్ధరణమే దాని యుద్దేశము. ధర్మవిశ్వాసముగాని సత్యము గాని యీమైత్రియందు లేకపోవుటచే పరిణామమున శుభఫలముఁ గలుగఁబోదు. మైసూరురా జెంతచతురుఁడో, మనమునాతనితో నంత చాతుర్యముతోఁ బ్రవర్తింపవలయును. అప్పుడాతఁడు మనలను మన శక్తియుక్తులను బాగుగాఁ దెలిసికొనఁగలఁడు.

ద్వార—నీవును చతురుఁడవు. నీవాతనికడ నెట్టి చాతుర్యమును జూపఁదలఁచినాఁడవు ?

రఘు—ఈవిషయమున నొక్కింత విశేషమున్నది. వీరిరువురి మనోగతాభిప్రాయములును వేఱువేఱుగనున్నను, ఒకవిషయమున మాత్ర ముభయుల స్వార్థమును సమానమైయున్నది. అసఫ్‌జా వీరిరువురకునుగూడ శత్రువు. ఆతని నడంపవలయుననియే యిరువురి యుద్దేశమును, ఆకార్యమును నెఱవేర్చుకొనుపట్ల బాజీరావుయభీష్టము సిద్ధించునట్లు సంచరింపవలయును. మైసూరుప్రభు వెంతనిపుణుఁడైనను తుదకు మనచాతురీజాలమున బద్ధుఁడైపోవును. అతినిపుణతతో మహాత్ముఁడగు బాజీరావు నడిచెడిమార్గమును కంటకవికీర్ణముగాఁ జేయుట కెవ్వరును సమర్థులుకారు. మేఘపంక్తిని భేదించుకొని సూర్యుఁ డెట్లుదయ మందునో, అట్లే బాజీరావు ప్రజ్ఞాబలముచే నఖిల విఘ్నముల నతిక్రమించి ప్రకాశింపఁగలఁడు. మైసూరునృపతి వేయికార్యములను చేసియును తన కుటిలతాపవనముచే బాజీరావు భాగ్యదీపము నార్పనేరఁడు. దుర్బుద్ధివశమున న్యాయముమల్లంఘించి నచో దానిఫలము నాతఁడే యనుభవింపఁగలఁడు.

రఘునాథరాయలు నుడివిన వాక్యములను విని హృదయమున నాతని బుద్ధికిమెచ్చుకొని ద్వారకరావాతనికి వందనము లర్పించెను. పూర్వముకంటె నాతనియెడ ద్వారకరావున కధికశ్రద్ధాభక్తు లుదయించెను. రఘునాథరాయ లొక గొప్పనీతిజ్ఞుఁడనియు, కుశాగ్రబుద్ధియునియు, నీతఁడెంతకాలము బాజీరావుకడ నుండునో, అంతకాలమును బాజీరావున కెట్టి యాపదలును సంభవింపనేర వనియును ద్వారకరా వనుకొనియెను.

ఒకశుభదినమున వారందఱును మైసూరునుండి బయలువెడలిరి. కాని వారి ప్రయాణము సుఖముగా జరుగలేదు. వారు గమ్యస్థానమును నిరాపదగాఁ జేరలేకపోయిరి. మార్గమధ్యమున జాలనాలస్యమై పోయినది.

అల్పకాలములోపల మహారాష్ట్రదేశమునకుఁ దిరిగిపోవలయునను నుద్దేశముతో వారు బహిరంగమగు చుట్టుమార్గమును విడిచి చేరువదారియగు నరణ్యమార్గమునఁ బయనము సేయనారంభించిరి. వారికడ నేనుగులు ద్రవ్యము ఆహారపదార్థములు మొదలగునవి వలసినన్ని యుండెను. ఏవిషయమునను నించుకంతయును గొఱంతలేదు. ప్రకృతిశోభాపరిపూర్ణమగు నావనరామణీయకతను దర్శించుచు వారత్యుత్సాహముతోఁ బయనమును సాగించుచుండిరి.

ఎనిమిది దినములకు వారు మహారాష్ట్రదేశప్రాంతమునకు వచ్చిరి. రఘునాథరాయలుతోఁగూడ వచ్చినవారందఱు నిన్నిదినములకుఁ బిదప మరలఁ దమస్వదేశమును జూడఁగలిగినందులకు సంతసపడఁజొచ్చిరి. ఏప్రదేశమున మహారాష్ట్రదేశము ప్రారంభమయ్యెనో ఆప్రదేశమునఁ బూర్వ మొకదుర్గముండెడిది. చంద్రారావను నా దుర్గాధిపతి యందు వాసము సేయుచుండెడివాఁడు. ఆతనిపేరిటనే యది "చంద్రారావుకిల్లా" యని వాడఁబడుచుండెడిది. ఇప్పుడాకిల్లా యతి శోచనీయావస్థయం దుండెను. అందిప్పుడు సైనికులులేరు.

అడవులలోనుండు ననాగరికులగు కోయలు మొదలగువారును దొంగలును వాసముసేయుచుండిరి.

రఘునాథరాయ లెప్పుడు నీప్రదేశమును జూచియెఱుఁగఁడు. ఆతని జీవితమం దెప్పుడు నీదేశమువచ్చియుండలేదు. ద్వారకరావును నాతనితోఁ గూడవచ్చినవారును మహారాష్ట్రదేశీయులగుటచే నీప్రదేశ మంతయు వారికిఁ దెలిసియుండెను. అందుచే ద్వారకరావు రఘునాథరాయలతో నిట్లనియెను.

"ఇట కనతిదూరమున "చంద్రారావుకిల్లా" అను నొకచిన్న గ్రామమున్నది. అది క్రమక్రమముగా దొంగలకు నివాసస్థానమగుచున్నది. రంగరాజను బందెపోటుగాండ్ర నాయకుఁ డొకఁడందు తన పరిజనులతోఁగూడ వాసముసేయుచున్నాఁడు. ఆతనిమూలమున ధనవంతులు రాత్రులయందు సుఖముగా నిద్రవోవుటలేదు. ఆతనిని బట్టుకొనవలయునని బాజీరావెంతయో ప్రయత్నము చేసినాఁడు. కాని సఫలమనోరథుఁడు కాలేదు. రాజకీయోద్యోగులలో ననేకులాతనిపక్షము వహించియున్నారు. సమయమువచ్చినప్పు డాతనికి ముందు వార్తలనంపుచు నాతనిని బట్టువడకుండఁ జేయుచున్నారు. ఆతనికడ మావులీలును ముసల్మానులును చాలమందికలరు—— వారశ్వారోహకులై కత్తులను, తుపాకులనుదాల్చి బందెపోటుగాపట్టపగలు గ్రామములపైఁబడి దోచుకొనిపోవుచుందురు. వారిపేరు వినినంతనే భయపడనివా రీదేశమున లేరు. మనము ప్రొద్దు గ్రుంకకుండఁగనే యీస్థానమునుదాటి ముందునకుఁ బోవలయును. రాయఘుడ మిటకు నలువదిక్రోశముల దూరములో నున్నది.

రఘునాథరాయ లించుక మందహాసముసేయుచు "నీవుచెప్పినట్లు చేయుట నాకునునిష్టమే. కాని ఇట్టి చిన్నచిన్న బందెపోటుగాండ్రకే మనము భయపడినచో, పెద్దదోపిడిగాండ్రను శిక్షించుటకు మనమెట్లు సమర్థుల మగుదుము ?" అనియెను.

ప్రాపంచికజ్ఞానమంతగాలేని ద్వారకరావు "పెద్దదోపిడిగాండ్ర నఁగా మీయభిప్రాయమేమి ?" అని ప్రశ్నించెను.

రఘు—ఎవరు గృహస్థుల ధనరత్నముల నపహరించెదరో వారు చిన్నచిన్న దోపిడిగాండ్రు. ఎవరు దేశమును దోచుకొని ప్రాణములకంటె ప్రియతమమైన స్వాతంత్ర్యమును హరించెదరో వారు పెద్దదోపిడిగాండ్రు. కార్యప్రవృత్తియం దిరువురునుసమానులే. వారి ప్రధానోద్దేశములును సమానములే. వారి యాశాపరిమాణమునందు మాత్రము తారతమ్యముకలదు. కాని యిందు విశేషాశ్చర్యకరమైన విషయమొకటికలదు. చిన్నదోపిడిగాండ్రు లోకమున విశేషనిందార్హులగుచున్నారు. పెద్దదోపిడిగాండ్రు వీరపురుషులని మిక్కిలిగాఁ గొనియాడఁబడుచున్నారు. ఇదియొకమహాశ్చర్యకర విషయముగదా! వీరపురుషులమని విఱ్ఱవీగువారు నరహత్యాజనితగౌరవము తమకు లభించుచున్నదనుమాట నెఱుంగకుండనున్నారు. లోభప్రయుక్తులై యితరుల రాజ్యములను కొల్లగొట్టి లక్షలకొలఁది నిరపరాధులగు జనులను హింసించుచు దాసత్వశృంఖలాబద్ధులను జేయుచున్నా మను జ్ఞానములేకుండ నున్నారు. తన దేశమునకు మంగళమునుగోరుచు ప్రబలులవలన దుర్బలులకు పీడగలుగకుండఁ గాపాడుటకై యస్త్ర ధారణముచేసి న్యాయమార్గమునం బ్రవర్తించు యథార్థధర్మజ్ఞాను లీ ఘోరమ్లేచ్ఛయుగమునఁ జాల నరుదయినారు. నీతిమార్గమును బరిత్యజించి దాంభికపథానువర్తనులై నిష్ఠురకర్మముల నాచరించు మానవులను వీరపురుషులని కొనియాడుచు మన జిహ్వాల కవమానమును దెచ్చిపెట్టుచున్నారము. అంతమాత్రమున వారందఱు వీరపురుషులు గానేరరు. ధర్మభీరువులై సర్వసుగుణాకరులగు వారలే వీరపురుషు లగుదురు.

ద్వారకరా వీవాక్యములను విని సంతుష్టహృదయుఁడై యావిషయమున మరల నేమియుఁ బ్రశ్నింపలేదు.

సరిగా రెండుజాములగునప్పటికి వారందఱును చంద్రారావు కిల్లాకడకు వచ్చిరి. ఆప్రదేశమంతయు పర్వతమయమై యనేకములగు చిన్నచిన్న రాళ్ళగుట్టలతో నిండియుండెను. కిల్లా ఆచిన్న పర్వతములనడుమ నొకపర్వతముపైఁ గట్టఁబడియుండెను. ఆపర్వతముయొక్క దిగువభాగమున నొక సమతలప్రదేశమున నొకచిన్నకుటీరము గన్పట్టుచుండెను. రంగరాజు తనపరిజనముతోఁగూడ నీకిల్లాయందు వాసము సేయుచుండెను. ఆతనిపక్షమున గూఢచారులు కొందఱు నానాప్రదేశములను దిరిగివచ్చుచుండుటచే నేదైనఆపద తటస్థించునప్పుడు వారివలన ముందుగనే తెలిసికొని యాతఁడు జాగ్రతపడుచుండెను. అందుమూలమున బాజీరా వెంతప్రయత్నముచేసియు నాతనిని బట్టుకొనలేకపోయెను. రంగరాజుపేరు దక్షిణదేశమునం దంతటను బ్రసిద్ధికెక్కెను. ఆతనియుదంతమును దెలిపినవారికి పది వేలరూపాయలు బహుమతిగ నిచ్చెదనని బాజీరావు ప్రకటింపించెను. కాని యెవ్వరు నాతని జాడను దీయలేకపోయిరి. ఇతిహాసప్రసిద్ధుఁడగు నీరంగరాజు గతించినవెనుక నాతని పరిజనము నానాశాఖలుగ విడిపోయి తలయొకచోటకు చెదరిపోయినది. అందొకశాఖ పిండారీలను పేరుతో భారతవర్షమునం దంతటను వ్యాపించెను. వారికి చేతూఖాన్, కరీమ్ అనువారలు నాయకులై గొప్పపేరును గాంచియుండిరి. రాజపుత్రస్థానమందలి రాజులుకొందఱు ఆపత్కాలములయం దీపిండారీల సాహాయ్యమును బడయుచుండెడివారు. ఈ పిండారీలకడసుశిక్షితులునుఅస్త్రచాలనాపటిష్ఠులును నశ్వారోహకులు నగు నిరువదియైదువేల సైనికు లుండెడివారు. కొన్నివందలగ్రామము లీపిండారీల యమానుషిక దారుణకార్యములచే భగ్నమైపోయి శాంతినికేతనతుల్యమైన యాప్రదేశమంతయు స్మశానముగాఁ బరిణమించిపోయెను. ఈపిండారీల నణంపఁగల శక్తిశాలి యప్పుడెవఁడును లేకపోవుటచే వీరి యత్యాచారములఁ బారిఁబడకుండ దేశమునురక్షించుట యవశక్యమైనది. కొంతకాలమున కింగ్లీషువారియనుగ్రహముచే

వారి సేనానుల బాహుబలముచే నీపిండారీల గర్వమడఁగిపోయినది. నర్మదానదీతీరమున జరిగిన ఘోరయుద్ధములో చేతూఖానును, రహీమును నిహలోకమును వీడిపోయిరి. వారితో వారిదళములన్నియు భిన్నభిన్నములైపోయినవి. అటుపిమ్మట నెప్పుడును మరల నీభారతవర్షమున పిండారీల నామరూపములు గన్పింపలేదు. కాని మే మేకాలమునాటి కథను వ్రాయుచున్నామో, ఆకాలమునాటికి పిండారీరాక్షసు లత్యంతౌన్నత్యస్థితియం దున్నారు. దేశమును శాసించు శాసనకర్తకూడ వారిపేరు విన్నంతనే భయభ్రాంతుం డగుచుండెడివాఁడు. ఎన్నిప్రయత్నములు చేసియును వారినిశిక్షించుట కాతనికి శక్యముగాకపోయెను. ధనవంతులధనమును, సుందరాంగనల గౌరవమును నిర్భయముగా నుండెడివికావు.

రఘునాథరాయల యాజ్ఞానుసారముగా నాజీన్గదుర్గమునకు దిగువనున్న సమతలప్రదేశమున వారుశిబిరములను నిర్మించుకొనిరి. వంటప్రయత్నములు జరుగుచుండెను. ఇంతలో శ్వేతచామరమువంటి తెల్లని గడ్డముగల ముసలిఫకీరొకఁడు వచ్చికూర్చుండి "అల్లాహో అక్బర్" అని కేకవైచి మృదుభాషణములతో "బాబా! మీరెక్కడ నుండి వచ్చితిరి? ఎక్కడకుఁబోయెదరు?" అని యడిగెను. సరళహృదయుఁడగు ద్వారకరావటకూర్చుండి "దాదాసాహేబ్! మేము మైసూరురాజ్యమునుండి వచ్చుచున్నాము. రాయఘడమునకుఁబోవుచున్నాము" అని ప్రత్యుత్తర మొసంగెను.

ఫకీరు—మంచిది. మీలోఁ బ్రధానుఁడగువాని పేరెవరు?

ద్వా—రఘునాథరాయలు. పీష్వాయాజ్ఞానుసారము మైసూరు రాజునకడకు దూతగాఁబోయి వచ్చుచున్నాఁడు.

ఈ సంభాషణము జరుగునప్పుడు రఘునాథరాయలు శిబిరమధ్యమున సంధ్యావందనము చేసికొనుచుండెను. లోపలనుండి యీమాటలను విని యాతఁడతివేగముగా నీవలకువచ్చి చూచునంతలో

ఫకీరెక్కడకో యదృశ్యుఁడై పోయెను. చతురుఁడగు రఘునాథ రాయలు ద్వారకరావుతో “ఈఫకీరునికథయంతయుఁ జూడగా నాకుఁ జాలసందియము కలుగుచున్నది. ఏదియో కుత్సితాభిప్రాయము లేకపోయినచో నాతఁడీరీతిగ నింతలోనే యదృశ్యుఁడై పోవనేల? మనమిట వంటప్రియత్నముల చేయుటవలనఁ బ్రయోజన మిసుమంత యునులేదు. వెంటనే యిటనుండి బయలుదేరవలయును. మఱియొక చోటకుఁబోయి యట భోజనప్రయత్న మొనరింతము.” అనిచెప్పి వెంటనే తూర్యధ్వనిచేసెను. తెప్పపాటులో సైనికు లందఱును సన్నద్ధులై యశ్వముల నధిరోహించి యజమాని యాజ్ఞలను నిరీక్షించు చుండిరి. ద్వారకరావు కత్తి నొరనుండితీసి, వారి పార్శ్వముననే నడచుచుండెను.

రఘునాథరాయలు తనయల్ప సైన్యమును జాగ్రతగా నడపించు కొనుచు నాస్థానమునువిడిచి బయలుదేరెను. ఇంతలో వారి కనతి దూరములోనే పర్వతముపైనుండి శతాధికసంఖ్యగల మనుష్యులు దిగుచుండిరి. శ్వేతాశ్వారోహకుఁడైన యొక దీర్ఘకాయుఁడగు పురుషుఁడు వారివెనుకనే వచ్చుచుండెను. ఆతఁడే వారినాయకుఁడని స్పష్టపడుచుండెను.

రఘునాథరాయలు వ్రేలితో వారినిజూపుచు ద్వారకరావుతో “చూడు! చూడు! నాసందేహము సత్యమైనది. ఈవచ్చెడివారు సదుద్దేశము కలవారలు కారు. వీరందఱును దోపిడిగాండ్రు. కాని వీరు మనలను దోచుకొనవలయునను నుద్దేశముతో వచ్చుచుండుట లేదు. నిశ్చయముగా వీరికేదియో రహస్యోద్దేశ ముండితీరవలయును. అదియట్లుండుము. వీరు మనకంటె చాలనధికముగనున్నారు. మన మీసమతల ప్రదేశమునకుఁ బోయి యుండితిమేని మనలను కాపాడు కొనఁగలము. వారు పర్వతమునుండి దిగివచ్చుటకుఁ బూర్వమే మన మాస్థానమునకుఁ బోయి యాక్రమించుకొనుట కర్తవ్యము. వారు

శత్రుభావముతో వచ్చుచున్నారనుట కించుకంతయును సందియము లేదు. వారిపై గుండ్లను బరపినచో మనకేమియు దోషములేదు" అనియెను.

ద్వారకరావందుల కంగీకరించెను. ఆతఁడు ముప్పదినల్గురు సైనికులతోఁగూడ కొంచెము ముందునకునడచి చక్కగా గురివెట్టి వచ్చెడివారిపై బందూకులఁ గాల్పనారంభించెను. దోపిడిగాండ్రు సంకీర్ణములగు పర్వతములనుండి దిగుచు నజాగ్రత్తగా వచ్చుచుండిరి. ఎవరెచ్చటనుండి తుపాకులను కాల్చుచున్నారో వారు తెలిసికొనలేకపోయిరి. అందుచే విహ్వలచిత్తులై యాత్మరక్షణము గావించుకొనలేకపోవుచుండిరి. మహారాష్ట్రుల యవ్యర్థలక్ష్యములకు ముప్పది మంది దోపిడిగాండ్రు గుఱియై ధరావతలమునఁ బడిపోయిరి. వారుకూడ గుండ్లను వేయనారంభించిరి. కాని అతి నిపుణుఁడగు రఘునాథరాయలు తనసైన్యమును వృక్షముల మఱుఁగునందుంచుటచే శత్రువులు వేయు గుండ్లయం దొక్కటియును నాతని సైనికులదేహమును స్పృశింపలేకపోయెను. మహారాష్ట్రసైనికులు వేయు ప్రతి వ్రేటునకును నొక్కొకమనుష్యుఁడు హతమైపోవుచుండెను.

దయార్ద్రచిత్తుఁడగు రఘునాథరాయలు ద్వారకరావుతో "ఈవిధముగా నరహత్యచేయుట మంచిదికాదు. శీఘ్రముగా నీ నరహత్యాకార్యము పరిసమాప్తమగు నుపాయము చూడవలసియున్నది" అనిచెప్పి తనగుఱ్ఱుపుజీనునుండి తుపాకినిదీసి శ్వేతాశ్వారూఢుఁడైన యామానవునివంక లక్ష్యముంచి వేసెను. కనుఱెప్పపాటులో నశ్వపృష్ఠమునుండి యాతఁడు భూతలమునఁ బడిపోయెను. ఈయవస్థను జూచి మిగిలినవా రందఱును చెల్లాచెదరై పాఱిపోయిరి. రఘునాథరాయల యాజ్ఞానుసారముగా నైదుగురు సైనికులు భూపతితుఁడైన యామనుష్యుని దీసికొనివచ్చిరి.

రఘునాథరాయ లాతనిని బరికించిచూచెను. తుపాకిగుండు ఆతని బాహువుపైఁ గట్టిగాఁ దగిలియుండెను. కాని యంతమాత్రమున నాతనికిఁ బ్రాణభయమురాదు. ఇప్పుడు స్మృతితప్పియున్నాఁడు. పరిచర్యచేసినచోఁ గొన్నినిమిషములలో మరలస్మృతిరాఁగలదు.

రఘునాథరాయ లిట్లు నిర్ధారణముచేసికొని యాతనిని శిబిరమధ్యమునకుఁ దీసికొనిపోయి మంచముపైఁ బరుండబెట్టించెను. గాయమును గడిగించుటకై శరీరముపైనున్న యంగరఖాను దీయించుటలో లోని జేబునందొక కాగితము కనఁబడియెను. రఘునాథరాయ లాకాగితమును చేతఁబుచ్చుకొని చూడ నదియొకయుత్తరమై యుండెను. దాని శిరోనామము "బహుప్రణయాస్పదుఁడగు శ్రీయుత రంగరాజసోపాలే మహాశయుని సముఖమునకు" అనియుండెను.

ద్వారకరావువలన నీపేరొకమాఱు వినియుండుటచే, అదృష్టవశమున దోపిడిగాండ్రనాయకుఁడు తన హస్తగతుఁడైనాఁడని సంతసించి, రఘునాథరాయ లాతని గాయమును గడిగించి యౌషధమయమైన పట్టీనివేసి జాగ్రతగా కట్లుకట్టించెను.

తక్షణమే వారందఱు నటనుండి బయలుదేరిరి. గాయమును దిన్న యామనుష్యుని జాగ్రతగా శృంఖలాబద్ధునిగావించి, ఏనుఁగుపైఁ బరుపుమీఁదఁ బరుండఁబెట్టి తదర్శిణార్థము నల్గురుసైనికులు కూడ వచ్చుచుచుండిరి. ఈ విధముగ నాలుగుక్రోశములదూరము నడచి వచ్చి యొకవిస్తీర్ణప్రదేశమున శిబిరములను వేసికొని వారందఱు నట విశ్రమించిరి.



## ఎనిమిదవ ప్రకరణము

### దోపిడిగాండ్ర నాయకుఁడు

భోజనము లైనపిదప నందఱును శయనించిరి. రఘునాథరాయలు శయ్యనువిడిచి దీపమును బ్రజ్వలింపఁజేసి యత్యంతాత్రముతో నాలేఖను జదువనారంభించెను. ఉత్తరము దేవనాగర లిపితో వ్రాయఁబడి యుండుటచేఁ జదువుట కాతని కించుకంతయును గష్టము లేకపోయెను. కాని యుత్తరము చదువుకొన్న కొలఁదిని నాతని హృదయభూమి విస్మయనీరధిలో మునిఁగిపోవుచుండెను. అదియెందుల కట్లు వ్రాయఁబడెనో యాతఁడు గ్రహింపలేకపోయెను. ఎవఁడో గుప్తశత్రు వ్వొకఁడు తన్నుఁ జంపుటకై యీదొంగలనాయకుని సాహాయ్య మపేక్షించిన ట్లాయుత్తరమువలన నాతఁడు గ్రహించెను. కేవల ద్రవ్యాపేక్షచేఁ గాకుండఁ బగదీర్చుకొనవలయునను నభిప్రాయముతో నీ కుతంత్రమును బన్నెనని నిశ్చయించి తనలో నిట్లనుకొనియెను. ఈగుప్తశత్రు వెవ్వఁడు ? నేను స్వప్నమునందైనను నెవరికి నపకారముచేయలేదు. నాకెవ్వరితోడను వివాదమైనను లేదు. ఎవని సుఖపథమునందును నేను కంటకములను వైవలేదు. అట్టిచో నెందుకొఱ కెవ్వఁడీ యంత్రమునుబన్ని నాజీవనమును హరింపఁదలపెట్టినాఁడు ? అంతమాత్రమున నాతని కెట్టి యభీష్టసిద్ధియగును ? ఈ ప్రపంచమునం దెవ్వనితోడను నాకు శత్రుత్వములేదే ! నిరపరాధినగు నన్నెందులకుఁ జంపఁదలపెట్టినాఁడు ? దీని కేదియో రహస్యకారణ మొకటి యుండితీరవలయు. ఈదొంగలగురువు నాచే బందీమైనాఁడు. బహుశః ఇతని పేరే "రంగారాజసాపోలా" అయియుండును. బాజీరా వీతనిని బట్టుకొనినవానికి పదివేలరూపాయలను బహుమాన మిచ్చెదనని ప్రకటించియును గార్యసిద్ధిని గాంచలేకపోయెను. భాగ్యవశమున నించుకంతయును రక్తపాతలేకుండ సామాన్యాయాసము

తోడనే యాదొంగలనాయకుఁడు నాచేఁజిక్కినాఁడు. ఆతని కభయ మొసంగి యీరహస్యమును గనుఁగొనవచ్చును. తనప్రాణములను రక్షించుకొనుటకై యాతఁడు నిజమును బయల్పరుపక మానఁడు. అసత్యకథలను జెప్పుట కాతనికి సాహసముండదు. ఆతనిమూలముననే యీరహస్యమును గనుఁగొందునుగాక !" అని నిశ్చయించుకొని మరల మరల నాయుత్తరమును చదువ నారంభించెను. అందిట్లు లిఖింపఁ బడియున్నది.

"జయతిజగదీశ్వరః"

బహుసన్మానాస్పదులును మిత్రవరులునగు శ్రీయుత రంగరాజ సాహోలాగారి సమ్ముఖమునకు—

సోదరా !

మీకు సదాశుభము నొసంగుఁడని జగదీశ్వరుని బ్రార్థించు చున్నాను. మన మిరువురమును బంధుత్వసూత్రమున బద్ధులమై యున్నాము. అది యీజీవితమున విచ్ఛిన్నమగునది కాదు. మేము మీయెడ నెట్టి ప్రేమతోనున్నారమో యావిషయ మనేకసందర్భము లలో ప్రత్యక్షముగాఁ జూపియున్నాము. మాదేహములయందు ప్రాణములున్నంతవఱకు శక్త్యనుసారముగ మీకుపకారముచేయుటలో నెప్పుడును వెనుదీయువారము కాము. ప్రభుపక్షమున నెట్టివాగలు వచ్చినను మీశిరోజాగ్రమునైనను కదపఁజాలరు. మీకువిరుద్ధముగాఁ బ్రవర్తించు సూచనలు కనఁబడినతక్షణమే మీ కావిషయమును ముందుగఁ దెలుపఁగలము. మీరు నిశ్చింతగాఁ గార్యక్షేత్రమున నడచుచుండ వచ్చును. మేముండగా మీకెట్టివిపత్తులును రానేరవు.

మీశత్రువు మాకాత్మీయుఁడై యున్నను వానియెడల మేమును శత్రుత్వమునే చూపెదము. మీరును మాశత్రువులను నాశనము

సేయుటకై విశేషప్రయత్నములను చేయఁగలరు. అందులకు సంది యములేదు. మేమొకవిషయమున మీశరణ్యమును గోరుచున్నాము. దాని వివరములన్నియు నీలేఖతెచ్చిన యాతనివలన మీకు స్పష్టముగాఁ దెలియఁగలవు. అందుచే నిందువ్రాయుటలేదు.

చంద్రరావుకిల్లా సమీపమున మీవలన నొకకార్యము కావలసియున్నది. మైసూరురాజ్యమునుండి యిటకువచ్చుట కొక మార్గమటనుండి యున్నదనుసంగతిని మీరును నెఱిఁగియేయున్నారు. అటకు పాంథులుకొందఱు రానై యున్నారు.

వారితో ముప్పదినల్గురు సైనికులుమాత్రమే యున్నారు. కావున నల్పాయాసముతోనే యీకార్యమును చక్కఁజేయవచ్చును. వారియం దితరులందఱికిని భయముచూపి వారిలోఁ బ్రధానుని మాత్రము దీర్ఘనిద్ర నొందింపవలసియున్నది. సర్పము నొక్కదెబ్బ కొట్టి యూరకున్నచో నెప్పటికైనను మరల దానివలన నాపదరాక మానదు. అగ్నిస్ఫులింగములను బూర్తిగ నార్పకున్నచోఁ గాలక్రమమున నవి ప్రబలి విశ్వమునంతను దగ్ధముసేయునంతటి శక్తికలవి యగును. కావున మీ రానాయకుని విషయమున నశ్రద్ధసేయకుండ నొక్కమారుగఁ గడతేర్పవలయునని చెప్పుటకై యింతదూరము వ్రాసితిని. ఆతనితోఁగూడ నున్నవారివిషయమై యీవిధముగాఁ జేయనక్కరలేదు. కార్యము నెరవేర్చుపట్ల నెట్లుప్రవర్తించినను నందువలన నుపద్రవమేమియును లేదు.

మీతీక్ష్ణదృష్టిప్రభావముచే నాతఁడెవఁడో సులభముగానే మీరు తెలిసికొనఁగలరు. ఆతనిపేరును, ఇంకనుగావలసిన యితర విషయములు నీపత్రవాహకునిమూలమున మీకుఁ దెలియఁగలవు.

మీమూలమున నీశత్రునాశనము తప్పక జరుగఁగలదని తోఁచుటచే మీకీశ్రమ నొసంగుచున్నారము. ఆతఁడు వంగదేశీ

యుఁడు. అందుచే మశకమువలె దుర్బలుఁడును, పట్టుపురుగువలె సవివేకియునై యుండునని తలంపుఁడు. మశకమునుజంపుటకు ఫిరంగు లక్కఱలేదు.

ఈకార్యమును మీరుచక్కగ నెఱవేర్చినచో మనస్నేహము వృద్ధినొందఁగలదు. మీయభివృద్ధి నిరాతంకముగా జరుగునట్లు మేమును సదాచూచుచుందుము. ఉత్తరమునం దింతకంటె నధికముగ వ్రాయఁబనిలేదు. ఈసామాన్యకార్యోద్ధరణమునకై మీరించుకంతయు నశ్రద్ధచేయరాదు.

సన్ 1149 సంవత్సరము, శ్రావణశుద్ధ ఏకాదశి.
నితాంతహితైషి.
భో——"

ఉత్తరమువ్రాసినవాని పేరందు లిఖింపఁబడి యుండలేదు. "భో" అనిమాత్రమే చేవ్రాలు చేయఁబడినది. అందుచే నాయుత్తరము వ్రాసినవా రెవరో రఘునాథరాయలకుఁ దెలిసినదికాదు.

మఱునాఁడుదయమున నాయుత్తరము ద్వారకరావునకుఁ జూపెను. ఆతఁడు మిగులఁ దొందరతో నాయుత్తరమును జదివి రోషావేశముతో "పూలరాశియందు సర్పమువలె మనపరిజనులలో విశ్వాసఘాతకుఁడెవఁడో యున్నాఁడు. ఆతఁడు మీప్రాణములను దీయ యత్నించుచున్నాఁడు. ఈయుత్తరమునుబట్టి యీాదొంగల నాయకునకును నీయుత్తరము వ్రాసినవానికిని చాలకాలమునుండి స్నేహమున్నట్లు స్పష్టపడుచున్నది. అందుచేతనే పీష్వాయెన్నిదిన ములనుండి ప్రయత్నముచేయుచున్నను నాతఁడు పట్టువడలేదు. కాని ప్రపంచమునఁ బాపము చాలకాలము రక్షింపఁబడఁజాలదు. ఒకప్పుడు పాపాత్ముల సౌభాగ్యదీపము చక్కగాఁ బ్రజ్వరిల్లినను నది చాలకాల మారిపోనకుండ నుండదు. ధార్మికుల నాపత్కాలమున ధర్మమే

రక్షింపఁగలదు. అందువలననే పాపాత్ముల కుతంత్రజాలము మూలమున మీకెట్టియాపదయును సంభవింపలేదు. సరికదా యాదొంగ మీహస్తగతుఁడైనాఁడు. ఇంతియేకాదు. దీనిమూలమున మిత్రవేషముతోనున్న శత్రువుల సర్వనాశనముకూడ కాఁగలదు. ఆ పాపాత్ములు బాజీరావు క్రోధానలమునఁ బడకుండఁ దప్పించుకొనఁజాలరు. ఈయుత్తరవ్రాసిన పాపాత్ముఁడెవ్వఁడో యీదొంగల నాయకుని మూలమున బయటఁబడఁగలదు. మనసైన్యమధ్యమున నిట్టివిశ్వాసఘాతుకుఁడై యున్నవాఁడెవఁడో తెలిసికొనువఱకును నా హృదయము స్థిరముగా నుండుటలేదు. కావున నిప్పుడేపోయి నరాధముఁడగు నాదొంగనడిగివచ్చెదను" అనియెను.

గంభీరస్వరముతో రఘునాథరావు "వత్సా! తొందరపడకుము. అంతదొందరపడవలసిన యావశ్యకములేదు. ప్రపంచమున బలముకంటె సహజముగాఁ గౌశలమువలనఁ గార్యసిద్ధి యగుచుండును. విశేషించి దొంగలహృదయమునందలి కథను చెప్పించుట యంత సులభమగు పనికాదు. అదృష్టవశమున రోగమును రోగియుఁబట్టువడినచోఁ దగినచికిత్సచేయవచ్చును. అంతవఱకును ధైర్యముతో కార్యములను చేయుచుండుట కర్తవ్యము" అనియెను.

ద్వారకరావు నితాంతవిస్మయచిత్తముతో "ఆదురాత్ముఁడు మనహస్తమునందున్నాఁడు. ఆతని జీవనమరణములు మనయిచ్ఛాధీనములై యున్నవి. మనము భయపెట్టినచో నాతఁడు సకలకథలను చెప్పఁగలఁడు. మిథ్యాకథలను చెప్పుట కాతఁడు సాహసింపలేఁడు." అనియెను.

రఘునాథరాయలించుక చిఱునగవుతో "నీవింకను బాలుఁడవు. ప్రపంచమును బాగుగాఁ దెలిసికొనలేదు. అందుచే నిట్లుపలికినాఁడవు.

ఈవిశాలప్రపంచమున దేవతాప్రతిరూపులగు మానవులును రాక్షస ప్రతిరూపులగు మానవులునుగూడఁగలరు. మనబలము నుపయోగ పఱచి యెట్టికఠినము వహించినను దొంగలకడనుండి నిజమును జెప్పిం చుట యసంభవము. వారు ప్రాణములనైన విడిచెదరు. కాని యెవ్వరికడను నిజముచెప్పరు. అందుచేతనే యిట మనబలముతోఁ బ్రయోజనములేదని చెప్పియుంటిని. అంతకంటె నాతని కభయ మొసఁగి ప్రాణమును రక్షించెదమని ఆశకొలిపినచో మనమనోభీష్టము నెఱవేఱిన నెఱవేఱవచ్చును. అందువలననే పండితులు బలముకంటె గాశలమెక్కువయని నుడువుచుందురు" అనియెను.

ద్వారకరావామాటల కేమియు నెదురాడలేదు. చతురుఁడగు రఘునాథరాయలు దొంగాలనాయకున కేమియు నాపదగలుగకుండ నేర్పాట్లుచేయించి యాతఁడు పాఱిపోవకుండఁ గట్టుదిట్టముల నొనర్చి ప్రయాణముసాగించెను.

వారందఱును రాయఘుడమున కరుదెంచిరి. కాని బందీని దుర్గములోనికిఁ దీసికొనిపోలేదు. ద్వారకరావు గృహమున నొక గదియం దాతనినుంచి ద్వారముకడ నిరువురుభటులను గావలి యుంచిరి. ద్వారకరావును రఘునాథరాయలును నీ దొంగవృత్తాం తము నెవ్వరికడను జెప్పరాదని శపథముచేసికొనిరి. సూచనగానైన నీకథ యెవ్వరికేని తెలిపినచో నాతనివలన నీయుత్తరము వ్రాసినవారి సంగతి తెలియకుండఁ జేయుటయేకాక, యాతఁడు పాఱిపోవుట కనువగున ట్లేర్పాట్లుకూడ చేయుదురు. అందుచే రంగరాజును దుర్గములోపలకుఁ దీసికొనిపోకుండుటయేకాక, యెవ్వరీయుదంతమును వెల్లడిచేయుదురో వారికిఁ మరణదండనముకూడఁ జేయఁబడునని రఘునాథరాయలు భయపెట్టెను. ఆభయముమూలమున నీకథ నెవ్వ రును వెల్లడించుటకు సాహసింపరైరి.

రఘునాథరాయ లానాఁడు ద్వారకరావునింటనే నివసించి రాత్రియైనపిదప, మలహరరావు దర్శనముచేసెను. మలహరరా వాతనిని జూచి మిగులసంతసమునొంది కుశలప్రశ్నముచేసి విశేషముల నడిగెను.

రఘునాథరాయలు తన శ్రేయోభిలాషియు నుదారహృద యుఁడునగు మలహరరావుకడ మైసూరునజరిగిన యావదుదంతమును చెప్పి పిదప నరణ్యమధ్యమున సంభవించిన యీయాపదలను దెలిపి, రంగరాజుగడ దొరకినయుత్తరమును జేతికిచ్చెను. మలహరరావా యుత్తరమును జదివి యించుకసేపు స్థాణువువలె నిశ్చేష్టుఁడైయుండి పిదప మృదుస్వరముతో "ఈబందెపోటు ద్రవ్యముకొఱకు చేయఁబడి నది కాదని స్పష్టమగుచున్నది. ఇటఁగొందఱు రాజద్రోహులున్నా రని చాలకాలమునుండియు నేను సందేహించుచునే యున్నాను. కాని సప్రమాణముగ ఋజువుపడినఁగాని వెల్లడిచేయుట కిష్టములేక యూరకుంటిని. నీ యౌన్నత్యమునకు సహింపఁజాలని పాపాత్ముఁ డెవఁడో మనలోనుండి నిన్ను వధింపవలయునను నుద్దేశముతో నీ కుట్రను బన్నినాఁడు. ఇఁక నాసంగతి మనకు బయటపడకమానదు. ఇట్టి కుట్ర లిప్పుడేకాకుండఁ బూర్వమునుండియు జరుగుచున్న ట్లీ యుత్తరమువలన స్పష్టమగుచున్నది. అందుచేతనే యెన్ని ప్రయత్న ములను జేసియును నా దోపిడిగాండ్ర నడంపలేకపోయితిమి. అయినను అదృష్టవశమున దొంగలనాయకుఁడు మనచేఁజిక్కుటచే నీ రాజద్రోహు లెవ్వరో తెలియుట సులభము. వానివలన నన్ని విషయములను దెలిసికొనవచ్చును.

రఘు—ఆవిషయమున నాకుఁ జాలసందియముకలదు. కౌశల ముచేఁదప్ప బలముచే దొంగలు తమనిజమైనకథను వెల్లడింపరు.

మల—నీకంటె నేను వయసునఁజాలఁబెద్దవాఁడను. అనుభవజ్ఞానమును నీకంటె నాకధికము! ఈదొంగలగురువుతోఁ బ్రథమమున నెట్లుమాటలాడవలయునో అది నాకు బాగుగఁదెలియును. ఇప్పుడాతనిని నేనొకమారుచూడవలయును. ఆతనితో నదియు నిదియు సంభాషించి పిదప పీష్వాసన్నిధి కాతనిని దీసికొనిపోవలయును. కాని మనకార్యము నెఱవేఱువఱకు నీవార్త వెల్లడికాకుండఁ జేయవలయును. లేనిచో నాద్రోహు లీయుదంతమునువిని యాత్మసంరక్షణము చేసికొనునుపాయముల నారయుచుందురు.

రఘు—అందులకువలయు ప్రయత్నములన్నిటి నిదివఱకే చేసియుంచితిమి. మాతోఁగూడ వచ్చినవారి కెచ్చటనైన నీయుదంతము దెలిపినచో బ్రాణములు దక్కవని భయముచెప్పితిమి.

మల—అట్లయినచో సరియే— ఇఁక మనమిట తడయరాదు. ఇప్పుడేపోయి యాతనినిచూచి యాతనియభిప్రాయమును దెలిసికొనవలసియున్నది.

రఘు—ఆతఁడు మనయీసౌధముక్రిందనున్న గదిలో నున్నవాఁడు. అచ్చట నొకసేవకుని కాపుంచితిమి. ఈ నిశీథకాలమున నందఱు సుఖనిద్రం జెందియున్నవారు. మన మిపుడేపోయి వానిని చూచివత్తము రండు.

వారిరువురు నొకదీపమునుగైకొని క్రిందకు దిగి యాతనిని బంధించియుంచిన గది తలుపులుకడకు వచ్చిరి.

ఆచోరనాయకుఁడు నిర్జనమైన యాగదియం దొంటరిగఁ గూర్చుండి తన యదృష్టమునుగూర్చి తలపోసికొనుచుండెను. సకల సుఖదుఃఖ నివారిణియగు నిద్రాదేవి యాతనినావహింపలేదు. ఆ నిద్ర భయంకరకాంతు లాతనినేత్రములలోఁ బ్రకాశించుచుండెను. తనజీవితమునఁ జేసిన నికృష్ట దారుణకార్యములన్నియు నొక్కొక్క

టిగ నాతనికి స్మరణకు వచ్చుచుండెను. అందుచే నాతని చిత్తభూమి యంతయును దారుణతాపముచేతను భయానకానుతాపము చేతను సమాచ్ఛన్న మైపోయెను.

పాపాత్ములు తమపాపఫలమును పరలోకమున నరకమునం దనుభవింతురని యనేకులుచెప్పుచుందురు. కాని మేము చెప్పునది యేమన- జ్ఞానోదయమయినపిదప ననుతాపమునలనను, వివేకుల తీవ్ర తిరస్కారమువలనను, పాపాత్ములు తమ జీవితకాలముననే యిహ లోకమునందే యసహనీయయాతనల ననుభవించెదరని మాయభి ప్రాయము. ఈ యాతనలకంటె నరకయాతనలు కఠోరములుగా నుండవు. మృత్యుదేవతయొక్క కోమలాంకముపైఁ జేరిన మానవు లిహలోక యాతనలను వీడి ముక్తి లాభమును బడయుదురు. కాని యణుక్షణమును కల్పనాబలముచే మరణవేదన ననుభవించుచుండుట యెంతకష్టమో యనుభవశీలురేగాని యన్యులు గ్రహింపఁజాలరు. మహాపాపియగు నీదోపిడిగాఁ డిట్టి యాతన నిప్పు డనుభవించు చున్నాఁడు. ఇంతలో మలహారరావును రఘునాథరాయలును వచ్చి ద్వారమును తెఱచిరి.

మలహారరావు దీపపువెలుతురున నీదస్యు నాపాదమస్తకమును నిరీక్షింప నారంభించెను. ఆతని వయసు నలువదియేండ్లకంటె నధిక ముండదు. చక్కనిగౌరవర్ణముకలవాఁడు. దృఢమై మాంసలమైన బాహుయుగళమును, విశాలవక్షస్థలమును, నతఁడొక బలశాలియని చెప్పక చెప్పుచుండెను. ఉన్నతమైన నాశికయు, తేజఃపూర్ణ సము జ్వలములై ఆకర్ణాంత విస్తృతములై యొప్పారునేత్రములును, ఉన్నత మైన లలాటమును, కృష్ణభ్రమరసన్నిభములై యొండొంటి నొరసి కొనుచున్న భ్రూయుగ్మమును నాతఁడు గలిగియుండెను. ఆతనివదన మండలము విధాతృని శిల్పనైపుణ్యమును బ్రదర్శించుచుండెను. ఆ

ముఖమును బరికించినచో నాతఁ డొక ప్రతిభాశాలియని తోఁచు చుండును. కాని సదా నిష్ఠురకార్యాచరణముచేనాతని హృదయము కఠోరభావవిశిష్టమైనట్లు కూడ నాతని మొగమునఁ జూపట్టుచుండెను.

ఆతఁడు ధరించినదుస్తులు మహారాష్ట్రులు ధరించువానివలె నుండెను. శరీరమ్మునై నంగరఖాయును, అశ్వారోహకుల కనువగు పాయిజామాయును, శిరమ్మునై నిరువదిగజములపొడవుగల వస్త్రముచే జుట్టఁబడిన పగడీయును, శోభాయమానములై యుండెను. బందీయగుటచే నాతనికడ నస్త్రములేవియు లేవు. వజ్రఖచితమగు నుంగర మొకటి వ్రేలియందును, రత్నఖచితమగు హారమొకటి కంఠము నందును, విరాజిల్లుచుండెను.

ఆతఁ డింతకుపూర్వము చింతాకూపమున నిమగ్నుఁడై యుండెను. తన యవస్థవిషయమున నివిష్టహృదయుఁడై యుండి, ద్వారము తెఱువఁబడినతోడనే చకితహృదయుఁడై వచ్చినవారి నొక్కమాఱు పరికించెను.

మలహారరావు గంభీరస్వరముతో నిట్లనియెను. "రంగరాజ సాహోలా! నీవొక గొప్పవీరపురుషుఁడవనుమాట సత్యము. కాని కాపురుషుల సహవాసముచే నీచపథానువర్తనుఁడ వైనాఁడవు. అందుచే ననన్యసామాన్యములగు నీయభిప్రాయములు విపరీతపథమున సంచరింపఁ జొచ్చినవి. నీబుద్ధిసామర్థ్యములు వికసించినవికావు. అల్పబుద్ధివై మంచిమార్గమును బరిత్యజించి కంటకశమాకీర్ణమార్గమునఁ బ్రయాణము చేయుచున్నాఁడవు. అందుచే నీప్రపంచమున సుఖమును బొందఁజాలకున్నావు. నీవిప్పుడు మాహస్తమునఁజిక్కియున్నావు. పాఱిపోవుటకించుకంతయునవకాశములేదు. అయినను నీవు మావశవర్తివై మేమడిగినదానికి నిజమైనప్రత్యుత్తరము నొసంగి

నచోఁ బ్రాణసంకటమగునీయాపదనుండినిన్నుద్ధరింపఁగలము. నీవంటి సాహసికుఁడును వీరపురుషుఁడును మాసైన్యమునందున్నచో ప్రభువున కందువలన నుపకారముకూడ కాఁగలదు. అందుచే నీప్రాణరక్షణము నకు వలయు నేర్పాటులను నేనుగావించెదను."

నిర్భయహృదయుఁడగు నా తస్కరనాయకుఁడించుక చిఱు నగవుతో "అయాచితముగ మీరు నాకుపకారము సేయఁదలపెట్టి నందులకు నే ననేక వందనము లర్పించుచున్నవాఁడను. మీరెవరో నాకెఱింగింప ననుగ్రహించెదరా?" అనియెను.

మలహరరావు సగర్వముగా "ఎవని గౌరవమయనామము భారతవర్షమునం దంతటను విఖ్యాతమైయున్నదో, ఢిల్లీపాదుషహా మొదలగు రాజాధిరాజులుసైత మెవనిపేరువిన్నంతనే గడగడలాడు చుందురో, ఈకాలమున నెవనితో సమానుఁడగు పరాక్రమశాలి యీభారతవర్షమునం దెచ్చటనులేఁడో, ఎవఁడు మహారాష్ట్రకుల తిలకుఁడో, అట్టి బాలాజీబాజీరావు నాకు ముఖ్యామాత్యపదవి నొసంగి గౌరవించినాఁడు. నీవిప్పుడు మాగృహమున బంధింపఁబడి యున్నావు. నాకిష్టమున్నచో నీప్రాణములను మృత్యుముఖమునుండి తప్పించి రక్షింపఁగలను. నీజీవనమరణములు నాహస్తమునందున్నవి" అనియెను.

మలహరరావు వాక్యములు తస్కరనాయకుని హృదయము నేమాత్రమును చలింపఁజేయలేదు. నిర్భయచిత్తముతో నాతఁడు "మీరు చాల సమర్థులు. మీకిష్టమున్నచో నేవియోచెప్పి పీష్వాచే నాప్రాణములను దీయింపఁగలరు. అదియటుండనిండు. మొదట నన్ను "రంగరాజసాహోలా" యని సంబోధించినారు. నేనెవరను? మీరు భ్రాంతచిత్తులై ఒకరి నింకొకరినిగా ననుమానించినట్లుతోఁచు చున్నది" అనియెను.

మలహారరావు నేత్రము లించుక రక్తిమం దాల్చెను. "చూడుము నాయెదుట మిథ్యాలాపములాడ సాహసింపకుము. దానివలన నించుకంతయు ఫలములేదు సరియేకదా మీకు మిక్కిలి ప్రాణసంకటము రావచ్చును" అనియెను.

పూర్వమువలెనే నమ్రస్వరముతో నాదోపిడికాఁడు "నేను వినయముతో మీకడ విన్నవించుకొనుచున్నాఁడను. మీరట్లు కను లెఱ్ఱఁజేసి మాటలాడవలదు. అందువలనఁ బ్రయోజనమేమియును లేదు. బూసిపేరుచెప్పిన భయపడుటకు నేను బాలకుఁడనుగాను. నాజీవితమును తృణప్రాయముగా నెంచుచున్నాను. చాలకాలము నుండి నేను సదా విపత్సాగరముననే యీఁదులాడు చున్నాఁడను. లోకమున గౌరవమును నాత్మమర్యాదయు శ్రేష్ఠములు. వానికొఱకు నాకెంతటి కష్టములు సంప్రాప్తమయినను నోర్చుకొందును. మరియు నాజీవితమునం దెప్పుడు నెవరినెఱుఁగనో, ఎవరి నామమునైనను నేను వినియుండలేదో, అట్టివాఁడను నేనేయని చెప్పి మీరుదానిని స్థిరపరచుచున్నారు. మీరుచెప్పెడి యాతఁ డేదే నపరాధము చేసి యుండవచ్చును. అందులకని నన్ను శిక్షింపఁదలంచుచున్నారు. మీరు రక్షింపను శిక్షింపను సమర్థులు. మీచేతియం దధికార మున్నది. నేనేకాకిని. అసహాయుఁడను. నిరపరాధిని. నన్నెట్టి కష్టములనైనఁ బెట్టవలయునని మీరుతలంచిన ననాయాసముగఁ గొనసాగును. ఏవియో తంత్రములుపన్ని నావంటివ్యక్తిని దండించుట ప్రబల ప్రతాపాన్వితుఁడగు బాజీరావు ముఖ్యామాత్యునకుఁ గష్టమైనకార్యము కాదు" అనియెను.

ఈవాక్యములను విని మలహారరావు నధరమున నించుక చిఱునగవు గనుపట్టెను. కాని రఘునాథరాయలు తన హృదయము

నందలి క్రోధానలము నడఁపలేకపోయెను. ఆదారుణక్రోధముచే నాతని ముఖమండలము తరుణతపనమండలమువలె నెఱ్ఱనైపోయెను. పవనతాడితమగు కిసలయమువలె నాతనియోష్ఠము పదింబదిగఁ గంపింపఁజొచ్చెను. తస్కరుఁడు నుడివిన మిథ్యావాక్యము లాతని హృదయమున కసహ్యములయ్యెను. తస్కరులమధ్యమున శ్వేతాశ్వారోహకుఁడై యాతడు ప్రత్యక్షముగాఁ గనుపట్టినాఁడు. ఇరుపక్షములకును యుద్ధముజరిగినది. ఆతఁడు చోరులను పురిగొల్పుచు యుద్ధము నడపించినాఁడు. యుద్ధమును సమాప్తము చేయవలయునను నుద్దేశముతోఁ దానాతనిపైఁ దుపాకినిగాల్చి భూమిపైఁ బడఁగొట్టినాఁడు. ఇవియన్నియు నెఱుఁగనట్లు మాటలాడుటచే రఘునాథరాయలకు దారుణక్రోధ మొదవెను. అందుపై నాతఁడు జలదగంభీరస్వరముతో ఓనరాధమ! మిథ్యావాక్యములను నుడివి నీజిహ్వ నపవిత్రముసేయఁ బోకుము. ఇట్టి చాతుర్యమును మాకడ నెరపినందువలన నీకుఁ బ్రయోజనములేదు. ఇంతేకాదు. ఇహపరములు రెండింటికినిగూడ దూరగుఁడవైపోదువు. రంగరాజనువాఁ డింకొకఁడుండెనా? మూఁడు దినములకిందట చంద్రరావు కిల్లాసమీప ప్రదేశమున నూర్గురుజనులతోవచ్చి నాప్రాణనాశనము సేయఁదలపోసినది నీవు కావా?" అనియెను.

రఘునాథరాయలాడిన యీకర్కశవాక్యములనువిని యాతఁడు "హా! హా!" యని నవ్వి యలక్ష్యభావముతో నీప్రాణనాశము సేయుటకు నేనేల ప్రయత్నింతును? అందుకొఱకు నూర్గురుజను లెందులకు? నీయాకారప్రకారములను జూడ మహారాష్ట్రునివలెఁ గనుపట్టుటలేదు. బహుశః వంగదేశీయుఁడవు కావచ్చును. అట్లయినచో నీజీవితమునకు విలువయెక్కడిది? ఇట్టితుచ్ఛకార్యమునకై నావంటివాఁ డెందులకు

బ్రియత్నించును ? మృగరాజగు సింహము దోమను జంపవలయు
నను నుద్దేశముతో గుహనుండి బయలువెడలునా ? నేనట్టి కాపురు
షుఁడను గాను. పరాన్నభోజియును దుర్బలహృదయుఁడును నిర్జీవ
ప్రతిమయునగు బంగాళీయుని వధించి నాఖడ్గమున కవమానమును
దెచ్చెదనా ? అందుచే నాకుఁగలుగు గౌరవమెయ్యది?" అనియెను.

అగ్నియందు నేయివోసినట్లు తస్కరగ్రామణి నోట వెలు
వడిన యావాక్యములను విని రఘునాథరాయలు క్రోధకంపితస్వర
ముతో "ఓ నరాధమ ! ఈప్రపంచములో నీవంటి మిథ్యావాదు
లెచ్చటను లేరు. నానాళీకమునుండి వెలువడిన యినుపగుండు
యొక్క చిహ్న మింకను నీశరీరముపై స్పష్టముగాఁ గన్పట్టుచున్నది.
నేను నా స్వహస్తములతో నిన్ను బందీగాఁజేసి యిక్కడకుఁ గొని
తెచ్చినాఁడను. అట్టి నాయెదుట నిట్టి మిథ్యాలాపము లాడుటకు
వెనుదీయకున్నాఁడవు. నిన్నీఖడ్గముతో ముక్కముక్కలుగా నరికి
వైచినను నాక్రోధము చల్లారదు." అనియెను.

రఘునాథరాయల యీకఠోరవాక్యములను విని యించుకంత
యును క్రుద్ధుఁడుగాక హాస్యసూచకస్వరముతో నాతఁడు "అల్పజల
మున గొప్ప తుపాను బట్టుచున్నది. శూన్యపాత్రమున నధికశబ్ద
ముదయించుచున్నది. అదియటుండనిమ్ము. రాక్షసులనోట రామ
నామమువలె బంగాళీయుల నోట ఖడ్గ మనుమాట ప్రథమమున
నిప్పుడే వినుచున్నాఁడను. ఎవరు వంశపారంపర్యముగ దాసత్వమును
వృత్తిగా గ్రహించియుండిరో, పరాన్నభోజనమే జీవితమునందలి
ప్రధాన కర్తవ్యముగా నెవరుతలంచుచుండిరో, నిరుద్యమశీలురగు
జాతివారని యెవరుపేరుగాంచిరో, అట్టి బంగాళీయుల కిట్టిమాత్సర్య
ముండుట మంచిదికాదు. దైత్యకులమందు ప్రహ్లాదుఁడు జనియించి
నట్లు బంగాళీయులలో నీవు జననమందితివి. కాని, నీజాతిధర్మమును

మాత్రము విడిచిపెట్టలేకపోయితివి. మహారాష్ట్రులకడ దాసత్వ మంగీకరించి జీవించుచున్నావు. విధవశరీరమున నలంకారము లెంత శోభించునో నీహస్తమున ఖడ్గమంతగా శోభించును. వికారగ్రస్తుఁడగు రోగినోటనుండివలె ప్రలాపవాక్యములు నీనోట వెలువడుచున్నవి. ఇతరులకు దాస్యముసేయుట యేజాతియొక్క ధర్మమగునో ఏజాతి స్వేచ్ఛను సంపూర్ణగా మఱచిపోయినదో, ఆజాతివారి నోట నుండి యసారములగు గర్వోక్తులు వెలువడు టెప్పుడును మంచిది కాదు." అనియెను.

ఈ నిందావాక్యములను విని రఘునాథరాయలు క్రోధముతో నోరనుండి ఖడ్గమును బెఱుక నుంకింపుచుండ, మలహరరా వాతని హస్తమును బట్టుకొని మృదుస్వరముతో మెల్లగా "వత్సా! తొందరపడకుము. క్రోధమునడంపుము. కోపమునడంపకపోయినచో నపరాధులను దండింపఁజాలము. ఈపాషండుఁడు మన చేతులయం దున్నాఁడు. మన యిష్టమువచ్చినప్పు డీతనిని మన యిచ్ఛవచ్చి నట్లు చేయవచ్చును. కాని, యిప్పుడు స్థిరభావముతోఁ గార్యములను జేయకున్నచో సంకల్పసిద్ధులము కాఁజాలము" అనియెను.

మలహరరావు చెప్పిన యీవాక్యముల నా దస్యుఁడు వినఁజాలఁడు. కాని, రఘునాథరాయలు కత్తినిదీయఁబోవుటయు, మలహరరావు నివారించుటయు నాతఁడు చూచుచుండెను. ఇదియంతయును చూచినపిదపఁగూడ నాతఁడేమియు భయమునొందలేదు. ఆతని ముఖమండలము పూర్వమువలెనే ప్రసన్న మైయుండెను. లలాటమున చింతాసూచకచిహ్నము లేమియుఁ గాన్పించుటలేదు. మలహరరావు వాక్యములనువిని రఘునాథరాయలు శాంతము నొందెను. ఆదొంగలనాయకుఁడు హాస్యసూచకస్వరముతో "నేనిప్పు డసహాయుఁడనై యున్నాఁడను. నిరస్త్రుఁడను. బందీని. ఇట్టినన్ను

వధించుట యెట్టి గౌరవకార్యము ? మషీరసజీవియగు బంగాళీయుఁడు దక్క నిట్టి గౌరవకార్యమునఁ బ్రవర్తించువాఁ డెవ్వఁడు ?" అనియెను.

రఘు—నీవు ధర్మజ్ఞానశూన్యుఁడవు. దోచుకొనుటయే నీ వృత్తి. బంగాళీయుల గౌరవము నీకెట్లు తెలియు ను? గుణహీనుఁడు గుణవంతుల గుణముల నెఱుఁగఁజాలఁడు. బంగాళీయు లజేయులగు మొగలాయీలతో ప్రాణములనొడ్డి రణముగావించియున్నారు. వీర ధర్ముఁడును ప్రతాపశాలియునగు మానసింహమహారాజు బంగాళీ యుల శౌర్యధైర్యముల నెఱింగి సమయకుశలురని వారిని వేయినోళ్ళఁ బొగడియున్నాడు. ప్రతాపాదిత్యాది రణశూరులుకూడ బంగాళీ యులను శ్లాఘించియున్నారు. నీవంటినీచుఁడు క్రూరకర్ముఁ డొక్కఁడు పలికినంతమాత్రమున త్రిలోకవిశ్రుతులగు బంగాళీలకీర్తికి భంగమురానేరదు. గుడ్లగూబ సదా సూర్యకిరణములనుజూచి యస హ్యించుకొనుచుండును. అంతమాత్రముచే సూర్యునికీర్తికి భంగము కలుగనేరదు. కుక్క లేనుఁగునుజూచి మొరగుచుండును. అందువలన గజమునకు గౌరవభంగముకాలేదు. నీచమనస్కుఁడును, దోపిడికాఁడు నగు నీవంటి యల్పమానవునకు వీరలక్షణము లేమి తెలియును ? నీవు నరపశువువు. నీవంటిపశువును వధించుట పాపకార్యముగానేరదు.

దస్యు—దోచుకొనుట మావృత్తి. మీప్రభువగు బాజీరావు కేవల ధర్మమార్గమున సంచరించుచున్నాఁడు ! మేము కొందఱు గృహస్థులనుమాత్రమే దోచుకొందుము. మీసాహాయ్యముచే బాజి రావు గ్రామములకు గ్రామములే దోచుకొనుచున్నాఁడు. మేము నిందాపాత్రులమును మీరు యశోవిశాలురును. మానవులు తమ దోషములను బరికించుటలో నంధులగుచున్నారు. ఇతరులదోషము లను జూచుటలో సహస్రనేత్రు లగుచున్నారు. దేశమును దోచు

కొను వారలయందు దోషములేదు. కాని విశేషసంపదగల కొందఱ ద్రవ్యములోఁ గొంత యపహరించినవారు దస్యులని పిలువఁబడు చున్నారు. స్వార్థపరులును ఆత్మసుఖప్రియులు నగు మానవుల విచారము లెట్టివో చెప్పశక్యము కాదు.

మల—ఇట్టి వివాదములతోఁ బ్రయోజనము లేదు. నీవు నిన్ను దెలిసికొనకుండ బంగాళీయులపైఁ గటూక్తులను గురియించు చున్నావు. మానవచారిత్రమునందలి విషయములను జక్కగాఁ దెలిసి కొనినవాఁడవని నీవాక్యములవలన స్పష్టమగుచున్నది. గనులలో వజ్రములును, బొగ్గులునుగూడ నుండునట్లే అన్నిజాతులయందును శూరులును, పిరికిపందలును, సత్పురుషులును, కాపురుషులునుగూడ నుందురు. పూర్ణిమానంతరమున నమావాస్యయు, పోటుతరువాత పాటును వచ్చునట్లే యీశ్వరుని నియమానుసారముగా సకలజాతుల యందును అభివృద్ధియును నాశనమును సంభవించుచుండును. ఈ సాధారణ నియమములు ప్రపంచము పుట్టిననాఁటనుండియును జరుగు చున్నవి. జరుగఁగలవు. సకల సంపత్సమృద్ధమగు వంగదేశమున మహాపురుషు లనేకులు జననమందినారు. నీ వేజాతిని పౌరుషహీన మైనదని నిందించుచున్నావో, ఆబంగాళాజాతి యత్యంత భయంకర తరంగవిశిష్టమగు సముద్రమునుదాఁటి సింహళమునఁ దనవిజయపతా కమును బ్రతిష్ఠించినది. ఈ గౌరవచిహ్న మేకాలమునందును, నశించిపోవునదికాదు. ధర్మభీరుత్వమునందును కర్తవ్యపరాయ ణత్వమునందును బంగాళీయులతోఁ బోలినవా రింకొకరీ భారతవర్ష మున లేరు. నీవజ్ఞానముచే బంగాళీయుల గుణముల నుగ్గడింపకుండ దోషములనుమాత్రమే వెల్లడించుచున్నావు. చంద్రునివలెనే యన్ని జాతులును గళంకవిశిష్టములై యున్నయవి. తేజోంధకారములు, పుణ్యాపాపములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములచే నీజగత్తు

సమకూర్పఁబడి యున్నది. శూలములవంటి కఠోరవాక్యములచే నీ వెవ్వనిని నొప్పించుచున్నావో ఆమహాత్మునకు బాజీరావుపీష్వా యనన్యసాధారణములగు నాతని సుగుణగణమునుగాంచి పరిహృష్ట చిత్తుఁడై రాజదూతపదవి నొసంగి గౌరవించినాఁడు. రాజదూత పదవి యెంత సన్మానార్హమైనదో యది నీవును నెఱుంగుదువు. ఆతఁడు దలంచుకొన్నచో నీవంటిదోపిడిగాండ్రి నఱనిముసములో నందఱకొలఁదిగ వలలోవేసి పట్టుకొనఁగలఁడు. కలుషచిత్తుఁడను నాతని యున్నతపదవినిజూచి సహింపలేనివాఁడును నగు నొకయవివేకి యీకుట్రపన్ని నీసాహాయ్యము నభిలషించినాఁడు. నీప్రాణరక్ష ణార్థము నీవును ఆసూత్రమును బట్టుకొని వ్రేలాడితివి. ఆసూత్ర మత్యల్పమైనది. క్షణములో విచ్ఛిన్నమైపోవునది. గోడలకు చెవు లుండును. మీరహస్యమంతయు మాకు దెలిసినది. సప్రమాణముగ రుజువైనది. నీవిఁక నిట్టి మిథ్యాలాపములాడినచో నీప్రాణములను రక్షించుకొనఁజాలవు.

మలహారరావు వాక్యములవలన నాచోరనాయకుని ముఖ మండలము క్షణమాత్రమున నల్లఁబడిపోయెను. కాని యొక్కింత సేపటిలో నాతఁడు మరల మనసును స్థిరముచేసికొని యలక్ష్యభావ ముతో "బంగాలీజాతిని నిందించి మీయెదుట నపరాధము చేసితిని. అందులకు క్షమాపణ వేడుకొనుచున్నాఁడను. కాని మీయీ దీర్ఘో పన్యాసము నందలి మర్మములను నేనుదెలిసికొనిలేక పోయితిని. మీకు విరుద్ధముగాఁ బనిచేయువారు కొందఱేదియో కుట్రలనుబన్నుచున్నా రని మీ రనుమానపడుచున్న ట్లందువలన నాకు బోధయయినది" అనియెను.

ఇంతకుఁబూర్వమా బందీవాక్యములకు రఘునాథరాయలకుఁ గోపమువచ్చుచుండెడిది. కాని యిప్పుడా కోపముపోయి నవ్వు రా

నారంభించెను. ఆతఁడు నవ్వు నాపుకొనలేకపోయెను. మలహరరావు దోపిడిగానితో నేవియోమాటలాడెను. కాని యాతఁ డెప్పటి యట్లే నిర్భయముగా నుండెను.

మలహరరావు నవ్వుచు "రంగరాజా! నేను చిన్నతనము నుండియు నించుమించుగ నేబదివత్సరములనుండి రాజకార్యములను నిర్వహించుచున్నాను. నీవంటి సర్దారుల నెందఱినో చూచితిని. నీకడ నాశక్తినంతయు వినియోగింపనక్కఱలేదు. నే నేమాత్ర ముపేక్ష వహించినను నీప్రాణములు దక్కనేరవు. మేమనేక దినముల నుండి నిన్నుఁ బట్టుకొనవలయునని యత్నించుచున్నాము. కాని పట్టుకొనలేదు. కారణమేమన, ఆయకార్యములను చేయుచున్నది నీవేయని సప్రమాణముగ రుజువైనఁగాని నిన్నుఁబట్టుకొనుట కిష్టము లేకపోయినది. మేము కొంతద్రవ్యమును వెచ్చించి నీప్రతిమూర్తిని సంపాదించి యుంచితిమి. నీకిష్టమున్నచో దానిని నీవు చూడ వచ్చును. నేనారూపమును జూచియే నిన్ను గ్రహింపఁ గలిగితిని. నీకు విరుద్ధముగఁ బ్రమాణములు లేకపోలేదు. నిశ్చయముగా నీ విఁక నిటనుండి నిష్కృతినొందఁజాలవు. నీకు రాజదండనముతప్పదు" అనియెను.

ఈ వాక్యములు వినినను దస్యుసర్దారునకు హృదయమున భావాంతరము వొడమలేదు. ఆతని చిత్తాకాశమున చింతామేఘ ముదయింపలేదు. ఆతని మొగమును జూచినవా రెవ్వరును నాతఁ డొక ప్రాణసంకటావస్థయం దున్నాఁడని యనుకొనరు. హుక్కాను బీల్చుచు బంధువులతో సల్లాపము లాడుకొనువానివలె నుండెను. మలహరరావును రఘునాథరాయలు నాతని నిర్భయభావమునకుఁ జాల నచ్చెరువుపడి యాతనికడనుండి నిజమునుదెలిసికొనుట కుపాయ మును గానలేక చింతింపజొచ్చిరి.

మలహరరా వేమియు మాటలాడకుండ నూరకుండెను. దస్యుఁడు పూర్వమువలెనే యలక్ష్యభావముతో "మంచిది. నాకు విరుద్ధముగ మీకు ప్రమాణములు లభించినచో నన్నుఁ దప్పక దండింప వలసినదే. న్యాయమును విచారించి నేనపరాధినని నిశ్చయించి దండించినచో నవనతమస్తకుఁడనై యాశిక్ష ననుభవించెదను. అంతియేకాని కిరాతుఁడు హరిణశాబకమునుగొట్టిన ట్లకారణముగ నిరప రాధినగునన్ను దూరమునుండి తుపాకితోఁగొట్టి బందీగాజేసి తెచ్చు టేటిన్యాయము? నే నేమియపరాధములను జేసితినో నాకుఁ దెలు పుఁడు" అనియెను.

మల—ఇంకను నాయెదుటఁ జాతుర్యమును జూపుచున్నా వెందులకు? నీవేమి యపరాధములను జేసితివో యెందులకునిన్ను బందీగాఁజేసి తీసికొనివచ్చితిమో నీవెఱుఁగవా?

దస్యు—నే నెఱిఁగియున్నచో మిమ్ముల నడుగు టెందులకు?

మల—నీ వనేకాపరాధములను జేసితివి. కుత్సితులగు రాజ ద్రోహులతోఁగూడి బాజీరావు రాజదూత ప్రాణములను హరింపఁ బ్రయత్నించితివి. అదృష్టవశమున నాతఁడు ప్రాణములను రక్షించు కొనఁ గలిగినాఁడు. కాని లేకపోయినచో నిశ్చయముగా నీచే నాతఁడు చచ్చియుండును. తక్కిన యేయపరాధములును సప్రమాణముగా రుజువు కాకపోయినను ఈ గురుతరాపరాధమునకు నీకుఁ బ్రాణ దండనము తప్పదు.

దస్యు—ప్రాణదండనముచేయుట కీశ్వరుఁడు మీకు సామ ర్థ్యము నొసంగియున్నాఁడు. అందుచే మీరు నావంటి యసహా యుని ప్రాణముల ననాయాసముగాఁ దీసికొనఁగలరు. కాని, మీరు యథార్థమును విచారించి తెలిసికొని నన్ను శిక్షించినచో నాహృదయమునకు క్షోభయుండదు. బాజీరావు ప్రభుని రాజదూత

ప్రాణములను నాశనముచేయ యత్నించితినని నాపై నేరము మోపు చున్నారు. రాజదూత యసత్యమాడఁడు. విషయము లెట్లుజరిగినవో తెలిసికొనవలయును. నాహృదయమున లేశమాత్రమును పాపము నుద్దేశింపదు. నేను నాయనుచరులతోఁగూడఁ బర్వతమునుండి దిగుచున్నమాట నిజము. మే మేమియును దురభిప్రాయమును వెల్ల డించియుండలేదు. ఆతఁడు నిష్కారణముగ మాపైని బందూకులఁ గాల్పనారంభించినాఁడు. పక్షులవలె ననేకు లాప్రదేశమునఁ బడి పోయినారు. తుదకు నన్నుఁగూడఁ గొట్టి బందీగాఁదెచ్చినాఁడు. ఈసంగతులన్నియు నిజములని రాజదూతకూడ నంగీకరించునని నా నమ్మకము. అట్లయినచోఁ దనప్రాణరక్షణమునకై యాతఁడు బందూకుల నుపయోగపఱచినాఁడా ? ఆతనిని వధించుటకై మేమరు దెంచుచున్న ట్లాతఁ డెట్లు నిశ్చయించెను ?

రఘు—నేను కారణములేకుండ నొకనిపై నస్త్రము నుపయోగ పఱచునంతటి యవివేకినిగాను. మేము ముందుగా నా సమతలము నాక్రమించుకొనకపోయినచో, మొదటినుండియు నేను జాగ్రతగా నుండకపోయినచో, మేమించుకంతయుఁ జేయునదిలేక మీచేఁబడి యుందుము. అందుచే ముందుగ మేమే యుద్ధమునకు దిగవలసి వచ్చినది. నీవాతతాయివని మాదృఢవిశ్వాసము.

దస్యు—మీకా దృఢవిశ్వాస మెట్లుకలిగినది ?

రఘు—నీవు చంద్రారావుకిల్లా ప్రదేశమున నివసించి పథికుల సర్వస్వమును దోచుకొనుచు, దోపిడిగాండ్ర నాయకుఁడవై ప్రసిద్ధి గాంచియున్నావని నాపరిజను లంతకుఁ బూర్వమే నాకెఱిఁగించినారు. తదనంతరము కుత్రిమవేషధారియగు ఫకీరొకఁ డక్కడకు వచ్చి పోయినాఁడు. ఆతని విషయమై నాహృదయము సందేహింపఁజొచ్చి నది. పిదపఁ బరివారముతోఁగూడ నీవు పర్వతముపైనుండి వచ్చు

చుంటివి. దానితో నాసందేహముతీరిపోయినది. నూర్గురుచోరులతో నీవు వచ్చుచున్నావని నిశ్చయించుకొంటిని. నాతో ముప్పదినల్గురు సైనికులు మాత్రమే యుండిరి. అందుచే నాత్మసంరక్షణముకొఱకు మేము ముందుగ మిమ్ముల నెదుర్కొనవలసి వచ్చినది. మేము దూరము నుండియే నిన్ను దస్యు సర్దారుఁడవని గ్రహింపఁ గలిగితిమి. నిరర్థకముగ నరహత్యలను జేయరాదను నభిప్రాయముతో నీపై నస్త్ర ప్రయోగముచేసి నిన్నుఁ బడఁగొట్టితిని. నీతోఁగూడ వచ్చినవారు ప్రాణభయముచేఁ బలాయనమైపోయినారు. నిన్ను బందీగాదెచ్చితిమి. అందుచే నీవు నాప్రాణహరణార్థ మరుదెంచితివని స్పష్టముగా గ్రహింపఁగలిగితిమి.

ఇంచుకంతయును చలింపకుండ స్థిరభావముతో నాదొంగల నాయకుఁడు "మీప్రాణనాశనముకొఱకు మేము వచ్చితిమని మీ రెట్లెఱుంగగలిగితిరి?" అనియెను.

రఘు—ఓపాషండ! ధర్మము ధార్మికుల సాహాయ్యముకొఱకు, నీచమనస్కులును, పాపిష్ఠులునగు కుతాంత్రికులను పట్టియిచ్చినది. అందుచేతనే మీరెన్ని ప్రయత్నములను జేసియును నాత్మరక్షణముఁ గావించుకొనలేకపోయితిరి. నేను నీశరీరముపైఁ దగిలినగాయములను గడిగింపవలయునని నీదుస్తులను తీయించితిని. నీ యంగరఖాజేబునం దొకయుత్తరము గనపట్టినది. ఆయుత్తరమువలన నీ నీచోద్దేశములును, నీవు వచ్చినకారణములును, వ్యక్తమైనవి. నీవు మిథ్యాకథలను నుడివి యపాయమును దెచ్చుకొనుచున్నాఁడవు.

దస్యు—రెండుమూఁడు మాసములమధ్య నెవ్వరును నాకుత్తరము వ్రాయలేదు. నాయొద్ద నెట్టి యుత్తరమును లేదు. నాజేబునందున్న యుత్తరమును జదివి తన్మూలమున నేను భవదీయప్రాణ హరణార్థము నూర్గురు జనులతో వచ్చితినని మీరుగ్రహించినట్లు

చెప్పుచున్నారు. ఇది చాల నాశ్చర్యకరమును నసంభవము నై యున్నది. ఒకజీవితమును హరింపఁదలఁచుకొన్నప్పు డందుకొఱ కిట్టి యుత్తరమును సృష్టించు టొక గొప్పవిషయము కాదు.

దండతాడిత భుజంగములె బుసకొట్టుచు రఘునాథరాయలు "నీలవర్ణపుటద్దములను ధరించి చూచినచోఁ బ్రపంచమునందలి వస్తువులన్నియు నీలములుగాఁ గన్పట్టినట్లే కుత్సితస్వభావముగల మీ బోంట్ల కందఱును గుత్సితస్వభావులే యయినట్లు కన్పట్టుచుందురు. మీవంటి సామాన్యవ్యక్తుల కపకార మొనర్చినందువలన మాకు స్వార్థ మేముండును ? శిష్టానుపాలనముకొఱకు రాజానుమతి ననుస రించి మీవంటి చోరులనుబట్టి బందీలనుగాఁ జేయుచుందుము. మీ వంటి వారినిబట్టి బంధించినచో లోకమున శాంతి నెలకొనఁగలదు. నీ వెన్నిదినములనుండియో చేసినమహాపాతకమున కిప్పటికి ప్రాయశ్చిత్త సమయము తటస్థించినది. నీవు శుభాకాంక్షివైనచోఁ గపటభావ మును విడనాడి సరళభావముతో మా యిచ్ఛానుసారముగ సత్య మును వెల్లడింపుము" అనియెను.

దస్యు—మంచిది. ఏమి చెప్పవలయునని మీయిచ్ఛ ?

రఘు—నీకీయుత్తరమును రచించినవారెవరో నిజముచెప్పుము.

దస్యు—నాకెవరును నుత్తరము వ్రాయలేదనియునదిబహుశః మీవలన సృష్టింపఁబడి యుండవచ్చుననియు నింతకుఁబూర్వమే చెప్పి యుంటినిగదా !

రఘునాథుఁ డేదో నుడువఁబోయెను. కాని మలహారరావు వారించి "ఈపాపాత్ముఁడు నిజమును వెల్లడింపఁడు. వెల్లడింపక పోయినను మనకు లోపము లేదు. నీయొద్దనున్న ప్రమాణములను బట్టియే మనము కృతకార్యులము గావచ్చును. ఈనరాధముఁడు లేనిపోని మిథ్యాకథలనుజెప్పి తనపాదములను తానే తెగఁగొట్టు కొనుచున్నాఁడు. కానిమ్ము. ఇఁక నీతని నేమియు నడుగఁబనిలేదు.

అప్పుడే పట్టుకొనఁబడిన పాము బుసకొట్టునట్లే యీపాపండుఁ డసత్యములాడి తన్ను రక్షింపఁ జూచుకొనుచున్నాఁడు. ఒకదినము గడచిన పిదప విషదంతముల నూడఁబెరికిన తోడనే యాగర్వ మడఁగిపోయినట్లే యీతఁడును గొన్నిదినములు గడచినపిదప మిథ్యావాదములాడ సాహసింపఁడు" అనియెను.

మలహరరావును రఘునాథరాయలును మరల ద్వారమును బంధించి యటనుండి వెడలిపోయిరి.

—♦—

## తొమ్మిదవ ప్రకరణము

### విశ్వాసియగు సేవకుఁడు.

మల—ఈపాపంఁడునివలన నెట్టి కథయును బయలుపడలేదు. మనము వేఱొకయుపాయము నవలంబింపవలసి యున్నది.

రఘు—ఏ యుపాయము నవలంబింపవలయును ?

మల— నీయభ్యున్నతిని జూచి యోర్వలేనివాఁ డెవఁడో యీదస్యునితోఁ జేరి యుండవలయును.

రఘు—నే నెవరికి నపకారము చేసియుండలేదు. నన్ను వధించుటవలన నాతని కేమి యుపకారము గల్గునో ?

మల—మనుష్యులను జూడఁగనే కరువవలయునని సర్పము పడగయెత్తును. ఉదరపూరణముకొఱకు వ్యాఘ్రము ప్రాణిహింస సేయును. నిష్ఠుర ప్రకృతిగల నరపశువులు తమ కపకారము సేయకపోయినను ఎదుటివారియందు శత్రుత్వమువహించి వారి కపకారము సేయుచుందురు. అట్టి నరపశువులు కొందఱిచ్చట నున్నారనుట

నిశ్చయము. వారి నెట్లో నేను తెలిసికొందును. కాని సప్రమాణముగాఁ దెలియువఱకును మన మీకథ నెచ్చటను దెలుపరాదు. ఈశ్వరకృపచే మన మనోభీష్టము నెఱవేఱఁగలదు. ఇప్పుడు రాత్రి చాల బొద్దుపోయినది. ఉదయముననే లేచి కర్తవ్యమును నిర్ధారణ సేయుదము. ఈకథనుమాత్ర మెచ్చటను దెలియనీయకుము. తెలిసినచో మనయుద్దేశము విఫలమై పోవును.

ఇట్లు చెప్పి మలహారరావతఃపురమున శయనింపఁబోయెను. రఘునాథరాయలును బోయి తనశయ్యపై నొరగెనుకాని, సర్వసంతాపహారిణి యగు నిద్రాదేవి యాతనికిఁ బ్రత్యక్షము కాలేదు. ఆతని హృదయమున ననేకవిధ చింతాలహరు లుదయించి ప్రవహింపసాగెను. అందుచే జాగ్రదవస్థయందే యారాత్రియంతయుఁగడపెను.

ఇతిహాస ప్రసిద్ధమును, మహాభాగుఁడగు శివాజీమహారాజుచేఁ బ్రతిష్ఠితమును, మహారాష్ట్రులకు రాజధానియు నగు రాయఘడము నందలి సభాభవనమున విఖ్యాతచారిత్రుఁడగు బాజీరావుపీష్వా కొలువుండెను. మంత్రి, సేనాని, పేష్కార్, అమీన్ మొదలగు ముఖ్యోద్యోగులందఱును దమతమస్థానముల నలంకరించియుండిరి. విచ్చుకత్తులు కరములఁదాల్చి సేవకు లటునిటు పరిభ్రమణము సేయుచుండిరి. ఎవ్వరును మాటలాడుటలేదు. విచిత్రవేషాలంకారములతో నందఱు నటుగూర్చుండి నీరవులై యుండిరి.

ఈశ్వరుని నియమానుసారముగా నేజాతి రాజ్యము సేయుచుండునో, ఆజాతివారి రీతులు, మతము, ఆచారములు, పద్ధతులు తుదకు శిల్పిసాహిత్యము సైతము శ్రేష్ఠముగాఁ బరిగణింపఁబడుచుండును. అందఱును వాని ననుకరింపఁ దలపోయుచుందురు. విజితజాతి విజయజాతి యొక్క పదాంశముల ననుసరింప యత్నించు

చుండును. ఆజాతివా రీదుచారములన్నియు సదాచారములుగా నెంచుకొనుచుందురు. గుణములకంటె దోషములనె యెక్కుడుగా ననుకరింతురు. జగచ్చారిత్రమున మాపాఠక మహాశయు లీవిషయ మును తఱచుగాఁ జూచుచుందురు.

ఆకాలమున దేశమున మహమ్మదీయుల ప్రభ యధికముగా నుండును. అందుచే మహమ్మదీయుల రీతులును, పద్ధతులును, వస్త్రాదిధారణములును, హిందూదేశమునఁ జాలఁ బ్రతిష్ఠవహించి నవి. శాంతినికేతనతుల్యమగు హిందువుల యంతఃపురమున సయిత మీపద్ధతులు ప్రవేశించినవి. అందుల కాశ్చర్యమెందులకు?

మహారాష్ట్రులు మహమ్మదీయులకు శత్రువులనుమాట సత్యమే. కాని వారుకూడ మహమ్మదీయుల పద్ధతులను ధారణాదులను బరిత్య జింపలేకపోయిరి. వారిననుకరించియే యీదర్బారుగృహ మలంక రింపఁబడియెను. దానికి "ఆమ్‌ఖాస్ దర్బార్" అని నామకరణ మొనర్చియుండిరి. ఆసభాగృహమును వర్ణించుటకు దుర్బలయగు మాలేఖినికి సాధ్యముకాదు. చంద్రకాంతప్రస్తర నిర్మితమైన యా సభాభవనమునం దశేషకారు కార్యసంపన్నమును, శిల్పనైపుణీ విరా జితమును నగు పారసీకపు తివాసి పరుపఁబడియుండెను. ఆకస్మికముగఁ జూచినవారి కది నానావిధ వికసితపుష్పరాజి పరుపఁబడియున్నట్లు భ్రమగొల్పుచుండును. నాల్గుప్రక్కలను చిత్రకారుల యసాధారణ నైపుణ్యమును బ్రకటించుచు స్వర్ణరౌప్యనిర్మితదీపాధారము లమర్పఁ బడి యుండెను. భవనమధ్యమున రత్నఖచితమగు స్వర్ణసింహాసన మును, రౌప్యసింహాసనమును, నెత్తుగ నమర్పఁబడి యుండెను. ప్రస్తుతమున రాజ్యలక్ష్మి బాజీరావును జేపట్టినదికాని, బాజీరావు రాజమకుటమును ధరియించుటలేదు. రాజసన్మానముకొఱ కామకు

టమును స్వర్ణసింహాసనముపై నుంచి, తాను రౌప్యసింహాసనముపైఁ గూర్చుండుచుండెను.

దోర్దండప్రతాపశాలియగు బాజీరావు సకల సంపచ్ఛోభాయమానమగు దర్బారుమందిరమునఁ గొలువుండెను. ఇంతలో రఘునాథరాయలను దీసికొని మలహారరావు సభాగృహమును బ్రవేశించెను. రఘునాథరాయలు సింహాసన సమీపమునకువచ్చి యవనతమస్తకుఁడై యభివాదనముచేసెను. బాజీరావు మధురవచనములతో నాశీర్వాదమును జేసి తనయొద్దఁ గూర్చుండబెట్టుకొని కుశలప్రశ్న మడిగెను.

రఘునాథరాయలు వినయస్వరముతో బయలుదేరినది మొదలు తిరిగివచ్చువఱకును జరిగిన యావదుదంతమును విన్నవించెను. కాని యరణ్యమధ్యమున జరిగిన దారుణకార్యము విషయమున మాత్రమేమియు నుడువలేదు. పిదప మైసూరురాజొసంగిన కానుకలు, నుత్తరమును సమర్పించెను ఆయుత్తరమునుజదివి రఘునాథరాయలయెడల నాతఁడు మిగుల సంతృప్తచిత్తుఁడయ్యెను. మైసూరుప్రభువు రఘునాథరాయల సుగుణములనుగూర్చి యాయుత్తరమున నధికముగా వ్రాసియుండెను.

రఘునాథరాయల సుగుణసంపదకై బాజీరావు హృదయమున నానందమునొంది ప్రకాశముగా నాతనిని స్తోత్రముగావించెను. బాజీరావువలన రఘునాథరాయ లిట్టిసన్మానమును బడసినందులకు మలహారరావు ముఖపద్మ మానందముచే వికసించెను. కాని సభాసదులలో నొక్క సేనాని వదనమునమాత్రము స్పష్టముగా విషాదము సూచించుచుండెను. ఆతఁ డీర్ష్యాకషాయితనేత్రములతో రఘునాథరాయలను నిరీక్షింపసాగెను.

బాజీరావు నగుమొగముతో నీవంటిగొప్ప రాజనీతిజ్ఞునియెదుట బాలుడగు మైసూరురాజు తన మనోభిప్రాయమును చక్కగా వెల్లడింపక ప్రచ్ఛన్నముగా నుంచినాడు. ఇది విశ్వాసయోగ్యమైనది కాదు. అందుచే నీవాతని మనోభావముల యెడల నెట్టి యభిప్రాయమును బొందితివో నాకడఁదెలుపుము. దాని ననుసరించి మనకర్తవ్యమును నిర్ధారణ చేసికొందము'' అనియెను.

రఘునాథరాయలు ద్వారకరావుతో మైసూరుప్రభువు విషయమున నేమిచెప్పెనో యావిషయములనే మరల బాజీరావుకడ విన్నవించెను. మఱియును, మైసూరు ప్రభు వెట్లు మాటలాడెనో, ఎట్టి భావములను వెల్లడించెనో, అట్టిభావము లాతని హృదయమున లేవు. ఆతఁడిప్పటికి మీాహితైషిగాలేఁడు. మీాయభ్యుదయ మాతని హృదయమునకుఁగష్టముగానుండెను. కేవలస్వకార్యోద్ధరణమునకై మీాతో నీసంధిసూత్రమున బద్ధుఁడైనాఁడు. స్వార్థమూలకమును, కపటవ్యంజకమునగు నీసంధికి విలువలేదని నాయభిప్రాయము'' అనికూడ విన్నవించెను.

బాజీరాజు నవ్వుచు ''ఆవిషయమును నేను బాగుగా నెఱుంగుదును. మైసూరుప్రభువు నాకెట్టి బంధువుఁడో నేనెఱుఁగనివాఁడను గాను. నేను చాలకాలమునుండి యాతనిని బాగుగా నెఱుఁగుదును. జలమునఁదైలము మెప్పుడును మిళితముకానేరదు. నాహృదయముతో నాతని హృదయ మెప్పుడును గలసికొనఁ జాలదు. అవసరము ననుసరించి యాతనితో నిప్పుడీ మిథ్యాసంధిసూత్రమున బద్ధులముకావలసివచ్చినది. ఆతఁడును నేనును నైక్యముగా నున్నచో అసఫ్జాహృదయమునఁ దప్పకుండ భీతి వొడమఁగలదు. అందులకనియే మైసూరు రాజు నాతో సంధిసేయుట కనిష్టమును జూపలేదు. ఆపాతతః అసఫ్జాతో మైత్రి నెరపవలయునని నాముఖ్యాభిప్రాయము. కాని నాయంతట నేనీప్రస్తావమును దెచ్చినచో నాతఁడందుల కంగీకరింపఁడు. ఆత

నికి భయముకలుగఁజేయవలయునను నభిప్రాయముతో మైసూరు రాజుతో నీసంధితంత్రమును జరపితిని. ఇందుమూలమున నాయభీష్టము సిద్ధించి, అసఫ్‌జాతో నాకు మైత్రియొడఁగూడఁగలదు. ఇప్పుడు కొన్నిదినములు మైసూరుప్రభువుతో మైత్రిగానున్నందువలన నాతని సాహాయ్యముచే దురాణీయులను భారతవర్షమునుండి యావలకుఁ దరిమివేయవచ్చును. అనంతరమున, ఢిల్లీపాదుషాను, మైసూరురాజును అసఫ్‌జాను, ఒక్కొక్కరిగ నాశనముచేసి సర్వభారతవర్షమునందును మహారాష్ట్రరాజ్యము స్థాపించెదను. నేను నాయభీష్టసిద్ధికై నిన్ను మైసూరుకడ కంపినాఁడను. ఈవిషయమున నీవు చాలసమర్థతతోఁ గార్యమును నెఱవేర్చినాఁడవు. నాకుఁ జాలసంతసముగానున్నది. మైసూరురాజుకూడ నిన్నధికముగాఁ గొనియాడినాఁడు" అనియెను.

రఘునాథరాయలు వినీతభావముతోఁ "ఈసామాన్యకార్యమునకు నన్నింతగా మెచ్చుకొనుట మీకు నాపైఁగలవాత్సల్యమే కారణముగాని వేఱొండుకాదు. గ్రహములును, ఉపగ్రహములును, సూర్యకిరణములచేతనే ప్రకాశించుచుండును. కాని వానికి స్వప్రకాశములేదు. అట్లే భవదీయప్రభావముచేతనే కార్యములన్నియు నెఱవేఱుచుండును. మేము నిమిత్తమాత్రులము. మైసూరురాజంతగా జతురుఁడుకాఁడు. ఆతనిచాతురీజాలమున మిమ్ము బంధింపఁజాలఁడు. మీఁదుమిక్కిలి తానే బద్ధుఁడై పోవును" అనియెను.

బాజీరా వత్యంత ప్రీతిచేతస్కుఁడై యాదాత్మ్యజ్ఞాపకార్థముగ స్వర్ణఖచితమైన యొకచిత్రఖడ్గమును, నైదువేలనాణెములను, రఘునాథరాయలకు బహుమానమొసంగెను.

ఆనాఁటికి సభముగిసెను. రఘునాథరాయలును మలహారరావును దుర్గమునుండి మాటలాడుచు బయలుదేరి మలహారరావు

గృహమువంక నడచిరి. రఘునాథరాయలు మలహారరా వింటనే యుండెను.

ఆహారాదికమైనపిదప రఘునాథరాయలు తన శయనగృహమున కరిగెను. ఆతని హృదయసాగరమున నానావిధ చింతాలహరులు వచ్చి పడుచుండెను. ఇంతలో మలహారరావచ్చుటకు విచ్చేయ నాతనిని జూచి రఘునాథరాయలు లేచి దయచేసి కూర్చుండుఁడని విన్నవించెను.

మలహారరావా శయ్యపై నొకప్రక్కఁ గూర్చుండి మెల్లగా "నాహృదయమునందలి సందియము నిజమైనది. ఇఁకఁ గొంచెము ప్రమాణమేదైన దొరకినచో నపరాధిని దండించుటకు వీలగును" అనియెను.

రఘు—మీహృదయమునఁ గలిగిన సందేహమెట్టిది ? ఎట్టి ప్రమాణము మీకుఁ గావలయును ?

మల—దొంగలనాయకుని కడ దొరకిన యుత్తరములలోఁ జేవ్రాలు "భో" అనికదా యున్నది. ఆ "భో" కరమ్చందుభోసలా—యని నాయుద్దేశము.

రఘునాథరాయలు చకితుఁడయ్యెను.

రఘు—మనయొద్దనైదువేలమనసబ్దారుగానున్నకరమ్చందేనా యీమహాపరాధమును గావించినది ? మీరెట్లెఱుఁగఁగలిగితిరి ?

మల—ఆతని ప్రవర్తనము ననుసరించి మొట్టమొదట నా హృదయమున కనుమానము జనించినది. నాయనుమాన మసత్యము కాలేదు. పీష్వా నీకు రాజదూతపదవి నొసంగినప్పు డీతఁడు నాకడకు వచ్చి నీకు విరుద్ధముగా నెన్నియో చెప్పినాఁడు. ఒకవిదేశీయున కిట్టిపదవి నొసంగుట పీష్వాకుఁ దగదనియు, ఈవిదేశీయుఁ డేశత్రువు యొక్క గుప్తచరుఁడైనఁ గావచ్చుననియు నాకడ నెన్నియో చెప్పి

నాఁడు. అందుచే నేనాతని ననుమానించితిని. నాయనుమానమిప్పుడు సత్యమైనదని తలంచుచున్నాను.

రఘు—సత్యమని తలంచుటకుఁ గల కారణములేవి?

మల—దర్బారు గృహమునందున్నప్పుడు నేను సదా యాతని ముఖలక్షణాదులనే పరీక్షించుచున్నాఁడను. మొదట నిన్నుఁజూచిన తోడనే యాతని మొగము ముడుచుకొనిపోయినది. పిదప పీష్వా నిన్నుఁ గొనియాడి నీకు ఖడ్గమును, అయిదు వేలనాణెముల నిచ్చుట తోడనే యాతనిమొగము నల్లవడిపోయినది. వ్రేటువేసినను రక్తము లేదు. ఆతఁ డీర్ష్యాకషాయితలోచనములతో నీవంకఁ జూడసాగి నాఁడు. మానవులలో నంతటికుటిలుఁడింకొకఁడుండఁజాలఁడు. ఆతని భావములన్నియు ముఖమునఁ బ్రతిఫలించినవి. ఆలక్షణములన్నిఁ టినిజూచి యాతఁడే నీయరిష్టమును గోరుచు దొంగలసర్దారునితోఁ గలసి యీకుట్రను బన్నెనని నేను నిశ్చయించితిని.

రఘు—నేను కరమ్‌చందున కేమియు నపకారము చేయలేదు. నాకును నాతనికిని శత్రుత్వములేదు. ఆతఁడెందులకు నాప్రాణములను దీయ యత్నించుచుండెనో తెలియఁజాలకున్నాఁడను.

మల— ధర్మజ్ఞానశూన్యులును పరశ్రేయసహన విహీనులు నగు మానవులకు శత్రుత్వ మిత్రత్వములతోఁ బనిలేదు. గుడ్లగూబ సూర్యకిరణముల నెట్లుసహింపలేదో అట్లే ఈర్ష్యాళువులగు మానవు లితరుల యౌన్నత్యమును సహింపలేరు. ఎట్లో వారి నంతమొందింప వలయుననియే చూచుచుందురు. నీవు కరమ్‌చందునకపకారము చేయలేదను మాట సత్యమే. కాని నీవాతనికంటె నెక్కువపదవియం దుండుటచే నీవాతనికి ఘోరశత్రుఁడవైనాఁడవు. నిన్నీప్రపంచమున లేకుండఁ జేయఁగలిగినచో నాతని హృదయవేగము శమింపఁ గలదు. అందులకై యీపాపాత్ముఁ డిట్టిపని తలపెట్టినాఁడు. ఆ

పాపాత్ముఁడొక్కఁడే యీపని చేయలేదు. ఆతనితోఁగూడ నింకొకఁడున్నాఁడు. వారిరువురును గలిసి యీకార్యము నడుపుచున్నారని తోఁచుచున్నది.

రఘు—ఆతనితోఁగూడ నున్నవాఁడెవ్వఁడని మీయభిప్రాయము?

మల—భాస్కరపండితుఁడను నింకొక బ్రాహ్మణుఁడున్నాడు. ఆతఁడుకూడ నీకుట్రలోఁ జేరియున్నాఁడని నాయనుమానము— నీకు విరుద్ధముగా నాతఁడుకూడ కొన్నివిషయములను నాకడఁ జెప్పినాఁడు. కరమ్‌చందునికంటె భాస్కరపండితుఁడు మిగులనేర్పరి. తనహృదయమును పైకిఁ దెలియనీయకుండుటలో చాలసమర్థుఁడు. ఎట్లయినను నాతనిమూర్తికూడ కొలఁదికాలములోనే బయల్పడునని నానమ్మకము.

రఘు—బయలుపడుట కేమియు మార్గములు గన్పట్టుటలేదు. ప్రాణాంతమునకైన నంగీకరించునుగాని యాతస్కరనాయకుఁడా నిజమును జెప్పుట కంగీకరింపఁడు. కరమ్‌చందే యాయుత్తరము వ్రాసెనని చెప్పుటకేమి ప్రమాణమున్నది? ఆతఁడు స్వహస్తముతో నీయుత్తరమును వ్రాసియుండఁడుకదా?

మల—ద్రవ్యమునకాశించి పాపకార్యములకు సాహాయ్యము సేయునాతఁడు తనకాపద రాకున్నచో మన మెక్కువ ద్రవ్యమిచ్చెదమని యాశఁగల్గించితిమేని మనకడ నిజమును బయలుపఱుపఁగలఁడు. నక్క యొకచోట యీలవైచి యొకచోట గొరికళ్యాణము పాడదు. ఆపాపాత్మ లెవనిసాహాయ్యమున నీతంత్రమును నడఁపుచున్నారో విశ్వాసియగు నాసేవకుని మూలమున మనమన్నియును దెలిసికొనవచ్చును. తన్మూలమున నాదురాత్ముల సర్వనాశము సంభవింపఁగలదు.

రఘు— ఆతఁడుమనయొద్దకు వచ్చుటెట్లు? ఈకథ వెల్లడి యైనచో నాతఁడును దండనార్హుఁడే యగునుగదా! ఆతఁడుకూడ నీ దారుణకర్మమునకు సాహాయ్యము చేసినవాఁడేకదా!

మల—కాదు. కాదు. ఆతఁడు దండనార్హుఁడు కాకపోవుటయే కాక ప్రభుత్వమువారిచే బహుమానమునుగూడఁ బొందఁగలఁడు. ఏమనిన, ఆతఁడు విశ్వాసముగల సేవకుఁడు. తన యజమానిచేయు, మనినపనిని చేసినాఁడు. ఆయుత్తరమునం దేమున్నదో యాతఁడేమెఱుఁగును? ఏమిగూఢమైన రాజకీయకార్యములున్నవో యని సేనాపతి యాజ్ఞానుసారముగా నావిషయమును రహస్యముగా నుంచినాఁడు. ఉత్తరమును జేతికిచ్చి కొన్ని సాంకేతికకథల నాసేవకునితోఁ జెప్పినాఁడనుకొందము. అంతమాత్రముచేత సేవకుని తప్పులేదు. ఉత్తరమునం దెట్టి దారుణమునుగూర్చి లిఖింపఁబడియుండెనో యాతఁడెఱుంగఁడు. పత్రవాహకుఁడై నంతమాత్రమున పాపకార్యములకుఁ దోడుపడినాఁడని యాతనిని దండించుట పాడిగాదు.

రఘు—ఔను. అది బాగుగనేయున్నది. కాని అట్టిసాక్షి మన కెక్కడ దొరకును?

మల— అట్టి మిథ్యాసాక్షిని సృష్టింపవలయునని నాయభిప్రాయము కాదు. ఆపాపాత్ముఁ డెవనిచే నీయుత్తరమును బంపినాఁడో వాని కనేకవిషయములు తెలిసియుండును. రంగరాజును బట్టుకొనినవానికి పదివేలరూపాయలు బహుమానమీయఁబడునని ప్రకటించియుంటిమికదా! ఆద్రవ్యమిచ్చెదమని యాశపెట్టినచో యావదుదంతమును నాతఁడే చెప్పును. ఇందుమూలమున మన మనోరథమీడేరఁగలదు.

రఘు— ఆమాటనిజమేకాని, కరమ్‌చంద్‌కడ నైదువేల యశ్వారోహకు లున్నారు. అందెవరిచే నీయుత్తరమును బంపినాఁడో మన మెఱుంగవలసి యున్నది.

మల—ఆవిషయమును దెలిసికొనుటకు నలుగురైదుగురు గూఢచారులను నియమించితిని. కొలఁదిదినములలోనే వారాతనిని బట్టుకొనఁగలరు. కరమ్‌చంద్ తన కత్యంత ప్రియసేవకునిఁ దక్కన్యుల సేవనికి నియమింపఁడు. ఎవనిపైనాతఁడు విశేషదయగలిగి యున్నాఁడో, ముందు తెలిసికొనవలసియున్నది. ఆతఁడెవరియందు నిర్దయుఁడై నిరంకుశాధికారమును జూపుచుండునో వారివలన నీవిషయము చక్కఁగాఁ దెలియును. ఇవియన్నియును బాగుగాఁ బరికించి చూచుచుఁ దెలిసికొన నారంభించితిమేని యీకార్యమున నియుక్తుఁడైనవాఁడెవఁడో నిశ్చయింపవచ్చును. ద్రవ్యలోభముచే నాతఁడు నిజమును బయల్పఱచును. తన్మూలమున నాతనిప్రభువును నాశము చేయఁగలము. ఈకథను వెల్లడించినచో నాతనికేమియు నాపదలేదని యాతఁడు తెలిసికొనునట్లు చేయవలయును. అట్లుచేసితిమేని నాతఁడు మనయెడల కపటముగాఁ బ్రవర్తింపఁడు.

రఘు—పూర్వజన్మమున మీరునాకు మిగులనాత్మీయులరై యుండవలయు. లేకున్న మీకిప్పు డింతదయ నాపై యేలకలుగవలయును? నానిమిత్త మింతకష్టమునొందు టేల?

మల—ఆదురాత్ముఁడు నీచోద్దేశములతో నరహత్యను జేయఁదలపెట్టినాఁడు. అట్టి నరాధముఁడు ప్రపంచమున కంతకును శత్రువు. ఆతనిని దండింపకపోయినచో రాజకార్యములు చాలభంగములైపోయి ధర్మము నశించిపోవును. ఆతనిని దండించుటకై నావిద్యుక్తకార్యములను నెఱవేర్చుచున్నాఁడను. ఈశ్వరానుగ్రహమువలన నల్పకాలములోనే నామనోరథమీడేఁరఁగలదు.

మలహరరావిట్లు పలికి నవ్వుచు నాస్థానమునువీడి వెడలిపోయెను. రఘునాథరాయలు మరల చింతాప్రవాహమున నిమగ్నుఁడయ్యెను

ఇంచుమించు పదిపండ్రెండు దినములు గడచిపోయినవి. మల హరరా వొకనాఁడు సమయమునుగని పెట్టి బాజీరావుతో రహస్యముగ చంద్రరావుకిల్లాకడ జరిగిన యావదుదంతము నాద్యోపాంతముగ విన్నవించెను. ఆకథనంతయును విని పీష్వా రఘునాథరాయల బల మును, బుద్ధికౌశలమును గొనియాడి సంప్రీతచిత్తుఁడయ్యెను. కాని, యీవిషయము నెవ్వరికడను వెల్లడించక సమయమునకై నిరీక్షించు చుండెను.

ఈనడుమ మలహరరావు దొంగలనాయకునికడకు వచ్చుచుఁ బోవుచుండెను. కాని, యాతఁడుమాత్ర మించుకంతయును చోటీయ లేదు. ఆతఁడు మొదట నేవాక్యములనుచెప్పెనో యంతియేకాని మరల నేమియు చెప్పలేదు. మలహరరావు చతుర్విధోపాయములను జూపిచూచెను. కాని కార్యము లేకపోయెను.

కరమ్‌చందునకు గిరిధరలాలను నొక యత్యంతప్రియభృత్యుఁడు కలఁడు. ఆతఁడెట్లుండునో, ఆతనివలన నెఱుంగవలసిన విషయము లెవ్వియో, మొదలగునవి యన్నియు మలహరరావు తనగూఢచారు లకు చెప్పిపంపెను. రహస్యముగా నాతనిని తన గృహమునకుఁ బిలిపించుకొని మలహరరావు కొన్నిప్రశ్నముల నడిగెను. మొట్ట మొదట గిరిధరలాలు తస్కరనాయకుని విషయమున నేమియు నెఱుఁగ నని బదులుచెప్పెను. అనంతరమున చతురుఁడగు మలహరరావు బాజీరావు చేసిన ప్రకటనపత్రమునుజూపి పదివేలరూపాయల నెందుకు బోఁగొట్టుకొనెదవు ! నిజముచెప్పుము" అని యడిగెను. గిరిధరలాలు విచలితుఁడై హృదయమున నానందసాగరమున నోలలాడుచు "నేనీ యానదుదంతమును వెల్లడించినచో నీకుతంత్రమునకు సాహాయ్యముఁ జేసితినని నన్నుఁగూడ దండింతురేమో" అనియెను.

మలహరరా వాతని ననునయించుచు "లేదు. నిన్నెంతమాత్రమును దండింపరు. దండింపకపోవుటయేగాక సప్రమాణముగా అపరాధులను నిర్ణయించినచో నీకుఁబదివేలరూపాయలు బహుమానముగా నీయఁగలరు. ఇంతియేగాక మేముగూడ నిన్నుచాల గౌరవముతోఁ జూచుచుందుము. నీవిఁకముందెచ్చటను సేవసేయనక్కఱయుండదు. నీజీవితమును సుఖముగా గడపవచ్చును. సైనిక నియమానుసారముగ సేనాధిపతి యాజ్ఞను శిరసావహించుట నీకుఁగర్తవ్యము. నీకర్తవ్యమును నీవు చేయకపోయినచో దండనార్హుఁడ వగుదువు. అదిగాక నీవు కేవల పత్రవాహకుఁడవు. పత్రిమున నేమిలిఖింపఁబడియున్నదో నీకుఁదెలియుట యసంభవము. అందుచే కుట్రిచేయువారిలో నీవొకఁడవని నిశ్చయించి దండించుట కవకాశములేదు. ఒక యపరాధమునకింకొకఁడు శిక్షింపఁబడరాదు. మేముండఁగా నీకు కరమ్ చందేమియు నించుకంతయు నపకారమును జేయలేఁడు. ఆతని యపరాధము చాల గురుతరమైనది. అతనిని రక్షించువారుండరు. అపరాధులకు కఠిన దండనముతప్పదు. నీవు మాయిచ్చానుసారముగఁ బ్రవర్తించితివేని నిన్నుఁదప్పక రక్షింతుమని శపథముచేయుచున్నాఁడను. దొంగల నాయకునిఁబట్టి యిచ్చినందులకై నీకుఁ బదివేలరూపాయలు లభింపఁగలవు. ధర్మసాక్షిగా నీకీమాటలను జెప్పినాఁడను.

గిరిధర— మీవంటి మహానుభావుల వాక్యము లెన్నఁడు నసత్యములు కాఁజాలవు. ఆవిషయమున నాకుఁ జాల నమ్మకము కలదు. మీయిచ్చానుసారముగ నడువ నంగీకరించితిని.

మల—అట్లయినచో పదివేలరూపాయలు నీకు లభించినవియే. నేనిప్పుడు నిన్నుఁ గొన్ని ప్రశ్నముల నడిగెదను. సదుత్తరములనిమ్ము.

గిరి— చిత్తము. ప్రశ్నింపుడు.

మల—మంచిది. తస్కరనాయకునికడ కుత్తరమును గొంపోయినవా రెవరు?

గిరి—కరమ్ చంద్ యాజ్ఞానుసారముగ నేనే యుత్తరమును గొనిపోయితిని.

మల—రంగరావుసోపాలాను నీవానవాలుపట్టఁగలవా?

గిరి—చిత్తము. పట్టఁగలను.

మల—నీవాతని నెన్నిపర్యాయములు చూచినాఁడవు?

గిరి—ఆఱేడు మారులు చూచితిని.

మల—నీవాతని నెందులకుఁ జూడవలసివచ్చినది?

గిరి— నేను ప్రత్యేక ముత్తరములను దీసికొనియేపోయితిని. చంద్రారావుకిల్లా యాతనికి నివాసస్థానము. రెండుమూఁడుమారులు నేను తిరిగివచ్చునప్పుడు నాచేతఁ గరమ్ చందునికడకు రూపాయల నిచ్చి పంపుచుండెడివాఁడు.

మల—ఎన్నిరూపాయల నంపుచుండెడివాఁడు?

గిరి—ఒకసారి వేయిరూపాయలు. మఱియొకసారి యైదువందలు.

మల—మంచిది. సాపోలా యీధనముతోఁగూడ నేవైన నుత్తరముల నొసంగుచుండెనా?

గిరి—ఉత్తరములనుగూడఁ బంపుచుండెడివాఁడు.

మల—కరమ్ చందు ఆయుత్తరములను చదువునప్పుడెవ్వరైన నుండెడివారా?

గిరి—నేనుత్తరములనుమాత్రము తెచ్చి యిచ్చెడివాఁడను. కాని, ఆయుత్తరములను జదువుచుండఁగా నే నెప్పుడునుజూడ లేదు.

మల—మంచిది. కరమ్ చందీయుత్తరముల నెచ్చట దాఁచి యుంచునో నీ వెఱుఁగుదువా?

గిరి—ఆతని విశ్రామగృహమున నొకచో గోడయం దమర్పఁబడిన లోహపుసందుగయం దీయుత్తరములు జాగ్రత్తగ నుంచఁబడుచున్నవి.

మల— మంచిది. కరమ్‌చందు తస్కరనాయకున కంపెడి యుత్తరములన్నియు నెవరిచే వ్రాయించుచుండెడివాఁడో నీవెఱుఁగుదువా ?

గిరి—ఎఱుఁగను. ఆతఁడెవనిచేతను నుత్తరములను వ్రాయించుచుండఁగా నేనుజూడలేదు. గణేశ్వరమూర్తి చిహ్నితమైనముద్ర యొకటి కరమ్‌చందుకడ నున్నది. ఆతఁ డీయుత్తరములపై నా ముద్రను వేయుచుండఁగా నేను చూచినాఁడను.

మలహారరావు తత్క్షణమే రఘునాధరాయలు రంగరాజుకడ నుండి తెచ్చిన యుత్తరమును తీసికొనివచ్చి చూడ దానివెనుకవైపున నీముద్ర వేయఁబడి యుండెను. మలహారరా వాయుత్తరమును గిరిధరలాలునకిచ్చి "బాగుగా చూడుము. ఇవి యెవనిహస్తాక్షరములు" అనియడుగ గిరిధరుఁడు బాగుగా నిదానించిచూచి "ఇవి యెవనిచే లిఖింపబడియెనో, నేను చెప్పఁజాలను. ఇవి కరమ్‌చందు హస్తాక్షరములుకావు" అనియెను.

మల—మేమును నట్లే యనుమానించితిమి. ఆతనివంటిధూర్తవ్యక్తి యట్టిపని యెన్నఁడు జేయఁడు. కరమ్‌చందు గణేశ్వర ప్రతిమూర్తిగల ముద్ర నెచ్చటదాఁచియుంచునో, నీవెఱుఁగుదువా ?

గిరి—ఆముద్రను ఆసందుగనుండియే తీయుచుండఁగా నేననేకమారులు చూచితిని. బహుశః యీముద్రనుగూడ నా లోహపు సందుగయందే దాఁచి యుంచవచ్చును.

మల—ఇందువలన మామనోరథసిద్ధి కాఁగలదు. నీవిఁక నా స్థానమునకుఁబోవలసిన యావశ్యకము లేదు. మాగృహమునఁ

ప్రచ్ఛన్నభావముతో నుండుట కంగీకరించెదవా ? నీవెచ్చటనున్నాఁడవో యెవ్వరికిని సూచనగా నైనను దెలియరాదు. అనంతరమున నీవు పదివేలరూపాయలను గైకొని నీయిష్టమువచ్చినచోటకుఁ బోవచ్చును. కరమ్చందు నీపైఁ గ్రోధమువహించునను మాట నిశ్చయము. కాని, నిన్నేమియుఁ జేయఁజాలఁడు. ప్రపంచమున నందఱును స్వలాభమును గోరువారే. నీయజమాని తనస్వలాభముకొఱకు నిన్ను సింహముయొక్క గుహలోని కంపినాఁడు నీకును నాతనికిని నేవిధముగానైన నించుక వివాదము సంభవించెనేని నిన్ను గడ్డిపరకవలెఁ జూచి యొక్క తన్నుఁదన్ని యావలకు సాగనంపఁగలఁడు. కరమ్చందున కత్యంత విశ్వసనీయభృత్యుఁడగు గిరిధరలా లించుక యోచించి, మలహారరావు చెప్పినట్లు చేయుట కంగీకరించెను. మలహారరావాతని నివాసముకొఱ కొకరహస్య ప్రదేశమునుజూపి యాతఁడీవలకు రాకుండ ద్వారమును బంధించెను. గిరిధరలాలు బందీవలె మలహారరావు గృహమున వాసముచేయుచుండెను.

—♦—

## పదియవ ప్రకరణము

### భయంకరమైనకుట్ర

మలహరరావు గిరిధరలాలు చెప్పినదంతయును రఘునాథరాయలకెఱింగింప నాతఁడచ్చెరువుపడి మలహారావు బుద్ధికౌశలమును గొనియాడి "గిరిధరలాలు మనపక్షమవలంబించి తన యజమానుని నాశనముచేయుట కంగీకరించెనుకదా ! మనమాతనిని—పాపము—బందీగాఁ జేయుటెందులకు ?" అని యడిగెను.

మలహారరావు నవ్వుచు విశ్వాసఘాతుకులైన నరాధముల మాటలకు విలువయుండదు. ఆతని హృదయమున నెప్పుడెట్టి పరివర్తనము గలుగునో యెవ్వరెఱుంగుదురు ? ఆతఁ డెవ్వరికడనైన నీకథను వెల్లడించునేమోయని యాతనిని బందీగా నుంచితిని. మన దృష్టిపథమునుండి యాతని నావలకుఁ బోనిచ్చుట మంచిపనికాదు. స్వార్థముకొఱకు విశ్వాసహీనుఁడై తన యజమానున కపకారము చేయఁదలపెట్టినవాఁ డెంతపనియైనఁ జేయఁగలఁడు. కపటులకడ కపటమార్గములనే యవలంబింపవలయును. అందుచే గిరిధరలాలును మనదృష్టిపథమునుండి దాఁటిపోనిచ్చుటలేదు” అనియెను.

రఘు—తన ప్రభువున కపకారము జరుగునని యాతఁడేమియు సంకోచింపలేదు. అట్టివాఁడు మనలను నమ్మియున్నాఁడనియు వాని వలనఁ గార్యసాఫల్యమగుననియు మనమెట్లు నిశ్చయింపఁగలము ?

మల—మనమాతని నిప్పుడు సంపూర్ణముగా నమ్మవచ్చును. న్యాయనిష్ఠుఁడగు బాజీరావు తనను దండింపఁడనియు సాహోలాను బట్టుకొన్నందులకై బహుమతికూడ నొసంగెదనని బ్రకటించియున్నాఁడనియు నాతఁ డెఱుంగును. ఇది తనయదృష్టమువలననే లభించినదియు, పదివేలరూపాయలు దనకు లభించుననియు నాతఁ డనుకొనుచున్నవాఁడు. చాలకాలమునుండి కరమ్‌చందునకుఁ బ్రియభృత్యుఁడైయున్నను నాతనివలన నొక్కరూపాయినైనను దనకు లభింపలేదనియు, కరమ్‌చందున కపకారము గలుగుచున్నందువలనఁ దనకేమియు నష్టములేదనియు నొక్కమారుగాఁ బదివేలరూపాయలు తనకు వచ్చుచున్నప్పు డూరకుండఁ జనదనియు ననుకొని గిరిధరలాలు యజమానుని నాశనముచేయుటకుఁ గృతసంకల్పుఁడయి యున్నాఁడు. ద్రవ్యలోభముచే నాతఁడు మనయిష్టమువచ్చినట్లు ప్రవర్తించును.

కరమ్చందు చేసినకార్యములన్నిటిని వ్యక్తపఱుపఁగలఁడు. అందుల కించుకంతయును సందియములేదు. కాని మనమాతనిని నమ్మరాదు. ధర్మజ్ఞానశూన్యులును, క్రూరకర్ములును స్వార్థలోలురు నగు పాపాత్ములతో సంబధంము పరిణామమున నీవిధముగా విరసమైపోఁగలదు. స్వార్థము సిద్ధించినచో నాసంబంధులను సర్వనాశనము చేయుటకు వారించుకంతయు సందేహింపరు. అందుచేతనే మన మెవరితోనైన స్నేహముచేయవలసినప్పుడు వారు ధర్మజ్ఞాన విశిష్టులగుదురా కాదాయని వితర్కించి తెలిసికొని మఱి చేయవలయును. ధర్మజ్ఞానశూన్యులగు మానవులు పశువులకంటె నధములు; రాక్షసులకంటె క్రూరులు. అతి సామాన్య కారణమునలనఁగూడ ఘోర విశ్వాసఘాతుక కార్యమునుచేయుటకు సంశయింపరు. అట్టిమానవులతో నీప్రపంచమున నెట్లు ప్రవర్తింపలయునో బాగుగాఁ దెలిసికొనవలసి యున్నది. అపాత్రులయెడ విశ్వాసముంచినచోఁ బరిణామమున మహాపద సంభవింపఁగలదు. అందుచే విశ్వాసఘాతుకుఁడగు నాభృత్యునియెడల మనము నమ్మకముంపఁజనదు.

మలహరరావిట్లు రఘునాధరాయలతోఁజెప్పి పిదప దర్బారునకు వెడలిపోయెను. ఆనాఁడు రఘునాధరాయలు దర్బారునకుఁ బోక యింటికడనేయుండెను.

మఱునాఁడు మధ్యాహ్నమున భోజనముచేసినపిదప రఘునాధరాయలు నిజగృహమున విశ్రమించెను. ఇంతలో మలహరరావు భృత్యుఁడొకఁడు లోనికివచ్చి యొకయుత్తరమును రఘునాధరాయల చేతికిచ్చెను. ఈయుత్తర మెవరిచ్చిరని రఘునాధుఁడడుగ "ఒక బ్రాహ్మణుఁడీ యుత్తరమును మీకిమ్మని నాచేతికిచ్చి వెంటనేవెడలి పోయినాఁడు", అనిచెప్పి భృత్యుఁడాతని కభివాదనముచేసి యట నుండి తరలిపోయెను

భృత్యుఁడావలకుఁబోయినతరువాత రఘునాథరాయలాయుత్త రమునువిప్పి చదువనారంభించెను. అందిట్లు లిఖింపఁబడియున్నది.

పరమకళ్యాణగుణులగు శ్రీయుత రఘునాథరాయలకు—

శతసహస్రాశీర్వాదములుచేసి చేయువిజ్ఞాపనము:—ఉభయకుశలోపరి. చాలదినములనుండి మీదర్శనము సేయవలయునని యనేకదేశములు తిరుగుచుంటిని. తుదకీ మహారాష్ట్రదేశమున మిమ్ముఁజూడఁగలిగితిని. భూతిచేఁగప్పబడిన యగ్నివలె మీరు ప్రచ్ఛన్నవేషముతో నున్నను తేజముమాత్రము నశించిపోలేదు. మిమ్ములను దెలిసికొనుటకు చాల కాలము పట్టలేదు. నీవీయవస్థలో నెన్నాళ్లుందువో నీగౌరవ ప్రతిష్ఠ లెట్లు వృద్ధియగునో చెప్పుటకై నేను నీదర్శనమునకు రాలేదు.

నేను వచ్చినకారణము సమక్షమున మాటలాడుకొనవలయును గాని, ఈయుత్తరమున వ్రాయుట మంచిదికాదు. నారాక బహు రహస్యముగా నుంచుటావశ్యకము. పట్టణమున కించుమించుగ మూఁడుక్రోశములదూరములో, పురాతనదేవాలయమొకటియున్నది. దానిచుట్టును చందనపువనమును, ఆమ్రవనమునుగలవు. ఆ ప్రదేశమునకు రాత్రి పదునొకండుగంటలైనపిదప నీవొక్కఁడవునువచ్చి నాకు దర్శన మొసంగవలయును. నేనాప్రదేశమున నీకొఱకు నిరీక్షించుచుందును. నేననేక శ్రమలకులోనై యీదేశమునకువచ్చితిని. నీవువచ్చుట మానవలదు.

నీ యత్యంతహితాభిలాషి
పూర్వపరిచిత బ్రాహ్మణుఁడు.

ఉత్తరము చదివినతోడనే రఘునాథరాయలు గభీరచింతాకూపమున నిమగ్నుఁడైపోయెను. తనలోఁదానిట్లనుకొనుచుండెను. "ఈయుత్తరమును వ్రాసినవారెవ్వరు? ఇంతకష్టపడి యాతఁడిక్కడ

కెందులకువచ్చెను ? నాహృదయమున భయసందేహములు పెనఁగొనియున్నవి. కాని యీవిషయమున మలహరరావుతో నేమియు నాలోచింపరాదు. ఆలోచించితినా యీవదుదంతమును జెప్పవలసి వచ్చును. చెప్పకపోయితినా వంచకుఁడనై పోవుదును. మిథ్యావాది నని యాతఁ డనుమానించును. ఆతఁడు నాయందెంతయో స్నేహ భావముఁగలిగియున్నాఁడు. అదియంతయు నిందుమూలమున తిరోహితమైపోవును. అందుచే నీయుత్తరసంబంధములగు విషయముల నెంతమాత్రమును నాతనికడ నుడువరాదు. నాసందేహములన్నిటి నణచివేసి, రాత్రియందఱును నిద్రించినపిదప రహస్యముగా నేనా నిర్దిష్టస్థానమున కేగెదఁగాక !" అని నిశ్చయించుకొనియెను.

రఘునాథరాయలు దినమంతయు నశాంతభావముతోఁ గడపి సాయంతనమైనపిదప మలహరరావు కడ కరిగెను. కాని యాతనితో నీవిషయమై యేమియుఁ బ్రస్తావింపలేదు.

రాత్రి పదిగంటలైనది. అందఱును నిద్రఁబోవుచుండిరి. రఘునాథరాయలు శయ్యనువిడిచి లేచి, ఒక్క ఖడ్గమునుమాత్రము సాహాయ్యముగాఁగొని రహస్యద్వారమున మెల్లమెల్లగా వెలుపలకు వచ్చి యేకలింగేశ్వరుని పురాతనమందిరమువంక నడచుచు మూఁడు క్రోశములనుదాఁటి చందనవనసమీపమున కరిగెను.

సాహసమునువహించి ఖడ్గము నొరనుండితీసి చేతఁబూని నిర్భయహృదయముతో రఘునాథరాయ లరణ్యమధ్యమునఁ బ్రవేశించెను. కుముదినీకాంతుఁడు గగనగర్భమున జననమంది తనసుధా కిరాణరాశిని భూతలమునఁ బ్రసరింపఁజేయుచుండెను. వృక్షపత్రము లస్పష్టచంద్రికాంతివిశిష్టమగు భూతలముపై నొక్కొక్కటిగ రాలి పడుచుండెను. రఘునాథుఁడు వనమధ్యమునకేగి యేకలింగేశ్వరుని యాలయసమీపమునఁ గూర్చుండెను.

ఈ యాలయమున చాలదినముల క్రిందటఁ బ్రతిష్ఠింపఁబడిన దగుటచే జీర్ణమైయుండెను. ఈయాలయమునకు నాల్గుదిక్కులను సమీపమున నొక్కగ్రామమైనను లేదు. ఈ యరణ్యప్రాంతమున చిన్నకుటీర మొకటిమాత్ర మున్నది. అందియేకలింగేశ్వరునిపూజారి నివసించుచుండెను.

ఆ యాలయమునకుఁ జుట్టును నర్ధక్రోశముదూరము చందనవనమును, నామ్రవనమును వ్యాపించియుండెను. ఆనడుమనుండి కాలిత్రోవ యొకటికలదు. పట్టపగలు జాగ్రత్తగాఁ బరికించి చూచినఁగాని యాత్రోవ దృష్టిగోచరముకాదు. రాత్రికాలమున సామాన్యమగు వెలుతురుసాహాయ్యమున నామార్గమును గనిపెట్టుట రఘునాథరాయలకు సాధ్యముకాదు. అందుచే నతఁడేఁకముందునకు నడువలేకపోయెను. ఖడ్గసాహాయ్యమున నడ్డముగానున్న లతలను చిన్నచిన్న కొమ్మలను తెగగొట్టి దారిచేసికొనుచు మెల్లమెల్లగా నడుగులిడుచుండెను. తుదకు ఆలయప్రాంగణముకడకువచ్చి చంద్రకాంతిసాహాయ్యమున నాయాలయమును దిలకించుచుండెను. ఆలయసమీపమున నాలుగైదు గజముల భూమి వాకిలిక్రింద విడువఁబడియుండెను. దానిపై వృక్షములేమియునులేవు. దాని మధ్యస్థలమున పురాతన వటవృక్ష మొకటిమాత్రము శాఖప్రశాఖలతోఁ బెరిఁగి యించుమించు నాలుగువేల చదరపుటడుగులువఱకు వ్యాపించియుండెను. తీర్థసంవాసులు విశ్రమించుటకై యావృక్షచ్ఛాయను విశాలమైనయరుఁగులు కట్టబడియుండెను. రఘునాథరాయలు వనభూమినిగడచి యాలయప్రాంగణమునకు వచ్చికూర్చుండి, వనమును, ఆలయమును, ప్రాంగణమును బరికించుచుండెను.

రఘునాథరాయలవంటి బుద్ధిమంతుఁ డొక యుత్తరమును చూచినంతమాత్రమున రాత్రికాలమున నింతకష్టపడి యీనిర్జన ప్రదే

శమున కెందులకువచ్చెను? తనను పుత్త్రునికంటె నధికముగఁ జూచుకొనుచున్న మలహరరావునకైన నీసంగతి తెలుపకుండ నొక్కఁడును ప్రాణాపాయకరమగు నీసాహసకార్య నేలచేయవలయును? ఎందుల కిట్టి యకార్యకరణమునఁ బ్రవృత్తుఁడైనాఁడు? దీనికేదియే నొక రహస్యకారణ ముండియుండవలయును. ఉత్తరమును జూచినతోడనే రఘునాథరాయల హృదయమున నెట్టిభావము లుత్పన్నములైన్నవో యెవ్వరు నెఱుగరు. ఏదియో విశేషకారణముండినఁగాని యిట్టి నిశీథకాలమున నెవ్వరితోడను జెప్పకుండనిట్టిదుర్గమస్థానమున కొంటరిగ వచ్చియుండఁడు. అట్టి విశేషకారణమేదియో మేము తెలుపకపోయినను కుశాగ్రబుద్ధులగు మాపాఠకమహాశయులు సులభముగఁ దెలిసికొనఁగలరు?

రఘునాథరాయ లక్కడఁ గూర్చుండి విస్మయవిస్ఫారితనేత్రములతో నాల్గుదిక్కులనుబరికించెను. ఇంతలో నావటవృక్షతలమునుండి యొకమూర్తి తనవంక వచ్చుచుండుటనుజూచెను. ఒక్కపరి యత్యద్భుతానంత నిమగ్నుఁడయ్యెను. కాని యొక్క ముహూర్తములోపల నాతని ముఖకమలము గంభీరాకృతి ధాల్చెను. ఆ యస్పష్టచంద్రాలోకమున నాయాగంతుకమూర్తి యోద్ధృవేషముతో నొరనుండి పైకిఁ దీయఁబడియున్న ఖడ్గమునుధరించి వచ్చుచుండుటను జూచి రఘునాథరాయ లించుకయు విలంబనముసేయకుండ నొరనుండి ఖడ్గమును బెరికి చేతధరించి హృదయమున నొక్కమారు సర్వదుర్గతినాశనియైన జగదంబకు వందనమొనర్చెను.

ఆగంతుకుఁడు క్రమముగా ముందునకువచ్చి యెనిమిది పది గజముల దూరముననుండి, అపహాస్యస్వరముతో "రాయ్‌జీ !సలామ్! నీదర్శనము చేయవలయునని చాలసేపటినుండి యిటనే కనిపెట్టుకొని

యున్నాను. నీవు నన్ను నాశనము సేయవలయునని మంత్రిపుత్త్రుని సాహాయ్యముచే విశేషప్రయత్నము సేయుచున్నాఁడవు. నీవుమిగుల నేర్పరివి. కాని నీచాతుర్యము మాకడఁ బనికివచ్చినది కాదు. నీవజ్ఞాతవేషముతోనున్న విదేశీయుఁడవని తెలిసికొంటిమి. అందులకే నీకిట్టి యుత్తరమునువ్రాసితిమి. ఆయుత్తరము నట్లు వ్రాయకపోయి నచో నిట్టి నిశీధకాలమున నొంటరిగా నిటకు వచ్చియుండవు. నీవు బాజీరావు నేత్రములలో నిసుకచల్లినాఁడవు. అందుచే నిన్ను బుద్ధిమంతుఁడవనియే చెప్పవలసియున్నది. కాని నేను బుద్ధిమంతుఁడనో వివేకహీనుఁడనో నీవొక్కసారి యోచించి చూచుకొనుము! అది యటుండనిమ్ము. నీవు మమ్ములను సంపూర్ణముగా నాశనముసేయ వలయునని తలఁచినాఁడవు. అందులకై నిన్నీలోకమున లేకుండఁ జేయుట మాకుఁగర్తవ్యము. ఈశ్వరేచ్ఛచే నీవిప్పుడు వలలోఁ జిక్కుకొనియున్నాఁడవు." అనియెను.

ఆగంతుకుఁడెవఁడో, ఆతని యుద్దేశమేదియో, రఘునాథ రాయలకు స్పష్టమయ్యెను. తత్క్షణమే యాతఁడు క్రోధవివశ హృదయముతో నొరనుండి ఖడ్గమును బెరికి జలదగంభీరస్వరముతో "ఓరీ నరాధమా! విశ్వాసఘాతకా! కరమ్‌చందా! నేను స్వప్నము నందైన నీకపకారమును జేయఁదలపోయలేదు. నీకును నాకును లేశ మాత్రమును శత్రుత్వములేదు. అయినను నీవు నా ప్రాణములను హరింపనలయునని యెన్నియోపన్నుగడలను బన్నినాఁడవు' అనియెను.

కరమ్‌చందు పూర్వముచూపుచుండెడి భక్తిభావమును త్యజించివైచి, అపహాస్యస్వరముతో "ఔను చేసితిని. మదీయోన్నత్య పథమునకు నీవు కంటకసముఁడవు. కంటకమును మొదలంట నాశనము సేయవలయును. అందులకై యనేకప్రయత్నములను జేసితిని.

కాని నీవు కౌశలముచే నాయాపదనుండి తప్పించుకొని సాహోలాను బందీగాఁజేసి తెచ్చితివి. అయినను నంతమాత్రముచే నాకు లేశ మాత్రమును భయములేదు. మీరు వేయిపనులు చేసినను, కంఠముపైఁ గత్తినిమోపి భయపెట్టినను సాహోలా యేకథయును మీకడ వెల్లడింపఁడు. ఆతనికి మరణమన్న భయములేదు. అందుచే నాతఁడు మీకేమియుఁజెప్పలేదు. నా సేవకులలో నధముఁడొక్కఁడు మీవశమైయున్నాఁడు. ఆతని మూలమున మాకు సర్వనాశనము సంభవింపఁగలదు. దానినుండి తప్పించుకొనుటకు నీకుచితశిక్ష విధించుటతప్ప వేఱుమార్గములేదు’’ అనియెను.

సింహమువలె గర్జించుచు రఘునాథరాయలు “నీవు స్వామిద్రోహివి. ప్రభుద్రవ్యమును దినుచు రహస్యముగా చోరులలోఁ గలిసి వారికి సాహాయ్యముచేయుచు దేశమును దోపించుచున్నాఁడవు. రక్షించినవారిని భక్షించు నీవంటి పాపాత్ముఁడు నరక కుండమునఁగూడ నుండఁడు. హితాహితజ్ఞానశూన్యుఁడవగు నీవంటి నరపశు వొకమానవుని ప్రాణములను హరింప యత్నించెనన్నచో నందాశ్చర్య మేమున్నది?’’ అనియెను.

కరమ్‌చం దొకటిరెండడుగులు ముందునకువచ్చి కర్కశస్వర శ్వరముతో “నీగర్వమంతయు నింక నొక నిమిషములోనే యంతరించి పోఁగలదు. కడసారి నీయిష్టదేవుని స్మరించుకొనుము. శిరస్సులేని నీశరీరమిప్పుడే యీధూళిలోఁబడి పొరలఁగలదు. వృద్ధా వాక్యములతోఁ బ్రయోజనములేదు. నీకు మృత్యువాసన్నమైయున్నది. సిద్ధముగ నుండుము’’ అనియెను.

ఇట్లుచెప్పి యాపాపాత్ముఁడు ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షింప కుండఁగనే రఘునాథరాయలపైఁ బడియెను. ఇరువురకును ఖడ్గయుద్ధ

మారంభమయ్యెను. ఖడ్గఘాతప్రతిఘాతములచే ఝున్ ఝున్ శబ్దము లుప్పతిల్లి యానిర్జనారణ్యమునం తంతటను వ్యాపించుచుండెను. మఱియు నగ్నిస్ఫులింగము లుదయించి యిటునటు వ్యాపించుచుండెను. ఇరువురును ఖడ్గయుద్ధపారగులు. అతి నేర్పరులగుటచే నొకరికొకరుతీసిపోవక వివిధగతులఁ దిరుగుచు రణము సేయుచుండిరి.

ఇట్లిరువురును ఘోరయుద్ధము సేయుచుండ వృక్షమునుండి యొకవ్యక్తి దిగివచ్చి కరమ్చందునకు సాహాయ్యము చేయనారంభించెను ఆవ్యక్తిమొగమునకు నల్లనిరంగు వేయఁబడియుండుటచే రఘునాథరాయ లాతఁడెవ్వఁడో యెఱుఁగకపోయెను. ఇరువురునుగూడఁ దనపైఁబడి యుద్ధము సేయనారంభించుటచే నిర్భీకహృదయుఁడగు రఘునాథరాయ లించుకభీతచిత్తుఁడయ్యెను. అట్టిసమయమున నిరువురతో నాతఁ డొక్కఁడునుపోరి విజయమునందుట యసంభవము. అయినను రఘునాథుఁ డించుకేనియు వెనుదీయక యతినైపుణ్యముతో నిరువురితోడను రణము సేయుచుండెను. కాని సుశిక్షితులగు నిరువురు దుర్మదులతో నేకాకియు నసన్నద్ధుఁడు నగు నొక్కపురుషుఁడెంతసేపని యుద్ధముసేయఁగలఁడు ? రఘునాథరాయలకు రెండుమూఁడుచోట్ల దెబ్బలు తగిలెను. రుధిరమాతని సర్వాంగములను తడిపివేయుచుండెను. సకల పృథివియు నేకముగాఁ దిరిగిపోవుచున్నట్లాతనికిఁ గనుపట్టెను. హస్తముల గుప్పిడులు వీడిపోవుచుండెను. ఇంచించుక స్మృతితప్పుచుండెను. స్థిరభావముతో దేనిని గ్రహింపఁజాలకుండెను. ఆయత్యున్నతస్థలమునుండి యొక్కమాఱుగఁ గ్రిందకుఁ బడిపోయెను. అది భాద్రపదమాస మగుటచే నాదిగువప్రదేశము జలమయమైయుండెను. ఆజలము నర్మదానదిలోని కతివేగముతోఁ బ్రవహించుచుండెను. ఆపాపాత్ము లాపతనశబ్దమును విని రఘునాథ

రాయలు జలములోఁబడియెనని నిశ్చయించుకొనిరి. వారిముఖము లానందచిహ్నితము లయ్యెను. రఘునాథరాయ లాప్రవాహమున మునిఁగిపోయి ప్రాణములను విడిచెనని వారు నిర్ధారణము చేసికొనిరి. శవమును గప్పిపుచ్చుటకై యేమియుఁ బ్రయాసపడనక్కఱ లేకపోయెనుగదాయని సంతసించిరి. ఈ ఘోరనిశీథకాలమున నా ప్రవాహము నుండి దరిఁజేర్చి యాతనిని రక్షించువా రెవ్వరునుండరని వారు నిశ్చయించుకొనిరి. కాని సర్వశక్తిమంతుఁడును, సర్వజ్ఞుఁడును నగు సర్వేశ్వరుని మాహాత్మ్యమును దెలిసికొనుటకు ధర్మజ్ఞానశూన్యులగు నట్టి నరపశువులు సమర్థు లెట్లగుదురు ? కాలభుజంగ ముఖమున సుధను సృష్టించిన సర్వేశ్వరుఁడు భక్తసంరక్షణార్థ మేమిచేయఁ జాలఁడు ? కర్తవ్యము నెఱవేఱినదని సంతసించుచు వారిరువురు స్వనికేతనములకు వెడలిపోయిరి. ఈదారుణకర్మములను పూర్తిగఁ గప్పిపుచ్చవలయునని వారిరువురు నూహించుకొనిరి. లోకమునం దెవ్వరును నీదారుణ కర్మవిషయమున బిందుని సర్గపర్యంతమైనను నెఱుంగఁజాలకపోయిరి. కాని దీని పరిణామ మెట్లు ఫలించునో పాఠక మహాశయులు ప్రత్యక్షముగాఁ జూచి యీశ్వరుని మహిమను దెలిసి కొనఁగలరు.

---

పదునొకండవప్రకరణము

విదేశ బ్రాహ్మణుఁడు.

విపన్నుల యాక్రందనధ్వను లాపదోద్ధారకుని కర్ణకుహరముల యం దతివేగముగాఁ జొచ్చుచుండుననియు, దుష్టులను సంహరించి తనభక్తుల నాయీశ్వరుఁడు సర్వదా కాపాడుచుండుననియు నీశ్వర

భక్తుల దృఢవిశ్వాసము. కాని యాతఁడేయుపాయముచే నాపన్నుల గాపాడుచుండునో, అందులకెట్టి యుపకరణములు, ఎట్టిసాధనము లాతనికిఁ గావలసియుండునో, అను విషయముమాత్రము మానవ మాత్రులకు గోచరముకాదు. ఊహించుటకుఁగూడ శక్యముకాదు. ఈచర్మచక్షువులతోఁ బ్రత్యక్షముగా భగవంతునిఁజూచుట కెవ్వరికిని శక్యముకాదు. కాని ప్రపంచమున మన చక్షువులయెదుట జరుగుచుండుకార్యములనుజూచి యాతని సత్యమును సులభముగా మనము దెలిసికొనవచ్చును. జీవుఁడు జననమందుటకుఁ బూర్వమే మాతృస్తనముల యందెవ్వఁడు దుగ్ధమును బ్రసాదించెనో, రోగముత్పత్తి యగుటకుఁ బూర్వమే యెవ్వఁడౌషధములను సృష్టించియుండెనో, అట్టి దయామయుఁడు. ఆపదలకుఁ బూర్వమే తన్నివారణోపాయములను నిర్మించియుంచినాఁడు. అందులకు మన మాశ్చర్యపడనక్కఱ లేదు.

రఘునాథరాయ లేస్థలమునఁబడియెనో, ఆస్థలమునకుఁ పది పండ్రెండు గజములదూరములో నొకనావ కట్టఁబడియుండెను. ఎక్కడకో పోవలయునని స్త్రీసహితుఁడై వచ్చిన బ్రాహ్మణుఁడొకఁ డందుండెను. రఘునాథరాయల పతనశబ్దమునువిని యీవలకువచ్చి ప్రవాహవేగముననేదియోతననౌకవంకఁ గొట్టుకొనివచ్చుచుండుటను జూచెను. వెన్నెలసాహాయ్యమున బాగుగఁ బరికించిచూచి మానవుఁడని యనుమానించి పట్టుకొని పైకిఁదీయుఁడని నావికులకాజ్ఞాపించెను. అదృష్టవశమున నీటివడి నౌకసమీపమునకుండుటచే నావికులిరువురు సులభముగా రఘునాథరాయలను బట్టుకొని పైకిఁదీసిరి.

రఘునాథరాయలు స్మృతితప్పిపడియుండెను. ఎడతెగని రక్తపాతముచే దుర్బలుఁడైయున్న యాతఁడు యీఁదుటకు శక్తిలేని వాఁడయ్యెను. అందుచే మెల్లగాఁ బ్రవాహవేగము ననుసరించివచ్చుచు

మునిఁగిపోకుండఁ గాపాడుకొనుచుండెను. ఇఁకఁ గొన్నిక్షణములకాల మట్లే యున్నచో శ్వాసవాయువులు రుద్ధములైపోయి ప్రాణరక్షణమున కుపాయము లేకుండఁబోయియుండును. కాని దయామయుఁడగు నీశ్వరుని యభిప్రాయమది కాదు. అందుచే నీసాహాయ్యమాతని కలవడినది.

బ్రాహ్మణుఁ డాతని నాపాదమస్తకమును బరికించిచూచి యీతఁడు సామాన్యవ్యక్తికాఁడని యనుకొనియెను. శరీరముపై నస్త్రచిహ్నములును, నాతని యవస్థయునుజూచి యీర్ష్యాళువు లెవరో మిత్రద్రోహముచేసి రహస్యముగా నిట్టిదారుణమును జరిగించి యుందురని తలంచెను.

బ్రాహ్మణుఁడు రఘునాథుని నాడిని వక్షమును బరీక్షించి చూచి, ప్రాణవిహంగము దేహపంజరమును వీడిపోలేదని యెంచి మిగుల సంతసించెను. కాని యందులకిఁక నెంతయో కాలవిలంబనము లేదు. ఇఁక రెండుమూఁడుగడియలు నీటియందున్నచో నాతఁడు మృతుఁడై యుండును.

బ్రాహ్మణుని యాజ్ఞానుసారముగా నాతనిభార్య శీఘ్రముగా నుష్ణజలమును సిద్ధముచేసి తెచ్చెను. బ్రాహ్మణుఁడు రఘునాథరాయల యార్ద్రవస్త్రములను దీసివేసి, యుష్ణజలముతో గాయములను గడిగి వానికి పట్టీలనువైచెను. మఱియు నగ్నిని బ్రజ్వలింపజేయించి యేదియో యౌషధముఁగలిగిన జలమును వెచ్చఁజేసి దానిని ద్రావనిచ్చెను. దానితో రఘునాథుని యుదరమునందలి జల మీవలకురా నారంభించెను. తదనంతరమున నాబ్రాహ్మణుఁ డగ్నిసాహాయ్యమునఁ దైలమునుగాచి గుడ్డతోముంచి సర్వాంగములను గాపించెను. మూఁడునాలుగు గంటలకాల మిట్లు పరిచర్యలు చేయునప్పటికి రఘునాథుని గాత్రమునందించుక యుష్ణము జనియించెను.

మెల్లగా నించుక యుచ్ఛ్వాసనిశ్వాసము లారంభమయ్యెను. కాని చైతన్యలక్షణములేమియు నింకను స్పష్టముగాఁ గనుపట్టుటలేదు.

ఆమందిరమున కించుకదూరముననున్న వనప్రాంతమున నొక సమప్రదేశమున జీర్ణకుటీరమొకటి కలదు. ఆకుటీరమునందు జనార్ద నాధికారియను పేరుగల యొక బ్రాహ్మణుఁడు వాసముచేయుచుం డెను. ఆతఁడే యీయేకలింగస్వామి సేవకుఁడు. ఆకాననమునకంతకు నాతఁడే యధిపతి. శివాజీమహారాజు రాజ్యముసేయునప్పుడే యేక లింగస్వామికి నీలాంబరాధికారియను బ్రాహ్మణుఁడు అర్చకుఁడుగ నుండెడివాఁడు. ఆతని సద్గుణములకు మెచ్చి శివాజీమహారాజీవన భూమినంతను నీయేకలింగేశ్వరునకు దానముగా సర్పించివైచెను. ఆతనిరాజ్యకాలమున నీస్వామిప్రభ విశేషముగానుండెడిది. శివాజీ మహారాజు దండయాత్ర వెడలునప్పుడు ముందుగ నీయేకలింగేశ్వ రుని పూజించి నీలాంబరుని యాశీర్వాదమును బొంది మఱి వెడలు చుండెడివాఁడు. అప్పుడు తప్పకుండ నాతనికి జయమునుగలుగు చుండెడిది. అందుచే నేకలింగస్వామిపై నందఱకును భక్తివిశ్వా సము లధికమగుచుండెడివి.

నీలాంబరుఁడు ప్రపంచసుఖములయం దుదాసీనభావముతో నుండెడివాఁడు. ఆతఁడెప్పుడును రమణీముఖావలోకమును జేసి యెఱుఁగఁడు. ఆతని యనంతరమున నాతని శిష్యుఁడొకఁ డీపూజారి పదమును వహించెను. ఇంతవఱకును అర్చకనియోజనమునందా నియమమే పాటింపఁబడుచుండెను. ఏకలింగస్వామియర్చకుఁడు పెండ్లి యాడరాదు. తనయనంతరమునఁ దనశిష్యునొకని నుత్తరాధికారినిగాఁ జేయవలయును.

ఇదివఱకుండెడి వృద్ధాధికారి మరణించుటచే నాతని యేక మాత్రశిష్యుఁడగు జనార్దనున కీపూజారిపదవి సంప్రాప్తమయ్యెను.

జనార్దనుఁడు పదిసంవత్సరముల వయసువచ్చినపిదప సన్యాసివేషముతో నలుదిక్కులు తిరిగితిరిగి తుదకీస్థానమునకు వచ్చెను. అప్పటి వృద్ధాధికారి జనార్దనునియెడల ప్రీతచేతస్కుఁడై యాదరించి విద్యాబుద్ధులను గఱపి తన శిష్యునిగాఁ జేసికొనియెను. ఆవృద్ధుని మరణపర్యంతమును జనార్దనుఁడచ్చట నేయుండి యాతనియనంతర మాతని పదవి నధిష్ఠించెను.

శివాజీ యిహలోకమును వీడిపోయినప్పటినుండియు నేకలింగ స్వామి ప్రభ మందీభూతముకాఁజొచ్చెను. అయినను శివాజీ యొసఁగియుండిన సంపత్తిమూలమున స్వామిసేవకుమాత్ర మేమియుఁ గొఱతరాకయుండెను. స్వామికొసంగిన యారణ్యమునందలి చందన వృక్షములను వర్తకులు విశేషధనమ్మునకుఁ గొనుచుండెడివారు. మఱియు నరణ్యమందలి యనేకవిధములగు ఫలములు, తేనె, వంట కట్టియలు మొదలగువానివలన నెంతయోధనము సమకూఱుచుండెడిది. అందుచే జనార్దనుఁడు నిశ్చింతచిత్తముతో నిరువురు సేవకులను కూడనుంచుకొని యాకుటీరమున వాసముచేయుచుండెను. ఆతఁడు పగటిభాగమున నొకమాఱు, ద్వారమును తెఱచి స్వామినిపూజించును. మరల సంధ్యాసమయమున హారతినర్పించి ద్వారమునుబంధించి తన నివాసస్థానమునకు వెడలిపోవును. ఆమందిరమునకును నాతనికిని సంబంధమేమియునులేదు. పాపాత్ముఁడగు కరమ్చందీవృత్తాంతము నంతయు నంతకుఁదూర్వమే యెఱింగియున్నవాఁడు. కావుననే యత్యంత నిర్జన ప్రదేశమగు నిచ్చోటకు నిశీథమున రావలయునని రఘునాథరాయలకు లేఖనంపియుండెను.

రఘునాథరాయల కుపచారముచేసిన బ్రాహ్మణునకును జనార్దనునకును విశేషసంబద్ధమున్నది. వారిరువురును బాల్యమున సహాధ్యాయులు. అప్పటినుండియును వారి కత్యంత స్నేహముకలదు.

జనార్దనుఁ డిటకు వచ్చినప్పటినుండియు నా బ్రాహ్మణున కుత్తరముల నంపుచుండెడివాఁడు. ఆ బ్రాహ్మణుఁడు భార్యాసమేతుఁడై రామేశ్వరయాత్ర చేసికొనివచ్చుచు జనార్దనుని జూడవలయునని యీ మార్గమునవచ్చి చాలరాత్రి యగుటచే నుదయముననేలేచి జనార్దనుని యింటికిఁ బోవచ్చునని తలంచి యానావయందే శయనించి యుండెను. బ్రాహ్మణున కప్పుడే కునుకుపట్టుచుండెను. ఇంతలో రఘునాథరాయల పతనశబ్దము వినవచ్చుటచే నిద్రాభంగమయ్యెను. సర్వేశ్వరుని యనుగ్రహవశమునను రఘునాథుని యదృష్టమూలమునను నట్టి ఘటనము సంప్రాప్తమయ్యెను.

భార్యాభర్తలిరువురును శక్తికొలఁదిగ రఘునాథరాయలకుఁ బరిచర్య సేయుచుండిరి. వారియొద్ద కస్తూరికూడనుండెను. అందించుకతీసి రఘునాథరాయలచే మ్రింగించిరి.

తెల్లవారుసమయమున రఘునాథరాయలొక్కసారి నేత్రములనువిప్పిచూచెను. కాని యేమియును మాటాడలేదు. ఒక్కపరి నలుదిక్కులను బరికించి మరలఁ గన్నులను మూసికొనియెను.

బ్రాహ్మణదంపతుల హృదయములయం దించుక యాశ జనియించెను. వారిశ్రమ వ్యర్థముకాలేదు. ఒకమానవుని ప్రాణములను రక్షింపఁగలిగితిమిగదాయను నుత్సాహముతో సమయోచితముగ నాతనికి పరిచర్యలను సేయుచుండిరి.

దినమణి గగనపటమున నుదయించుటతోడనే బ్రాహ్మణుఁడు నౌకనుండి తీరమునకు దిగియెను. ఆతనిభార్య తల్లివలెఁ గాపాడుచు రఘునాథుని సమీపముననుండెను.

ఒకముహూర్తకాలములో బ్రాహ్మణుఁడు జనార్దనుని దీసికొని మరల నౌకకడకువచ్చెను. జనార్దనాధికారి రఘునాథరాయల నాపాదమస్తకమును బరీక్షించిచూచి విస్మితభావముతో "ఈతఁడెవరో నేను బాగుగా నెఱుఁగను. కాని యీతని నీపట్టణములో రెండు

మూఁడుమూఁటులు చూచియున్నాఁడను. పీష్వాయుద్యోగీయులలో నీతఁడొక గొప్పయుద్యోగియని వినియున్నట్లు నాకు జ్ఞాపకముగ నున్నది. ఇతఁడు కొలఁది దినముల క్రిందటనే పీష్వాపక్షమవలంబించి నాఁడు. ఈతని జన్మస్థానము మహారాష్ట్రదేశముకాదు. ఇంతకంటె నీతనివిషయమున నాకేమియుఁ దెలియదు. ఈతఁడొక మహాపురుషుఁడు. ఈతనిజీవనము చాల విలువకలదియనుట కణుమాత్రమును సందియములేదు" అనియెను.

బాజీ—అనిందితమగు నీతనియాకారమే యీతఁడొక మహాపురుషుఁడని చాటుచున్నది. అదియటుండనిమ్ము. ఎప్పుడీతఁడు మన కంటఁబడినాఁడో అప్పుడే యాతని ప్రాణములు రక్షింపఁబడినవని తలంపుము. ఆతని ప్రాణసంరక్షణకొఱకు మనము ప్రాణములను విడువవలసివచ్చినను విడువవలయును.

జనా—అవశ్య మట్లే చేయవలయును. కాని ఈతఁడిట్టిస్థితికి పాల్పడుట కేదియో రహస్యకారణముండి యుండవలయును. ఇతనికి చైతన్యము లభింపకపోయినచో మనసందేహము తీరనేరదు. బాజీరావు అపాత్రులను సన్మానించునంతటి యవివేకి కాఁడు. ఈతని శక్తిసామర్థ్యముల నెఱింగి యీతని కేదియో యున్నతపదవి నొసంగి యుండును. అదిగని సహింపలేని యీర్ష్యాళువు లెవరో యీతనిని నిట్టిగతికిఁ బాల్పడఁజేసియుందురు. చచ్చిపోయెనని యెంచి యీతని నీప్రవాహమునఁ ద్రోసివేసియుందురు. కాని యీతనికింకను నాయువున్నది. అందుచేతనే నీకంటఁబడినాఁడు. కాని నాకొక్క సందియము వొడముచున్నయది. ఈతని కిట్టి యపకారము చేసినవారు సామాన్యులై యుండరు. పీష్వాదర్బారునందలి ప్రధానోద్యోగీయులలో నొకరై యుండియుండవలయును—అందుచే మనమీకార్యము నతిరహస్యముగ నుంపవలయును. లేకున్న మనకేదేని యాపద సంభవింపవచ్చును.

బ్రా—నీయోచన చాలమంచిది. నీయభిప్రాయానుసారముగాఁ గార్యములను నడపవలయును. ఇప్పుడు మనము చేయఁదగినదేది ? ఈతఁడిప్పుడు గాయములచే బాధపడుచున్నవాఁడు. గాయములను దినినవానికి జ్వరముకూడవచ్చును ఔషధమును పథ్యమును సరిగానుండినఁగాని యీతనిప్రాణములను రక్షింపలేము. ఎడతెగని రక్తపాతముచే దుర్బలుఁడయి మాటలాడుటకైన శక్తి చాలకున్న యీతనికి బలముగలుగఁజేయు పదార్థము లవసరములు. కాని యీనౌకయందట్టివేమియును లేవు.

జ—మీరట్లు చింతింపనక్కఱలేదు. ఏయేవస్తువులవసరములో వానినన్నిటిని నేను తెప్పించెదను. నాకడ నిరువురుసేవకు లున్నారు. వారన్నివస్తువులను సంగ్రహించి తేఁగలరు. మనమీ యావద్విషయమును బహురహస్యముగా నుంపవలయును. ఎవరితోడను నించుకంతయును జెప్పఁగూడదు. మన మీతనిని దీసికొని మాయింటికిఁ బోవుదము. అచ్చట నుచితమైన చికిత్సలను జేయవచ్చును.

జనార్దనుఁ డీప్రకారముగఁ జెప్పి నౌకనుండి యొడ్డునకు దిగిపోయి అత్యల్పకాలములోనే సేవకులిరువురిచే మంచ మొకదానిని మోయించుకొనుచు మరల నక్కడకు వచ్చెను.

ఆమంచముపై రఘునాథరాయలను బరుండఁబెట్టి నల్వురును మోసికొనికొనుచు మెల్లగాఁ గుటీరమునకుఁ దీసికొనివచ్చి యందుఁ బరుండఁబెట్టిరి. బ్రాహ్మణునిభార్యకూడ వారివెంటవచ్చెను.

రఘునాథరాయలు పరుండియున్న యింటికి మూఁడుదిక్కులను నెత్తైనయిటుకగోడలు పెట్టఁబడియుండెను. దక్షిణపుదిక్కున రెండుమూఁడు గవాక్షములుండెను. గోడకావల పూరియిల్లొకటియుండెను. అందర్థభాగము వంటయింటికిఁ బ్రిందను మిగిలిన యర్థభాగము గోశాలకిఁబ్రిందను నుపయోగపడుచుండెను.

కస్తూరిప్రభావముచే రఘునాథరాయలకు వేఁడియందు కొని

యెను. కాని సర్వదా యాతఁడు ముసుఁగుపెట్టుకొని పరుండి యుండెను. ఒత్తిగిలుటయైనను లేదు.

ఈవృత్తాంతమేమైన బహిరంగమగునేమో యను శంకచే వారు వైద్యునెవ్వనిని దీసికొనిరాలేదు. జనార్దనాధికారి చాలఁగ నౌషధముల నెఱిఁగియుండెను. ఆతనికి వైద్యశాస్త్రమునందించుక ప్రవేశముకూడఁ గలదు. రఘునాథరాయల కాతఁడే యౌషధము నొసంగుచు పథ్యముల నేర్పరచి రోగనివారణమునకై పాటుపడు చుండెను. అవనితామణియును నించుకేనియు విరామములేకుండ రోగికిఁ బరిచర్యలను సేయుటలోనే కాలమును వినియోగించు చుండెను.

మధ్యాహ్నపూర్వమునుండియును రఘునాథరాయలకు జ్వర మధికమై ప్రలాపమారంభమయ్యెను. రఘునాథరాయలగాయములను కడిగి మరల నౌషధమునిచ్చి పట్టీలనువైచి కనిపెట్టిచూచుచుండెను.

ఎవఁడీయాపదనుండి రఘునాథరాయలను రక్షించెనో, ఎవని ధర్మపత్ని జననివలె నాతనిని గాపాడుచుండెనో, ఆబ్రాహ్మణుని పేరు "అచ్యుతకుమారమిశ్రులు." ఆతఁడు వారేంద్రశాఖలోని బ్రాహ్మణుఁడు. ఆతనిపూర్వనివాసము వంగదేశమందలి శాంతి పురము. స్వగ్రామమందలి పాఠశాలలో వేదములను బూర్తిచేసి పందొమ్మిది సంవత్సరముల వయసున నాతఁడు వేదాంతమును దర్శ నములను జదువవలయునను తలంపుతోనే కాశికి వెడలిపోయెను. జనార్దనుఁడుకూడ నట్టివాఁడే. కాని యాతఁ డింకొకశాఖకుఁ జేరిన బ్రాహ్మణుఁడు. ఆతని యప్పటిపేరు కృష్ణకమలభట్టాచార్యులు. శాంతిపురమున నిరువురును నొకవిద్యాశాలలో విద్యనభ్యసించిరి. పిదప నిరువురును గలిసి కాశికేగి యట వేదాంతమును జదువనారం భించిరి, కొన్నిదినములు గడచినపిదప కృష్ణకమలుని హృదయమధ్య మున వైరాగ్యానలము ప్రజ్వలింపనారంభించెను. నీరసమైన శాస్త్ర

పఠనమునం దాతని కిచ్ఛలేకపోయెను. ఆతఁ డెవ్వనితోడను జెప్పకుండ నాక్షణముననే రహస్యముగా కాశినుండి పలాయనుఁడై నానా దేశములుతిరిగి శుదకీస్థానమునకు వచ్చిచేరెను. ఇక్కడకు వచ్చిన పిదప తన పేరునుమార్చుకొని పూర్వపు టధికారికడ శిష్యుఁడై యాతని యనంతరమున నీపదవి నధిష్ఠించెను.

కృష్ణకమలుని నిమిత్తము కాశీధామమున నచ్యుతకుమారుఁ డెంతయో ప్రయత్నించెను. కాని యెచ్చటను కనఁబడలేదు. తిరిగి తిరిగి చేయునదిలేక విసుఁగుఁజెంది యాతఁడు మరలఁ దన పాఠములను జదువుకొన నారంభించెను.

కొన్నిదినములకుఁ బిదప కంఖాలమునుండి పవిత్రచేతస్కుఁడగు బ్రహ్మానందమిశ్రుఁడు కాశికేగి యచ్యుతకుమార మిశ్రుని విద్యాబుద్ధులనుగాంచి ప్రీతిజెంది యాతనిని దనతోఁగూడ కంఖాలమునకుఁ దీసికొనివచ్చి తన తనయయగు సుబాలనిచ్చి పరిణయము చేసెను. అచ్యుతకుమారుఁడు కొలఁది దినములు కంఖాలముననుండి పిదప పత్నీసహితుఁడై మరలవారణాసికేగి యచ్చట సుఖముగాఁ గాలమును గడపుచుండెను.

రెండుసంవత్సరములకుఁ బిదపఁ గృష్ణకమలుఁడు తన పేరు మార్చుకొంటిననియు, తానిచ్చోట వాసముచేయుచున్నాఁడననియు, నొక్కమాఱువచ్చి దర్శనమొసంగవలయుననియు నచ్యుతకుమారమిశ్రున కొకలేఖ వ్రాసెను. అచ్యుతకుమారుఁడా లేఖంగాంచి యత్యంత ముదితహృదయుఁడై బాల్యమిత్రుని శీఘ్రకాలములోఁ జూడవలయునని నిశ్చయించుకొనియెను.

కొలఁది దినములైనపిదప సేతుబంధరామేశ్వర యాత్రార్థమై యొకసేవకుని, పత్నినిగూడఁ దీసికొని యచ్యుతకుమారుఁడు బయలువెడలి, రామేశ్వరునిదర్శించి పిదప బాల్యస్నేహితునిఁ జూచుటకై

యొకనొక నద్దెకుఁదీసికొని యీమార్గమున నిచ్చటకువచ్చెను. పిదప నేమిజరిగినదియుఁ బాఠకులెఱిఁగియే యున్నారు.

చాలకాలమునకు సమావేశమైన బాల్యమిత్రు లిరువురును వారివారి కథలను ముచ్చటించుకొనుచుఁ జాలసేపుగడపిరి. ఆకథలతో మాపాఠకమహాశయుల కేమియును సంబంధములేదు. కావున వానిని గూర్చి మేమేమియు నిట లిఖింపఁబోము. సమయము వచ్చినప్పు డవసరమైనకథలను వారికి మేము పరిచయము చేయుదుము.

నాల్గుదినములు గడచినపిదప రఘునాథరాయలకుఁ గొంచెము జ్వరము తగ్గనారంభించెను. జనార్దనుఁడువైచిన పట్టీలమూలమున గాయములు మానుచుండెను. జనార్దనుఁ డీయోషధులను వైద్యమును తన గురుదేవునియొద్ద నేర్చుకొనియుండెను. మఱియు ననేకుల కీ యౌషధము నొసంగి యారోగ్యవంతులనుగాఁ జేసియుండెను.

ఐదవదినమునఁ గన్నులువిప్పి చూచునప్పటికి రఘునాథ రాయల కొకదేవబాల తనతలప్రక్క నున్నట్లును, ఆమె రూపజ్యోతి చే నాగృహమంతయుఁ బ్రదీప్తమగుచున్నట్లును గనుపట్టెను. ఆతఁ డొక్కపరి నాల్గుదిక్కులను గలయఁజూచి మరల ముద్రితనయనుఁ డయ్యెను. ఆతని హృదయమున నేవియో భావములు గొన్ని సంచా రము సేయఁదొడఁగెను. అందుచేతనే యాతఁడు ముద్రితనయనుఁ డయ్యెను. గడచిపోయిన ఘటనములన్నియు నొక్కటొక్కటిగ స్మృతిపథమునఁ బ్రచారము సేయనారంభించెను. ఏకలింగేశ్వరుని మందిరప్రాంగణమున దురాత్ముఁడగు కరమ్చందు మఱియొక నరాధమునితోఁ గలిసివచ్చి ఖడ్గయుద్ధమున దన్నుజంప నుంకించుట యాతనికి జ్ఞప్తికివచ్చెను. తోడనే యాతనిశరీరము భయముచేఁ గంపింపనారంభించెను. గాయములవెంట మరల రక్తము స్రవింపఁ జొచ్చెను. ఆతఁడు భయముచే నట్లు బాధపడుచుండెనని సుబాల తెలిసికొనియెను. కాని యేయుపాయముచే నాతని నాబాధనుండి తప్పింపవచ్చునో యామెకుఁ దెలిసినదికాదు.

కొంత సేపటికి రఘునాథరాయ లతికష్టముమీఁదఁ గన్నులను దెఱచెను. సుబాల యచ్చటనేయుండి యాతనినోటఁ గొంచెము గొంచెముగ పాలను బోయుచుండెను. ఆపాలను ద్రావుటచే నాతనికి మాటలాడుటకు శక్తికలిగెను. పిదపనాతఁడు "అమ్మా! నీవెవరవు" అని యడిగెను.

క్షుద్రనీరదఖండముచే సుధాకరునికాంతి సమాచ్ఛన్నమై పోవునట్లు లజ్జచే నామె యావరింపఁబడిపోయెను. తరుణతపనబింబము వలె నామె ముఖము రక్తిమందాల్చెను. అర్ధభాగమవకుంఠనముచే నాచ్ఛాదితమగుట నామె ముఖమండలము సప్తమినాఁటి చంద్రుని వలెఁ బ్రకాశించుచుండెను. సుబాల లజ్జాక్రాంతయై నమ్రముఖి యయ్యెను. రఘునాథరాయల కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు.

రఘునాథరాయలు విస్మయవిస్ఫారితనేత్రములతో నామెదివ్య సౌందర్యమును విలోకించుచుండెను. ప్రశాంతమహాసాగరమువలె నామెసౌందర్యము స్థిరమును గాంభీర్యపరిపూర్ణమునై యుండెను. చంచలతరంగములు నామమాత్రమునకైనలేవు. ఆమెనుజూచువారల హృదయము లానందలహరిలో నీఁదులాడుచుండును. మఱియు సదా యామెను జూడవలయుననియే యుద్దేశముపొడముచుండును. కాని వారి హృదయమున నెప్పుడును ప్రాపంచికవిషయవాసన లించుకేని యును జనియింపనేరవు అట్టివారు కేవలము విధాతృని నైపుణ్య మును మాత్రమే కొనియాడుచుందురు.

ప్రపంచమున రమణుల సౌందర్యమునందు విశేషముగాఁ దార తమ్యములు గన్పట్టుచుండునను మాట వాస్తవము. కాని యది చూచువారల భావముల ననుసరించియుండును. తుపాకిమందున అగ్నిస్పర్శమైన నెట్లో, అట్లే ఒక్కొకసుందరి రూపప్రభ నేత్రము లపైఁ బడినతోడనే మానవుని హృదయరాజ్యముకూడ దగ్ధమై పోవును. పంజరమునుండి విడివడినపక్షివలె నాతనిహృదయము

కూడ నెచ్చటికో యెగిరిపోఁగలదు. అదియొకచో స్థిరముగా నుండఁ జాలదు. ప్రాణులహృదయమున దాగియుండుభావములు సదా బాహ్యమునఁ గన్పట్టుచుండును. ఎంతప్రయత్నముచేసినైనను నా భావములను పైకిఁగన్పడకుండ నెవ్వరును జేయఁజాలరు. అందు చేతనే ఉత్కటవాసనావశవర్తులును విలాసవతులునగు నారులసౌంద ర్యమున సదా కృత్రిమశోభ గన్పట్టుచుండును. అట్టి సౌందర్యమున దళుకుండుననుమాట నిజమే. కాని యందు మాధుర్యముమాత్రి మించుకంతయు నుండఁబోదు. అట్టిరూపప్రభ మానవునకు గోచర మయ్యేనేని యాతనిహృదయ మిఁక చల్లగానుండఁజాలదు. హృదయ మధ్యమున వాసనయనియెడి యగ్నియుదయించి క్రమక్రమముగా దగ్ధముచేసివేయును. అసారవస్తుఘటితమైనట్టియు, కృత్రిమపరిపూరిత మైనట్టియు, బాహ్యచాకచక్య శీలమైనట్టియు సౌందర్యమునందు విశేషమగు నాకర్షణశక్తియుండదు. కేవల సుఖలోలురును సరళచిత్తు లును దూరదికంటె లఘువగు హృదయము గలవారునగు యువకులను మాత్రిమే యది యాకర్షింపఁగలదు. యథార్థభావగ్రాహకు లిట్టి సౌందర్యము నెన్నఁడును మెచ్చుకొనరు. ఆసౌందర్యలహరిలో వారి హృదయమీఁదులాడనేరదు. కాని సుబాల సౌందర్య మట్టిదికాదు. ఆసౌందర్యమున నామమాత్రమునకైనను కృత్రిమశోభలేదు. సరియే కదా యది మాధుర్యపరిపూరితమై యుండెను ఆమె సౌందర్యము నలంకారము లించుకంతయు నభివృద్ధి సేయలేకపోయినవి. అందుల కనియే పండితులు ఈశ్వరుఁడెవరికి రూపముప్రసాదించునో వారి కలంకారములవలనఁ బ్రయోజనములేదని వక్కాణించియున్నారు. తీయని చక్రకేళియరఁటిపండు నందు శర్కరను మిశ్రమము సేయుట కేవల మనావశ్యకము.

సుబాల వయ సిరువది సంవత్సరములకంటె నధికములేది. ఆమె దేహవృక్షమున నింకను ఫలమేమియు ఫలింపలేదు. వర్షాకాల

మందలి నదివలె నామె సర్వాంగములును మాధురీరసపరిపూరితములై యుండెను. ఆమె దేవ్యవతారమని చూపరులందఱు ననుకొను చుందురు.

ఆమె యించుక పొడగరియనుమాట నిజము. కాని యందుచే నామె సౌందర్యమున కించుకంతయును గొఱంతవడలేదు. తప్త కాంచనసన్నిభమగు శరీరచ్ఛాయఁగల యామె భ్రమరసంచయ సన్నిభమగు కేశకలాపము, నితంబదేశమువఱకును వ్రేలాడుచుండు టనుజూచి పీతవర్ణవిశిష్టమగు గగనతలమునందు చిన్న కాలమేఘ ముదయించెనని చూపరులనుకొనుచుందురు. కళంకవిశిష్టమగు చంద్ర మండలమును ముకుళీభావసంకలితమగు పంకజమును నిర్మించినవిధాత తన నైపుణ్యమును నిందించుకొనుచు నాలోపములు లేనిపదార్థమును సృజింపవలయునని తలంచి నిర్జనప్రదేశమునఁగూర్చుండి యెంతయో ప్రియత్నించి యీసుబాలవదనమండలమును సృష్టించి స్తుతిపాత్రుఁ డయ్యెను. విశాలఫాలప్రదేశమును, సమున్నతనాశికయు, పరస్పర చుంబిత భ్రూయుగళమును, ఆకర్ణాంత విస్తృతసముజ్వలనేత్రములును, గలిగియున్న సుబాల సౌందర్యమునుజూచి మెచ్చుకొననివారుండరు.

సుబాల యవనతవదనయై కూర్చుండియుండెను. రఘునాథ రాయలామె సౌందర్యమును నిరీక్షించుచుండెను. ఇంతలో జనార్ద నుఁడును నచ్యుతకుమారుఁడు నచ్చోటకువచ్చి రోగినిజూచి సంతుష్ట చిత్తులై "మహాశయా! మీశరీరములో నెమ్మదిగానున్నదా?" అని యడిగిరి.

రఘునాథరాయలు ప్రత్యుత్తరమేమియు నీయకుండఁ గృతజ్ఞ తాపూర్వకమగు దృష్టితో వారల నాపాదమస్తకము దిలకించుచు క్షీణస్వరముతో "మీరెవరు? ఇప్పుడు నేనెక్కడ నున్నాఁడను?" అని యడిగెను. జనార్దనాధికారి యించుక ముందునకువచ్చి "నేను ఏకలింగేశ్వరస్వామి పూజారిని. ఈకుటీరమున వాసముసేయు

చుందును. ఐదుదినములకుఁ బూర్వము నాబంధువుఁడగు నీమహాశయుఁడు నౌకపై నన్నుఁ జూడవలయునని యిచ్చటకువచ్చినాఁడు. ఆనాఁటిరాత్రి యీతఁడు నౌకయందు శయనించియుండఁగా జలమధ్యమునం దేదియో పడినట్లు శబ్దమయ్యెను. అదివిని యీతఁడివ్వలకువచ్చి చూచునప్పటికి మునిఁగిపోవునవస్థలోనుండి మీరు ప్రవాహవేగమునఁ గొట్టుకొని వచ్చుచుంటిరి. దయాశాలియగు నీతఁడు శ్రమపడి మిమ్ములను పైకితీసెను. అప్పటికిమీరు సంజ్ఞాశూన్యులై పడియుంటిరి. మీకడఁ జేతనలక్షణములేమియుఁ గాన్పింపలేదు. మీగర్భమందున్న జలము నీవలకురప్పించుట కౌషధమొసంగి యీతఁడును నీతని ధర్మపత్నియు మీకనేకవిధములఁ బరిచర్యచేసి మీప్రాణములను గాపాడిరి. ఈతనివలన యీవదుదంతమును నేనెఱింగి మిమ్ముల నిటకుఁ దెచ్చి యౌషధము నొసంగుచుంటిని. మాగురుదేవుని యనుగ్రహవశమున నేను ఓషధులను ఔషధములను గొంతవఱకుఁ దెలిసికొనియున్నాఁడను. అత్యాశ్చర్యకరమగు నాయౌషధమాహాత్మ్యముచే మీగాయములన్నియును మాని మీకారోగ్యము కలిగినది. అదియటుండనిండు. మీకిప్పుడు స్మృతివచ్చి మాటలాడుచున్నందులకు మేమెంతయో సంతసము నొందుచున్నారము. మాశ్రమయంతయు సఫలీకృతమైనది. మహాశయా! మీరెవరో మాకింతవఱకును దెలియదు. కాని మీరొకగొప్ప రాజకీయోద్యోగులనియు మాసన్మానమునుబొందదగినవారలనియుమాత్రము మేము గ్రహించితిమి. మీరెవరో మీకిట్టియాపద యెట్లుసంఘటించెనో తెల్పి మమ్మనుగ్రహింపుఁడు" అనియెను.

రఘునాథరాయ లీకథనంతయును శ్రద్ధతో విని ఆబ్రాహ్మణుని, దేవీరూపయగు నాతనిపత్నిని ఆపాదమస్తకమును నిరీక్షించుచు క్షీణస్వరముతో "మీరునాప్రాణదాతలు. మీయనుగ్రహముచేత నే నీఘోరవిపత్తును దాటఁగలిగితిని. లేకపోయినచో నేను నిశ్చయముగా

మృత్యువువాతఁబడియుండును. మీరు నన్నుఁ దల్లిదండ్రులవలెఁ గాపాడినారు. నాయీజన్మమున మీఋణమును దీర్చుకొనలేను. నే నింతకుముం దీయమను "అమ్మా!"యని సంబోధించియున్నాను. పూర్వజన్మమున నిశ్చయముగా నీమె నాకుఁ దల్లియైయుండును. లేక పోయినచో అన్యుఁడనగు నాపై నింతమమత యుండఁజాలదు. అదృష్టవశమునఁ జాలదినములకుఁ బిదప నాతలిదండ్రులను గాంచఁ గలిగితిని. భయంకరమగు మహాప్రవాహము దేశముపైఁ బడినను తుదకుఁ దన్మూలమున నాభూమికి బలమధికమై యది ఫలవంతమగు నట్లే ఘోరవిపత్తులకులోనైనను నేను మీదర్శనలాభమును బడయఁ గలిగితిని. నేను చాలదినములనుండి "అమ్మా"యని నోరారఁబిలుచు కొను భాగ్యమును గోలుపోయియుంటిని. నేటికి మరల "అమ్మా! అమ్మా! యను మధురశబ్దము నుచ్చరించుచు నామహదానందము ననుభవించుచున్నాఁడను" అనిపలికి జనార్దనునివంకఁ దిరిగి "మీ ఋణము నే నెన్నిజన్మలకును దీర్చుకొనలేను. మీరు నా కాశ్ర యమునొసంగి యాహారాదులనిచ్చి రక్షింపకపోయినచో నే నీపాటి కీలోకమును వీడిపోయియే యుందును. మీరు నాప్రాణదాతలు. నాకంఠమునఁ బ్రాణమున్నంతవఱకును, జన్మజన్మములయందును మీరొనర్చిన మేలును మఱవఁబోను. ఈయుపకారమును రాత్రిం దినములు సర్వదా తలంచుకొనుచుండెదను" అనియెను.

రఘునాథరాయలమాటల నాలకించి యచ్యుతకుమారమిశ్రులు "మహాశయా! ప్రపంచమున మానవమాత్రులకెల్ల నేది కర్తవ్యమో దానినే మేమాచరించితిమి. అందులకై మమ్మింతగాఁ బ్రశంసచేయ నక్కఱలేదు. శీతకాలమున భూదేవివలన సామాన్యమగు తేమను మాత్రము సంగ్రహించి సూర్యదేవుఁడు ప్రీతచేతస్కుఁడై వర్షకాల మున వారినవ్వారిగా మరల భూదేవికి బహుమాన మొసంగుచుండు నట్లే మహాత్ము లితరులొనర్చెడి సామాన్యసాహాయ్యమును గొప్పగా

బరిగణించి బహూకరించుచుందురు. మహాశయా! మీరిప్పుడు మమ్ముల నాత్మీయులగాఁ బరిగణించియున్నారు. అదియేనిజమైనచో దయచేసి మీపూర్వచారిత్రమును మాకుఁదెల్పి యనుగ్రహింపుఁడు" అనియెను.

రఘునాథరాయలు బాష్పపూరితనయనుఁడై గద్గదస్వరముతో "ఈప్రపంచమున మీరే నాయాత్మీయులు. ముమ్మాటికి మీరే నా తలిదండ్రులు. హృదయమున్నంతవఱకు మీరొనర్చినమేలు మఱపునకురాదు. ప్రపంచమున మానవులలో దేవతాస్వరూపులును రాక్షసస్వరూపులును గూడఁ గలరనుమాట నిశ్చయమని యనుభవమువలన నేనెఱింగితిని. ఎప్పుడును పరిచయములేని నాయెడల మీరింతదయఁ గలిగియుండుటచే మీహృదయౌన్నత్యము స్పష్టమగుచున్నది. జీవనదాతలైన మీకడ నేను దాఁపవలసిన రహస్యములేవియునులేవు. నే నీయాపద కెందులకు లోనైతినో తెల్పెదవినుఁడు" అని రఘునాథరాయ లాద్యోపాంతముగ యావదుదంతమును తెలియఁజెప్పెను. తనవిషయమునమాత్రము పీష్వాకడఁదెలిపినట్లే వీరికడఁగూడ నిజమును కప్పిపుచ్చిచెప్పెను.

ఈకథనంతను వినినపిదప జనార్దనాధికారి అచ్యుతకుమారమిశ్రునితో "మిత్రవేషముతోనున్న శత్రువెవఁడో యిట్టిపని చేసియుండునని నీతో నింతకుపూర్వము నే ననియుండలేదా? కాని సర్వశక్తిశాలియగు పరమేశ్వరుఁడు తోడయి యున్నవానికి మనుష్యుఁడు వేయిప్రయత్నములుచేసియు నరిష్టమును దేఁజాలఁడు. సత్పథమున సంచరించెడి భక్తుల నాగూఢసముద్రుఁడు సర్వదా తిలకించుచు రక్షించుచుండును. ప్రపంచమున మానవరూపధారులగు రాక్షసుల నుండి నిరపరాధులను రక్షించుట కాతఁ డొక్కఁడే సమర్థుఁడు. మిగిలినవారందరు నిమిత్తమాత్రులు!" అనియెను.

అచ్యు — ఇంకను నందులకు సందియమేమి? ప్రబలవేగముతో నేఱు ప్రవహించుచున్నను గిరిశృంగములెట్లు చలింపవో, అట్లే

పాపాత్ముల నీచకార్యములచే నీశ్వరభక్తు లెన్నఁడును చలింపరు. వారికెట్టి యాపదలును సంభవింపవు. మీఁదుమిక్కిలి యాపాపాత్ములే సర్వనాశనమైపోవుదురు. అనాథలకు నాథుఁడును దుర్బలులకు బలమునునగు నాయీశ్వరుఁ డీతని విషయమునఁ జూపిన యనుగ్రహము నకు మేరలేదు. అందులకు నేనాకరుణాసింధునకు శతసహస్రవందనము లర్పించుచున్నాఁడను.

వీరిట్లు మాటలాడుచుండఁగా నింతలో వీధివెంట గుఱ్ఱములు నడచుచున్న శబ్దము వినవచ్చెను. ముగ్గురు నల్గురు అశ్వారోహకు లీకుటీరమువంక కతివేగముతో వచ్చుచున్నట్లనుమానము కలిగెను. జనార్దనాధికారి అదియేదియో తెలిసికొనవలయునను తలంపుతో నాగదినుండి యీవలకు వచ్చెను. సుబాల పాకశాలలోని కరిగెను. రఘునాథుఁడును నచ్యుతకుమారుఁడును నాగదియం దుద్వేగభావములంతోఁ గూర్చుండి యుండిరి.



## పండ్రెండవప్రకరణము

క్రమక్రమముగా నశ్వపదధ్వని కుటీరనికటమున కరుదెంచి తుదకందు మిళితమయ్యెను. అశ్వారోహకులు కుటీరమునకరుదెంచిరని అచ్యుతకుమారమిశ్రులును రఘునాథరాయలును నిశ్చయించుకొనిరి. వారిహృదయములు సందేహముతోడను ఉద్వేగముతోడను సమావృతములై పోయెను. సంగతులేవియో తెలిసికొనవలయునని రఘునాథుఁ డాతురపడుచుండెను. ఆతనికి క్షణిక మొకయుగమువలెఁ గన్పట్టుచుండెను. ఆతఁ డధైర్యభావముతోడను ఆశాపూరితనయనములతోడను ద్వారమువంకఁ బరికించుచుండెను. ఇంతలో నధికారి యోధృవేషముతోనున్న యొకయువకునిగూడఁ దీసికొని లోపలకు వచ్చి దీపమును బ్రజ్వలింపఁ జేసెను. ఆయువకునిజూచినతోడనే

రఘునాథుని మలినముఖమండల మానందముచే వికసించెను. యువకుఁడు మలహరరావు ప్రియతనయుఁడగు ద్వారకరావని మేము తెలుపకుండఁగనే పాఠకమహాశయులు తెలిసికొనియుందురు. ద్వారకరావు తనవల్లురు అశ్వారోహకులతో నక్కడకు వచ్చియుండెను.

ద్వారకరావు రఘునాథరాయలు పరుండియున్న మంచము కడకువచ్చి యాతని దుర్బలదేహమును మలినముఖమండలమును జూచి కన్నులనీరు పెట్టుకొనియెను.

రఘునాథరాయలు ద్వారకరావును తనమంచము ప్రక్కఁ గూర్చుండ నియమించి యాతని యశ్రుజలములఁ దుడుచుచు "సోదరా! విచారింపకుము. కన్నుల నీరుపెట్టుకొనవలసిన యావశ్యకము లేదు పరమేశ్వరానుగ్రహమువలనను, నీమహాత్ముల కృపాతిశయముననను నింతవఱకు జీవించియున్నాఁడను. భయములేదు. ముందుగ నీవుచెప్పఁదలచినదేదియో చెప్పుము. పిదప నాయీయాపదకంతకునుగల కారణముల నెఱింగించెదను" అనియెను.

ద్వారక—ఆనాఁడు ప్రభాతమున మీగుండెడిగది శూన్యమై యుండుటనుజూచి మేము చాలవిస్మయము నొందితిమి. ప్రొద్దెక్కిన కొలఁది మాయుత్కంఠ యధికముకాఁజొచ్చినది. సేవకులెవరును మీజాడ నించుకంతయుఁ దెలుపకపోయిరి. అందుచే మాకు భయ మధికమయినది. పీష్వా యీవృత్తాంతమునువిని విచారమునుజెంది నాల్గుదిక్కులకును చారులనంపెను. మేమును ననేకప్రయత్నము లొనర్చితిమి. కాని ఫలములేకపోయెను. మీసంబంధమైన వార్తలేవియును తెలిసినవికావు. పట్టణమంతయు నల్లకల్లోలముగానుండెను.

రెండుదినము లీవిధమున వ్యర్థముగాఁ గడచిపోయినవి. మూఁడవనాఁటిరాత్రి మాజనకుఁడు కరమ్చందు సేవకుని బాజీరావు కడకు రహస్యముగఁ దీసికొనిపోయి కరమ్చందు పాపకార్యముల నన్నిటి నొక్కటొక్కటిగఁ విన్నవించెను. ఆసేవకుఁడును నొక్కటి

మైనదాచకుండ పూసగుచ్చినట్లు పీష్వాకడ నన్నియునుజెప్పివైచెను. బాజీరా వీకథనంతనువిని కరమ్‌చందే మిమ్మెదోవిధమున నావలకుం గొంపోయి కనంబడకుండఁ జేసియుండునని నిశ్చయించి క్రోధము నాపలేక యారాత్రియే ససైన్యముగ నాతనియింటిని ముట్టడించి భృత్యుఁడు దెలిపినరీతిగ కచ్చేరీసావడియందున్న లోహపుసందుగ పెట్టెను దెఱచి యందున్న కాగితములను బరీక్షింప నారంభించెను. అదృష్టవశమున దొంగలనాయకునిచే లిఖింపఁబడిన రెండుత్తరము లందుఁగనంబడియెను. మరియును, గణేశప్రతిమూర్తి చిహ్నితమై యున్న ముద్రికకూడ గన్పించెను. దొంగలనాయకునికడ నీవు పట్టుకొని తెచ్చిన యుత్తరమునం దీముద్రికతో ముద్రించిన ముద్రయే యుండెను. కరమ్‌చందుని యపరాధము సప్రమాణముగ రుజువు పడియెను. బాజీరాయని యాజ్ఞానుసారముగా నారాత్రియే కరమ్ చందు కారాగారమున నుంపఁబడియెను. కాని యాపాపాత్ముఁడు మీవిషయమై యొక్కమాటయైనను జెప్పినాఁడుకాఁడు. మీవిషయ మైయాతఁ డొక్కసారియైనను విచారించియుండలేదు. ఆతఁడిప్పుడు కారాగారమున బద్ధుఁడైయున్నాఁడు.

మీవిషయమై మేమందఱమును చాలవిచారించితిమి. మా విచారమునకు మేరయేలేకుండెను. కరమ్‌చందునకు భయముచూపియు నయముచూపియు ననేకవిధములఁ బ్రయత్నించితిమి. కాని ఫలము లేకపోయెను. “నేనెఱుఁగను” అనుమాట దక్క నాతనినోటనుండి వేఱుమాట రాలేదు. అందుచే మేము చాల నిరాశఁజెందితిమి. రంగరాజును మాయింటినుండి పంపివేసి కారాగారమునబంధించితిమి. వేఱువేఱు గదులయందు వారి నిరువురను శృంఖలాబద్ధులంజేసి యుంచితిమి.

నిన్నటిదినమున మాధ్యాహ్నమున నాతండ్రి సందిగ్ధచిత్తముతో మీరుండెడిగదిలోనికివచ్చి మీశయ్యను బాగుగాఁ బరీక్షించి చూడ మీశయ్యక్రింద నొకయుత్తరమగపడియెను. అందుమూల

మున మీరు కనఁబడకుండుటకుఁ గలకారణము స్పష్టమయ్యెను. కాని యాయుత్తరము వ్రాసినవారెవరో తెలిసినదికాదు. ఇదికూడ కరమ్చందుయొక్క దుస్తంత్రమే యని మాజనకుఁడు నిశ్చయించుకొని యొకనిమిషమైనను విలంబముసేయకుండ బాజీరావుకడ కేగి యాయుత్తరముం జూపించెను. బాజీరావాయుత్తరమును కడకంటఁ జదివి "రోగమిప్పటికి పట్టుపడినది. దీనికిఁదగినచికిత్స వెంటనే చేయవలసియున్నది. రఘునాథరాయల కపకారము సేయఁదలపెట్టియే యీయుత్తరమును వ్రాసినారు. కాని వేఱుకాదు. ఏకలింగస్వామి పూజారికూడ నీదుస్తంత్రమునఁ జేరియుండవలయు: పాపాత్ముఁడగు కరమ్ చందు తననీచోద్దేశమును నెఱవేర్చుకొనుటకై యాబ్రాహ్మణుని సాహాయ్యము గైకొనియుండవచ్చును. ఆతనివలన రఘునాథుని వృత్తాంతమేమియుఁ దెలియకపోయినచో, నాతని నిటకుఁబట్టి తెప్పించవలసియున్నది" అని పలికి పీష్వా నన్నాపనికై నియమించెను. నేనందులకై నల్గురశ్వారోహకులతో నిటకరుదెంచితిని. ఇంటికడ బయలుదేరునప్పుడు మిమ్ములను మరలఁజూడఁగల్గుదుమను నాశ మాకు లేదు. ఈబ్రాహ్మణుఁడు చెప్పినను మిమ్ములను జూచువఱకును మాకుఁ దృప్తిగలుగలేదు. మా మృతదేహములయం దించుక ప్రాణసంచారము గలిగినది. జరగికథయంతయు మాకుఁదెలిపి మమ్మనుగ్రహింపుఁడు."

రఘునాథరాయలీకథ నంతను నత్యంతశ్రద్ధతోవిని క్షీణస్వరముతో "మహాత్ములగు బాజీరావును మలహరరావును దమ ప్రజ్ఞాబలముచే నపరాధినిఁబట్టుకొనినారు. కాని భ్రాంతివశమున దయాళుఁడగు నీబ్రాహ్మణుని విషయమునఁగూడ సందేహపడినారు. ఈ మహానుభావుని యనుగ్రహమూలముననే నాప్రాణములు రక్షింపఁబడినవి. మొదటనుండి యిప్పటివఱకును నాకు సంభవించిన ఘటనములను నీవు వినినచో మానవులలో దేవతలును రాక్షసులును గూడఁ గలరని నీకు సప్రమాణముగా ఋజువుకాఁగలదు. నా కా

రాత్రి కుబుద్ధియుదయించుటచే నాకిష్టదేవతా స్వరూపుఁడగు మీ జనకునితోనైనను జెప్పకయే నిశీథసమయమున నీవలకు వచ్చితిని. దానికి ఫలము క్రమక్రమముగా పండినది. నా కిప్పు డాయనమొగ మునుజూచుటకుఁ జాలఁగ లజ్జాభయములు వొడముచున్నవి” అనియెను.

ద్వారకరా వామాటలనువిని యధైర్యపడి “గతించినదానికై చింతింపబనిలేదు. మీనిమిత్తమై మాతండ్రి మిగులఁ జింతించు చున్నాఁడు. మిమ్ముల నొక్కమాఱు చూడగల్గినచో నాయన సంతాపమంతయుఁ దీరిపోఁగలదు. మీరుతక్కినకథనంతను దయ యుంచి నాకుఁదెలుపవలయును” అనియెను.

రఘునాథరాయలు మృదుస్వరముతో “ఆ యుత్తరమును జదివి నేను మిగుల నాశ్చర్యమునొందితిని. ఉత్తరములో వ్రాసిన ప్రకార మచ్చటకుఁ బోవలయునని కుతూహలము జనియించినది. కాని యందేదేని కృత్రిమముండియుండుననియెడి యూహ నాకప్పుడు కలుగలేదు. నాయదృష్టమున నీకష్టములన్నియు విధింపఁబడి యుండఁగా నాకట్టియూహ యేలపొడమును! అప్పుడు నామతిచెదరి పోయినది. మీతండ్రిగారితో నాలోచించినచో నా కట్టిస్వేచ్ఛ యుండకపోవును. ఈకష్టములు నుండకపోవును. రాత్రి పదిగంట లైన పిదప నింటినుండి బయలువెడలి యేకలింగేశ్వరుని మందిరము వంక ప్రయాణముచేయుచు నతికష్టముమీఁద నరణ్యమునుదాఁటి మందిర సమీపమునకు వచ్చితిని. అప్పటికి రాత్రి రెండుజాములు దాఁటినది. జనార్దనాధికారి సంధ్యాసమయముననే దేవునర్చించి వెడలిపోయియుండుటచే నీకథ యేమియు నెఱుఁగఁడు. జనశూన్య మగు నాప్రదేశమున నొంటరిగఁగూర్చుండి నాల్గుదిక్కులను బరికించు చుండ నింతలోఁ బాపాత్ముఁడగు కరమ్ చందు కత్తిని చేతఁదాల్చి “మలహారరావు సాహాయ్యమున నీవు నా సర్వనాశనమును చేయ

యత్నించుచు నా సేవకునిఁ దీసికొనిపోయినాఁడవు. నీవు క్షమింప నర్హుఁడవుకావు. నిన్నీపృథివిపై లేకుండఁజేసి నిశ్చింతచిత్తుఁడనయ్యెదను. నిన్నుఁజంపినఁగాని నాహృదయతాపము చల్లారదు. ముందుగ నిన్ను వధించి పిదప మలహరరావు పని చూచెదను" అని చెప్పుచు కత్తినిదూసి నాపై కురికెను. నే నతిజాగరూకతతో నాత్మసంరక్షణము చేసికొనుచుంటిని. అంతలో నెవఁడో యింకొకమనుష్యుఁడు వచ్చి యాతనికి సాహాయ్యముచేసెను. ఆమనుష్యుఁడు మొగమునకు నల్లనిరంగువేసికొని యుండుటచే నస్పష్టమగు చంద్రకాంతిలో నాతనిని బాగుగా గుర్తింపలేకపోయితిని. ఆతఁడొక్కమాటయైన నాడకుండ కరమ్‌చందుతోఁ గలిసి యుద్ధము సేయనారంభించెను. అంతవఱకు నాకు స్మృతియున్నది. తరువాత వారు నన్ను తమఖడ్గములతో మిక్కిలిగా గాయపఱచినారు. నే నెటనో పడిపోయినట్లించుక స్మృతియున్నది. పిమ్మట నేమిజరిగినదో నాకుఁ దెలియదు. నేనొకనదిలోఁబడి కొట్టుకొనిపోవుచుండఁగా బైకిఁదీసి యౌషధముల నొసంగినట్లు వీరివలన పిదప నే నెఱింగితిని. వీరల హృదయమునం దేమాత్రము కాపట్య ముదయించినను నే నింతకుపూర్వమే మరణించియుందును. వీరు నన్నుఁ బుత్రవాత్సల్యముతోఁ జూచుకొనుచు నానిమిత్తమై తమ సుఖమునుగూడఁ బరిత్యజించి కంటికిఱెప్పవలె నన్నుఁ గాపాడినారు. దేవీరూపయగు నీదయార్ద్రహృదయ నాకుఁ బ్రాణదాత్రి. నిజముగా నీమె మాయమ్మ. వీరలకు సర్వదా నేను కృతజ్ఞుఁడను" అనియెను.

ద్వారకరా వామాటలనువిని క్రోధకంపితస్వరముతో "ఈదినముతోఁ బాపాత్ముఁడగు కరమ్‌చందుని యాయుష్కాలము పూర్తియైనది. ఆతనికిఁకఁ దప్పించుకొనుమార్గము లేదు. నిశ్చయముగా నపరాధమున కుచితదండనము కాఁగలదు. బాజీరావు క్రోధాగ్నిరగుల్కొనినచో నార్పుట కేరితరము ? కరమ్‌చందునింట దొంగలనా

యకుఁడు వ్రాసినయుత్తరములు లభించినవి. ఆతనిసేవకుఁడే యాతని దుర్మార్గము నగ్గడించుచు సాక్ష్యమొసంగినాఁడు. ఆసేవకుఁడే యా చోరనాయకున కుత్తరమును దీసికొని వెళ్లినాఁడు. ఆయుత్తర మా దొంగల గురువుకడ లభించినది. అందుపై గణేశరూపముతో నున్న ముద్ర వేయఁబడినది. అట్టి ముద్రికయే యీతనియింట దొరకినది. ఇదియంతయు బాజీవు స్వయముగఁ బట్టుకొనినాఁడు. అందుపై మీ విషయమున జరిపిన యీమహాపరాధము—ఇఁకఁ గరమ్చందునకు దిక్కెవ్వరు ?" అనియెను.

ఈమాటలను విని, అచ్యుతకుమారమిశ్రులును జనార్దనాధికారియు నదివఱకుఁ దామనుకొనినమాటలు నిజములయ్యెనని యనుకొనఁజొచ్చిరి.

సరళహృదయుఁడగు ద్వారకరావు బ్రాహ్మణుల వంకఁదిరిగి "మీరెవరో, యెట్టివారో తెలియకపోవుటచే జనార్దనాధికారి విషయమున మేము సందేహపడినమాట నిజము. అందులకు క్షమింపవలయునని నేను మిమ్ము వేఁడుకొనుచున్నాఁడను. పరులు దుఃఖములోనున్నప్పు డెవనిహృదయము కరగుచుండునో, ఇతరుల ప్రాణసంరక్షణమునం దెవఁడు ముందంజవేయుచుండునో, ఆతఁడే పాపతాపమయగు నీప్రపంచమున నీశ్వరప్రతిరూపుఁడు. ఆతనిజన్మమే సార్థకమైనది. మీరుచేసిన మహోపకారమును వ్యక్తముసేయుట కొక్క వదనముగల నాకు శక్తిచాలదు. ఈతని ప్రాణసంరక్షణమునకా సర్వేశ్వరుఁడు మిమ్ముల నగపఱచినాఁడు. ఈరఘునాథరాయలు పీష్వా కత్యంత ప్రియపాత్రుఁడు. ఈతనిప్రాణరక్షణముచేసిన మీ యెడల పీష్వా యత్యంత ప్రసన్నచిత్తుఁడగును. ఇంతేకాదు. మీ యెడల సర్వదా యాతఁడు కృతజ్ఞుఁడై యుండును. ఒక్క పీష్వాయే కాదు. ఆతనిదర్బారునం దున్నవారందఱును మీయెడలఁ గృతజ్ఞత గలవారై యుందురు. అదియటుండనిండు. నేనిఁక నిటఁ దడయరాదు.

అటనందఱును రఘునాథరాయలకొఱ కెంతయో వ్యాకులము నొందు చుందురు. నే నతిత్వరితముగఁబోయి వారికీసువార్త నెఱింగింప వలయు. పోయివచ్చెదను సెలవిండు" అని ద్వారకరా వందఱకడను సెలవుగైకొని బయలువెడలెను. జనార్దనాధికారి వీధిగుమ్మమువఱకు నాతనిని సాగనంపెను. ద్వారకరా వశ్వము నధిరోహించి గంతవ్య స్థానమునకై పరుగుపరుగునఁ బోయెను.

రఘునాథరాయల హృదయమందలి సందియమంతయుఁ దీరి పోయినది. కాని కరమ్చందునితోఁగూడ వచ్చిన యాతఁడెవఁడో తెలిసినదికాదు. రంగరాజునుపట్టుకొనినది మొదలు జరిగిన యావ దుదంతమును రఘునాథరాయలు బ్రాహ్మణుల కెఱింగించెను. వారీ విచిత్రగాథల నన్నిటిని విని తమయతిథి యొకసామాన్యవ్యక్తి కాఁడని నిశ్చయించుకొనిరి. జనార్దనాధికారి యత్యంత కుతూహల హృద యముతో నాతనిపూర్వ వృత్తాంతమును దెలియఁగోరి "వంగదేశము నుండి యీమహారాష్ట్రభూమికి మీరెందుల కరుదెంచితి"రని ప్రశ్నిం చెను. ఈప్రశ్నను విని రఘునాథరాయలు క్షణకాలము నీరవుఁడై యుండెను. తీక్ష్ణదృష్టిగల కుశాగ్రబుద్ధులెవ్వరైన నాక్షణమున నాతని ముఖమును బరికించియున్నచో నది విషాదరాహుగ్రస్తమై యున్న చంద్రమండలమని తప్పక గ్రహింపఁగలరు. తత్క్షణమే రఘునాథరాయ లాత్మనిగ్రహముచేసికొని తనవృత్తాంతమును బాజీ రావుకడ తెల్పినట్లే యీబ్రాహ్మణులకడను దెలిపెను. బ్రాహ్మణు లావాక్యములను సత్యమని విశ్వసించి యాతఁడొక గొప్పరాజనీతిజ్ఞుఁ డనియు, పరాక్రమశాలియనియు నట్టివాఁడు తమ కతిథి యగుట తమభాగ్యమనియుఁ దలంచి యపరిమితానంద సిమగ్నులైరి.

సంధ్యాసమయ మాసన్నమగుటంగాంచి జనార్దనాధికారి ఏక లింగేశ్వర సేవకై మందిరాభిముఖుఁడై వెడలిపోయెను. అచ్యుత కుమారమిశ్రులు నాతని వెంటనంటిపోయిరి.

గదియం దున్న వారందఱును వెడలిపోవుటచే సుబాల యచ్చటకువచ్చెను. ఆమె యాగది ప్రక్కను నిలుచుండియుండి యంతకుపూర్వము జరిగిన సంభాషణము నంతను వినియుండెను. అందుచే రఘునాథరాయ లోకమహావ్యక్తియని యామెకు స్పష్ట పడియెను. ఇంతియేకాదు. ఆతఁ డామెను "అమ్మా!"యని సంబోధించినాఁడు. ఇఁకఁ గావలసినదేమున్నది! ఇఁక లజ్జగాని భయము గాని లేదు. ప్రపంచమున శబ్దజాల మెంతయోయున్నది. కాని "అమ్మా!" యను శబ్దము నందున్న మాధుర్య మేశబ్దమునందును గానము. "అమ్మా!" యని పిలుచువారి సర్వావయవములును నానందరసపూరితము లగుచుండును. వారిహృదయము శాంతి సమ్మిళితమై యానందమున నోలలాడుచుండును. ఈశబ్దము నుచ్చరించినతోడనే పాషాణసమహృదయములుగూడ దయార్ద్రీభూతములు కాఁగలవు. ప్రేమపూరిత మగు నీశబ్దమును పిల్లలు, పెద్దలు, యౌవనులు, పురుషులు, స్త్రీలు, పశువులుసైతము నానందముతో నుచ్చరించుచుండుట మన మెఱుంగుదుము. ఈశబ్దమాధుర్యము ననుభవింపలేనివానిజన్మము నిరర్థకము. స్వార్థమిశ్రితులగు కొందఱు నీచు లీశబ్దమును తమ యుద్దేశము నెరవేర్చుకొనుటకై కలుష హృదయులై యుచ్చరించుచున్నారు. అట్టివార లీశబ్దమందలి మాధుర్యము ననుభవించుటలేదు. వారీపదమును లోకసామాన్య మైనదిగా వ్యవహరించుకొనుచున్నారు. వారి నేమనిపిలువవలయునో మేము తెలుపఁజాలము.

రఘునాథరాయల హృదయమున మాలిన్య మిసుమంతయును లేదు. ఆతఁడు "అమ్మా"యను శబ్దమునందలి మాధుర్యమునంతయు గ్రహించెను.

ప్రథమమున రమణీజలసులభ మగు లజ్జ సుబాలనావరించుటచే రఘునాథరాయల ప్రశ్నమున కేమియు నపుడుత్తర మీయలేదు.

చాలదినములనుండి పరిచయుఁడైన యాత్మీయునివలెనే సుబాల యాతనిని జూడఁజొచ్చెను. ఆమె యాతని శిరసుకడఁగూర్చుండి వీణామనోహరస్వరముతో "జగదీశ్వరుఁడు ఘోరవిపత్తునుండి మిమ్ము లను రక్షించినాఁడు" అనియెను. రఘునాథరాయ లామెవంకఁ దిలకించుచు "అమ్మా! నేనీయాపదను సంపదగానే పరిగణించుచున్నాఁడను. ఈసంపద నాకు లభింపకపోయినచో మాయమ్మదర్శనము నాకు దొరకకయే యుండును" అనియెను.

రఘునాథరాయల వాక్యములను విని సుబాల యవనతముఖి యయ్యెను. తరుణతపనబింబమువలె నామెముఖము రక్తిమం దాల్చెను. రఘునాథరాయ లామాతృదేవతా స్వరూపమును బరికించుచుండెను.

ప్రపంచమున ప్రకృతస్వరూపిణియగు రమణీముఖమండలము నేభావముతో మానవులు చూచుచుందురో వారిహృదయములయందట్టి రూపమే ప్రతిబింబించుచుండును. ఒక్కసారి చూచిన దోషము చేతనే లఘుచిత్తులగుపురుషులు, వారి హృదయములయందలి స్వభావ సిద్ధమగు ధృతియంతయు ననావృతస్థానమందలి కర్పూరమువలె హరించిపోవ, విషయలోలురై చెడిపోవుదురు. లవణస్పర్శమైన జలగవలె వారి హితాహితజ్ఞానము సంకుచితమైపోవును. ఇఁక వారెట్టి యకార్యములనైనఁ జేయుట కించుకంతయునుసంశయింపరు. పరమశిల్పి నైపుణ్యనిదర్శనమగు రమణీసౌందర్యము నెవఁ డత్యంత పవిత్రనేత్రములతోఁ బరికించునో వానిహృదయము శాంతికి నెలవగును. అందెట్టి దుష్టభావములు నుదయింపఁజాలవు. శాంతిసుఖములే సదా అట్టిహృదయమునఁ బ్రభుత్వము సేయుచుండును. ప్రపంచసంబంధమైన కలుషకలాపమేమియు నట్టివారి హృదయము నంటఁజాలదు.

పవిత్రచేతస్కుఁడగు రఘునాథరాయలు పవిత్రభావముతో సుబాల సౌందర్యమును జూచి సంతసించెను. ఆతని ప్రశాంతహృద

యార్ణవమున తరంగసంచారమేమియు లేదు. లజ్జాశీలయగు సుబాల మృదుస్వరముతో "మహాశయా! మీరు నన్ను తనయవలెఁ జూచుచు సన్మానించుచుండుటచే మిమ్ముల నీప్రశ్నముల నడుగ సాహసించితిని. మీ దేదేశమో, ఎచ్చటనివాసమో, మీపిల్లలు బంధువు లెచ్చట నున్నవారో, తెలిసికొన నిచ్ఛపడుచున్నదానను. నాకావృత్తాంతమును దెలిపి యనుగ్రహింపుఁడు" అనియడిగెను.

సుబాల యడిగిన ప్రశ్నమును వినినతోడనే రఘునాథుని నిర్మల ముఖమండలమున విషాదచిహ్నములు స్పష్టముగాఁ గాన్పించెను. పూర్వపువిషయము లేవియో యాతనిహృదయమునకు జ్ఞప్తికి వచ్చెను. సముద్రతరంగము వేలాభూమి నెట్లాక్రమించునో, అట్లే స్వభావసిద్ధమగు ధైర్యము సడలిపోవ దుర్భావప్రవాహ మాతని హృదయము నాక్రమించెను. జలభరాక్రాంత మేఘములవలె నాతని యాకర్ణాంతవిస్తృతసముజ్వలనయనములు రెండును జలపూరితములయ్యెను. సుబాల నిష్కల్మషహృదయ. ప్రపంచమందలికుటిలత నించుకంతయు నామె యెఱుఁగదు. అందుచే రఘునాథుని భావాంతరచిహ్నములను జూచి, ప్రియజనవిరహముచే నాతఁ డట్లున్నాఁడని యెంచుకొనియెను. రఘునాథరాయ లించుకసేపటిలో హృదయమును స్థిరముజేసికొని "అమ్మా! నీవు సరళచిత్తవు. దయార్ద్రహృదయవు. నిష్కల్మషహృదయవు. ఇట్టినీకడ నిజముదెల్పకున్నచో నే నీశ్వరునియెడ నపరాధముఁ జేసినవాఁడనగుదును. నేను నిన్నీశ్వరాంశసంభూతనుగాఁ దలంచుచున్నాఁడను. స్వర్గస్థురాలగు మాతల్లికిని నీకును నించుకంతయును భేదములేదు. మాయమ్మ నాపైఁ జూపిన యాదరమువంటి యాదరమును నేఁటికి మరల నీవలనఁబడయఁ గలిగితిని. నీవు నాప్రాణములను గాపాడితివి. అనాఘ్రాతకుసుమకోరకమువలెను, శారదీయకుముదినీరీతిని, విశుద్ధహీరముపోలికను నీహృదయము పవిత్రమైనది. నీవత్యంత సన్మానార్హవు. నీకడ నెట్టికథ

యును దాఁపవలసిన యావశ్యకము లేదు. నా హృదయమునంతయును నీకడ సంపూర్ణముగ నెఱింగింపవలసినదియే. కాని "అమ్మా! భాగ్యవిపర్యముచే నాకథనంతను నీకడఁ దెలుపఁజాలకున్నాఁడను. ఈశ్వరానుగ్రహమున నాయదృష్టమున నట్టిసుదినము లభించునేని నాకథనప్పుడు నీకెఱింగించెదను. "అమ్మా! మన యీపరిచయము జలతిలకమువంటిది కాదని తలంపుము. దీని నింతలో భిన్నము సేయుట కెవ్వరును సమర్థులుకారు. మందభాగ్యుఁడనగు నేనిప్పు డేకాకినై కూలములేనిసాగరమున నీఁదులాడుచున్నాఁడను. ఏదినమున కూలమును జేరఁగలుదునో ఆదినమ్మున నీకు నాకథనంతను జెప్పెదను. ఇప్పుడింతకంటె నెక్కువగఁ దెలుపుటకు నాకు సమర్థతగాని యధికారముగాని లేదు.

రఘునాథుడేమియు మాటాడలేకపోయెను. ఆతనికంఠస్వరము క్రమక్రమముగా రుద్ధమయ్యెను. సముద్రతుల్యమగు నాతనిగాంభీర్యమంతయు నదృశ్యమైపోయెను. సుదృఢమగు నాతని ధైర్యప్రాకారము కూలిపోయి భూసమమైనది. ఆతఁడించుకేనియు స్థిరహృదయుఁడుగా లేక బాలకునివలె నశ్రుజలములను వర్షింపసాగెను.

అత్యంతప్రియతమయగు భార్యయో, అలరారుముద్దులపట్టియో, యిహలోకమునువీడియుండుటచే నీతఁడు దుఃఖించుచున్నాఁడనియు, ఆశోకముచేఁ బ్రపంచమున నీతనికి వైరాగ్య ముదయించెననియు సుబాల నిశ్చయించుకొనియెను. ఇప్పుడు మరలఁ బూర్వస్మృతి కలుగుటచే మరల శోకించుచున్నాఁడనియు నిఁక నావిషయమున నేమియుఁ బ్రశంసింపరాదనియు నామె నిశ్చయించుకొని యాతనితో మధురవాక్యములు పలుకనారంభించెను. ఏదియో లోకాభిరామాయణముదక్క నాతని పూర్వకథనుగూర్చి యామె మరల నేమియు నడుగలేదు.

---

## పదమూఁడవ ప్రకరణము.

### అధికారిమహాశయుఁడు.

మలహరరా వుత్తరమునుదీసికొని బాజీరావుకడఁ గూర్చుండి యంతకుఁబూర్వపుదినమున జనార్దనాధికారినిపట్టుకొనితీసికొనిరమ్మని ద్వారకరావున కాజ్ఞయొసఁగియుండెను. ఇప్పు డట్టియాజ్ఞలేదు. జనార్దనాధికారిని విదేశబ్రాహ్మణుని దర్బారునకు దయచేయుఁడని వేఁడుకొనుచుండెను. ఏమన దుర్మార్గుఁ డగుకరమ్‌చందువిషయమున వారు సాక్ష్యమీయవలసియున్నది.

రఘునాథరాయలు పరుండియున్నగదిలోనికి మలహరరావు విచ్చేసెను. ఆతనిని జూచినతోడనే రఘునాథరాయ లవనతముఖుఁ డయ్యెను. ఇంచుకంతయుఁ దెలుపకుండఁగనే దుస్సాహసముచేసి రఘునాథరాయ లారాత్రి యాకార్యమునఁ బ్రవృత్తుఁడయ్యెను. ఇఁక మలహరరావు మొగ మెట్లుచూడఁగలఁడు? అయినను మలహరరావు రఘునాథరాయలయెడ స్నేహభావమునే గలిగియుండెను. ఇంతే కాదు. ఆతని నిమిత్తము మలహరరావుత్కంఠుడై సదా పరితపించుచుండెను. అట్టియుదారహృదయునిజూచి కృతజ్ఞుఁడగు రఘునాథరాయలు సిగ్గుఁజెందెనన్న నందాశ్చర్య మేమున్నది?

దూరదర్శియగు మలహరరావు రఘునాథరాయల యభిప్రాయము నెఱింగి యాతనిమంచముపైఁగూర్చుండి ప్రేమపూర్వకముగ "నన్నుఁజూచి నీవించుకంతయు సిగ్గుపడవలసిన యావశ్యకములేదు. నీయెడనంతవిశేషాపరాధ మేమియును లేదు. ఎవనికి గ్రహస్థితిబాగుగా నుండదో వాఁడెంత ప్రతిభాశాలియైనగానిండు, ఆతనిబుద్ధివృత్తి మేఘమాలికాసమాచ్ఛన్నమైన దివాకరునిపోలిక ప్రతిభావిహీనమై పోవును. మహాభాగులగు నలయుధిష్ఠిరాదినరేంద్రులకీర్తిదిగంతవ్యాప్తమైనదికదా! గ్రహస్థితి బాగుగ లేనప్పుడు వారిబుద్ధిచలించిపోలేదా? సామాన్యమానవులుసైతము గర్హించెడి ద్యూతవృత్తియందు వారి

మనసుపోలేదా? అట్టిచో నారాతిరి నాతోఁ జెప్పకుండ నట్టిసాహస కార్యమున నీబుద్ధి ప్రవృత్తమయ్యెనన్నచో నందాశ్చర్యములేదు. అది యటుండనిమ్ము. నిశ్చయముగా నీవాయీశ్వరుని పరమభక్తాగ్రగణ్యుఁడవు. అందుచే నిట్టి ఘోరవిపత్తును దాఁటఁగలిగితివి. పర శ్రేయ సహనవిహీనులగు పాపాత్ములు నీప్రాణములనుదీయ యత్నించియును సఫలీకృతమనోరథులు కాలేకపోయిరి. నీకొఱకై నేనుచాలఁ గాతరము నొందితిని. నిన్న ద్వారకరావు నీవార్త తెలిపినప్పటినుండియు నాహృదయము కుదుటఁబడినది." అనియెను.

రఘునాథరాయలావాక్యములనువిని గద్గదస్వరముతో 'పుత్రుని యపరాధసహస్రములను తండ్రియోర్పుతో సహించెనన్నచో విచిత్రమేమియునులేదు. నేనీసాహసకార్యముచేసినది మొదలు మీమొగముఁ జూడ నిచ్చవొడముటలేదు. యమద్వారతోరణముకడనుండి నన్నీ మహాత్ములీవలకుఁ దీసికొనివచ్చినారు. నాజీవితము వీరికి విక్రయింపఁబడినది.' అనియెను.

మల— ద్వారకునివలన యావదుదంతమును విన్నాఁడను. బాజీరావుకూడ నీవృత్తాంతమునువిని మిగుల నానందించినాఁడు. వీరినిరువురను దర్బారునకుఁ దీసికొనిరావలయునని పీష్వాసెలవైనది.

మల—(బ్రాహ్మణులతో) మీరు మాకందఱకును గొప్ప యుపకారమును జేసినారు. అందులకు మేమందఱమును మీయెడలసదా కృతజ్ఞులమైయుండెదము. మహారాష్ట్రపీష్వాయగు బాజీరావుకూడ మిమ్ములను మిక్కిలి సన్మానింపఁగలఁడు. నిరపరాధియగు నొకవ్యక్తికి ప్రాణదానమొసంగి రక్షించినారు. ఈయపకర్మమునకు నాయకుఁడగు కరమ్‌చందిప్పుడు కారాగారమున బందీయైయున్నాఁడు. రఘునాథరాయలకు బాగుగ నెమ్మదింపఁగనే యాపాపాత్ముని విచారణము ప్రారంభమగును. అప్పుడు మీరు సాక్ష్యమీయవలసియుండును.

జనార్దనాధికారి వినమ్రస్వరముతో "మానవజన్మమెత్తిన వారికెల్ల నేదికర్తవ్యమో దానినేమేమాచరించితిమి. ఇందులకు మీ రంతగా మమ్ముఁగొనియాడఁబనిలేదు. ఈస్వల్పకార్యమునకే ప్రభువు మాపైఁ బ్రసన్నుఁడైనచో నది మాయదృష్టముగాని వేఱుకాదు. అతని యాజ్ఞానుసారముగాఁ బ్రవర్తించుటకు మేము సదాసిద్ధముగా నుందుము. ఆతనియాజ్ఞ మాకు శిరసావహింపఁదగినది." అనియెను.

అచ్యు—కరమ్చందు పీష్వాకడ నుచ్చపదస్థుఁడై యున్నాఁడు. ఆతఁడు బహుశః గొప్పవంశమున జన్మముఁగాంచి, సుసభ్యుఁడును, సుశిక్షితుఁడునై యుండును. అట్టివాఁ డిట్టి మహోన్యక్తి నెందులకు విషనయనములతో వీక్షించుచున్నాఁడు? ఈతనిప్రాణములను హరి యింపవలయునని యెందులకిట్టి కుట్రలను బన్నుచున్నాఁడు? ఈతనిని జూచినచో నాతని కంతమనఃపీడ యెందులకు? తనప్రాణములనుగూడ నొడ్డి యీరక్తపాతమున కొడిగట్టి యేలయున్మత్తుఁడై పోవలయును?

మల——మనము సరళచిత్తులము. అందుచే నిట్టి నిష్ఠురకార్యముల యందుఁ బాపాత్ములేల ప్రవృత్తులగుదురని సదాయనుమానించుచుం దుము. సరళహృదయుఁడును, ధర్మభీరువునగు రఘునాథరాయలు స్వప్నమునందైనను కరమ్చందునఁ కపకారము సేయఁదలపెట్టలేదని నేను శపథముచేసిచెప్పఁగలను. అనేకవిధతిర్యగ్జాతులలోజననములంది నపిదపగాని మానవజన్మములభింపనేరదు. అందునుపూర్వజన్మకర్మ ఫలమనుభవింపకతప్పదు. పశుజన్మమునకుఁబిదప మానవజన్మలభిం చుటచే, మానవజన్మమందును, పశుత్వధర్మముండకతప్పదు. కాని, యింద్రియనిగ్రహముగల వివేకవంతుఁడు పశుధర్మమునుబరిత్యజించి మానవధర్మము ననుసరించి వర్తించును. నిద్రించుచున్న వ్యక్తిని సర్పము కఱచినట్లే పాపాత్ములకనిష్టముచేయకపోయినను వారిగుణ మును వారువిడువక సాధుల కపకారమును చేయుచుందురు. వారి హృదయము పాషాణముకంటె నధికకాఠిన్యమును దాల్చును. దురా

త్ముఁడగు కరమ్‌చందీ జాతిలోనివాఁడు. అందుచేతనే నిరపరాధియగు రఘునాథరాయలనాశనమునందుఁ గృతసంకల్పుఁడైనాఁడు. సద్గుణఖనియగు బాజీరావు రఘునాథరాయల యనన్యసామాన్యసద్గుణములనుజూచి సంతుష్టచిత్తుఁడై రాజదూతపదవినొసంగి మైసూరు రాజుకడకు రాయబారిగ నంపినాఁడు. ఈసామాన్యకారణమునేమనసు ననిడుకొని యీర్ష్యాళుఁడై కరమ్‌చందీతనియెడల శత్రుత్వమును వహించి పగదీర్చుకొనుటకై యిట్టిఘోరకర్మమును నాచరించినాఁడు. కాని, సర్వశక్తిమంతుఁడగు నీశ్వరుని యనుగ్రహవశమునను, మీ యనుకంపాతిశయమునను, ఆపాపాత్ముని యభీష్టము నెఱవేఱినదికాదు. నేఁటి కాదురాత్ముని కాయువుమూడినది. ఆతనియంతిమావస్థను జగమంతయుఁ గన్నులారఁ గాంచఁగలదు.

మల—(రఘునాథరాయలతో) కరమ్‌చందునకు సాహాయ్యముగావచ్చిన యాతఁడెవఁడో నీవు తెలిసికొనలేకపోయితివి కాఁబోలు.

రఘు—ముఖమునకు నల్లనిరంగును బూసికొనియుండుటవలనను, రాత్రిసమయమగుటను నాకానవాలు తెలిసినదికాదు. కాని, యసిచాలనముం దాతఁడు కరమ్‌చందునికంటె మిగుల నిపుణుఁడు. ఆసమయమునందాతఁడు రాకయున్నచో కరమ్‌చందుశిరసుభూమిపైఁ బడియుండును. ఆరెండవయాతనివలననే నాకు గాయములు తగిలి యుండవచ్చును.

మ—ఆపాపాత్ముఁడు ప్రస్తుతమున మృత్యుముఖమునుండి తప్పించుకొనినాఁడు. కాని, సర్వజ్ఞుఁ డగునీశ్వరుని కోపమునుండి రక్షింపఁ బడుటకెవ్వఁడును సమర్థుఁడుకాఁడు. ఎప్పుడో యొకప్పు డతఁడును తనయపరాధమునకుఁ దగినశిక్ష యనుభవింపక తప్పదు.

ర—కరమ్‌చందునకు సహకారియని మీరెవరిననుమానించితిరో యాతఁడే యీతఁడై యుండవచ్చును.

మ——భాస్కరపండితుఁడు కరమ్చందున కీకార్యమున సహ కారియయ్యెనని నాయనుమానము. వారిరువురును పరమమిత్రులు. భాస్కరపండితుఁ డతినిపుణుఁడు. అందుచే నెంత ప్రయత్నము చేసియు నాతనిపై నేరమునుస్థాపించుటకుఁ దగిన ప్రమాణములను గనుఁగొనలేకపోయితిని. ఆపాపాత్ముఁడిప్పుడు ముప్పది వేలసైన్యముతో వంగ దేశముపై దండయాత్ర వెడలియున్నాఁడు.

ర——భాస్కరపండితుఁడు వంగదేశముపై నేలదండెత్తినాఁడు!

మ——వంగదేశపుసుబేదారు మరణించినపిదప నలివర్దిఖానను వీరపురుషుఁ డా రాజ్యము నాక్రమించుకొని మహారాష్ట్రుల యాధి పత్యమునంగీకరింపక వారికీయవలసిన చౌదీ నీయక ఢిల్లీపాదుషహా ప్రభుత్వము నంగీకరించి మహారాష్ట్రులచే నిరస్కరించినాఁడు. ఆతనని దండించి మహారాష్ట్రులకు సామంతునిగాఁ జేసి యాతనికడ నుండి రాజస్వమును గైకొనివచ్చుటకై భాస్కరపండితుఁడా దేశముపై దండు వెడలినాఁడు.

రఘు——అయ్యో! వంగదేశమున నరరక్తము ప్రవహించు నుకాఁబోలును. ఎన్ని వందలనగరములు స్మశానములై పోవునో! ఎంత యరిష్టము సంభవించునో! దేశమందంతటను హాహాకారధ్వను లెగయుచుండును. అందులకించుకంతయును సందేహములేదు.

రఘునాథుని నేత్రము లశ్రుపూరితములయ్యెను.

మల——రాజుదోషముచే రాజ్యమునకు నష్టమువచ్చుచుండును. రాజుదుష్టుఁడయ్యెనేని రాజ్యమునందలిప్రజలు సదాకష్టమును ననుభ వించుచుఁదుదకు వధ్యులయ్యెదరు. ప్రపంచమున నీ ధర్మమిప్పాఁడు పుట్టినదికాదు. ఇదిరాజనీతి. దీనికిఁ బ్రతివిధానములేదు. సుబేదారు మాతో సంధికంగీకరించి మాకీయవలసిన రాజస్వము నిచ్చెనా, ఇఁక నెట్టియుపద్రవము నుండదు. ప్రజలకు నెట్టికష్టములును సంభవింపవు. అది యటుండనిమ్ము. పాపాత్ముఁ డగుభాస్కరపండితుఁ డీవిధముగా

నిప్పుడు మృత్యుముఖమునుండి తప్పించుకొనినాఁడు. కాని, యెప్పటి కైన నాతనికి శిక్షమాత్రము తప్పదు. ఈశ్వరునికడ మానవుని చాతుర్యము పనిసేయఁజాలదు. నీవు భాస్కరపండితుని శత్రువుగా భావించి మెలఁగుచుండవలయును. నేనీకథనంతయును పీష్వాకెఱింగిం చెదను. నీకు బాగుగా నారోగ్యముగనున్న పిదప కరమ్చందుని, దస్యుసరదారుని నేరములు విచారణసేయఁబడును. ఈ బ్రాహ్మణు లొనర్చినమేలునకై నేనుచాల సంతసించుచున్నాఁడను. వీరి సుగు ణములను పీష్వాకడ విన్నవించెదను. పీష్వావీరులకు యథోచిత సత్కారములొనర్చి గౌరవించును.

మలహరరావిట్లుచెప్పి వారికి వందనములుచేసి సెలవుఁగైకొని వెడలిపోయెను.

నాల్గుదినములు గడచెను. ఔషధప్రభావముచేతను, బ్రాహ్మ ణులొనర్చెడి యుపచారముల మూలమునను రఘునాథరాయల కారోగ్యముగలిగెను. ఇప్పుడాతఁడాగదియందు బద్ధుఁడై యుండలేదు. ఇటునటు పరిచారముసేయుచు నావలకీవలకు వచ్చుచుండెను. కాని, దేహమునందింకను బూర్ణముగా రక్తముచేరుకొనలేదు.

మలహరరావువలన నీకథనంతను విని బాజీరావు సదాశివ మిశ్రుఁడను సుప్రసిద్ధ రాజవైద్యుని రఘునాథరాయలున్నెడకంపెను. అప్పటికిరఘునాథరాయలకు సంపూర్ణారోగ్యము కలిగెను. సదాశివ మిశ్రులు వైద్యముచేయవలసిన యావశ్యకములేకపోయెను. బలము గలుగుటకై తగినయౌషధముల నొసంగి యాతఁడు మరల పీష్వాకడ కేగెను. రఘునాథరాయలయుదంతయును విని దర్బారునందలి ప్రధా నోద్యోగులందఱును ననేకవిధములగు నుపహారద్రవ్యములను గైకొని యాతనిని జూడవచ్చిరి. పీష్వాకూడ స్వయముగ నొకయుత్తరమును వ్రాసి తనసహానుభూతిని వెల్లడించెను. రఘునాథరాయలు పరిస్కృత వ్యాపారమును దెలిసికొనివచ్చుటకై యధికారిమహాశయుని పీష్వా డకు నగరమునకంపించెను.

జనార్ధనాధికారి వెడలిపోయినపిదప రఘునాథరాయలును అచ్యుతకుమారమిశ్రులును నాగదియందుఁ గూర్చుండి మాటలాడు కొనఁజొచ్చిరి. ఆమాటలీమాటలైనపిదప రఘునాథరాయలు "నీవు వంగదేశీయుఁడవు. మీపూర్వులనాఁటనుండియు మీకు వంగదేశమే నివాసభూమి. మీరెప్పుడును మహారాష్ట్రదేశమునకు వచ్చియుండ లేదు. అట్టిచో మీకును 'నీజనార్ధనాధికారికిని నింతటి ప్రగాఢ స్నేహమెట్లు సంఘటించినది?" అనియడిగెను.

అచ్యు—మీవంటి సత్పురుషులకడ మిథ్యావాదము లాడ రాదు. అందుచే నున్నదున్నట్లుగ విన్నవించెదను. కాని ముందుగ మీరు నేనుచెప్పఁబోయెడుకథను ప్రాణావసరసమయము వచ్చినను ఎవ్వరికిని దెలుపనని నాకడ శపథముసేయవలయును. ఈకథ యెచ్చట నైన వెల్లడియైనచో జనార్ధనాధికారికిఁజాలగ నపకారము కాఁగలదు.

రఘునాథరాయల హృదయమునఁ గౌతూహల మధిక మయ్యెను. తక్షణమే యాతఁడాకథను మిగుల రహస్యముగ నుంచెద నని ప్రతిజ్ఞచేసెను. అచ్యుతకుమారరాయలత్యంత ప్రసన్నభావముతో "మీవంటి పుణ్యాత్ములవాక్యము లెన్నఁడు ననృతములుకాఁజాలవు" అని నుడివితనయొక్కయు, అధికారి మహాశయునియొక్కయు యావ దుదంతమును దెలియఁజేసెను. వారిబాల్యము, కాశీప్రయాణము, విద్యాభ్యాసము, కృష్ణకమలుని వైరాగ్యము, ఆతనికై వెదకుట, పిదపఁ గొన్నిదినముల కుత్తరమువచ్చుట, తనవివాహము, సేతురామేశ్వర యాత్ర, మిత్రదర్శనముకొఱకై యిచ్చటకు వచ్చుట, రఘునాథ రాయలపతనము మొదలగు యావదుదంతమును వెల్లడించెను.

రఘు—కృష్ణకమలునకుఁ బరిణయముకాలేదా?

అచ్యు—కాశికి వచ్చుటకుఁబూర్వమే పరిణయ మైనది. అప్పటికాతని కొకకుమార్తెకూడఁ గలదు.

ర—మీకుఁ దలిదండ్రులులేరా?

అచ్యు—చిన్నతనముననే మృతిఁజెందిరి. నామాతామహియే నన్నుఁబెంచి పెద్దవానిని జేసినది.

ర—కృష్ణకమలునకు?

అచ్యు—నావలెనే యాతఁడును నాలుగైదు సంవత్సరముల ప్రాయముననే తలిదండ్రులులేని బాలకుఁడై పోయినాఁడు. ఆతనికిఁ జంద్రచూడతర్కాలంకారుఁడను పితామహసోదరుఁ డుండెడివాఁడు. ఆయనయే యీపిల్లవానిని సంరక్షించు చుండెడివాఁడు. ఆతఁడొక గొప్పపండితుఁడు. ఆతఁడు భూషణ నగరాధిపతియగు సీతారామ రాయలకు గురుపదవి నంగీకరించియున్నాఁడు. నేను చాలదినముల నుండి యాదేశమున లేకపోవుటచే నాతఁడు జీవించియున్నాఁడో లేదో యెట్లున్నవాఁడో నాకుఁదెలియలేదు.

పథికుఁడేదియో యాలోచించుకొనుచు వడివడిగఁబోవుచుండ మార్గమధ్యమున సర్పదర్శనమైన నెట్లులికిపడునో యట్లే అచ్యుత కుమారమిశ్రులు నుడివిన తుదివాక్యమునువిని రఘునాథరాయలు చకితుఁడయ్యెను. ఆతని సర్వావయవములునుగగుర్పొడిచెను. మఱియు నాతని లలాటమున ఘర్మబిందువు లుదయించెను. ఆతని యీ భావాంతరము నచ్యుతకుమారరాయలు చూచెను గాని కారణ మేమియో తెలిసికొనలేకపోయెను. నితాంతవిస్మయవిస్ఫారిత నేత్రములతో రఘునాథరాయలవంక వీక్షించుచు నిలువఁ బడియెను. ఇంతలో వీప్వాకడనుండి జనార్దనాధికారి యటకు విచ్చేసెను. అందుచే నచ్యుతకుమారమిశ్రులు రఘునాథరాయల నేమియుఁ బ్రశ్నింపలేదు. రఘునాథుఁడాత్మసంయమనముఁ గావించుకొని చిఱు నవ్వుతో జనార్దనాధికారిని ప్రశ్నార్థద్యోతకముగ వీక్షించెను.

# ప దు నా ల్గ వ ప్ర క ర ణ ము

## పా ప ప రి ణా మ ము

రఘు—పీష్వాకడ నగరమున విశేషములేమి?

జనా—పీష్వా మీవిషయమై యెన్నియో ప్రశ్నములను వైచినాఁడు. నేను వానికన్నిఁటికిని ప్రత్యుత్తరములనిచ్చితిని. మీపై నాతని కెంతయో యనుగ్రహము. మీకథనంతమువిని కరమ్చందుపై నెంతయో క్రోధమువహించినాఁడు. విశ్వాసఘాతకుఁడగు నాపాపాత్మున కుచితదండనము గావింతునని ప్రతిజ్ఞయొనర్చినాఁడు. కొలఁది దినములలోనే నిండుసభయందాతని నేరమును విచారించెదరని తోఁచుచున్నది. అప్పుడు నేనును నచ్యుతకుమారమిశ్రులును సాక్ష్యమీయవలసియుండును. మీమూలమున మేము పీష్వాయనుగ్రహము నకుఁ బాత్రులమైనారము. పరిమళవిశిష్టములగు పూవులతోఁ గలసియుండుటచే తిలకుసుమమునకుఁగూడఁ బరిమళమబ్బినట్లే మీసహవాసముచే మాకుఁగూడ పీష్వాయనుగ్రహము లభించినది. అందు చేతనే సాధుసమాగమము సర్వవిధముల శ్రేయస్కరమని పండితులు చెప్పుచుందురు.

రఘు—ఉపయుక్తసమయమున బీజావాపన మొనర్చినచో సస్యమువర్ధిల్లి లాభమొనఁగూడునట్లే సత్కార్యమొనర్చినచో నది యూరకపోక, సత్ఫలము లభియించుచుండును. మనుష్యులును దేవతలునుగూడ నట్టివారినిజూచి సంతసించుచుందురు. మహారాష్ట్రపీష్వా బాజీరావు న్యాయనిష్ఠకలవాఁడును గుణగ్రాహియునై యున్నవాఁడు. ఆతఁడు నిశ్చయముగా మీయనన్యసాధారణగుణములకుఁ దగిన సత్కారమును జేయగలఁడు. నాప్రాణదాతలకుఁ దగినయుపకారమును జేయుఁడని నేను పీష్వాను వేఁడుకొనియెదను.

ఇట్టికథలతో నాదినము గడిచిపోయెను. మఱునాఁడు మలహారరావు జనార్ధనాధికారి కుటీరమువకునచ్చి సంపూర్ణారోగ్యమునొంది యున్న రఘునాథరాయలనుజూచి చాలసంతసించి యిట్లనియెను.

మల—నీవు సంపూర్ణారోగ్యము నొందితివని రాజవైద్యుని మూలముననను ఈజనార్ధనాధికారివలనను పీష్వా విని యున్నాఁడు. పీష్వాదొంగలనాయకుఁడగు రంగరాజు నేకాంతస్థానమునకుఁ బిలిచి నిజమునంతయుఁ జెప్పినచో క్షమింతునని చెప్పెను. కాని, పాషండ హృదయుఁడగు రంగరాజు మనకడజెప్పినట్లే చెప్పినాఁడు కాని యించుకంతయును జోటీయలేదు. పీష్వాప్రయత్నము లేమియు ఫలింపలేదు. పీష్వా మిగుల క్రుద్ధుఁడై యాతనినేరమును కార్తిక శుద్ధ విదియనాఁడు విచారించుట కేర్పఱచినాఁడు. ఆనాఁటికి నీవక్కడకు రాఁగలవో లేవో కనుఁగొనిరావలయునని పీష్వా నన్నిక్కడకుఁ బంపినాఁడు.

రఘునాథరాయలు ప్రత్యుత్తరమిచ్చుటకుఁబూర్వమే జనార్ధనాధికారి "నేఁడుమొదలుకొని యైదుదినములు గడచినపిదప నీతఁడు దర్బారునకు రాగలఁడు. ఈశ్వరేచ్ఛచే నీతనికిఁ బూర్ణారోగ్యము కలిగినది. ఇఁకనేమియు భయములేదు. విశేషించి యట్టివిశ్వాసఘాతుకులెంత శీఘ్రముగ దండింపఁబడిన లోకమునకంత మేలు. వారెప్పుడు శిక్షింపఁబడుదురాయని లోకమెదురుచూచుచున్నది. వారిరువురును దండింపఁబడకపోయినచో శిష్టులకెన్నఁడును సుఖము, శాంతి లేదు. విచారణదినమును మార్పవలసిన యావశ్యకమిసుమంతయును లేదు. మేమును నానాఁడీతనితో రాజదర్బారున కరుదెంచెదము" అనియెను.

రఘు—ఆనేరములవిచారణలో నేను ముఖ్యసాక్షిని. మేము నిశ్చయముగా నానాఁడు దర్బారునకు వచ్చెదము—

అచ్యు—అందుకొఱకే నేనిచ్చట నున్నాఁడను. రెండు మూఁడుదినములలో నేనిటనుండి వెడలిపోవలయునని యున్నది. కాని, ఆపాపాత్ములనేరముల విచారణచూడకుండ వారెట్లుదండింపఁబడుదురో వినకుండఁ బోవలయునని లేదు.

మల—రఘునాథరాయలప్రాణసంరక్షణార్థమై యీశ్వరుఁడు మిమ్మిటకుఁ దెచ్చినాడు. ఈశ్వరసృష్టిలోని యొక మహావ్యక్తి ప్రాణములు మీవలన రక్షింపబడినవి. పీష్వా మీకెట్టి సన్మానమును గావించునో ఆపాపాత్మునకెట్టి శిక్షవిధించునో మీరుచూచెదరుగాక! మహాశయా! ఈజనార్దనాధికారికిని మీకును నెట్టిసబంధమో వినఁ గోరుచున్నాఁడను.

అచ్యుతకుమారమిశ్రుఁడు ప్రత్యుత్తర మీయలేను.

జనార్దనాధికారి యవనతమస్తకుఁడై యూరకుండెను.

అచ్యు—నాకును సీతనికిని నింతకుఁబూర్వ మంత విశేష పరిచయములేదు. నేను తీర్థయాత్రాపరుఁడనై నాభార్యతోఁగూడ రామేశ్వరమునకేగి యటనుండి యీనదిలో నౌకపైఁ బ్రయాణము సేయుచు నిటువచ్చి యీరాత్రి యిటవిడసితిని. అప్పుడే యిట్టిదుర్ఘటనముసంభవించినది. ఏమిచేయుటకును దోఁచలేదు. ఈప్రదేశము నాకుఁబరిచయమైనదికాదు. విదేశీయుఁడను. ఏమి సేయుదునాయని యిటునటు ప్రచారముసేయుచుండఁగ నుదయమున నీమహాత్ముఁ డగపడి నావలన యావనుదంతయును విని దయార్ద్రహృదయుఁడై మమ్ములను దనయింటికిఁదీసికొని వచ్చినాఁడు. మేముకుటుంబ సహితముగ నీతినికతిథులమై విశేష సత్కారముల నందుచున్నారము. మాపై నీతఁడెంతయో దయఁజూపియున్నాఁడు. అందుచేఁ గొలఁది దినములలోనే మాకపరిమితమైత్రి యేర్పడినది. జనార్దనాధికారి సద్గుణమూర్తి. ధర్మావతారము. అందుచేనాతనితో మైత్రిమాకొక మహద్గౌరవముగా భావించుచున్నాఁడను. ఈకొలఁదిదినములలోఁ

గలిగినయీపరిచయము చాలకాలమునుండి స్నేహబంధుత్వముగలిగిన వారికంటె నధికముగా మమ్ములను స్నేహపాశమున బంధించినది.

ఈవాక్యములు వినినతోడనే జనార్దనాధికారి ముఖ మానంద ముచే వికసించెను. కాని, రఘునాథరాయలదక్క మిగిలినవారెవ్వరు నాతని ముఖమువంకఁ దిలకింపలేదు.

మలహారరావు కార్తికశుద్ధవిదియ మంగళవారము నాఁడు విచారణజరుగునని మరల నుడివి వారికడ సెలవుఁగైకొని బయలు వెడలెను. రఘునాథరాయలును జనార్దనాధికారియు నాతనిని గొంత దూరముసాగనంపి తిరిగివచ్చి యచ్యుతకుమారమిశ్రునితోఁ గలసి కరమ్‌చందువిషయమునుగూర్చి ముచ్చటించుకొనుచుఁ గూర్చుండిరి. సంధ్యాకాల మగుటతోడనే జనార్దనాధికారి యేకలింగేశ్వరుని సేవిం చుటకై యాలయమున కేగెను. అచ్యుతకుమారుఁడును రఘునాథ రాయలునీవిధముగా సంభాషింప నారంభించిరి.

రఘు—మలహారరావుకడ జనార్దనాధికారినిగూర్చి యట్లు మాటలాడితి రేమి?

అచ్యు—అంతకంటె నేనుచెప్పుటకును నాకుపాయము దోఁచ లేదు. ఒక యసత్యమాడవలయునని యత్నించినచో వేయియసత్య ములాడవలసివచ్చును. నావిషయమై కృష్ణకమలుఁడేమైననాతనితోఁ జెప్పెనోలేదో నాకుఁదెలిసినదికాదు. అందుచే వెంటనే ప్రత్యుత్తర మొసంగుట కవకాశములేకపోయినది. కాని, కృష్ణకమలుఁడవనత మస్తకుఁడై యూరకుండుటచే నావిషయమై యాతఁడేమియుఁ జెప్పి యుండడనట్లుఁదోఁచి నేనామాటలను జెప్పితిని. ఇట్లు చెప్పినందులకు మీరన్యథాభావింపవలదు.

రఘు—నేను కృతఘ్నుఁడనుగాను. మీరుచెప్పినదానికి విరు ద్ధముగాఁ బ్రవర్తింపను. మీరు నాప్రాణములను రక్షించితిరి. నా

జీవితము మీకువిక్రయింపఁబడినది. మీరెట్లు చేయమన్నను నట్లే చేసెదను.

ఇంతలో జనార్దనాధికారి యాలయమునుండివచ్చుటచే నాప్రసంగ మాగిపోయెను.

క్రమక్రమముగ నైదుదినములును గడచిపోయినవి. ఈయైదుదినములలోను నీప్రపంచమున నెచ్చటనెట్టివిచిత్రములు జరిగినవో, ఎన్నిహృదయములానందలహరిలోఁ దేలులాడుచుండెనో, ఎన్నిహృదయములు విచారాంబుధిలో నిమగ్నములై పోయినవో, ఎవ్వరెఱుంగుదురు? ఎవ్వరునెఱుంగకపోయినను దినములుమాత్రము గడచిపోయినవి. ఒకముహూర్తములో నశ్వరమగు మానవజీవితమున నెన్నియో పరివర్తనములు సంభవించుచుండెను. ఒక్క ముహూర్తములోఁ బ్రళయముకూడ సంభవింపఁగలదు. అట్టిచో నీసుఖమయప్రపంచముల మానవుఁడు తానమరుఁడనని తలంచిభ్రాంతచిత్తుఁడై నిత్యవస్తువును త్యజించి యనిత్యవస్తువులయందుఁ బ్రమత్తుఁ డగుచుండుట మాత్ర మాశ్చర్యజనకము.

ఆఱవనాఁటిప్రాతఃకాలమున ద్వారకరావు మూఁడుశిబికలను వెంటఁదీసికొని జనార్ధనాధికారికుటీరమునకు విచ్చేసెను. రఘునాథరాయలు దుర్బలుఁడై యుండునని తలంచి పీప్యా గుఱ్ఱములనంపుటకు బదులుగ శిబికల నంపించెను. ద్వారకరా విరువురు సేవకుల వెంటఁగొని యశ్వారోహకుఁడై యరుదెంచెను.

ఆహారమును భుజించినపిదప దుర్గతినాశనియైన దుర్గానామస్మరణము చేయుచు రఘునాథరాయలును జనార్దనాధికారియు నచ్యుతకుమారమిశ్రుఁడును శిబికారోహణముచేసిరి. రఘునాథరాయల యభీష్టానుసరణిచి ద్వారకరావు తనయనుచరులనిద్దఱను సుబాలకుసాహాయ్యముగ నుండుటకై యట నుంచెను.

రాజవాటీప్రాంగణ ప్రదేశమునఁ గారుకార్యసంపన్నమగు విశాలవితానముక్రింద దర్బారేర్పాటుచేయఁబడియెను. అచ్చటకువచ్చుట కెవ్వరికినినాటంకములేదు. అందులకనియే యాబహిరంగప్రదేశమున దర్బారేర్పాటుచేయఁబడినది. ఆనాఁటివిచారణము జూచుటకై రావలయునని నగరవాసులందఱు నాహ్వానింపఁబడిరి. అందుచే పూర్వాహ్ణమునుండియు జనప్రవాహమచ్చటకుఁ బ్రవహింప నారంభించెను. కావలివారలకు సభయందు నెవ్వరిని నెలకొల్పుట చాలఁగష్టముగనుండెను, ఉచ్చపదస్థుఁ డగుకరమ్చందును, సుప్రసిద్ధచోరాగ్రగణ్యుఁడగు రంగరాజును దోషులగుటచే వారివిచారణను జూడవలయునని నగర మశేషముగ వచ్చి యాసభయందుండెను.

క్రమక్రమముగ ప్రధానసేనానులు, మంత్రివర్గమును పీష్వాయును, సచ్చటకు విచ్చేసిరి. వారిరాకను జూచి సభ్యులు నిలుఁవబడి జయజయధ్వనులు చేసిరి. కావలివారలు సశస్త్రులై యున్ముక్తఖడ్గములందాల్చి యచ్చటచ్చట నిలువఁబడియుండిరి.

ఎత్తైనపీఠముపై నమర్పఁబడిన స్వర్ణఖచిత రౌప్యసింహాసనమున పీష్వా కూర్చుండియుండెను. తక్కినరాజకీయోద్యోగులందఱు వారి వారికిఁదగినపీఠముల నధిష్టించియుండిరి. కొలఁదిసేపటిలోనే రఘునాథాదులు నల్వురును వచ్చిరి. సుధాకరసందర్శనముచే జలనిధి యెట్లుప్పొంగునో, అట్లే రఘునాథరాయలు ప్రవేశించినతోడనే సభయంతయు నొక్కసారిగ విచలితమయ్యెను. సముద్రగర్జనమువలెనే సభకోలాహల ముప్పతిల్లెను. రఘునాథరాయలు పీష్వాసింహాసనము కడ సాష్టాంగపడియెను. పీష్వా పులకితహృదయముతో నాతని లేవనెత్తి తనపార్శ్వమునఁ గూర్చుండఁబెట్టుకొనియెను. పిదప బ్రాహ్మణద్వయమునకు నమస్కరించి యాదరించి యుచితపీఠములపైఁ గూర్చుండఁబెట్టుకొనియెను. రఘునాథరాయలు సభయందలి ప్రధానోద్యోగులకందఱకు నుచితరీతిగ నభివాదనము లర్పించి కుశలప్రశ్నములు నడిగెను.

ఈవిధముగ శిష్టాచారవిధులను నడపి రఘునాథరాయలు మరలఁ దనపీఠము నలంకరించెను. రక్షకభటులు "నెమ్మది నెమ్మది" అని యుచ్చకంఠములతో నుచ్చరించుచుండిరి.

బాజీరావు స్నేహపూర్వకముగ రాయలతో నీవిధముగా సంభాషించెను.

బాజీ—నిన్ను మరలఁ జూడఁగలిగినందులకే నెంతయో సంతసించుచున్నాఁడను. నీకొఱకు నేను చాలఁ బరితాపపడితిని. జగదీశ్వరుఁడు ప్రాణసంకటావస్థనుండి నిన్ను రక్షించినాఁడు. ఇంతకుఁ బూర్వము నేనీకథనంతను వినియున్నాఁడను. పాపాత్ములు భయానకములగుకుట్రలను పన్నినారు. అవియన్నియుఁ దెలిసినవి. కాని, నీ వేకాకిగ నాయర్ధరాత్రమున నాయుత్తరము ప్రకారము నిర్జనారణ్యమున కెందులకుఁ బోయితివి?

ర—ధర్మావతారా! నేను కేవలమును కుతూహలప్రవృత్తి నివారణార్థమే యీ సాహసకార్యమునఁ బ్రవృత్తుఁడ నైనాఁడను. ఇఁదింతకుట్ర జరిగియుండెనని నాకప్పుడు తెలిసినదిగాదు. నాహృదయమున కప్పుడించుకంతయును భయముకలుగలేదు. ఈప్రపంచమున నాకు శత్రువు లెవ్వరునులేరు నే నెవ్వరికిని స్వప్నమునందైనను నపకారము చేసియెఱుఁగను. హృదయమునఁ దలంచియైన నెఱుంగను. నన్ను వధించినందువలన నెవ్వఱికిని నేవిధమగులాభమునుండదు. అందుచే నాహృదయమున నెట్టిశంకయును జనియింపలేదు. అదిగాక యేకలింగేశ్వరునిమందిర మంతనిర్జనస్థానమున నుండునని యంతకుఁ బూర్వము నేనెఱుంగను. అందుచే నేను సరళహృదయముతో నిర్భయముగా నానిశీథసమయమున నెవ్వరితోడను జెప్పకుండ నా ప్రదేశమునకుఁ బోయితిని. ఇంతకుట్ర జరుగుచున్నదనియు, కరమ్ చందింతనరాధముఁ డనియు మొట్టమొదట నేనెఱుంగను. మహానుభావులగునీ బ్రాహ్మణు లానిశీథమున నన్నుఁ గాపాడకపోయినను, నా

నిమిత్తమునయింతకష్టమునొందకపోయినను నేనీపాటికిమృతుఁడనయియే యుందును. నేను వీరియనుగ్రహమువలననే మృత్యుముఖమునుండి తప్పించుకొంటిని.

రఘునాథరాయలు యావదుదంతమును వివరముగా పీష్వా కెఱింగించెను. పీష్వా యాకథనువిని క్రోధము నాపలేకపోయెను. ఆతని ముఖమండలము తరుణతపనబింబమువలె రక్తిమందాల్చెను. అధరము పదింబదిగఁ గంపించుచుండెను. లలాటప్రదేశమందలినాడి పరిదృశ్యమానమగుచుండెను. సభ్యులందఱును భీతచిత్తులై క్రోధపూరితమగు బాజీరావుమొగమును బరికించుచుండిరి. బాజీరావొక్కింత స్థిరహృదయుఁడై బందీలను గొనిరమ్మని యాజ్ఞ యొసంగెను,

కొలఁదినిమిషములలోనే సశస్త్రులైనరక్షకభటులు శృంఖలాబద్ధులగు రంగరాజును, కరమ్‌చందును దర్బారునకుఁ దోడితెచ్చిరి. జనులందఱును వారిపై కటూక్తులను గురిపింపనారంభించిరి. సభయంతయుఁ దుపానుసమయమందలిరత్నాకరమువలె విచలితమైపోయెను. రక్షకభటులప్రయత్నముమీఁద సభ్యులు కొంతసేపటి కూరకుండిరి.

దుర్బలచింతవలనను కారాగృహవాసమువలనను కరమ్‌చందు మిగులఁ గృశించియుండెను. అతనిశరీరమంతయు నల్లవడిపోయెను. ప్రాతఃకాలమందలిశశిమండలమువలె మొగము వెల్లనైయుండెను. సభలోఁ బ్రవేశించి పీష్వా సముఖమున నున్నరఘునాథరాయలను జూచునప్పటికి, పవనతాడితవృక్షమువలె నాతని సర్వావయవములును గంపింపనారంభించెను. కాని, దస్యుసర్దారుఁ డగురంగరాజు సాపోలాయందుమాత్ర మట్టిపరివర్తనచిహ్నము లేవియుఁ గాన్పింపలేదు. నిర్భయహృదయముతో, చింతారేఖాపరిసూన్యలలాటముతో నాతఁ డొక్కప్రక్క నుండెను.

వేత్రహస్తులచీత్కారధ్వనులమూలమునఁ గొంతసేపటికి సభ నీరవయయ్యెను. అప్పుడు బాజీరావుపీష్వా జలదగంభీరస్వరముతో "రంగరాజసాహేబా! కరమ్చంద్! మీనేరములను విచారణసేయుటకై మిమ్ముల నిప్పు డీదర్బారునకు రప్పించితిమి. రంగరాజుచేసిన నేరముకంటె కరమ్చందుచేసిన యపరాధము గురుతరమైనదిగా మేము భావించుచున్నాము. ఏమనిన, రంగరాజు చోరుఁడు. రాజధర్మములను గౌరవింపఁడు. దోపిడితనముచే జీవితమును గడపుకొనుచుండువాఁడు. ఆతఁడు సదా యకార్యములనే సేయుచుండును. కాని, కరమ్చంద్! నీవు రాజభృత్యుఁడవు. రాజుచే గౌరవింపబడుచు రాజుచేఁ బోషింపఁబడుచున్నాఁడవు. నేను నీయెడ సంపూర్ణమైన విశ్వాస ముంచినాఁడను. నాసామ్రాజ్యప్రజనులలో పూజనీయుఁడవనితలంచుచున్నాఁడను. కాని, నీవు విశ్వాసఘాతకుఁడవై దారుణకార్యములయందుఁ బ్రవృత్తుఁడవైనాఁడవు. నాదేశమునకుఁ బరమశత్రువును, సంఘమునకుఁ గంటకప్రాయుఁడు నగురంగరాజుతోఁ జేరి, చాలకాలమునుండి యాతని ప్రాణసంరక్షణకు విశేషసాహాయ్యము చేయుచున్నాఁడవు. నీ వీచోరునితోఁ గలిసి కుట్రనుబన్ని నిరపరాధియు, విశ్వాసపాత్రుఁడును, గొప్పరాజకీయోద్యోగియు, నగునీరఘునాథరాయల ప్రాణములను దీయుటకై ప్రయత్నమునొనర్చితివి. ఆప్రయత్నము విఫలమైపోవ నీస్వహస్తములతో నీకార్యమును నెఱవేర్పవలయునని నిశ్చయించుకొని యెంతయో ప్రయాసపడితివి. కార్యము సంపూర్ణమయ్యె ననుస్థిరవిశ్వాసము నిజమైనచో ప్రతిహింసాప్రవృత్తి నశించిపోయియేయుండును. కాని భగవంతుఁ డన్యథా యొనర్చినాఁడు. భగవంతునియనుగ్రహమునకుఁ బాత్రుఁడైనవానిని నీవంటి నీచుఁ డేమిసేయఁగలఁడు? ఎవనిప్రాణములనుదీయుటకై నీవు విశేషప్రయత్నమును చేసితివో యాతఁడిప్పుడు నాపార్శ్వమున నాసీనుఁడైయున్నాఁడు. ఒక్కమాఱుపరికించిచూడుము. నీవో, శృంఖలా

బద్ధుఁడవై బందీగా సభయెదుట నిల్చుండియున్నాఁడవు. సభ్యులంద ఱును నిన్ను తృణముకంటె నల్పముగాఁ జూచుచున్నారు. కరమ్ చంద్! నీవు నాస్వదేశీయుఁడవు. విశేషించి యాత్మీయుఁడవు. నిజమే. అనేకసమయములలో నా కనేకోపకారములను జేసియున్నాఁడవు. కాని, యంతమాత్రమున నీనిమిత్తము న్యాయదేవతమస్తక మును పదాఘాతముచేఁ దిరస్కరింపఁజాలను. ఈశ్వరుఁ డెవనిహస్త మున రాజదండమునిడునో యాతఁడు రాజ్యమును రాజధర్మాను సారముగఁ బరిపాలింపవలయును. దుష్టశిక్షణమునుశిష్టప్రతిపాలనమును నించుకంతయును దోషసంయుతములు గాఁజాలవు. విశేషించి నీ యపరాధ మత్యంతగురుతరమైనది. నీవు రాజద్రోహివి. సంఘ ద్రోహివి. మిత్రద్రోహివి. నరహంతకుఁడవు. నీపాపములకుఁ దగినట్లు శిక్ష ననుభవింపకతప్పదు నీవు సరళహృదయముతో నిజమునొప్పు కొని క్షమాపణము వేఁడుకొన్నచో నీకు విధింపవలసినశిక్షవిషయమై యాలోచించెదను" అనియెను.

బాజీరావు విరమించినతోడనే కరమ్‌చందు క్షీణకంఠస్వర ముతో "ధర్మావతారా! నే నేకుట్రలోఁ జేరియున్నాఁడనో, అందు వలన నా కగుప్రయోజన మెద్దియో, నాకించుకంతయు బోధపడ లేదు. ఏలిక యనన్యసాధారణపరాక్రమవంతులు, మీప్రజ్ఞాబలము త్రిలోక విశ్రుతమైనది. దానిచే సకలకుతంత్రములును భిన్నభిన్న ములైపోవును. నేను మీదాసుఁడను. నిరపరాధియగు దాసునిప్రాణ రక్షణభార మేలికపై నున్నది. ప్రభూ! దేవరమంత్రియగు మలహార రావునకును నాకును జాలకాలమునుండి వివాదము కలదు. ఒకజాగీరు నుగూర్చి మేమిరువురమును తగవుపడుచున్నారము. ఏలికకడనాపై నీకృత్రిమాభియోగము నాతఁడే తెచ్చినాఁడు. కాని. దురదృష్టవశ మున ప్రమాణమేమియు లేకపోవుటచే నేనుపరాజితుఁడ నైనాఁడను. ఇప్పటినుండియు నాతనితో నాశత్రుత్వము నిర్మూలమైపోఁగలదు.

నాయెడ నపరాధముచేసిన యొకభృత్యుని నే నుద్యోగమునుండి తప్పించితిని. మలహారరావు విశ్వాసఘాతకుఁడగు నాభృత్యుని, తన స్నేహితుఁడగు రఘునాథరాయలను సాహాయ్యముగాఁ గైకొని యీ కుట్రను బన్నినాఁడు. నేను నిస్సహాయుఁడనైయుండఁగా మీఁకడకుఁ దీసికొనిరాఁ బడితిని. నే నెవరితో మొఱ్ఱపెట్టుకొందును? నాపై నెట్టిసాక్ష్యమును లేదు. నేను శిక్షార్హుఁడనుకాను" అనియెను.

క్రోధకంపితస్వరముతో బాజీరావు 'ఓ నరాధమా! ఈసభా మందిరమున నసత్యపుగాథలనునుడివి నీజిహ్వ నేల యపవిత్రముచేసి కొందువు? నాకువిశేషప్రమాణములు లభియింపకపోయినచో నిన్నేల బందీగాఁ జేయుదును? నీవు రఘునాథరాయల ప్రాణహరణవిషయమున నీదొంగలనాయకున కుత్తరమువ్రాయలేదా!' అనియెను.

కర—నేనే యీలేఖను లిఖించితినని చెప్పుటకుఁ బ్రమాణమేమియున్నది? నేనాలేఖను లిఖించుచుండఁగాఁ జూచినవారెవ్వరు? నాహస్తాక్షరములని గుర్తించినవారెవ్వరు? నేనే యీయుత్తరమును లిఖించితినని యేలిక కెట్లు విశదమైనది?

బాజీ—(ఆరక్తనయనుఁడై) దొంగలనాయకునికడ దొరకిన యుత్తరమును నీవు లిఖింపలేదనియే యంగీకరింతము. రఘునాథరాయలను నిశీథసమయమున నేకలింగేశ్వరుని యాలయముకడకు రమ్మని యుత్తరమువ్రాసి యట నాతనిని వధించుటకై నీవు ప్రయత్నము చేయలేదా?

కర—ధర్మావతారా! శత్రువులుపన్నినవలలో నేను జిక్కుకొంటిననియు, దానినుండి తప్పించుకొనుటకు నాకు శక్తి లేదనియు నేనిదివఱకే విన్నవించుకొనియున్నాఁడను. నాపైఁ బగఁదీర్చుకొనుటకై యీనేరమును శత్రువులే నామీఁదఁబెట్టినారు. నాకడనించుకంతయు నపరాధములేదు. మలహారరావే యీపన్నుగడ యంతయుఁ బన్నినాఁడు. రఘునాథరాయలెప్పుడును నాకేయపకారమును జేసి

యుండలేదు. నేనెందులకాతనినాశనమును దలపెట్టుదును? అందువలన నాకగు లాభమేమి? కింవదంతిగ నేనొకవార్త వినియున్నాడను. దేవా! అది యీసభలోఁ దెలుపుచున్నందులకు క్షమింపవలయును. ఒకానొకకులఘువుతో నీరఘునాధరాయలకుఁ బ్రణయ మేర్పడి యెనఁట. ఈవిషయ మామెభర్త యెఱింగెనఁట. ఆతఁడే యీతనిని నిట్టిదుర్దశకుఁ బాల్పడఁజేసెనఁట. సమయమునకై వేచియున్న మల, హారరాయ లీయపరాధమును నాపైఁబెట్టి పగఁదీర్చుకొనయత్నించు చున్నాఁడు. సత్యవాది యగు రఘునాధరాయలుకూడఁ నాతని వలలోఁ బడి యనృతమాడ సిద్ధపడుచున్నవాఁడు.

ఈవాక్యములనువిని సభ్యులందఱును నవ్వసాగిరి. కాని. ఆజ్యముపోసినయగ్నివలె బాజీరావు క్రోధాగ్ని ప్రజ్వలింపసాగెను. ఆతఁ డత్యంతక్రోధముతో వజ్రగంభీరస్వరమున "రే! నరాధమ! నీకుఁ గఠినశిక్షననుభవింపవలసినయోగమున్నది కాఁబోలు! లేకున్న నిట్టి యసంబద్ధప్రలాపములాడవు. నేను నిన్నుక్షమింపఁగలను. కాని, నాయెదుట ననర్గళముగా మిధ్యాకధలనుజెప్పి తప్తకాంచనసన్నిభ మగు రఘునాధరాయల నిష్కళంకచారిత్రమునకుఁ గళంక మాపాదించి, నీపాదములను గొడ్డలిదెబ్బచే నీవే కొట్టుకొనుచున్నాఁడవు. నే నేమిచేయుదును? సప్రమాణముగా రుజువుచేయనిదే నేను నీకు శిక్షవిధింపను. ఈసభ్యు లందఱియెదుటను నీయపరాధమును ససాక్ష్యముగ స్థిరపఱచి సభ్యులయభిప్రాయమును గైకొని నీయపరాధమును నకుఁ దగినదండనమును విధించెదను.

బాజీరా విట్లుపలికి మలహారరావువంకఁ దిలకించెను. ఆతఁడు కరమ్చందు సేవకుఁ డగుగిరిధరలాలును బిలిపించెను.

గిరిధరలాలు సాక్షులుండెడిస్థలమున నిలిచి బాజీరావునకును సభ్యులకు నభివాదమునముచేసెను. ప్రమాణముచేసి సర్వజనసమ

క్షమునను తానెఱింగినకథ నంతయును దౌలుత మలహారరావుతోఁ జెప్పినట్లే చెప్పివైచెను. సభ్యులందఱును కరమ్చందును నానావిధముల దూషింపసాగిరి.

బాజీ—కరమ్చందు నిన్నుద్యోగమునుండి యెందులకుఁ దీసి వేసినాఁడు?

గిరి—ప్రభూ! నన్ను తీసివేయలేదు.

బాజీ—అట్లయినచో నీ వాతనికడ సేవకుఁడుగ నేలయుండ లేదు?

గిరి—ప్రభూ! నాయజమానుఁడుచేసెడు కార్యములయెడ నాకు సందేహముకలుగఁజొచ్చినది. ఈరంగరాజు నాపరమున ద్రవ్యమునిచ్చి కరమ్చందున కంపుచుండెడివాఁడు. వారిరువురు నొకటియనియు నేవియో యకార్యములను వారిరువురునుగలసి చేయుచున్నారనియు నాకుఁ దోఁచినది. ఎప్పటికేని యది బయటపడకమానదని నేను నిశ్చయించుకొంటిని. అప్పుడీకుట్రలో నేనుకూడఁ జేరియుంటినని తలంచి నన్నుకూడ శిక్షించెదరేమోయని నాకు భయముకలిగినది. అట్టియాపత్కాలమున నీతఁడు నన్నుఁ గాపాడునను నమ్మకము నాకు లేదు. న్యాయముకొఱ కాతనికి వ్యతిరేకముగ సాక్ష్యమీయవలసివచ్చునేమో యనుసంశయము నాహృదయమును బాధించినది. ఈకారణములచే నాతనియాశ్రయమును విడుచుటయే మంచిదని తలంచితిని. ఈవిశ్వాసఘాతుకుని పట్టియిచ్చుటచే నేలికకును, దేశమునకును నాకును శ్రేయమే యని నిశ్చయముచేసికొనినాఁడను.

బాజీ—అట్లయినచో నీయజమానుఁడు నిన్నుద్యోగమునుండి తొలఁగింపలేదా?

గిరి—ప్రభూ! లేదు. నాయంతట నేనే నాయుద్యోగమును వదలుకొన్నాఁడను.

బాజీ—(కరమ్చందుతో) నీ వీతని నేమైన నడిగెదవా?

కరమ్‌చందు తనయసమ్మతమును దెలియఁజేసెను,

బాజీ—(సాక్షితో) నీవు నీయిష్టమువచ్చినచోటునకుఁ బోవచ్చును. ఇఁక నిన్నడుగవలసినదిలేదు.

పీష్వాయనుమతిప్రకారము రఘునాథరాయలు సాక్ష్యస్థానమునకు వచ్చి ప్రమాణముచేసి యావదుదంతమును క్రమముగా సాక్ష్యమొసంగెను. రంగరాజుకడ దొరకినయుత్తమును సభ్యులందఱకుఁ జదివి వినిపించెను. సభ్యులందఱును కరమ్‌చందును దూషింపనారంభించిరి.

సభ నిశ్శబ్దముగా నున్నతోడనే బాజీరావు దోషులవంక రోషకషాయితనేత్రములతోఁ దిలకించి జలదగంభీర స్వరముతోఁ "మీరేమైన సాక్షి నడిగెదరా" యని ప్రశ్నించెను. కరమ్‌చందు పూర్వమువలెనే తనయసమ్మతమును దెలియఁజేసెను.

రంగ— ధర్మావతారా! సర్వనియంత యగుజగదీశ్వరుఁడు మీకు విశేషశక్తిసామర్థ్యములనొసంగియున్నాడు. ఆశక్తిసామర్థ్యములను మీ రెప్పుడును దుర్వినియోగముచేయరాదు. నేనిప్పుడు పూర్ణముగా మీచేతఁ జిక్కియున్నాఁడను. నేనేమిచెప్పుటకును నిప్పుడు సమర్థుఁడనుకాను. నిస్సహాయుఁడనై శరణాపన్నుఁడనైయున్న నాపై నకారణముగ నితరులు చెప్పెడిమాటలను విని దోషారోపణము సేయఁజనదు. అపరాధులనుదండించునప్పుడు ప్రత్యక్షప్రమాణము లుండవలయును. ఏలికనన్నుసహ్యించుకొనుచుండవచ్చును. కాని, అంతమాత్రముచే నీశ్వరసృష్టియందలి యొకశ్రేష్ఠజీవితమును ప్రపంచమునుండి తీసివేయుటధర్మముకాదు. ఇష్టమున్నచో నెవనిని కీటమువలె కాలనుబట్టిరాచివేయవచ్చునో అట్టివానియెడ సదయహృదయులగుట యథార్థపురుషార్థము. ఏలిక వీరపురుషులనియు న్యాయైకశీలురనియు లోకమంతయు నెఱుగును. అనేకలక్షలజనులజీవితములు మీచేతియందున్నవి. నావంటినిస్సహాయుని—నిరపరాధిని దండించినచోఁ

ద్రిలోకవిశ్రుత మైనమాయశఃప్రభకుఁ గళంకముకలుగునేమోయని చింతించుచున్నాఁడను. మొట్టమొదట నేను రంగరాజసాహోలానని మీరెట్లుతెంగిరి? ఆపై నీతనితోఁగలిసి నేను కుట్రచేయుచుంటినని మీకెట్లు తెలిసినది? దానికి సాక్ష్యమేమున్నది? రెండవది:— ఏలికదూతను నేను పట్టుకొనుటకై యేమియత్నములను చేసితిని? ముందుగ మీదూతయే నాపై గుండ్లను వేయలేదా? అజ్ఞానావస్థలోనున్నప్పుడు నన్ను బందీగాఁజేసి తేలేదా? అట్టిచో నాయపరాధమేది! మూఁడవది — ఏయుత్తరమువలన నీకుట్రలోఁ జేరినట్లుసూచింపఁబడుచుండెనో, ఆయుత్తరము నాయొద్ద దొరకినందులకుఁ బ్రమాణమేమున్నది? నేనీతనినెఱుఁగనేయెఱుంగను. అట్టిచో నేనీతనిలోఁగలిసి కుట్రలను జేయుచున్నానని చెప్పుటన్యాయము.

నాజీవితమెట్టిదో తెలిసికొనకుండ, నాయపరాధము సప్రమాణముగ స్థిరపడకుండ నన్నుదండించుటెన్నఁడును న్యాయము కానేరదు. అందుచే ధర్మావతారులగుదేవరవారు నన్ను నిరపరాధి నని స్థిరపఱచి విడిచిపెట్టవలయు నని వేఁడుకొనుచున్నాఁడను.

బాజీ—బందీ! సరియైనప్రమాణములు లభింపనిదే నిన్నెన్నఁడును శిక్షింపబోము. అగ్నినివస్త్రమధ్యమునదాఁచుటెంతయసాధ్యమో పాపకార్యములను చాలకాలము దాఁచిపెట్టుటంతయసాధ్యము. కుంచమునిండుటతోడనే బయలుపడకమానదు. మిథ్యాకథలనుజెప్పి నీవు నాకన్నులలో నిసుకనుపోయఁజాలవు. ధర్మభీరువును, వీరధర్ముఁడునగు రఘునాథరాయలమాటలు విశ్వసింపఁదగినవి. ఆతనినోట నసత్యములెన్నఁడును రాఁజాలవు. దూరదర్శియగునాతఁడుముందుగ మేల్కొనియుండనిచో, నీవాతనిని వధించియేయుందువు. అత్యంత సాహసుఁడును, సుకౌశలియు నగురఘునాథరాయలు కేవలమాత్మసంరక్షణముకొఱకే యట్టికార్యము నొనర్చినాఁడు. అంతమాత్రముచే నాతఁడపరాధి కానేరఁడు. నీ వపరాధము జేసితివో లేదో నీ యెదుటనే స్థిరపఱచెదను జూడుము.

గిరిధరలాలు మరల సాక్ష్యమిచ్చుటకై పిలువఁబడియెను. ఆతఁడు మరల ప్రమాణముచేసి సాక్ష్యమీయఁదొడంగెను.

బాజీ— (బందీవంకఁజూచుచు) నీ వీతనినామమేదియో యెఱుఁగుదువా?

గిరి—చిత్తము. ఎఱుఁగుదును. ఈతని పేరురంగరాజుసాహోలా!

బాజీ—ఈతనినామమును నీ వెట్లెఱుఁగుదువు?

గిరి—హుజూర్! కరమ్చందు నాపరమున రంగరాజనకిమ్మని పంపినయుత్తరములనన్నిటిని నీతనికే యిచ్చితిని. ఈతఁడు స్వహస్తములతో నాకుత్తరములనొసంగుచుండెడివాఁడు. ఈతనియాజ్ఞాప్రకారముగా నిఁకనొకదొంగ నాకు రూపాయలనిచ్చెను. మొదటిదినమున నాయజమానునియాజ్ఞానుసారముగా నీతనితో నొకసాంకేతికకథను జెప్పుటకు వెళ్ళినప్పుడు తక్కినయీతనియనుచరు లెందులకువచ్చితి వనినన్నడిగిరి. రంగరాజసాహోలాదర్శనార్థమైవచ్చితి నని చెప్పితిని. అప్పుడు వారు నన్నీతనికడకుఁ గొంపోయిరి. ఈతఁడు నామాటలను విని ప్రత్యుత్తరముల నొసంగినాఁడు. అందుచే రంగరాజసాహోలా యీతఁడే యని నేను బాగుగా నెఱుంగుదును.

గిరిధరలాలు చెప్పుచుండినవాక్యములను విని దస్యుసర్దారుని మొగము వెలవెలపోయెను. గిరిధరలాలు నొక్కప్రశ్ననైన నడుగుటకు సాహసింపలేకపోయెను. అవనతముఖుఁడై భూమివంకఁ జూచుచు నిలువఁబడియెను. బాజీరావు గిరిధరలాలునకు సెలవొసంగెను. పిదప కరమ్చందునింటికడదొరకిన మూఁడుత్తరములనిచ్చి సర్వజనసమక్షమునఁ జదువుమని మలహరరావున కాజ్ఞాపించెను. మలహరరావుచ్చస్వరమున నాయుత్తరములను జదువనారంభించెను. ఆయుత్తరములలో మొదటిదిది.

జయతుజగదీశ్వరః!

అత్యంతసన్మానాస్పదులగు 'భో' మహాశయులసమ్ముఖమునకు—

మీకు సదాశుభముఁగలుగఁ జేయుటకై యీశ్వరునిఁ బ్రార్థించుచున్నాఁడను. తరువాత మీరంపినయుత్తరమును జదువుకొని యందలిసంగతులను గ్రహించితిని. నగరమునందు చిన్నపని యొకటి యున్నదనియు, నందుకొఱకు పండ్రెండుగురు పఠానులను గతశని వారమునాఁటికిఁబంపవలసినదనియు నిదివఱలోనాజ్ఞాపించియున్నారు. అట్లే పంపుటకేర్పాటుచేసితిని. కాని యింతలో నొకఘనకార్యము మీఁద నూటయేబదిమందిని వేఱొకచోటకుఁ బంపవలసివచ్చుటచే మీయాజ్ఞాప్రకార మానాఁటికి పఠానులను బంపలేకపోయితిని. అందులకు నన్ను క్షమింపవలయును.

మీరు నన్నొకయాత్మీయునిగా భావించుకొనువలయును. నాకేకార్యమున నెంతస్వల్పలాభముగలిగినను అందుకొంతభాగము మీ గృహమున నున్నదనియే తలంపుడు. కర్నాటకమునుండి యింగ్లీషు వారి ఖజానావచ్చునని తెలిసి మార్గమధ్యముననుండి దానిని దోచుకొన్నారము. ఆకార్యమునకై చాలమందిని పంపవలసివచ్చినది. అందు మీభాగమునకైదువందలరూపాయల నీతనిపరమున నిచ్చి పంపితిని. అందినవివరమును వ్రాయఁగోరెదను.

మీరు మొదట చెప్పినకార్యమింకను నెఱవేర్పవలసి యున్నచో ఒకదినము నందులకై యేర్పాటుచేసి తెలియఁజేసినచో మిగిలిన 'బందోబస్తు'లను నేను చేసెదను.

శ్రావణ శు ౧౫.

మీచిరహితైషి, రంగరాజు.

జలదగంభీరస్వరముతో పీష్వా 'ఏమి! నరాధమా! ఈయుత్తరము నీచే వ్రాయఁబడలేదా? పట్టణమందలి యొకధనికునియింట దోపిడిచేయించుటకై నిన్నుఁ బిలువనంపలేదా?' అని యడిగెను. దొంగలనాయకుఁ డేమియుఁ బ్రత్యుత్తరమీయలేదు. మలహరరావు రెండవయుత్తరమును నీరీతిగ జదువఁదొడంగెను.

జయతుజగదీశ్వరః.

మాననీయులగు "భో" మహాశయుని సమ్ముఖమునకు—

సోదరవర్యా! మీరును నేనును నత్యంతమిత్రులము. మనశరీరములు వేఱుకాని, ప్రాణమొక్కటియే. మనమన్యోన్యము నుపకారమును చేసికొనుటయందు బద్ధప్రతిజ్ఞులమై యున్నారము. అందుచే మీరు నాకాత్మీయులరని తలంచి యిట్లు సంబోధించితిని. మీరు పంపినవర్తమాన మందినది. కృతజ్ఞుఁడను. కొలఁదిదినములలోనే నేనీ స్థలమునుండి మఱియొకచోటికిఁ బోవుచున్నాఁడను. అందుచే రాజభృత్యులెవ్వరును నన్ను పట్టుకొనఁజాలరు. నేనెక్కడకేగునదియు నింకను స్థిరముకాలేదు. అందుచే నావిషయమున నధికముగఁ దెలుపఁజాలను. కొన్నిదినములు గడచినపిమ్మట మీకడకు నేనొకమనుష్యునిఁ బంపెదను. ఆతనివలన నన్నిసంగతులును దెలియఁగలవు. మీకడకు వచ్చి యెవడు 'రంగరాజు' అనుశబ్దము నుచ్చరించునో వాఁడు నేనుబంపిన మనుష్యుఁడేయని తలంపుడు. ఆతనితో మీరన్నివిషయములును మాటలాడవచ్చును.

ఇట్లు,

మీ రం॥ సో॥"

తదనంతరమున మలహరరావు మూఁడవయుత్తరమును జదువనారంభించెను.

"అయ్యా! నమస్కారములు—

నిన్నటిదినమున మనుష్యులుకొంద ఱాకార్యమునకై వెళ్ళి వచ్చినారు. కాని, దానివలన నేనుకొన్నంతలాభము లేకపోయినది. వారెట్లో మాయభిప్రాయములను దెలిసికొనఁగలిగిరి. అందుచే మన యాశ ఫలించినదికాదు. ఇంతేగాక మనమనుష్యులలో నిదువురకు

దెబ్బలుకూడఁ దగిలినవి. అందుచే నేనుమరల నచ్చటకుఁ బోవలసి యున్నది. అక్కడనుండి మరలివచ్చినపిదప మరల మీ కుత్తరము వ్రాసెదను.

ఇట్లు మీచిరహితైషి

సాహోలా."

బాజీ—ఈయుత్తరములన్నియు కరమ్‌చందునకు నీవు వ్రాయ లేదా? ఈయుత్తరములమూలమున మీయిరువురి యపరాధములు సప్రమాణముగా రుజువుపడుచున్నవి. ఇంకను నాయెదుట మిథ్యా ప్రలాపములాడెదవేల?

రంగ—ప్రభూ! ఈకథల నెప్పుడు మీరు నమ్ముచున్నారో అప్పుడు మేము దీనినిగూర్చి మాటలాడుటవలనఁ బ్రయోజనమేమి గలదు? నిశ్చయముగా నెవఁడో నాశత్రువొక్కఁ డీయుత్తరములను సృష్టించియుండును.

బాజీ—నరాధమా! మిథ్యావాదీ! ఇట్టియసత్యపుమాటలాడి మృత్యుముఖమునుండి తప్పించుకొనయత్నించుచున్నావా? ఈయుత్త రములన్నియు నీసహకారియగు కరమ్‌చందుగృహమున లోహపు సందుగలోనుండఁగాఁ బట్టుకొనఁబడినవి. నాయెదుట నాసైనికుఁ డీ యుత్తరముల నాపెట్టెలోనుండి తీసినాఁడు. నిన్ను సర్వనాశనము చేయవలయు ననియెవఁడో నీశత్రు వీయుత్తరముల నాసందుగలోఁ బెట్టినాఁడా? ఆత్మరక్షణముకొఱకు నీ వేసూత్రము నాధారముగఁ జేసికొంటివో యాసూత్ర మత్యల్పకాలములోనే భిన్నభిన్నమ్మైతె పోయినది. అసత్యములాడి నీమీఁదకుఁ దెచ్చికొనుచున్నాఁడవు. ఇఁక గరమ్‌చందుచేసిన నేరములను స్థిరపఱచుటకై మీరందఱును రఘునాథరాయల ప్రాణరక్షణముచేసినవారి సాక్ష్యములను వినవలసి యున్నది.

బాజీరావు నాజ్ఞానుసారముగా మొట్టమొదట నచ్యుతకుమార మిశ్రిలు సాక్షి నిలుచుండెడితావునకు వచ్చి ప్రమాణముచేసి తా నెఱిగియున్నదంతయు సాక్ష్యమిచ్చెను. జనార్ధనాధికారి, నంతకుఁ బూర్వము తా నెఱిఁగియున్నసంగతియు నాతనిని జూచిపోవుటకై తాను వచ్చినసంగతియుమాత్రము చెప్పలేదు. పిదప జనార్ధనాధికారియు నందులకనుగుణముగఁ దా నెఱిఁగియున్నవిషయముల నన్నిఁటిని గ్రమముగాఁ దెలియఁజేసెను.

బాజీ—ఏకలింగేశ్వరాలయమున మీరు మున్నెప్పుడైన నీ కరమ్‌చందును జూచియున్నారా?

జనా—నేను కరమ్‌చందును బాగుగా నెఱుఁగను. ఒకటి రెండుసారులుమాత్రము చూచియున్నాఁడను. ఈదారుణకార్యము జరుగుటకు పూర్వము 20–25 దినములక్రిందట నొకమా రేకలింగేశ్వరుని పూజకై సపరివారముగా నీయన యాలయమునకు వచ్చినాఁడు.

బాజీ—అప్పుడు నీతో నేమైనమాటలాడెనా?

జనా—విశేషవిషయములేమియు మాటాడలేదు. "రాత్రి ఎన్నిగడియలకు స్వామికి హారతియిచ్చెదరు? రాత్రి ఆలయమందే పరుండెదరా? మీనివాసమెక్కడ" ఇత్యాదిప్రశ్నములను మాత్రము నన్నడిగినాఁడు. కాని, నాహృదయమున నప్పుడేమియు సందియము కలుగలేదు. సరళభావముతో నాతనిప్రశ్నములకన్నిఁటికిని ప్రత్యుత్తరములనొసఁగితిని.

బాజీ—మంచిది. కరమ్‌చందుతోఁగూడ మఱియొకసైనికు నెవ్వనినైనఁ జూచియుంటిరా?

జనా—చూడలేదు. ఆనాఁడు కరమ్‌చందుతోఁగూడ కొందరు స్త్రీలును భృత్యులునుమాత్రమే కలరు. పురుషసైనికుఁ డెవఁడును వచ్చియుండలేదు.

బాజీరావు కరమ్‌చందువంకకుఁ దిరిగి "ఈజనార్దనాధికారి నేమైన యడిగెదవా?" అనియడిగెను. పూర్వమువలెనే కరమ్‌చందు తల నాడించుచుఁ దనయనిష్టమును దెలియఁజేసెను.

బాజీరావు పీష్వా జనార్దనాధికారిని గూర్చుండనియమించి సభవంక దృష్టినిగిడ్చి "ఆర్యులారా! మీరీయపరాధులనేరములను, సాక్షమును వినియున్నారు. అపరాధులను న్యాయముగా విచారణ చేసి దండింపకపోయినచో, ప్రభువు ఈశ్వరునియెదుట నపరాధికావలసివచ్చును. వీరు దోషులో నిర్దోషులో మీరిప్పుడు నిశ్చయించి చెప్పవలయును. మీయభిప్రాయమును దెలిసికొని పిదప నపరాధులకుఁ దగిన దండనము విధించెదను" అనియెను.

సభలో నాల్గువైపులనుండియును నేకగ్రీవముగ "దోషులు—దోషులు" అను శబ్దములు వినవచ్చెను.

సభ నిశ్శబ్దమైనపిమ్మట బాజీరావు అపరాధులవంకఁ దిరిగి "రంగరాజా! కరమ్‌చంద్! మీయపరాధములు సప్రమాణముగా రుజువైనవి. మీకువ్యతిరేకముగా నీపెద్దమనుష్యులు సాక్ష్యమిచ్చినారు. వారిసాక్ష్యమును నమ్మకుండుటకుఁ దగినకారణ మేమియు నాకుఁ గాన్పించుటలేదు. సాక్ష్యములోఁ బరస్పరభేద మేమియును లేదు. న్యాయముగనుఁగొనుటకై యింతగాఁ బ్రయత్నించిపనిచేసితిని. రాజదండమును చేఁబూనినవాఁడనగుట నిష్పక్షపాతముగా నావిధిని నేను నిర్వర్తింపవలసియున్నది. న్యాయతః—ధర్మవశతః—మీయపరాధములకుఁ దగినదండనమును విధింపక మిమ్మనుగ్రహించినచో నాకీర్తికి గొప్పకళంకము వాటిల్లఁగలదు. ఇంతేకాక యీశ్వరునియెదుట నపరాధినిగూడ నగుదును. రంగరాజా! నీవనేకదినములనుండి దోపిడులను జేయుచున్నాఁడవు. నీమూలమున గృహస్థులు రాత్రులయందు సుఖనిద్రజెందుటలేదు. నీకీర్తిని నేను చాలకాలమునుండి యెఱుఁగుదును. నిన్నుఁ బట్టుకొనవలయునని చాలకాలమునుండి

ప్రియత్నించుచున్నాఁడను. కాని, కృతకార్యుఁడునుగాలేకపోయితిని. తుదకు నిరపరాధియగు రఘునాథుని సర్వనాశనమును దలపెట్టితివి. దానితోఁ గుంచమునిండినది. ఇఁక నీపాపమునకుఁ బ్రాయశ్చిత్తము లభింపఁగలదు. నీవునారాజ్యమునఁ గంటకమువంటివాఁడవు. అందుచే నిన్నుఁ బట్టుకొనినవానికిఁ బదివేలరూపాయల నిచ్చెదననికూడఁ బ్రకటించియుంటిని. ఇప్పుడు జూపట్టిన ప్రమాణములనుబట్టి నీవు దోపిడివని యే నేను నమ్ముచున్నాఁడను. రాజద్రోహివి. దొంగలనాయకుఁడవు. అందులకుఁదగిన ఫల మనుభవింపుము. నీజీవిత మీనాఁటితో నంత్యమైపోయినది. నీకు మరణదండనము విధించితిని" అని పలికి రక్షకభటులవంకఁ దిలకించెను. రక్షకభటులు రంగరాజు నాస్థానము నుండి యావలకుఁ గొంపోయిరి. రాజాజ్ఞను వినియును సాహోలాచెక్కు చెదరకుండ గంభీరముగా నడచుచు వెడలిపోయెను. ఆతని ముఖమండలమున విషాదచిహ్నమేమియుఁ గాన్పింపలేదు. కాని, కరమ్‌చందు మాత్రము విషాదవదనుఁడై యూపస్తంభమునకుఁ గట్టఁబడినపశువు వలెఁ గంపింపనారంభించెను.

సభ్యులందరును పీష్వావంక దృష్టులనునిలిపి చెవులొగ్గియుండిరి. బాజీరావు రోషకషాయితనేత్రములతో కరమ్‌చందును జూచుచు గంభీరస్వరముతో "కరమ్‌చంద్! నీమీఁద నొకగొప్పయపరాధము మోపఁబడి సప్రమాణముగా రుజువైనది. నీయపరాధము ప్రాణదండనము విధింపఁదగినది. నీవు మా సేవకుఁడవైయుండియు ద్రవ్యలోభముచే దొంగలలోఁజేరి దోపిడిగాఁడవైతివి. దోపిడిగాండ్రకుఁ బ్రోత్సాహమొసంగుచు దోఁచి తెచ్చినద్రవ్యములోఁ బాలుగొనుచున్నాఁడవు. పట్నములోనిధనికులనేకులయిండ్లలో నీవే దోపిడిగాండ్రకు "ఆచూకీ"యిచ్చి దోపించినట్లూహింపఁ దగియున్నది. ఇన్నాళ్ళ వఱకును నీమూలమున రంగరాజసాహోలా పట్టువడలేదు. నీమూలమున ప్రజలు నిర్భయముగా నిద్రింపలేకపోయినారు. ఇన్నాళ్ళకు విధి

నీకుఁ బ్రీతికూలుఁడైనాఁడు. అందుచే నీమాయయంతయు బయట పడినది. ఈప్రపంచమున పాపాత్ముఁ డెల్లప్పుడును రక్షింపఁబడ నేరఁడు. కుంచమునిండుటతోడనే బయటపడకమానఁడు. వానిపాపఫలమిప్పు డనుభవింపక తప్పదు. నీవంటిపాపాత్మునుపేక్షింపఁదగదు. దేశమున నరాజకముప్రబలఁ జేసిన రాజద్రోహివి. నీ రెండవయపరాధమింతకంటె గురుతరమైనది. నిష్కారణముగ నిరపరాధి యగు రఘునాథరాయ లను జంపఁదలపెట్టితివి. నీవు వీరపురుషుఁడవయ్యు కాపురుషునివలె నీచకార్యమున కొడిగట్టినాఁడవు. నీపై ననుగ్రహము చూపుట నాకుఁ బాడిగాదు. నిన్ననుగ్రహించినచో ధర్మముతప్పిన వాఁడ నగుదును. నీవామూలాగ్రముగ నసత్యములను నుడివి, నాక్రోధము నినుమడింపఁ జేసితివి. నిజమునొప్పుకొని క్షమింపవేఁడుకొన్నచో నీకుఁ గొంచెము మేలుకలుగఁగలదు. ఇప్పుడైనను ఆరాత్రి నీకు సాహాయ్యముగ వచ్చినవాఁడెవఁడో తెల్పితివా నీకుఁ గొంత శ్రేయము గలుగును" అనియెను.

కరమ్చందు క్షీణకంఠముతో 'ధర్మావతారా! నావాక్యము లన్నియు నసత్యములనియే మీరుతలంచినప్పుడు నేను నిజమని చెప్పిన దానియందుమాత్రము మీకు నమ్మకమెట్లుండును' శత్రువుల కుతంత్రముచే నేనిప్పుడు శమనద్వారతోరణముక్రింద దూరవలసి వచ్చినది. నేనిట్టియవస్థనుండి యింకొకని కిట్టియవస్థఁ గలుగఁజేయు టేల? నే నసహాయుఁడను. ఏలిక సర్వతంత్రస్వతంత్రులు. నన్ను మీ యిష్టమువచ్చినట్లొనర్పవచ్చును. నే నేమియుఁ జెప్పవలసినది లేదు' అనియెను.

బాజీరా వీమాటలను క్రోధకంపితస్వరముతో "రే! నరాధమ! నీయపరాధము పూర్తిగా రుజువైనది. నీయపరాధమునకుమరణదండ నముదక్క వేఱుశిక్ష లేదు. నీవిదివరకు మాకనేకవిషయములలో సాహాయ్యమును జేసియున్నాఁడవు. ఆపత్కాలములయందు ఛాయ

వలె నాతోఁగూడ నుండి యనేకోపకారములను జేసియుంటివి. అనేక దినములు. నమ్మకముగనుండి రాజకార్యములను జక్కఁగా నిర్వహించియున్నాఁడవు. అందుచే నీయందనుగ్రహించి మరణదండనము నకుబదులుగ యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధించినాఁడను. నీయాస్తి యంతయును రాజభాండారమునఁ జేరిపోవలయును" అనియెను. పిదప పీష్వా మరల నిట్లుచెప్పెను. నీజాగీరునందును నీయాస్తియందును సగముభాగము రఘునాథరాయల కిచ్చివైచెదను. పుణ్యాత్ములగు జనార్దనాధికారికిని అచ్యుతకుమారమిశ్రులకును చెరి వేయినూటపదార్లును బంగారువలయములును దుశ్శాలువులు నొసంగఁ బడును. సుబాలాదేవికిఁగూడ నొకయలంకార మొసంగఁబడును.

బాజీరావునుడివిన యీవాక్యములను విని సభ యంతయు నపరిమితానందమును బొందెను. ఉచ్చస్వరములతో సభ్యులు పీష్వాకు ధన్యవాదములను చేసిరి. రక్షకభటులు బందీలను శృంఖలాబద్ధులం జేసి జాగ్రతగా నావలకుఁ గొంపోయిరి. పీష్వాయాజ్ఞానుసారముగా సభ చాలింపఁబడియెను. శిలలచే నొకచో నించుకయడ్డువెట్టఁబడి నప్పుడు ప్రవాహము ద్విగుణీకృతవేగముతో నెట్లుధ్వనిసేయుచు ప్రవహించునో, అట్లే సభచాలించుటతోడనే సభ్యులరసనాయంత్రములు పరిచలించుచుండ విచారణసంబంధమునఁ దమతమయభిప్రాయములను వ్యక్తీకరించుకొనుచు నెవరియిండ్లకువారు వోయిరి.



## పదునేనవ ప్రకరణము.

## తీర్థయాత్ర.

పదిదినములుగడచినపిదప నగరమునకావల నొకబహిరంగ ప్రదేశమున రంగరాజసాహోలా నురితీసిరి. కరమ్చందును దేశాంతర వాసునిగఁజేసిరి. ఆతనియాస్తిని విక్రయించి యందుసగముభాగమును

రాజభాండారమునఁ జేర్చివైచిరి. తక్కినసగమును రఘునాథరాయ లకు బహుమానముగ నీయఁబడియెను. ఇంతియేగాక ప్రకటన పత్రి మున లిఖింపఁబడినరీతిగఁ బదివేలరూపాయలను రఘునాథరాయల కీయఁబడియెను. కరన్‌చందు కుటుంబభరణమున కై నెలకు పదునేను రూపాయలవంతున రాజబొక్కసమునుండి యిచ్చుచుండుఁడని పీష్వా యుత్తరువుచేసెను. పీష్వాయాజ్ఞానుసారముగా బ్రాహ్మణదంపతుల కును, అధికారికిని బహుమానముఁ గొసంగఁ బడియెను. రఘునాథ రాయల కోర్కెననుసరించి యచ్యుతకుమారమిశ్రుఁడును సుబాలయు మలహారరావునింట విడిసిరి. జనార్దనాధికారి యహరహము నటకు వచ్చిచూచి పోవుచుండెను.

ప్రపంచమునఁ గార్యమునుద్ధరించుపట్ల శఠులకడ శఠతచూపు టయే కర్తవ్యము. ద్రవ్యలోభముచే విశ్వాసఘాతుకుఁడై యజమా నునకు సర్వనాశముతలపెట్టిన గిరిధరలాలునెడల నెట్లుప్రవర్తించినను పాపములేదు, అని యోచించి రాజనీతిజ్ఞుఁడగు మలహారరా వాతని కేమియు నిచ్చుటకిష్టపడఁడయ్యెను. కాని, దయార్ద్రహృదయుఁడగు రఘునాథరాయ లందుకిష్టపడలేదు. అందువిషయమున నిరువురకును విశేషసంవాదమైనపిదప తుద కైదువందలరూపాయలు గిరిధరలాలున కొసంగఁబడియెను. గిరిధరలాలేమియు మాటలాడలేక యెంతదొరికిన నంతియే యని యాద్రవ్యమును గైకొని వెడలిపోయెను.

అచ్యుతకుమారమిశ్రుఁడును సుబాలయు రఘునాథరాయలను దమయాత్మీయునివలె భావించుకొనుచుండిరి. రఘునాథరాయలును వారియెడ నట్లే మెలంగుచుండెను. జనార్దనాధికారి తనపూర్వ వృత్తాంతమును ప్రకృతమున నీవేషముననుండుటకుఁ గలకారణమును రఘునాథరాయల కెఱింగించెను. వారు ముగ్వురునుదక్క మలహార రావుమొదలగువారెవ్వరును నారహస్యము నెఱుంగరు.

ఆమోదాహ్లాదములతో దినములు గడచిపోవుచుండెను. ఒక నాఁడు సుబాల రఘునాథునితో "పవిత్రస్థానమగు హరిద్వారమునకు సమీపముననున్న కంఖాలమున నాజనకుఁడు వసించియున్నాఁడు. నేనాయన నొకసారి దర్శించి కాశికేగవలయునని తలంచుచున్నాను. నేనిఁక నిట చాలదినములుండఁజాలను. కొలఁది దినములలో నేయిట నుండి బయలు దేరివెళ్లెదను" అనియెను. రఘునాథుఁడేమియుఁ బ్రత్యుత్తరమీయలేదు. మలహారరావుతో నీమాటలను ప్రసంగవశమున విన్నవించెను.

మల—మాయిష్టదేవుఁడు హరిద్వారసమీపమున నొకయాశ్రమమునందు వాసము సేయుచున్నాఁడు. చాలదినములనుండి నేనాతని దర్శనము సేయుటలేదు. నేనిప్పుడు వార్ధక్యమునందుచున్నాఁడను. ఇఁక నెన్నిదినములో జీవింపఁజాలను. ఒక్కసారి యాతనిని జూచి రావలయునని మిక్కిలి యిష్టపడుచున్నాఁడను. నాయీయుద్దేశమును నేను విడువజాలను. నాకుఁగూడ నొకసారి హరిద్వారమునకుఁ బోవలయునని యున్నది. కరమ్చందు దేశభ్రష్టుఁడైనను ఆతనిబంధుమిత్రులిట చాలమందియున్నారు. వారందఱును నీపై మిగులఁ గోపముఁ గొనియెట్లయిన నిన్నుఁ గడతేర్పవలయునని చూచుచుందురు. సమయమయ్యెనేని వారు వారినీచోద్దేశమును నెఱవేర్చుకొనకమానరు. విశేషించి నేనీయూరునలేకపోయినచో నాపాపాత్ములు స్వేచ్ఛవహించి తమకార్యమును సాధించుకొనుట తథ్యము. కావున, నీవు మాతోఁగూడఁ దీర్థయాత్రకు రమ్ము. నిన్నిక్కడనుంచి, పోయివచ్చుట నాకిష్టములేదు.

ఈవాక్యములనువిని సంతుష్టచిత్తుఁడై రఘునాథరాయలు "నాయొద్ద కత్తియున్నచో నాకేమియు భయములేదు. ప్రాణభయముచే నింకొకచోటునకు పలాయనము కావలసినయవసరములేదు. కాని, హరిద్వారమునకు రావలయునని నాకు మిగుల యిచ్ఛకలదు.

పీష్వాయనుమతియైనచో మీతోఁగూడఁ దీర్థయాత్ర కరుదెంచెదను” అనియెను.

మల—అందులకై నీవు చింతింపఁబనిలేదు. నేనునీనిమిత్తము పీష్వాయొద్దకుఁ బోయి సెలవిప్పింపుమని వేఁడుకొనియెదను. ఆయన నాప్రార్థన నంగీకరింపకపోఁడు. విశేషించి యాప్రభువునకు హిందూ ధర్మములయెడ విశేషాభిమానముకలదు. తీర్థయాత్ర కేగుచున్నామని చెప్పినచో నందులకాయన యడ్డుపెట్టఁడు. నేనాయనకడ మూఁడు మాసములు సెలవుగైకొనియెదను. మనము లేనప్పుడు మనకుఁ బ్రతి నిధిగ ద్వారకరావిచ్చట నుండఁగలఁడు.

రఘు—ద్వారకరావుదక్క మీకింక సంతానములేదా?

మల—నాకు మొదట సంతానము కలుగుననెడియాశ లేక పోయినది. విచారముతోఁ గాలముఁ గడపుచుండెడివాఁడను. నాగురు దేవుఁడొకప్పుడు ద్వారకకుఁబోవుచుండ నేనును వెళ్లితిని. గురుదేవుని యాజ్ఞానుసారముగా ద్వారకానాథునింగూర్చి ధ్యానముచేసితిని. నా కిరువురు సంతానము కలిగినచోఁ బ్రథమసంతానమును స్వామికర్పిం చెదనని శపథముచేసితిని. కొలఁదిదినములకు నాకొకయాఁడుశిశువు జన్మించినది. పిదప రెండుసంవత్సరములకుఁ దరువాత నొకమగశిశువు కలిగెను. నాల్గుసంవత్సరముల వయసులోనుండఁగా నాప్రథమసంతా నమును గురుదేవునిసన్నిధిని సర్పించితిని. ద్వారకానాథునికృపచేఁ గలిగిన సంతానముగుట నాబిడ్డకు ద్వారకరావని పేరుఁ బెట్టితిని. గురు దేవుఁడును నేనునుదక్క నీరహస్యము నెవ్వరు నెఱుఁగరు. ఆవిషయ మున మొట్టమొదట నీతోడనే చెప్పితిని.

రఘు—మీతనయ యిప్పుడెక్కడనున్నది? ఆమెపేరేమి?

మల—ఎచ్చటనున్నదియో నేనెఱుఁగను. గురుదేవుఁడామెకు “జయంతి” యని పేరుపెట్టెనని వినియున్నాఁడను.

రఘు—ఆమె కెంతవయసుండును?

మల—ఇరువదినాల్గువత్సరములక్రిందట నామెను గురుదేవుని యాశ్రమమున నప్పగించితిని. అప్పటికామెకు నాల్గుసంవత్సరముల వయసుండెను. ఇప్పటికి ముప్పదిసంవత్సరములకు మించియుండవని తలంచెదను.

ఈమాటలు వినినతోడనే రఘునాథరాయల ముఖమండలము వర్షవిహీనమేఘమండలమువలె నయ్యెను. నేత్రముల నశ్రువులు గ్రమ్మనారంభించెను. ఆతఁడు మెల్లగా నాచోటునుండి లేచి మఱి యొక్చోటునకు వెడలిపోయెను. ఆతఁడు భావాంతరగతుఁడయ్యె నను విషయమును మలహరరావు కనిపెట్టలేదు.

రఘునాథరాయలు తనగదిలోనికేగి గభీరచింతాకూప నిమగ్నుఁడై కొన్ని నిమిషములుండి పిదపఁ దనలోఁ దానిట్లనుకొన నారంభించెను. "మొదటిదినమున ద్వారకరావు మొగమునుజూచి నేను సంశయించియేయున్నాఁడను. దానికిఁగారణము నిప్పుడు గ్రహింపగలిగితిని. స్వప్నమునందైన ననుకొననివిషయ మిప్పుడు సత్యముగా పరిణమించినది. ఈశ్వరునిమహిమ యతివిచిత్రమైనది. నాజీవిత మిదివఱకే వీరికి విక్రయమైపోయినది. ఈఋణము నీజన్మ మందించుకంతయును దీర్చుకొనఁజాలను. నేనిప్పుడు వీరితోఁగూడఁ బోయినచో, ఆమహాపురుషునిదర్శనము లభింపఁగలదు. కాని, నా యనుమానమే నిజమై యామెయచ్చోటనున్నచో నేమగును? నా సత్యస్వరూపము బయటవడిపోవును. మలహరరావునెడ చాలగ నప రాధముచేసినవాఁడ నగుదును. నేను కృత్రిమవేషముతో మిథ్యాకథ లను జెప్పితినని యాతఁ డనుకొనును. అనుకొన్నను నన్నాతఁడు క్షమింపఁగలఁడు. అతఁడు కరుణామూర్తి. నాహృదయసంతాపమును దీర్చి నన్ననుగ్రహింపనేతెంచిన దేవతామూర్తి. ప్రపంచమునఁ బరులకొఱకింతగా కష్టపడువారెవరున్నారు? నేను గుణహీనుఁడను.

చంచలచిత్తుఁడను. భ్రాంతుఁడను. దురదృష్టవంతుఁడను. ఇట్టి నాపై నాయన యెంతయనుగ్రహమును జూపుచున్నాఁడు! ఆయన కేవలము నీశ్వరుని యవతారము. నాగురుతరాపరాధమును సైరించి తనయుఁ డెట్టివాఁడైనను తల్లి సదా యాతని క్షేమమునే కోరుచుండు నట్లో తఁడు నాశ్రేయమునే గోరుచు నాకై సదా చింతించుచున్నాఁడు. అదృష్టమెట్లున్నదో యట్లు జరుగకమానదు. నేనిప్పుడీయనకాశమును బోఁగొట్టుకొనఁజాలను. వీరితోఁగూడ నాపుణ్యాశ్రమమున కేగెదను. నాహృదయమునందలి యాశ ఫలించి నాయనుమానము నిజమైనచో నేమికావలసినదను విషయమొకటి యాలోచింపవలసియున్నది. ఏమ యినను సరియే "వీరితోఁగూడ నటకుఁబోవుటయే మంచిదని తోఁచు చున్నది. అదియేకర్తవ్యము. మలహరరావు చెప్పినచో పీష్వాకూడ తప్పక యంగీకరించును."

రఘునాథరాయ లిట్లు నిశ్చయించుకొని సుబాలకడ కేగి "అమ్మా! నేనుగూడ మీతో మీతండ్రిగారిని జూచుటకై వచ్చె దను" అనియెను. సుబాల యపరిమితానందనిమగ్నయై నవ్వుచు "నిజమేనా? నీవు మాతోఁగూడ హరిద్వారమునకును వచ్చెదవా?" అని యడిగెను.

రఘు—అమ్మా! తప్పకవచ్చెదను. నేను మీతో నెప్పుడైన నసత్యమాడితినా? మీతోఁగూడ నిజముగావచ్చి తీర్థమును దర్శించె దను. మలహరరావుకూడ గురుదేవుని దర్శించుటకై మనతోఁగూడ వచ్చును. మనకేమియుఁ గష్టములేదు. మనమందఱమును సుఖముగా గంతవ్యస్థానమును చేరఁగల్గుదుము. మహారాష్ట్రపీష్వా ప్రధాన మంత్రి యగు మలహరరావుకూడ వచ్చునప్పుడు కొదవయేమి యుండును? యానవాహనాదులును భృత్యులునుగూడ నేతెంతురు. మనము శీఘ్రముగనే యాప్రదేశమును జేరగల్గుదుము.

సుబాల యీవార్త నచ్యుతకుమారమిత్రునకు తెలియించెను. ఆతఁడును నత్యంతానంద నిమగ్నుఁ డయ్యెను. రఘునాథరాయలు కూడ వచ్చుట కాతఁడు మిగుల సంతసించెను.

జనార్దనాధికారిగూడ నీవార్తను విని చాల సంతసము నొందెను.

అచ్యు—నీవుకూడ మాతో రావలయునని నా ప్రార్థనము. మిత్రుని ప్రార్థనమును నిరాకరించుట నీకుఁ బాడిగాదు—

జనా—నేనువచ్చుట కేమియు నభ్యంతరములేదు. కాని, మన మందరము నేకముగాఁ బోయినచో పీష్వాయేమైన ననుకొనునేమో యని సంశయించుచున్నాఁడను. అందుచే మీరు ముందుగ హరిద్వారాభిముఖులై వెళ్ళుఁడు. రెండుమూఁడు దినములు గడచినపిదప నేనిటనుండి బయలువెడలి కాశీనగరమునకువచ్చి మిమ్ములను గలిసికొనియెదను. నేనిఁక నెన్నఁడు నిటకు మరలరాను. పీష్వాయనుమతి నపేక్షించి యూరకుండను. ఉచితసమయమున జూచి యాస్థానమును విడిచి తిన్నగాఁ గాశీ కరుదెంచెదను. మీరు హరిద్వారమునుండి వచ్చుసరికి నేనును కాశీయందు మిమ్ములను గలిసికొనెదను.

బ్రాహ్మణదంపతు లంగీకరించిరి. మలహరరావును రఘునాథ రాయలునుపీష్వాకడ కేగి మూఁడుమాసములు సెలవిప్పింపుఁడనియును తీర్థయాత్రఁ జేసికొనివచ్చెదమనియు వేఁడుకొనిరి. పీష్వా యందుల కీయకొనుట కిష్టములేనివాఁడయ్యును నెట్టకేల కాజ్ఞయొసంగి శిబికలు, శిబిరములు, వాహనములు. సేవకులు వలసినద్రవ్యము మొదలగు వన్నియుఁ దీసికొని వెళ్ళుఁడని చెప్పెను.

ప్రయాణదినము నిశ్చయపఱుపఁబడియెను. శీఘ్రముగాఁ దిరిగి రండనియుఁ గావలసిన సైన్యమునుగూడఁ దీసికొనిపొండనియు నానతిచ్చెను. కాని మలహరరావు అందులకంగీకరింపలేదు. సుబాల

నిమిత్త మొక శిబికయు నెనమండుగురు బోయవాండ్రును, కొందఱు పరిజనులనుమాత్రము కూడఁ దీసికొనియెను.

సుముహూర్తమున దుర్గానామస్మరణమును జేయుచు నందఱు బయలువెడలిరి. సుబాల శిబికారోహణముఁ జేసెను. పురుషులు ముఫ్వురును నశ్వముల నధిరోహించిరి. ఒకగజమును రెండు లొట్టియలును సామగ్రిలను మోసికొనివచ్చుచుండెను. పరిజను లుచితవాహనముల నధిరోహించి కూడవచ్చుచుండిరి.



పదునాఱవ ప్రకరణము

రహస్యభంగము

నానాజనపదముల నతిక్రమించుచు వారు క్రమక్రమముగా నుత్తరపుదిక్కునకుఁ బ్రయాణముచేయసాగిరి. ఆహారపదార్థములును, శిబికలునుగూడ నుండుటచే వారించుకంతయును గష్టము లేకుండ నిచ్చవచ్చినతావుల విశ్రమించుచు, బ్రయాణముసేయుచుండిరి.

విచిత్ర తరుసంయుతంబులును, నానావిధ సుకంఠవిహంగమ మధురకూజిత విశిష్టంబులునై ప్రకృతిశోభాభాండారములనందగు నరణ్యములను, పర్వతములను దాఁటి చనుచు నత్యంతానందముతో నిరువదిరెండు దినములు ప్రయాణమును జేసి కంఖాలమును సమీపించిరి. మలహరరావునకు రామానందస్వామి యిష్టదేవుఁడనియు నాతని జూచుటకై మలహరరావు వచ్చుచున్నాఁడనియు రఘునాథరాయలు సుబాల కెఱింగించెను. ఆమాట వినినతోడనే సుబాల యత్యంతానందమునొంది యప్పటినుండియు మలహరరావును "కకా" యని పిలువసాగెను. మలహరరావు బ్రహ్మానందమిశ్రుని చాలకాలము నుండియు నెఱిఁగియుండెను. కాని, సుబాల యాతనితనయ యని మాత్ర మెఱుఁగడు. ఇప్పుడీకథలను విని మలహరరావు చాల సంత

సించి సుబాలను దన తనయువలెఁ జూడసాగెను. వారందఱును మహా దానందముతోఁ బ్రయాణము చేయుచు వచ్చిరి. దూరము తక్కువ యైనకొలఁదిని సుబాలహృదయ మానందముచే నృత్యము సేయఁ దొడంగెను. కాని, రఘునాథుని ముఖమండలము మాత్రము ప్రభాత కాలమందలి శశిమండలమువలె వెల్లనగుచుండెను. ఆతనిహృదయా ర్ణవమున విశేషతరంగరాజి యుదయించుచుండెను. కాని, యావిష యము నెవ్వరు నెఱుంగరు.

క్రమముగా వారు కంఖాల సమీపప్రదేశమున కేగి యొకసమ స్థలమున శిబిరము నేర్పఱచుకొనిరి. అచ్యుతకుమార మిశ్రుఁడును సుబాలయుమాత్రము బ్రహ్మానందమిశ్రుని యింటి కేగిరి. మిగిలిన వారందఱును శిబిరమున నివశించియుండిరి.

పాఠకమహాశయులు జన్మదుఃఖిని యగు శ్రీని మఱచియుండ రనియే యూహించుచున్నాము. సర్వజ్ఞుఁ డగురామానందస్వామి యాజ్ఞానుసారముగా నామె యిప్పుడు పుణ్యాశ్రమముననే వాసము సేయుచుండెను. జయంతికూడ నక్కడనేయుండి నడుమనడుమ కం ఖాలమునకు వచ్చుచుఁబోవుచుండెను. సుబాల పిత్రాలయమున కరు దెంచుటకుఁ బూర్వదినముననే స్వామియాజ్ఞానుసారముగా జయంతి బ్రహ్మానందమిశ్రుని యింటికి వచ్చియుండెను. అందుచే వారిద్దఱు నిటఁ గలిసికొనిరి. సుబాల చిన్నతనమునుండియును జయంతీదేవిని "సోదరీ!" యని పిలుచుచుండెడిది. చాలకాలమునకు సోదరిని జూచు టచే సుబాలహృదయ మానందలహరిలో నీఁదులాడనారంభించెను. వారిరువురు నొకనిర్జన ప్రదేశమునఁ గూర్చుండి మాటలాడుకొన నారంభించిరి. సుబాల తమప్రయాణవృత్తాంతమును, తాను ప్రసవ వేదన నొందకుండఁగనే కుమారునిగనుటయు జయంతి కెఱింగించెను. జయంతినవ్వుచు "నీవుకనకుండఁగనే యెవరికిఁదల్లివైతివి? మీపిల్లవాఁ డెచ్చటనున్నాఁడు?" అని యడిగెను.

సుబా—మాపిల్లవాఁడు మాతోఁగూడఁ దీర్థయాత్రకై వచ్చి యున్నవాఁడు. ఆతఁడు కాకుండ నాతనితో స్వామిజీశిష్యు లొకరు వచ్చియున్నారు. వారినవ్వరు ననుచరులతోఁ గూడ నూరివెలుపల విడిసి యున్నవారు.

జయం—ఆతఁడెవ్వరు? ఆతని నివాస మెచ్చట?

సుబా—ఆతఁడు మహారాష్ట్ర పీష్వా యగు బాజీరావుకడ ప్రధానమంత్రి. ఆతని పేరు మలహారరావు. మాపిల్లవాఁ డాతని యొద్దనే యుండుచుండును. మేముకూడఁ గొన్నినాళ్ళాతని యింటనే యుంటిమి, ఆతఁడు మిగుల దయాళుఁడు. సాధువర్తనుఁడు. ఆతనిని నేను 'కక్కా' యని పిలుచుచుండును. ఆతఁడును నన్నుఁదనయవలెఁ జూచుకొనుచుండును.

జయం—నీకాతఁడెప్పుడు 'కక్క' యయ్యెనో అప్పుడే నిశ్చయముగా నాతఁడు నాకును బూజనీయుఁడు. ఇఁక నీబిడ్డవిషయమునఁ జెప్పనేల? కాని, సోదరీ? నాకొక్కసారి నీపిల్లవానిని జూడవలయు నని యున్నది.

సుబా—పూజనీయులగు నాయనగారు వారినిటకుఁ దీసికొని రావలయునను నుద్దేశముతో నటకేగియున్నారు. వారలను దీసికొని మధ్యాహ్నమునకిటకు రాఁగలరు. అప్పుడు నీవు చూడవచ్చును. నాబిడ్డనుజూచినచో మహారాజపుత్రుడోఁ, స్వర్గభ్రష్టుఁడగు దేవతయో యని నీవనుకొందువు.

జయం—సంతోషము—ఒక్కసారిచూచి యంతయుఁ దెలిసికొందును.

మధ్యాహ్నమగునప్పటికి మిశ్రమహాశయుఁడు రఘునాథరాయలను, మలహారరావును దీసికొనివచ్చెను. సుబాల గవాక్షముకడ నిలుచుండి యంగుళితో రఘునాథరాయలను జూపుచు 'సోదరీ! అదిగో! ఆవృద్ధుడు మలహారరావు. ఆతనిపార్శ్వముననున్న యాతఁడే

మాముద్దులబిడ్డఁడు' అనియెను. ఆతనిని జూచుటతోడనే జయంతి యధరముపై నించుక మందహాసము వొడమెను.

సుబా—సోదరీ! మాపిల్లవానినిజూచి నవ్వుచున్నావెందులకు?

జయం—(నవ్వుచు) నీబిడ్డ మిక్కిలి పసినిసుఁగు. అందులకై నాకు నవ్వువచ్చినది. అది యటుండనిమ్ము. కాని, నీబిడ్డ పేరెవరు?

సుబా—రఘునాథరాయలు.

జయం—నివాసమెచ్చట?

సుబా—ఆతఁడు వంగదేశీయుఁడు. అందుచే నాతనినివాసము వంగదేశమునందెచ్చటనో యైయుండును. ఆతనివిషయము నేనంతగా నేమియు నెఱుంగను. ఆవిషయమున నేమేని ప్రశ్నించితిమా యాతని నేత్రము లశ్రుపూరితములగును. ఆతఁడేదియో శోకావేగముచే దేశమును త్యజించి మహారాష్ట్రదేశమున కరుదెంచెనని మాకుఁదోచినది. బాజీరావాతనిని దయార్ద్రహృదయముతో నాదరించి యాతనికి రాజదూతపదవి నొసంగినాఁడు. అంతటి యుచ్చపదవి నధిష్ఠించుటయే యాతనికీ విపత్తుసంభవించుటకుఁ గారణమైనది. నేనొకప్పు డాతని వృత్తాంతమునుగూర్చి యడిగినప్పుడు 'సమయము వచ్చినప్పు డంతయు నీకెఱిఁగించెదను. ఇప్పుడింతకంటె నధికముగఁ బ్రత్యుత్తర మొసంగుటకు నాకధికారములేదు' అనియాతఁడుప్రత్యుత్తరమిచ్చెను ఆతనికి నాప్రశ్నమూలమునఁ బూర్వస్మృతికలిగెను. అందువలన నాతనికొకింతవిచారము వొడమెను. అందుచే నేనిఁక నావిషయమున నెప్పుడు మరలఁ బ్రశ్నింపలేదు. ఆతని వృత్తాంతమంతయుఁ దెలిసికొనుసమయ మెప్పుడువచ్చునా యని యెదురుచూచుచున్నాను.

జయం—మీపిల్లవాని యాకారమునుజూడఁగా నాతఁడొక సామాన్యవ్యక్తి కాఁడని తోఁచుచున్నది. ఆతఁడేదియో యొకమహ ద్వంశమున జన్మించియుండును. నీబిడ్డ నీకడ నసత్యములాడలేదు. మంచికాలమువచ్చినచో నాతని యుదంతమంతయు నీవు తెలిసికొనఁ

గలవు. తెలిసికొనుటయే కావు. నీవు కోడలనుగూడఁ జూడఁగలవు. అట్టి సుసమయము శీఘ్రముగనే వచ్చును. కాని, కొడుకునుకోడలును గలిగియుండి గృహకృత్యములను నిర్వహించుచుండుట మాత్ర ముండదు.

సుబాల విస్మయవిస్ఫారిత నేత్రములతో జయంతివంకఁ దిల కించుచు 'ఇట్లు మాటలాడుటలో నీయుద్దేశమేమి? అట్టిసుసమయము శీఘ్రముగనే వచ్చునని నీవెట్లెఱుంగఁగలిగితివి?' అని యడిగెను. జయంతి 'ఇట్లు మాటలాడుటలో నాకు విశేషోద్దేశమేమియు లేదు. ఆతనిని జూచినతోడనే యాసుసమయ మతిశీఘ్రముగనే వచ్చునని తోఁచినది' అనిపలికి సుబాలతో నుఱియొక విషయమునుగూర్చి ప్రస్తావింప నారంభించెను. సుబాల హృదయమున నెట్టిసందేహమును గలుగలేదు.

మిశ్రమహాశయుఁడు పూర్వమునుండియు మలహరరావు నెఱుంగును. చాలకాలమునకుఁ బునస్సమాగమమగుటచే వారిరువురు నొక్కింతసేపానందాబ్ధి నోలలాడిరి. మలహరరావు రఘునాథరాయ లను మిశ్రమహాశయునకుఁ బరిచయముచేసెను. అందుచే వారినిరువు రను బ్రహ్మానందమిశ్రుఁడు తనయింటికిఁ దీసికొనివచ్చెను.

ఆహారమును భుజించినపిదప వారిరువురును తిరిగి శిబిరమున కేగిరి. ఆసమయమున జయంతి మిశ్రమహాశయు నొకనిర్జనప్రదేశము నకుఁ గొనిపోయి యావదుదంతము నాతని కెఱింగించెను. బ్రహ్మానందు డాకథనంతను విని 'అపారమహిమా సమన్వితుఁడగు నీశ్వరుని లీల లద్భుతములు. వానినెఱుంగుటకు మనకు శక్యముకాదు. అందుచేతనే మనమొకక్షణ మానందమును, ఒకక్షణము దుఃఖము నొందుచుం దుము. అదియటుండనిమ్ము. నీవిప్పుడు నాకొక క్రొత్తసంగతిని చెప్పితివి. దానిని నీవు వెల్లడిచేయనట్లు తోఁచుచున్నది. స్వామి యాజ్ఞలేనిదే దానినిగూర్చి యేమిచేయుటకును నీకధికారములేదు.

నీవు కాలవిలంబము సేయకుండఁ బుణ్యాశ్రమమునకరిగి యీవృత్తాంతము నాతని కెఱింగింపుము. ఆతనిశిష్యుఁడగు మలహరరావుకూడ వచ్చియుండెనని తెలుపుము. నీమాటలనువిని యాతఁడేమియాజ్ఞ యొసంగునో, అట్లుచేయుము. నేను సుబాలకేమియు నిప్పుడు చెప్పను. స్వామియెదుటనే సర్వరహస్యములును వెల్లడియగును. ఆలస్యము చేయక నీవు నాస్వామికడకరుగుము. నీ సోదరి యీ వృత్తాంతమును విన్నచో నపరిమితానంద భరితురాలు కాఁగలదు'' అనియెను.

జయం—నాసోదరిహృదయము సంపూర్ణముగాఁ బరివర్తనము నొందినది. ఆమెహృదయము సర్వదా యీశ్వరునిమీఁదనే నిలిచి యున్నది. పరిణామమున సదా విరసమే సంప్రాప్తమగు ప్రపంచ ఘటనముల యందామెకు సంతోషముకాని, విచారముగాని కలుగుట లేదు. స్వామియనుగ్రహమువలన నామెచిత్తము శారదీయజ్యోత్స్న వలెనిష్కళంకమును, గంగాజలమువలెఁ బవిత్రమునై యొప్పుచున్నది. ఆమె యీతనినిజూచుట కంగీకరింపదేమో యని శోఁచుచున్నది.

మిశ్రి—చిన్నపారిజాత కోరకమువలె నామెహృదయమందలి ధర్మభావము చాలదూరము పరిమళించుచు నెందఱికో నానందము కలుగఁజేయుచున్నది. ఇట్టిధర్మపరాయణయగు గుణవతిని మున్నెన్నఁడును గని విని యుండలేదు. విధాతకూడ నిట్టిరమణీరత్నమును దనసృష్టిలో నెన్నఁడును జూచియుండఁడు. ఇది చాల నాశ్చర్యకరమైన విషయము.

జయం——ప్రపంచమున నిట్టి విచిత్రము లపారములు. సుఖదుఃఖములు మానవుని భావాంతరమాత్రములు. హృదయబల ప్రభావముచే నట్టి సుఖదుఃఖములను సహించుకొనినచో నిఁక నావిషయమునఁ గాతరమేమియునుండదు. పరశుస్పర్శచే లోహము బంగారమైనట్లే సాధుసహవాసముచేఁ జిరదుఃఖిని యగు నాసోదరి హృదయము

నిర్మలమైనది. ఆమె పూర్వపు శ్రీకాదు. నూతనజీవమును దాల్చినది. ప్రపంచముతో నామెకేమియు సంబంధములేదు.

మిశ్ర—అది నిజమే. కాని, యామెకిప్పుడు పరీక్షాసమయము తటస్థించినది. ప్రేమితవస్తువు సమ్ముఖమున లేనప్పుడు చిత్తమును సంయమనమును గావించుకొనవచ్చును. కాని, యావస్తువు తనంతటఁ దాను సమీపమునకు వచ్చినప్పుడెట్లుండునో తెలియవలసియున్నది. అది యట్లుండనిమ్ము. నీవు శీఘ్రముగా స్వామికడకేగి యాతఁడేమి యాజ్ఞాపించునో తదనురూపముగాఁ గార్యమును నిర్వహింపుము. నేనాయన యాజ్ఞకొఱకు నిరీక్షించుచుందును.

జయంతి సుబాలకడకేగి "సోదరీ! నేనొకసారి యిప్పుడే స్వామి కడ కత్యవసరముగాఁ బోవలసివచ్చినది. నీవు ప్రయాణ శ్రమచే చాలనాయాసముఁగొని యున్నదానవు. నీవిచ్చట విశ్రమించియుండుము. మూఁడు నాల్గు దినములలోపలనే నేను తిరిగివచ్చెదను" అని చెప్పి మంత్రపూతమగు త్రిశూలమును జేతఁదాల్చి పుణ్యాశ్రమాభిముఖయై బయలువెడలెను. సుబాల భర్తతోఁగూడ బ్రహ్మనందుని యింటనుండెను. మలహరరావును, రఘునాథరాయలును శిబిరము నందుండిరి. వారనుదినమును మిశ్రమహాశయునింటికి వచ్చుచుఁబోవు చుండిరి. మిశ్రమహాశయుఁడు వారలను అల్లునివలెనే యాదరించు చుండెను. అనంతకాలసాగరమునం దీవిధముగా మూఁడు దినములు గడచినవి.

నాల్గవనాఁడు మధ్యాహ్నమున మిశ్రమహాశయునకును మలహరరావునకును నీక్రిందివిధమున సంభాషణము జరగెను.

మల—నేను పెద్దవాఁడనైనాఁడను. ఒకసారి గురుదేవుని దర్శించి పోవలయునని వచ్చితిని. ఇఁక వృధాకాలక్షేపముచేయుటయం దిచ్ఛలేదు. నాయభీష్టసిద్ధి కనువగు నేర్పాటులను జేయ వేఁడుకొను చున్నాఁడను.

మిశ్రి—నేనూరక యుండలేదు. మూఁడు దినములక్రిందటనే మీరాకను గురుదేవునకుఁ దెలుపుచు వర్తమానమంపితిని. తెల్లవారులోపల నాయనకడనుండి ప్రత్యుత్తరము రావచ్చును.

మల—రఘునాథరాయలు నాకు మిత్రుఁడు. గురుదేవునిఁ జూడవలయునని యిచ్ఛపడుచున్నవాఁడు. ఆయన యనుమతి లేకుండ పుణ్యాశ్రమమున కీతని నెట్లుతోడ్కొని పోవుదునాయని సంశయించుచున్నాఁడను.

మిశ్ర—అందులకై మీరంత యాలోచింప నక్కఱలేదు. ఈతనివిషయమునఁగూడ గురుదేవునకు వర్తమానమంపితిని. ఆయన బహుశః రఘునాథరాయలను జూచుటకంగీకరించును. అక్కడనుండి వార్తవచ్చినతోడనే సుబాలనుగూడఁ దీసికొని మనమందఱమును పుణ్యాశ్రమమున కేగవచ్చును.

మల—(నిట్టూర్పువిడచి) ఒకవిషయమునుగూర్చి మిమ్ములను బ్రశ్నింపవలయుననియున్నది. అందునుగూర్చి తెలిసికొనవలసినవి శేషావశ్యకమేమియు లేకపోయినను హృదయకుతూహల నివారణార్థము మిమ్ముల నడుగుచున్నాఁడను. ప్రభుదాసి యిప్పుడెచ్చటనున్నది?

మిశ్ర—(నవ్వుచు) ఇచ్చటనే సమీపముననేయున్నది ఇష్టమున్నచోఁ జూడవచ్చును.

మల—ఆమెపై నాకెట్టి యధికారమును లేదు. అయినను నడుమనడుమనొక్కసారి చూడవలయుననుకొన్కొ వాడముచుందును. మేమల్పమనుష్యులము. మాయాదాసులము. అందుచేసంపూర్ణముగా మఱపునొందఁజాలము.

మిశ్రి—మాయాపాశములను డెంపివేయుటయన్న నది సామాన్యమగుకార్యముకాదు. నాహృదయముకూడ సుబాల నిమిత్తము నడుమనడుమ చంచలమగుచునేయుండును. ఎన్ని ప్రయత్నములుచేసియును దుర్దమనీయమగు నాచిత్తగతికి నిరోధముఁ గల్పింపఁ జాలకున్నాఁడను.

రఘునాధరాయలీ సంభాషణమును వినుచుండియును నందలి రహస్యము నెఱుంగనివాఁడగుటచే మిశ్రమహాశయుని మొగమువంకఁ బరికింపుచుఁ గూర్చుండెను. మిశ్రమహాశయుఁడు నవ్వుచు నాతనితో "మేమాడుకొనుమాటలు నీకుఁ దెలియక యాశ్చర్యపడుచున్నాఁడవు. ఒకటి రెండుదినములలో నీకన్నియుఁ దెలియును. అప్పుడు నీవు మఱింతయాశ్చర్యపడెదవు. నీవనేకనూతనకథలనువినఁగలవు. అప్పుడు మామాటలు నీకర్థములగును" అనియెను. మలహరరావు విస్మయవిస్ఫారితనేత్రములతో బ్రహ్మానందునిఁ జూచుచు "ఇందేమియోయొక రహస్యమున్నట్లు తోఁచుచున్నది. నాకెఱింగింపరా?" అనియడిగెను.

మిశ్ర—తినఁబోవుచున్నదానికి రుచులడుగుటెందులకు? ఒక్క విషయమననేల? అన్నిసంగతులును విశదముకాఁగలవు. మీహృదయార్ణవము విస్మయానందలహరులచే నుద్వేలితము కాఁగలదు.

రఘునాథరాయ లామాటలనువిని గభీరచింతాకూపనిమగ్నుఁడయ్యెను. కాని, తనవిషాదమును పైకిఁగనఁబడనీయలేదు. నీరవుఁడై మానసిక వేదనలను సహించుకొనుచుండెను.

మఱునాఁడు పుణ్యాశ్రమమునుండి రామానందస్వామి శిష్యుఁడొకఁడగుదెంచి "మిమ్ములనందఱును పుణ్యాశ్రమమునకుఁ దీసికొనిరమ్మని స్వామి నన్నంపినారు" అని బ్రహ్మానందునకెఱింగించెను. ఆ వర్తమానమువిని రఘునాథరాయలును మలహరరావును నపరిమితానంద నిమగ్నులైరి. మఱునాఁడు ప్రత్యూషముననేలేచి మిశ్రమహాశయుఁడును సుబాలయు, నచ్యుతకుమారుఁడునుఁ మలహరరావును, రఘునాథరాయలును పుణ్యాశ్రమాభిముఖులై బయలుదేరిరి.

ప్రకృతిశోభాపరిపూరితమును శాంతిరసాస్వాదమునగు పుణ్యాశ్రమమును మేము గ్రంథారంభమున వర్ణించియున్నాము. ఆపుణ్యాశ్రమమిప్పుడు నదేరీతిగఁజూపరుల కానందదాయకమై యొప్పారు

చుండెను. వీరందఱును నాయాశ్రమమున కేగుసరికి స్వామి వీరికై నిరీక్షించుచుఁ గుటీరద్వారమునఁ గూర్చుండియుండెను.

దివ్యతేజోవిరాజితుఁడగు రామానందస్వామిని జూచుటతోడనే మలహారరావు మొదలగువారందఱును భూమిపై సాగిలఁబడి వందనములుచేసి యాతనిపాదధూళిని దమశిరములపైఁ జల్లుకొనిరి. స్వామి మధురవచనములతో వారి నాశీర్వదించి రఘునాథునివంకఁ దిలకించి యించుకచిఱునగవుతో 'మహారాజా! ఈకుశాసనముపైఁ గూర్చుండుము' అనియెను. నిర్మలాకాశమునుండి పిడుగుపడినప్పటివలె స్వామి ముఖమునుండి వెలువడిన యీవాక్యములను వినినతోడనే యందఱు నత్యంతవిస్మితులై నిశ్చేష్టులైపోయిరి. రఘునాథరాయలు మాత్రము లజ్జితుఁడై యవనతముఖుఁడై యూరకుండెను. సుబాల రమణీసులభమగు కౌతూహలము నడంపఁజాలక స్వామితో 'ప్రభూ! మాబాలుని మీరెందులకు 'మహారాజా' యని సంబోధించితిరి?' అని యడిగెను. స్వామి చిఱునగవుతో 'అమ్మా! నేనెప్పుడు నసత్యమును జెప్పను. ఆ వృత్తాంతమంతయును జెప్పెదనుండుము' అనిపలికి రఘునాథునివంకఁ దిరిగి 'మహారాజా! నాయీ యాశ్రమమునం బెట్టి కలుషకలాపములకును, గందరగోళములకును చోటుండరాదు. ఇదికపటవర్తమానములకును మారువేషములకును నివాసము కాఁగూడదు. అందుచే నీరహస్యకథయంతయును వ్యక్తముచేయువలయును. నీవొక యదృష్టవంతుఁడవు. విధివశమున గ్రహచారమూలమున నీకు రాజ్యచ్యుతి సంభవించినది. నశ్వరమగు నీజీవితమునందిఁకఁ జేయవలసినకార్యము లంతగా లేవు. నీవిఁక మారువేషముతో నుండవలసినపనిలేదు. ఒక్కసారి నీ భార్యాపుత్రులనుజూచి ప్రాణములను చల్లపఱచుకొనుము' అనియెను.

మలహారరావు విస్మితచిత్తుఁడై స్వామితో నీవిధముగా సంభాషించెను.

మల—ప్రథమదర్శనముననే నీతఁడొక గొప్పవ్యక్తియని నేనూహించితిని. మీరుచెప్పినమాటలువలన నాసంశయము నిశ్శంశ

యమైనది. ఈమహాత్ముఁ డేరాజకులమును బ్రకాశింపఁ జేయుచుం డెనో నాకింకను తెలిసినదికాదు.

స్వామి— ఈపురుషసింహుని నామము సీతారామరాయలు పూర్వబంగాళమునందలి భూషననగర మీతని రాజధాని. మహమ్మదీయులదుండగములచే నీతఁడు భార్యాపుత్త్రి సహితుఁడై యానగరమును విడివచ్చినపిదప గురుదేవునికడ భార్యాపుత్త్రిల దిగవిడిచి మహారాష్ట్రదేశమున కరుదెంచి, ఈమారువేషముతో నటసంచరించుచున్నాఁడు. పిదప నేమేమిజరిగినదియు నీవెఱింగియే యున్నాఁడవు. అవస్థావిపర్యయము మూలమునను నదృష్టదేవత యనుగ్రహము తప్పిపోవుటవలనను నీతఁ డీమారువేషమును ధరించి తిరుగవలసివచ్చినది. అంతమాత్రమున నీతఁడపరాధికానేరఁడు.

మల— మొదటినుండియు నీతని నొక మహాపురుషుఁ డనియే తలంచుచుంటిని; మీముఖమున నీవిచిత్రకథయంతయునువిని మిగుల సంతసించుచున్నాఁడను.

మల—(మహారాజుతో) రాజా! మీపాదస్పర్శచే మా గృహము పవిత్రమైనది. నేను కృతార్థుఁడనైతిని. అజ్ఞానవశమున నేనేమైన నపరాధములను జేసితినేని నన్ను మన్నింపవలయును.

సీతారామరాయలు— స్వామి యనుగ్రహమున మాకలి మిప్పటికిఁ దడబాటునువీడి సీతారామరాయలని వ్రాయగలిగినది— లజ్జచే నధోవదనుఁడై యేమియు నుత్తరము చెప్పనేరక యూరకుండెను.

ఈకథయంతయును విని సుబాలహృదయ మానందముచే వికసింపఁజొచ్చెను.

సుబా— మీరు యోగబలముచే మాబాలుని పూర్వవృత్తాంతము నెఱింగితిరి.

స్వామి—యోగబలముచేఁ గాదు. జయంతి నాకడ సమస్తమును జెప్పినది. నీపీపుత్త్రిరత్నము నెట్లుబడసితివో యదియును జెప్పినది. మలహరరాయా! నీవుజయంతిని మఱచిపోలేదనుకొనెదను.

మలహరరావేమియుఁ బ్రత్యుత్తర మీయకుండఁగనే సీతారామరాయలు 'ప్రభూ! దేవి యిచ్చటనున్నదా? ఈయధముఁడొక్కమారామె పాదపద్మములను దర్శింపఁగూడదా?' అని యడిగెను.

మేఘముకడ మెఱుపువలె, ఈమాటలను వినినతోడనే స్వామి యధరముపై నించుక మందహాసము వొడమెను. మలహరరావతి విస్మితుఁడై 'నీవు జయంతినెఱుఁగుదువు' అని యడిగెను.

సీతా—అయ్యా! జయంతీదేవిని నేను బాగుగా నెఱుఁగుదును. నా జీవిత మామెకు విక్రయింపఁబడినది. ఆమె కృపావశమున నే నేను జీవములతో నీలోకమున నిలిచియున్నాఁడను. లేకపోయినచో నేనీపాటికిఁ గుటుంబసహితముగా నాశనమైపోయి యుందును. మావంశము నిర్వంశమైయుండును. వృక్షమును నాటుపెట్టి నరకుచున్నను నరకువానియెడ నావృక్షము కార్పణ్యమునుజూపక నీడనిచ్చునట్లే, అజ్ఞానవశమున నేనెంతదౌర్జన్యముచేసినను ప్రాణమూలను దీయయత్నించినను, ఆదేవి నాపైఁ గోపగించుకొనక నాప్రాణములను, నాకుటుంబమును రక్షించినది.

మల—అట్లయినచో జయంతినిగూర్చి నేనుచెప్పినప్పుడు నీవేమియు మాటలాడలేదేమి?

సీతా—నాకథయంతయు బయటఁబడిపోవు ననుభయముచే నప్పుడేమియుఁ జెప్పలేదు.

స్వామి—భాగ్యవంతుఁడా! నీవీప్రపంచమునఁ జాలగఁగీర్తిని గడించియున్నాఁడవు. అది యెప్పుడును విలుప్తముగాఁజాలదు. ఎవనికైన నపకారముచేయవలయు నను నుద్దేశముతో నీవీమారువేషమును ధరింపలేదు. అవస్థాభేదముచే నాత్మగోపనముఁ జేసికొనుటకే వేష

మును ధరించితివి. అందుచే నీవు లేశమాత్రమును సిగ్గుపడనక్కఱ లేదు సజ్జనులు గర్హించునట్టి దేమి యన్యాయ కార్యమును నీవు చేసి యుండలేదు. జరాసంధ వధార్థము శ్రీకృష్ణభగవానుఁడు సయితము భీమార్జునులతోఁగూడ బ్రాహ్మణవేషమును దాల్చినాఁడు. నీవిఁక నీవేషమును వదలివేయుము. ఈవిషయమును బూర్తిగా మఱచి పొమ్ము. బుద్ధిమంతుఁడవై కార్యానుష్ఠానపరుఁడవు కమ్ము. తనూ్మలమున నీనిర్మలచరిత్రమునకు లేశమాత్రమును గళంకము రాఁబోదు. నిన్నెవ్వరును నసహ్యముతోఁ జూడఁబోరు. నీవిఁక నిట్టి మాయ వేషములో విదేశముల వెంటఁ దిరుగుట యుక్తము కానేరదు. ఏమ నిన మానవునియాయుర్దాయ మమూల్యమైనది. గడచిన ప్రతి ముహూర్తమును దానిలోనుండి తరిగిపోయినదనియే గ్రహింపుము. అది స్థిరముగానుండదని తెలిసికొనుము. తరిగిపోయి తరిగిపోయి తుదకు నిశ్శేషమైపోయినతోడనే యిఁక నేమియుండును? ప్రపంచమే యుండదు. కావున, ప్రతిమానవుఁడును ప్రతినిమిషమును వ్యర్థముగా గడపకుండ జీవితమును సార్థకము జేసికొనుచుండవలయును. నీవిఁక నాలస్యము సేయకుండ నీభార్యాపుత్రుల కడకు సత్యస్వరూపముతో నేగుము. నీవిఁక మహారాష్ట్రదేశమునకుఁ బోవకుము. అంతకంటె నీవీదేశమునఁ జేయవలసిన కార్యములనేకములున్నవి. నీవిఁక శాజీ రావుకడ సేవకుఁడవై యుండరాదు. నీకర్మపాశము బిన్నమై పోయి నది. కొంచెమవశిష్టమున్నచో నది యనతికాలములోనే నశించిపోఁ గలదు. నీకు జయంతినిజూడవలయునని యున్నదా? ఆకోర్కె నీకు సంపూర్ణముగా నున్నచో నర్ధరాత్రిమున నాయాజ్ఞానుసరణి నామె నీకు దర్శనమీయఁగలదు. నీవీరాత్రి నాయాశ్రమమునందొక కుటీర మున విశ్రమింపుము.

స్వామియాజ్ఞానుసారముగా నొకశిష్యుఁడు సీతారామరాయలు విశ్రమించుట కొకపటకుటీరమునఁ దగిన యనుకూలముల నేర్పఱిచెను. తక్కిన వారందఱును పటగృహముల విశ్రమింపనేగిరి.

౧.——.౧

## పదునేడవ ప్రకరణము

### పరిణామము

సీతారామరాయలు శయ్యపైఁ బండుకొనియెను. కాని, సకల సంతాపహారిణియగు నిద్రాదేవి మాత్ర మాతని ననుగ్రహింపలేదు. పూర్వము జరిగిన యావత్కార్యములును క్రమక్రమముగా జ్ఞప్తికి వచ్చుచుండెను. అందుచే నాతని హృదయమున నశాంతి యుదయించి వేధింపఁజొచ్చెను. ముహూర్తకాలములో వేత్రఘాతయగుటకు సిద్ధముగానున్న జయంతీమూర్తి యాతనికన్నులకుఁ గనుపట్టెను. తోడనే శరవిద్ధమైన మృగమువోలిక నాతఁడు మానసిక యాతనిచే శయ్యపై నటునిటు పొరలాడసాగెను. పిదప నల్పసైన్యవ్యూహమాతనికి గోచరమయ్యెను. ఈశ్వరనామోచ్చారణము సేయుచు సన్యాసిని పాడిన పవిత్రసంగీతధ్వను లాతనికర్ణకుహరములయందుఁబ్రతిధ్వనింపనారంభించెను. పిదప నామెముఖమండల మాతనిహృదయదర్పణము నఁబ్రతిఫలించెను. అపారధీశక్తి సంపన్నుఁడగు సీతారామరాయల ధైర్యమంతయుఁ గరఁగిపోయి శోకప్రవాహ మతివేగముగాఁ బ్రవహింపఁజొచ్చెను. శ్రావణమాసమందలి వర్షబిందువులవలె నాతని నేత్రద్వయమునుండి యశ్రుజలము వర్షింపనారంభించెను.

ఈసమయమున జయంతీదేవి మెల్లగ నాకుటీరమునఁ బ్రవేశించి మధురస్వరముతో "మహారాజా! అనర్థదాయకమగు మనోవేదనచే బాధపడుచు నశ్రుజలముల నేల్లవిడుచుచున్నావెందులకు పూర్వవేషమును పూర్వనామమును బరిత్యజించియును పూర్వకథలను మఱచిపోలేదేమి?" అనియెను.

సీతారామరాయలు చకితుఁడై దేవిని ప్రత్యక్షముగాఁజూచి యాత్రముతో లేచి యామెపాదములపై సాగిలఁబడి బాష్పపూరిత నేత్రుఁడై గద్గదస్వరముతో "తల్లీ! స్నేహమయియగుజనని యవివేకుఁడగు తనయు నెట్లుకాపాడి యాతని యపరాధముల నెట్లుక్షమించునో

అట్లే యీయధమునిగురుతరాపరాధములను క్షమింపుము. నీచరణదర్శన మీజన్మమున నాకుదొరలలభించునని నేనెన్నఁడుననుకొనలేదు. నాజీవితమునందిదియే సుదినము. మీపవిత్రపాదపద్మ దర్శనముచేఁ గృతార్థుఁడ నైనాఁడను' అనియెను.

జయం—మహారాజా! నీవు నాకడ నింతవినయమునుజూపుచు క్షమింపవలయునని వేఁడుకొనవలసిన యావశ్యకము లేదు. నే నా పూర్వకథనంతను సంపూర్ణముగా మఱచిపోయితిని. నాదేహమునఁ బ్రాణములున్నంతవఱకు నేను మీశుభమును గోరుచుందును. త్రికాలజ్ఞుఁ డగుస్వామి కృపాపరవశుఁడై మీ భవిష్యద్వృత్తాంతములను సూచించి యున్నాఁడు. మీరాయనయాజ్ఞను దిరస్కరింపక వారానతిచ్చినట్లు ప్రవర్తింపుఁడు. దాన మీకు శుభము కలుగఁగలదు.

సీతా—స్వామియాజ్ఞానుసారముగా నేను తప్పక ప్రవర్తించెదను. అత్యంతశాంతిరసాస్పదమును ప్రకృతిశోభాకరంబునగు నీ పుణ్యాశ్రమమును, ఈశ్వరసమానుఁడగు స్వామిని దర్శించినందువలన నానేత్రములును నాజన్మయును సార్థకములైనవి. నేను పూర్వకథనంతను సంపూర్ణముగా మఱపుఁజెందినాఁడను. కాని, యొకవిషయమునుగూర్చి యడుగవలెనను నభిలాష మెండుగఁగలదు.

జయం—(నవ్వుచు) మీరు శ్రీనిగూర్చి యడుగనుద్దేశించితిరి కాని, యీజన్మమున నామె మీకుఁ గనఁడదు. శ్రీ యిప్పుడు జీవించియున్నది. కాని ప్రపంచబంధమును వీడి వేఱొకనూతన జీవమును దాల్చియున్నది. ఆమె తనముఖమును మీకుఁ జూపుట కిష్టపడకుండునప్పు డామె యిక్కడనున్న నేమి? యెక్కడనున్న నేమి? మీయీజీవిత శేషమునందామె మీతోఁగూడ నున్నచో నామె జీవితమునందిఁకఁ జేయవలసినకార్యములేవియు నుండవు. కోమలప్రాణయగునబలయే మనోనిగ్రహముగావించుకొనియున్నప్పుడు, ప్రజ్ఞావంతులరగు మీవంటిపురుషులు కాతరహృదయులగుట యేల? ఇహలోక

మునందిఁక నామె మీతోఁ గలిసికొనదు. అయినను మీతోడ నామెసంబంధ మించుకేనియు విచ్ఛిన్నముకానేరదు. ఆమె మీతోఁ గూడఁ బరలోకమునకుఁ బ్రయాణముచేసి యట మిమ్ముఁ గలిసికొని మిమ్ములను సేవింపుచుండఁగలదు.

సీతారామరాయలు హృదయవేదనాసూచకమగు నొక్క నిట్టూర్పునువిడిచి యిట్లనియెను.

"నేనామెసంబంధమగునాశను హృదయమునుండి యిదివఱకే దూరముచేసియున్నాఁడను. కాని యిహలోకమున నొక్కమాఱామెను సందర్శింపవలయుననునిచ్ఛమాత్ర మడఁగింప జాలకున్నాఁడను.

జయం—మీహృదయపటమునం దామెరమ్యమూర్తి యంకితమైయున్నచో, మానసనయనములచే మీరా మూర్తిని దర్శించి సంతుష్టచిత్తులుగండు. ప్రత్యక్షముగా నామె మీకన్నులఁబడదు. ఆమె యెచ్చటనున్ననేమి, మీజీవితమునం దంత్యముహూర్తమున మీరామెను జూడఁగలరు.

ఇట్లుపలికి జయంతీదేవి ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షింపకయే యటనుండి యదృశ్యమైపోయెను. సీతారామరాయలు మరల గభీర చింతాకూప నిమగ్నుఁడయ్యెను.

స్వామి యాజ్ఞానుసారముగా నందఱును బుణ్యాశ్రమమున వాసముసేయుచుండిరి. జన్మదుఃఖినియగు శ్రీ యాయాశ్రమముననే వాసముచేయుచున్నను ఒక్కనాఁడైనను సీతారామరాయల కంటఁ బడలేదు. సుబాలతనకోడలనుజూచి యామెవలన యావదుదంతమును మొదటినుండియును వినియెను. అందుచే శ్రీ యాయాశ్రమమునందు వసించుచున్నదను విషయము నామె యొక్కనాఁడైనను దనపుత్రున కెఱింగింపలేదు.

ఈవిధముగ నేడెనిమిది దినములు గడచినవి. మలహరరావు స్వామియొద్దను సీతారామరాయలయొద్దను సెలవుఁగైకొని స్వదేశాభి

ముఖుఁడై బయలువెడలిపోవుచు సీతారామరాయలతో "భాస్కర పండితుఁడు వంగదేశమునందున్నాఁడు. ఆతఁడు నీకుఁబరమ శత్రువని భావింపుము. వైరినిర్యాతనాపరాఙ్ముఖుఁడవుగాకుము. నిన్నుఁగూర్చి పీష్వా యడిగినప్పుడు నేనీయావద్వృత్తాంతమును నున్నదున్నట్లుగ నాతని కెఱింగించెదను. నీకును నాకునుగలయీస్నేహము విచ్ఛిన్నమై పోకుండనట్లుగ సర్వదా నాకుత్తరములను వ్రాయుచు మీక్షేమమును దెలియఁబఱచుచుండుము." అనియెను.

మలహరరావు వెడలిపోయిన మూఁడు నాల్గుదినములకుఁబిదప సుబాలయు నచ్యుతకుమారుఁడును సీతారామరాయలును వారణాశికిఁ బ్రయాణమైపోయిరి. వెళ్లునప్పుడు జయంతీదేవి సీతారామరాయల కనేకకథలను చెప్పెను. ఎప్పుడో యొకప్పుడు మరలఁ గలిసికొనియెద ననిచెప్పి యాతనినూరడించెను.

యథాకాలమునను వారందఱును కాశీధామమును జేరిరి. ఆ మఱునాఁడు కృష్ణకమలభట్టాచార్యుఁడు రాయగడమునుండి వచ్చి వారలను గలిసికొనియెను. వారందఱు నట సుఖముగాఁ గాలము గడపుచుండిరి.

మాసముదినములుగడచినపిమ్మట సీతారామరాయలుఅచ్యుత కుమారుని గృష్ణకమలునిఁగూడఁ దీసికొని బంగాళాదేశమున కరిగెను.

మహమ్మదుపురము మహమ్మదీయుల చేఁజిక్కినప్పుడు సీతారామరాయలు తనజ్యేష్ఠమహిషియగు నందాదేవిని, కనిష్ఠమహిషియగు రమాదేవిపుత్రుని జాగ్రతగఁ గాపాడుచుండుఁడని చంద్రచూడ తర్కాలంకారునకొప్పగించి పాట్నాయందుంచియుండెను. గురుదేవుని కృపాతిశయముచే రాజపుత్రుఁ డుత్తమశిక్షందేరి రాజసింహాసనము నధిష్ఠించుట కర్హుఁడై యుండెను. ఆసమయమునఁ బరాక్రమశాలియగు నలివర్దీఖాఁ పాట్నాప్రభువుగనుండెను. చంద్రచూడుఁ డలివర్దీఖాఁ కడ తనపాండిత్యమును బ్రదర్శించి యాతనిస్నేహమును సంపాదిం

చెను. కొలఁది కాలములో బంగాళాదేశమునకుఁ బ్రభుఁడవయ్యెద వని యాతనిభవిష్యద్వృత్తాంతమును దెలిపి యాతని యనుగ్రహమును బడసి యొకనాఁడు రాజకుమారు నాతనికడకుఁ గొంపోయి యావ ద్వృత్తాంతమును సవినయముగ విన్నవించెను.

గుణగ్రాహియగు నలివర్దీఖాన్ ఈకథనంతనువిని రాజకొమరు నియెడ దయార్ద్రహృదయుఁడై యాతనికుపకారము చేయుచుండునని వాగ్దానముచేసెను. కొలఁది దినములలోనే తర్కాలంకారుఁడునుడివి నట్లు బంగాళాదేశపు ప్రభువును జయించి, అలివర్దీ ఖానా దేశమును దనవశము చేసికొనుట తటస్థించెను. అప్పటినుండియు నవాబున కాతనియెడ భక్తివిశ్వాసము లధికము కాఁజొచ్చెను.

అలివర్దీఖాన్ బంగాళమున కధిపతియైనప్పటినుండియును, మహా రాష్ట్రులతో సర్వదా రణము సేయవలసివచ్చుచుండెను. అందుచే నాతనికి సుఖముగాఁ గాలముఁగడుపుట కవకాశములేకపోయెను.

బంగాళాదేశప్రజలు మహారాష్ట్రుల మూలమున నాపద పాలు గాకుండఁ గాపాడవలయునని యలివర్దీఖాన్ చేసిన ప్రయత్నము లితి హాసములయందుఁ జక్కఁగా వర్ణింపఁబడియున్నవి. ఆప్రయత్నముల కును మాకథకును నంతగా సంబంధములేదు కావున వానిని గూర్చి మేమిట నేమియు వ్రాయఁబోము.

సీతారామరాయలు కాశినుండి బయలుదేరిన పది దినములకుఁ బాట్నానగరమును జేరుకొనియెను. కాని యాతఁడు నగరమధ్యమున కేగక గంగాతీరమున నివసించి యచ్యుతకుమారుని నగరములోని కంపించెను. రెండుగడియలగునప్పటి కచ్యుతకుమారుఁడొక వృద్ధునిఁ గూడదీసికొని మరల సీతారామరాయలున్నెడ కరుదెంచెను. ఆ వృద్ధుఁడే చంద్రచూడ తర్కాలంకారుఁడని పాఠకులకు మేము తెలుప నక్కఱలేదు. చాలకాలమునకుఁబిదప మరల సీతారామరాయలను జూడఁగలిగినందుల కాతఁ డెంతయో సంతసించెను. కృష్ణకమలునిఁ

జూచి విస్మితచిత్తుఁడై "నీ వెక్కడనుండి యిటకువచ్చితివి?" అనియడిగెను. సీతారామరాయలు గురుదేవునకు సాష్టాంగ వందనము చేసి యానుపూర్వికముగ సమస్త కథనువిన్నవించెను. ఆకథ యందు కృష్ణకమలుని చారిత్రముగూడఁ దెలుపఁబడియెను.

గురు—అట్లయినచో నిఁక నిప్పుడు చేయఁదగిన దేమి? నీవొక్క మాఱు వారినిఁజూడవా? రతికాంతునకు నేను రాజోచిత విద్యనంతను నేర్పి సుశిక్షితుఁని జేసితిని. నవాబుబహదూరుకూడ నాతనియందను గ్రహము గలిగియున్నాఁడు. అతని కేదేనొక మహోపకారము సేయ నున్నాడు.

సీతా—నవాబిప్పడెచ్చట నున్నాఁడు?

చంద్ర—మహారాష్ట్రులు దేశముపైకి దండెత్తి వచ్చినారు. వారలను నిర్జించునుపాయముల నాలోచించుచుససైన్యముగా ఖాలాన్న సమీపమున శిబిరమునందున్నాఁడు.

సీతా—మహారాష్ట్రులకును నవాబునకును శాశ్వతమైనమైత్రి యొడఁగూర్పవలెనని నాయుద్దేశము. నాయుద్దేశము నెఱవేరెనేని యుభయ దేశములకునుగూడ శాంతి సంఘటిల్లును. మహారాష్ట్రుల దండయాత్రలనుండి బంగాళాదేశమును గాపాడుట కిదితక్క వేఱు మార్గములేదు. ఈవిషయమున మీరు నాకుఁ దోడుపడవలయును. ఉభయ దేశార్థదాయకంబగు నీకార్యము చక్కఁబడినంగాని యితర కార్యములపై నామనసు పోవదు. ఇదియైనపిమ్మట మీయాజ్ఞాను సారముగ మరల సంసారశృంఖలాబద్ధుఁడ నయ్యెదను.

చంద్ర—అట్లయినచో నీమాటలు నాతోఁ జెప్పనేటికి? నవాబ్ బహదూర్ నాయెడల భక్తివిశ్వాసములను గలిగియున్నాఁడు. నీవునాతోఁగూడ వచ్చినచో నన్నియు నాతనితో మాటాడవచ్చును

సీతా—చిత్తము.

చంద్రచూడుఁడు మఱునాఁడలివర్దీఖానికడ కేగి యన్నియుఁ జక్కఁబరచెను. సీతారామరాయలును తర్కాలంకారుఁడును మూఁడు నాలుగుదినములు గడచినపిదపఁ బాట్నానుండి బయలువెడలి ఖాన్ని కేగిరి.

చంద్రచూడతర్కాలంకారుఁడు సీతారామరాయలను దీసికొని మహమ్మదీయ శిబిరములోని కేగెను. అలివర్దీఖా నంతకు బూర్వమే సీతారామరాయల పేరు వినియుండెను. ఇప్పుడాతనిని జూచి మిగుల సంతుష్టచిత్తుఁడయ్యెను.

పరస్పరాభివాదనాది శిష్టాచారములు నడచినపిమ్మట సీతారామరాయలును ఖానును నిట్లు సంభాషించిరి.

సీతా—నవాబ్ బహదూర్! ప్రతాపశాలురును దేశక్షేమాభిలాషులు నగు మీరు బంగాళాదేశమునకుఁ బ్రభువులై నందునకు నాకెంతయో సంతసము గలుగుచున్నది. మీ ప్రభుత్వమున బంగాళాదేశపుగడగండ్లన్నియు నశించిపోవునని తలంచుచున్నాఁడను. నేనును మీరునుగూడ బంగాళా దేశక్షేమమును గోరువారమే. అందుచే నేను విన్నవించెడివాక్యముల నోర్పుమెయి నాలకించి కర్తవ్యమును నిర్ధారణసేయవలయునని వేఁడుకొనుచున్నాఁడను.

అలి—రాజోత్తమా! మిమ్ముల నిదివఱకుఁ జూడకపోయినను మీకీర్తిని వినియున్నాఁడను. మీయెడల నాకుఁ జాల గౌరవము కలదు. మీ యభిప్రాయమును నిస్సంశయముగఁ దెలుపవచ్చును. మనకిరువురకును గమ్యస్థాన మొక్కటియేకావున దానినిగూర్చి మన మిరువురము నాలోచించి కర్తవ్యమును నిర్ధారణము సేయుదము.

సీతా—మీరీదేశమునకుఁ గ్రొత్తగా నరుదెంచిన ప్రభువులు. దేశమిదివఱకే మహారాష్ట్రుల యెడతెగని దండయాత్రల చేతను మహమ్మదీయుల దుండగములమూలమునను నించుమించుగ సర్వనాశనమైయున్నది. నేనీనడుమఁ జాలకాలమునుండి మహారాష్ట్ర దేశ

మున బాజీరావుకడ సైన్యాధికారిగనుండి వచ్చినవాఁడనగుటచే వారి శక్తిసామర్థ్యముల విషయమున మీకంటె నాకనుభవము మెండుగఁ గలదు. పీష్వా బాజీరావపారధీశక్తి సంపన్నుఁడు. కార్యదీక్షా పరుఁడు. పరాక్రమశాలి. ఇప్పుడు మనపై వచ్చియున్న యీసైన్యమును ఈ సేనాధిపతినిమాత్రమే మనము తలంపరాదు. ఇట్లని శత్రుపక్షముగ మాటలాడుచున్నాఁడనని తలంపవలదు. సర్వవిధముల మనకిప్పుడు రణము సేయుట మంచిదికాదు.

అలి—ఈరణమును మనము తలపెట్టితిమా? వారే మనపై విడిసియుండిరికాదా!

సీతా—వారే మీఁదికెత్తి వచ్చినను యుద్ధకారణమును గల్పించినది మనమేయని చెప్పవలసివచ్చినందులకు నన్ను మన్నింపుఁగాక!

అలి—అయినచో మనము "చౌద్" నీయవలసినదేనా?

సీతా—ఆపన్ను నిచ్చుట యక్రమమేయగును. కాని సమయమువచ్చువఱకును మనమోర్పువహించి యుండవలయును. ఇప్పుడే దేనొకరీతిగ నావిషయమున సంధిచేసికొన్నచోఁ గొలదికాలములోనే బంగాళమున కీపన్ను లేకుండఁ జేయఁగలుగుదునను ధైర్యము నాకుఁగలదు.

అలి—అదియెట్లు?

సీతా—మహారాష్ట్ర పీష్వా నాయెడల నెంతయో నాదర గౌరవములను గలిగి యున్నాఁడు. మీకును మీకునుగల యీపట్టు దలలించుక సడలినతోడనే నేను పీష్వాకడ కేగి యన్నియుఁ జక్కఁ బఱచెదను. మీకిరువురకును మైత్రి యొడఁగూర్చెదను. దేశక్షేమమును దలపోసిమీరు నామాటలను ద్రోసివేయక యనుగ్రహింపవలయును.

అలి—నీయభిప్రాయమేమి?

సీతా—సంవత్సరమున కొఱులక్షలవంతున చౌద్ నిచ్చుటకు మీరొడంబడవలయును.

అలి—ఆఱులక్షలా? ఎవరితోసంధిమాటలాడుట?

సీతా—బహదూర్! సెలవైనచో నేనిప్పుడే సేనాధిపతికడ కేగి సంధి ప్రయత్నములను గావించి రణమునాపెదను. పీష్వాకడ నున్నప్పుడాతఁడు నన్నెఱింగియుండుటచే నాకోర్కె నిరాకరింపఁ డనియే నానమ్మకము. తరువాత పీష్వాతో మాటలాడ వచ్చును. నాప్రార్థన మాలకించి దేశమును, ప్రజలను, సైన్యమునుగాపాడుఁడు.

అలి—ఈసంధి నాకంతమంచిదిగాఁ గాన్పించుటలేదు. అయి నను నీమాటనతిక్రమించుటకు నాకిష్టములేదు. పీష్వాకడ మీప్రయత్నము విఫలమైనచో నెట్లును రణముతప్పదు. ప్రస్తుతమున నీయిష్టము వచ్చినట్లొనర్పుము. నేను నంగీకరించితిని. పోయిరమ్ము.

సీతా—నాకోర్కె చెల్లించినందులకుఁ జాలసంతసించితిని.

సీతారామరాయలును జంద్రచూడతర్కాలంకారుఁడును నవాబుకడ సెలవుఁగైకొని యివ్వలకువచ్చిరి.

సీతా—ప్రభూ! నేనిప్పుడే మహారాష్ట్రశిబిరమున కేగిభాస్కర పండితునితో మాటలాడివచ్చెదను. మీరు పాట్నా కేగెదరా? ఇట నుండెదరా?

చంద్ర—ఇచ్చటనే యుండెదను. నీవు రేపటి ఉదయమునఁ బోఁగూడదా?

సీతా—రేపటి యుదయముననే రణప్రారంభముసేయుట కుద్యుక్తులయియున్నారు. ఈలోపుగ నేగి యాకార్యమును జక్కఁ జేయవలయును.

చంద్ర—మంచిది.

సీతారామరాయలకు మలహరరావు వాక్యములు జ్ఞప్తికి వచ్చెను. పరమశత్రుఁడగు భాస్కరపండితునికడ కొంటరిగఁ

మూలమున వంగదేశము నాశనమైపోవునేమో యనియును, లేదా మహమ్మదీయుల జయించుట సంభవించునేని తనకెంతయో మహోప కారముచేసిన బాజీరావునెడలఁ జూచుచు నూరకుండుటచేఁ దనకుఁ గృతఘ్నతాదోషము సంభవించునేమో యనియును సంశయము తోఁచెను. తనచేత ఖడ్గమున్నంతవఱకుఁ దనకేమియు భయము లేద నియు నైనను భాస్కరపండితుఁడంత యవివేకికాఁడనియు, భాస్కర పండితుఁడు శత్రువైనను మహారాష్ట్రసైనికులు తనకు శత్రువులు కారనియుఁ దలంచి ధైర్యమునవహించెను.

అలివర్దీఖానుపక్షమున సంధిమాటలాడుటకై యొక రాయబారి రానున్నాఁడని సీతారామరాయలు వర్తమానమంపెను.

భాస్కరపండితుని వివేకసంపద యెట్టిదో పాఠకమహాశయు లెఱింగియేయున్నారు. రఘునాథరాయ లారాత్రి మరణింపకుండు టయు, కరిమ్చందు దేశభ్రష్టుఁడగుటయు, కొలఁదికాలములోనే తన గతికూడ నట్లేకానుండుటయు, చారులవలన నదివఱకే భాస్కర పండితుఁ డెఱిఁగియుండెను. రఘునాథరాయలెట్లో పాట్నాకరుదెంచి నట్లును, మహారాష్ట్రులకును నవాబునకును సంధి నెఱపనున్నాఁడని యు, అలివర్దీఖానుతో మాటలాడుచున్నాఁడనియుఁగూడఁ గ్రమక్ర మముగ చారులవలన నాతఁడెఱింగెను. ఈవర్తమానము వచ్చుట తోడనే రఘునాథరాయలే రాయబారిగ వచ్చుచున్నాఁడనియు నాతనినెట్లయినఁ గడతేర్చి పగదీర్చుకొనవలయుననియు నిశ్చయించు కొని భాస్కరపండితుఁడు, సంధ్యాసమయమగుటచే నసుష్ఠానములను నిర్వర్తించుకొను చున్నాఁననియు నొకగడియయైనపిదప రావచ్చు ననియు వర్తమానమంపెను.

భాస్కరపండితుఁడు రాయబారితో మాటలాడుటకై దూర మునకున్న నొకశిబిరము నేర్పఱిచెను. కనుచీఁకటిపడినది. న్నాతి గడియయైనపిదప సీతారామరాయ లిరువురుసైనికులను గూడఁదీసు

కొని మహారాష్ట్రశిబిరముల కరుదెంచి సైన్యాధిపతి యెచ్చటనున్నాఁడని యడుగ నచ్చటిసైనికు లాశిబిరమును జూపించిరి. సీతారామరాయలావంకకరుగ నచ్చటిభటుఁడొకఁ డెదురుగవచ్చి 'మాప్రభువు లిచ్చట మీకై యెదురుచూచుచున్నారు. అయ్యా! లోపలకుదయ చేయుఁడు' అనియెను. సీతారామరాయలు లోపలికరిగెను. ఆతనితోఁగూడ నెవరైనవచ్చినచో లోపలకు రానీయవలదని భాస్కరపండితుఁడదివఱకే కట్టడిచేసియుండెను. ఆజ్ఞాక్రమమున నాసైనికులు దూరమునందుంచఁబడిరి. సీతారామరాయ లభివాదనముచేసి 'అయ్యా' యనునంతలో భాస్కరపండితుఁడు 'ఛీ! దురాత్మా! మాయాన్నత్యమున కంతరాయముగ నుండుటయేగాక తుదకు మాప్రాణములను దీయఁదలపెట్టినాఁడవు. నీకీనాఁటితో నాయువు సరి' అనుచుఁగనుఱెప్పపాటులో నాతనిపైఁబడి ఖడ్గముతో గాయపఱిచెను. పాపము సీతారామరాయ లొఱనుండి ఖడ్గము తీసుకొనునంతలో నాతని దేహముపై నెన్నియోగాయములు తగిలెను 'ఛే! నరాధమా!' అని సీతారామరాయ లొక్కదెబ్బ విసరెను. ఆదెబ్బ భాస్కరపండితుని వక్షముపై నించుకఁ దగిలెను. సీతారామరాయ లవుడుగఱచుచు మరల ఖడ్గము నెత్తెనుగాని యదివఱకే రక్తమంతయుఁ గాలువలు గట్టిపోవుచుండుటచే దుర్బలుఁడై స్మృతితప్పి పడిపోయెను. దురాత్ముఁడును నిర్దయుఁడును నగు భాస్కరపండితుఁడు సీతారామరాయలకంఠమును నరికివేయవలయునని ఖడ్గము నెత్తి యతివేగముతో నాతనిని సమీపించుచుండెను. ఇంతలో నొకఛాయ యాతని కడ్డము వచ్చెను. ఆతఁడిదియేమని యాశ్చర్యముతోఁ జూచుచుండఁ దిశూలధారిణియు, ముక్తకేశపాశయు కాషాయవస్త్రధారిణియు, నగునొక దేవీమూర్తి యగ్నిస్ఫులింగములు గురియు నేత్రములతో వచ్చి యాతని కెదురుగ సీతారామరాయలసమీపమున నిలువఁబడియెను. ప్రళయకాలమందలి కాళీరూపమును బోలియున్న యా

మూర్తింగాంచి భాస్కరపండితుఁడు నిశ్చేష్టుఁడైపోయెను. ఇంతలో వెనుకవైపునుండి ఖడ్గాఘాత మొక్కటి భాస్కరపండితుని కంఠముపైఁ బడియెను. ఆవేటుతో నాతనికంఠమును దేహమును వేఱయిపోయినవి. ఆదేవీమూర్తి సీతారామరాయలవంక నొకసారి తిలకించెను. ఆతనికించుక స్మృతికలిగెను. ఆతని ప్రాణజ్యోతి యారిపోవ సిద్ధముగానుండెను. ఆతఁడామూర్తివంకఁ దీక్ష్ణదృష్టితోఁ జూచెను. అతని నేత్రములు లశ్రుపూరితములయ్యెను. ఆదేవీమూర్తి ప్రతిమవలె గంభీరదృష్టితో నట్లె చూచుచుండెను. సీతారామరాయ లేదియోం మాటలాడవలయుననియత్నించెను. మాటరాలేదు. సంజ్ఞచేయుటకుఁ జేయాడలేదు. పెదవులొక్కమారట్లె కదలెను. "చూడఁగలిగితిని." అనుమాట మెల్లగ వెలువడియెను. శిరస్సు కదలలేదు. ఇఁక నేచిహ్నములును లేవు. ఏమియును లేదు. దీపమారిపోయినది. ఆదేవీమూర్తి యొక్క నిశ్వాసమునువిడిచి యటనుండి బయలువెడలి యెచ్చటికోపోయెను.

ఈవార్త యత్యల్పకాలములోనే యుభయశిబిరములయందును వ్యాపించెను. అందరు నాశ్చర్యమునుజెంది విచారించుచు భాస్కరపండితుని దూషింపసాగిరి.

మఱునాఁడుదయమగునప్పటికి సీతారామరాయల శవము గంగాతీరమునకుఁ దీసికొనిరాఁబడియెను. శవముతోఁ గూడఁ జాలమంది వచ్చియుండిరి. అచ్చటి కిరువురుసన్యాసినులు వచ్చిరి. వారెవరో పాఠకమహాశయులెఱిఁగియేయున్నారు. శ్రీ చంద్రచూడతర్కాలంకారుని పాదములకెఱఁగి "ప్రభూ! గ్రహచారవశమున నీజన్మమునం దొక్కదినమునైన నను నాప్రాణనాథుని పాదపద్మసేవచేయుటకు నేనునోచుకొనలేదు. నానాథునితోఁగూడ ననంతధామమున కేగుటకు నాకివ్వుడాజ్ఞయొసంగుఁడు. ఇంతకంటె నారీజాతికి శ్రేష్ఠమైన ధర్మమింకొకటిలేదు" అనియెను.

చంద్రచూడుఁడు కన్నులనశ్రువులుగ్రమ్ముచుండ "అమ్మా! ఈసమయమున నిన్ను నేను చూడఁగలనని స్వప్నమందైనను దలంప లేదు. నిశ్చయముగా నీవేదో దేవీస్వరూపమవు. శాప ప్రభావముచే మర్త్యలోకమున జన్మించినదానవు. నీయుచ్చకడ్డము చెప్పుటకు నేను సమర్థుఁడనుకాను." అనియెను.

శ్రీ జయంతిపాదధూళిని తనమస్తకమునఁ దాల్చి "సోదరీ! నానిమిత్తము నీవు చాలశ్రమనొందితివి. అనేకకష్టముల ననుభవించి తివి. ఈయభాగిని నిమిత్తమున నీకిఁక గష్టములుండనేరవు. నేను ప్రపంచమయమగు మాయాపాశములన్నిటిని ద్రెంపివైచితిని. ఇఁక సనంతధామములోఁ గలసిపోయి యనంతధామమున విహరింపఁగలను. గ్రహవశముచే నేనధికారచర్యయందుఁ బ్రవృత్తనై నారీజాతి యను సరింపఁదగిన శ్రేష్ఠధర్మములను బరిత్యజించివైచితిని. నారీజన్మము నకు దేవతాస్వరూపుఁడగు స్వామిని సేవించుటకంటె నుత్తమ మగు ధర్మమింకొకటిలేదు. కాని, యీదాసి యాధర్మమునుండి వంచితయై పోయినది. ఇప్పుడీదాసికి సెలవొసంగి యనుగ్రహింపవా? ఇహధామ మును బరిత్యజించి నాథునితోఁగలిసి పరలోకమునకరిగెదను. ఉత్తప్త మగు నీయభాగిని హృదయము శీతలముకాఁగలదు." అనియెను. జయంతి యశ్రుపూరితనేత్రయై "సోదరీ! నారీజాతి కేది శ్రేష్ఠమైన ధర్మమో దానినవలంభించుటయందు నీవు ప్రవృత్తవై యున్నప్పుడు నేను దాని కభ్యంతరము చెప్పఁజాలను. ధర్మమునకు జయముండు నేనిపరజన్మమున నీవుసుఖింపఁగలవు. ఈజన్మమునందువలె నిరాశా సముద్రమున నీఁదులాడఁ బనిలేదు" అనియెను.

అనంతరము చితి యేర్పఱుపఁ బడియెను. శ్రీ యందరికడను సెలవుగైకొని సీతారామరాయల పాదములను స్పృశించి గంభీర గమనముతోఁ జితినెక్కి పతి ప్రక్కను శయనించెను. చూచుచుండఁ గనే యిరువురిదేహములును భస్మరాశిగాఁ బరిణమించెను.

---

# ఉపసంహారము



చంద్రచూడతర్కాలంకారుఁడు పాట్నానగరమునుండి రాజకుమారుని నందాదేవిని దీసికొని గంగాతీరమునకు వచ్చి యథావిధిగ సీతారామరాయల శ్రాద్ధకార్యములను నిర్వర్తింపఁ జేసెను. అలివర్ది ఖాన్ రాజకుమారునకు భూషణనగరరాజ్యమునంతను జాగీరుగానిచ్చివేసెను. అనేకదినములకుఁబిమ్మటమహమ్మదుపుర శూన్యసింహాసనము మరల రాజరత్నసమాలంకృతమయ్యెను. రతికాంతునకుఁజంద్రచూడతర్కాలంకారుఁడు స్వయముగఁ బట్టాభిషేకము చేసెను. కృష్ణకములుఁడు రాజగురుపదవిని వహించెను. అచ్యుతకుమారుఁడును సుశాలయు భూషణనగరమునకరుదెంచి యచ్చటనే వాసముసేయుచుండిరి. అనేకదినములైనపిదప సీతారామరాయలతనయుఁడు రాజపదవి నధిష్ఠించి తమ్మునుపరిపాలింప నేతెంచినందులకు భూషణనగరరాజ్యమునందలి ప్రజలపరిమితానందమును బొందిరి.

క్రమక్రమముగా నలివర్దిఖాన్ రాజ్యము నభివృద్ధినొందఁ జొచ్చెను. ఆతఁడు చాల గుణవంతుఁడు. ప్రతాపశాలి. ఆతని కాలమున హిందువులకును మహమ్మదీయులకును నైకమత్యమేర్పడియెను. హిందువులాతనిరాజ్యమునఁ బరమసుఖము ననుభవించుచు నేవిధమగు బాధలులేకుండిరి. అన్యోన్యవిజయకాంక్ష హృదయముల వేధించుచున్నను మలహారరావు నైపుణ్యమువలనను విశేషించి సీతారామరాయలయందలి గౌరవముమూలమునను తమవిరోధముల నడంచుకొని బాజీరావును అలీవర్దిఖానును మిత్రులైరి.

అలివర్దిఖాన్ రతికాంతరాయలయెడ నత్యంతమైత్రితో మెలఁగుచు నాతని యభివృద్ధి కనేకవిధములఁదోడుపడి తనకృతజ్ఞతను వెల్ల

డించెను. రతికాంతరాయలుఁను తనరాజ్యమునందలి ప్రజలను గన్న బిడ్డలవలెఁ గాపాడుచుఁ దనకీర్తిని దిగంతముల వ్యాపింపజేసెను.

ఖాల్నా గంగాతీరమున నెచ్చట శ్రీసీతారాముల పవిత్ర దేహములు భస్మీభూతములయ్యెనో, అచ్చట రతికాంతరాయలొక శివాలయమును, ధర్మశాలను నిర్మించెను. ఆదేవునకు సీతారామేశ్వరుఁడని పేరుపెట్టెను. ఆయాలయమును ధర్మశాలయుఁ సీతారామరాయలకీర్తిని బ్రకటించుచుండెను. కాలప్రభావముచే నవి రెండును గంగాగర్భమునఁ బడిపోయినవి. ఇప్పుడు వాని చిహ్నములైనను గనఁబడుటలేదు.

—సంపూర్ణము—



శ్రీఆనంద తీర్థ ప్రెస్, రామచంద్రపురం

# ఆంధ్రకవితరంగిణి

(1300 మంది తెనుగుకవుల చరిత్ర)

రచయిత:- శ్రీ చాగంటి శేషయ్యగారు

నన్నయభట్టు మొదలు నేటివరకుగల తెలుగుకవుల చరిత్ర పూర్తిగ పరిశోధించి సులభశైలిలో 20 సంపుటములలో వ్రాసిరి. లైబ్రరీలకు టెక్స్టుబుక్ కమిటీవారిచే అప్రూవుకాబడినది. పలువురు పండితులీ గ్రంథావశ్యకమునుగూర్చి కొనియాడియున్నారు. 12 భాగములు గ్లేజు కాగితముపై అచ్చుపడినవి. ఒక్కొక్క భాగము

సుమారు 280 పేజీలు వెల రు **3-0-0**

మొదటి సంపుటము: (ద్వితీయముద్రణ:) గ్లేజుకాగితం:

మదాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారి తొలిపలుకు—నన్నయాది కవీంద్రుల చరిత్ర యిందు సవిమర్శకముగ వ్రాయబడినవి. నన్నయభట్టు, నారాయణభట్టు, భోజమహారాజు, పావులూరి మల్లన వేములవాడ భీమకవి మున్నగువారి చారిత్రముల గూర్చి వ్రాయబడియున్నది.

రెండవ సంపుటము: (ద్వితీయముద్రణ) గ్లేజుకాగితం:

ఈ భాగమున జయదేవకవి, వాదీంద్రచూడామణి, రేచన, ఉదయాదిత్యుడు, గోకర్ణుడు, శ్రీపతిపండితుడు, దేసటిపండడు, మల్లికార్జున పండితారాధ్యులు, రుద్రదేవమహారాజు, మంత్రిభాస్కరుడు, కేతన ప్రెగడ, తిక్కనసోమయాజి మొదలగువారి చరిత్రములు

మూడవ సంపుటము: (ద్వితీయముద్రణ) గ్లేజుకాగితం:

ఈ భాగమున యథావాక్కుల అన్నమయ్య, బద్దనకవి, విశ్వేశ్వరదేశికులు శివదేవయ్య, మూలఘటిక కేతనకవి, అథర్వణాచార్యుడు, పాలకురికి సోమనాథకవి, చక్రపాణి రంగనాథుడు, కవిరాక్షసుడు, మారన, నందూరి కేతన మంత్రి, మంచనకవి, కమలనాభామాత్యుడు, శరభాంకుడు, హుళక్కిభాస్కరుడు, మల్లికార్జునభట్టు కుమారరుద్రదేవుడు, కవిభల్లటుడు, మొ॥

నాలుగవ సంపుటము: (ద్వితీయముద్రణ) గ్లేజుకాగితం:

ఇందు: రంగనాథుడు, గోనబుద్ధభూపతి, గోనకాచభూపతి, విఠలరాజు, త్రిపురాంతకుడు, గణపనార్యుడు, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోముడు, అప్పనమంత్రి,

చిమ్మపూడి అమరేశ్వరుడు, దోనయామాత్యుడు, శ్రీగిరికవి, అయ్యలార్యుడు, మడికి సింగన, మడికి అనంతయ్య, జక్కయకవి మొ॥

అయిదవ సంపుటము: (ద్వితీయముద్రణ) గ్లేజు కాగితం:

ఈ భాగమునందు శ్రీనాథుఁడు మున్నగువారి చరిత్రములు విశేషాంశములు విమర్శించి చక్కగా విశదీకరింపబడినవి. నిశ్శంక కొమ్మన్న, కొలనిగణపతిదేవుడు, వెన్నెలకంటి అన్నయ్య, అనంతామాత్యుడు మొ॥

ఆఱవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: శ్రీధరుడు, పిల్లలమఱ్ఱి, నంది మల్లయ్య, బమ్మెర పోతన, వెలిగందల నారయ వేమన మొ॥

సప్తమ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు శ్రీకృష్ణదేవరాయలు, పెద్దన, మల్లన, గోపమంత్రి, తిమ్మన, ధూర్జటి

ఎనిమిదవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: తెనాలిరామకృష్ణ, శ్రీగిరికవి, ప్రౌఢకవి, మల్లన, తాళ్ళపాకకవులు, రాచమల్లుకవులు, వెన్నెలకంటి సూరన్న, పెదపాటి సోమయ్య, భానుకవి.

తొమ్మిదవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: రాధామాధవకవి, మల్లుభట్టు, బొడ్డపాటి కవులు, తెనాలి అన్నయ్య, పచ్చకప్పురపు తిరువెంగళకవి, పోతరాజు, లింగమకుంటకవులు శంకరభాస్కరాచార్యులు, కావూరి ఎల్లయకవి మొ॥

పదియవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: అయ్యలరాజు రామభద్రకవి, దోనూరి కోనేరుకవి, తెనాలిరామభద్రకవి, చెదలువాడ మల్లయకవి, పింగళి సూరన్న, రామరాజభూషణుడు, చిత్రకవి అనంతకవి, వెలుతుర్ల ఒడ్డెయ్యకవి, అయ్యలరాజు అయ్యలకవి భాస్కరకవి, అద్దంకి గంగాధరకవి మొ॥

పదకొండవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: పట్టమట్ట సోమనాథసోమయాజి, ఎల్లారెడ్డి, మల్లారెడ్డి, కవిచౌడప్ప, కేసకవి మల్లకవి, మల్లారెడ్డిదేశాయి, సురభిమాధవరాయకవి, మొ॥

పండ్రెండవ సంపుటము: గ్లేజు కాగితం:

ఇందు: రఘునాథభూపాలుడు, చేమకూర వెంకటకవి, కంకంటి, కుమారధూర్జటి, కాకునూరి పసుపులేటి రంగాజమ్మ, వత్సవాయ బలభద్రరాజకవి, కె. విశ్వనాథకవి, ఏనుగులక్ష్మణకవి, చింతపల్లికవులు, భవానీశంకరకవి మొ॥

13, 14 సంపుటములు ముద్రణమగుచున్నవి.